# ఉపోద్ఘాతము

విదేశీయ భాషలలో వ్రాయబడిన జ్ఞానోపదేశ గ్రంథములు, మత గ్రంథములు పెక్కులు గలవు. కతోలికు జ్ఞానావసరములను తీర్చగల పలుగ్రంథములు మన దేశభాషలలో గూడ ప్రచురింపబడియున్నవి. ఇవియన్నియు విషయ నివేదనమందు తృప్తికరములుగా నున్నను వీనిలో ననేకములందొక ముఖ్య లోపము గోచరించుచున్నది. అదే మన చదువరుల హృదయమును చూరగొని నిత్య సత్యములను నేర్చుకొన వారిని కుతూహలపరుప జాలక పోవుచున్నవి.

"రస్సెల్ గురువరేణ్యులు వ్రాసిన "నీ విశ్వాసము, జీవితములో దాని ప్రాధాన్యత" అను గ్రంథములో నట్టి లోపము కానరాదు. సత్యవేదమునకు మూలపురుషుడును, జ్ఞానజీవమునకు కేంద్రస్థానము నయిన జేసునాథునికిని వేదసత్యములకును కతోలికుల జీవితమునకును సన్నిహిత సంబంధ ముండవలయుననియు, అట్టి సంబంధము మత గ్రంథమందు గోచరించక పోయిన ఫలభరితము కాదనియు గ్రహించి, క్రీస్తునాథుని ఆదర్శమూర్తిగా నిలిపి ఆతని బోధనా సత్యములను నీతి సూత్రములను వాని ననుసరించియున్న సత్యములను అమర్చిపెట్టియున్నారు. ఈ సత్యములను సూత్రములను నేర్చుకొనునపుడు క్రీస్తునుగూర్చి తెలిసికొనక తప్పదు. గ్రంథకర్త యీ గ్రంథమున క్రీస్తునాథునికి మన జీవితముపై గల ప్రమేయమును స్పష్టపరచియున్నాడు. గ్రంథమును చదువుకొలది ఇంకను చదువవలెనను ఆశను జనింపజేసి, చదువరిని ఆలోచనా నిమగ్నుని జేయును. ఇదియే యీ గ్రంథమునందలి విశిష్టత.

ఈ గ్రంథము ఉపాధ్యాయులకు ఉపదేశకులకు, గురువులకు, మఠకన్యకలకు అత్యంత యుపయోగకరమైనది. ఆదివార ప్రసంగములకు, అజ్ఞాతవాస ప్రసంగములకు ఉపయోగపడును ఉన్నత పాఠశాల విద్యార్థులకు పాఠ్యగ్రంథముగ నుండవలసిన గ్రంథము.

సామాన్య ప్రజల వ్యావహారిక భాషలో వ్రాయబడి యున్నందున శైలి సులభముగను సరళముగ నున్నది.

# విషయసూచిక

# మొదటి అధ్యాయము

కథోలిక పాఠశాలకు పోవడంలో గల ఉద్దేశ్యం.

**జీవితం ఒక ఆట** ఆటలంటే నీకు ఉషార్ గదూ? తరచుగా ఆటలవల్లా, పోటీలవల్లా బాల బాలికల్లోఉన్న గొప్పతనం బైటికి వస్తుంది. శక్తి సామర్థ్యాల్ని పరీక్షించే ఇటువంటి ఆటలూ, పోటీలు నీకు సహజంగా పరమానందం కలిగిస్తయ్. కాని, అన్నిటికంటే ఎక్కువ తెలివితేటల్ని ప్రదర్శించాల్సిన ఆట, జీవితమన్న విషయం నీ వెప్పుడైనా గుర్తించావా? ఇంకా నీకు సరిగ్గా నడవడం కూడ చేతకాక పూర్వమే, నీ వీ జీవిత క్రీడను ప్రారంభించావు. ఈ జీవిత క్రీడలో గెలుపొందడానికి, నిన్ను బాగా పోషించి మంచి శిక్షణ ఇచ్చారు. ఇప్పుడిక నీకు నీవే ప్రతి విషయాన్నీ నిర్ణయించు కోవడం నేర్చుకుంటున్నావు.

ఈ జీవితక్రీడ మాదిరిగా, నీ వితర్లతో చేసే పోటీలు ముఖ్యమైనవికావు. కష్టమైనవీ కావు. ఒక్కసారి శాశ్వతత్వాన్ని గూర్చి ఆలోచించు. ఈ జీవిత క్రీడనుంచి నీవు వైదొలిగి పోయిన తర్వాత, నీకోసం అంతులేని కాలం ఎదురు చూస్తూన్నదన్న విషయాన్నిగూడా ఆలోచించు. ఆ అనంత కాలంలో శాశ్వతత్వంలో ఎట్లా కాలక్షేపం చేయబోతున్నావో అన్నవిషయం నీకు తప్పకుండా ఆసక్తి కలిగిస్తుంది. ఎందుకంటే, ఇక్కడ నీవుచేసే చేతల్నుబట్టే అక్కడ నీస్థితి నిర్ణయింపబడ్తుంది.

**సరి దిద్దడం** నీవీ జీవితక్రీడను ప్రారంభించ బోయే ముందు, దీనికి సంబంధించిన సూత్రాన్ని తెలుసుకోవడం మంచిది. నీవీ పాఠశాలకు రావడంలోగల కారణమదే. పని చేయకుండా తలాయించడానికిగానీ, ఆషామాషీజీవితాన్ని గడపడానికిగానీ, కేవలం పాఠశాలలోని ఖాళీల్ని భర్తీచేయడానికిగానీ, ఏదో యోగ్యతా పత్రాన్నొకదాన్ని సంపాదించుకోడానికిగానీ, నీ విక్కడకు రాలేదు. ఇటు

వంటి ఊహలు నీ బుర్రలో ఉండి ఉండవచ్చు. ఇతర్లపై ఆధారపడి జీవించే సోమరిపోతు రకానివి కాకపోతేమాత్రం, నీవిక్కడకు రావడంలోగల ఉద్దేశ్యాన్ని తప్పకుండా గుర్తించాల్సిన బాధ్యత ఉంది. నీ అనుకూలం కోసమని ఆ ఉద్దేశ్యాన్ని వ్రాసి ఉంచుకో.

ఒక ప్రత్యేకమైన గమ్యస్థానాన్ని చేరాలనే కోరిక నీలో ఏమైనా ఉందా? మంచిది — ఆ గమ్యస్థానం యోగ్యమైందయితే మాత్రం, దానినుంచి నీదృష్టి మరల్చవాకు. మీవాళ్ళు పోరుపెట్టి పంపించారు కాబట్టే నీవీ బడికి వచ్చావా? ఎందుకువచ్చిన రబసరా నాకిదంతా అనే అంటీఅంటని స్వభావంతో ఉన్నావా? మరిప్పుడు నీ వొక గమ్యస్థానాన్ని నిర్ణయించుకో వెందుకు? ఒక ఆలోచనా పాలోచనా లేకుండా ఏదో ఆషామాషీగా కాలక్షేపం జేసిన నీకంటే పెద్దవాళ్ళకు పట్టిన దుస్థితి ఏదో నీవు గ్రహించే ఉన్నావ్.

ఇంటిదగ్గర నిన్ను సంతృప్తి పరచడానికి కష్టమై, ఇంకా నిన్ను క్రిందికి దిగజారిపోకుండా సరిదిద్దడం కోసమేనా నిన్నీ పాఠశాలలో ఉంచింది? కొంచెం సేపు దానికి వ్యతిరేకంగా ఆలోచించు. ఆత్మ నిగ్రహం ప్రారంభించు. నీ కోరికలన్నీ నీ అదుపు ఆజ్ఞల్లో ఉంచుకోవడం నేర్చుకో. ఇల్లా ఒక సంవత్సరంపాటు కృషిచేసిన తర్వాత, నీ చేతల్లో, నీ బుద్ధిలో కలిగిన భేదాన్ని గమనించు. మంచికీ, చెడుకూ కూడా నీకు కావాలసినన్ని అవకాశాలున్నయ్. స్వార్థాన్నిగాని, సంకుచితత్వాన్నిగానీ అనుసరించావంటే నిన్ను నీవే మోసం చేసుకొంటావు. నీలో ఎక్కడనో దాగివున్న సుగుణాలను తెలుసుకొనేందుకు నీకు పాఠశాల సహాయం చేయాలి. తప్పుడు మార్గాన్ననుసరించే చాల మంది యువకులు 'మంచికాల మంటేగాని, జయ మంటేగాని' పొరపాటు అభిప్రాయంతో ఉన్నారు. అటువంటి సమస్యల్లో పాఠశాల నిన్ను సరిదిద్ది మంచి మార్గంలో పెడ్తుంది.

**గొప్ప ఉద్దేశ్యం** ఉన్నత పాఠశాలలకు హాజరు కావడంలో ఒక్కొక్కరికీ ప్రత్యేకమైన ఉద్దేశ్యాలు ఉండవచ్చు, ఐనప్పటికీ వాటన్నిట్లో సూత్రప్రాయంగా ఒకే ఉద్దేశ్యం అంతర్లీనమై ఉంది. జేసునాథుని సుగుణాలలో కొన్ని అలవర్చుకోవడానికే నీ విక్కడున్నావు. జేసునాథునితో గాఢమైన మైత్రిని పెంపొందించుకొనేందుకు నీకీ పాఠశాల ముఖ్యంగా సాయపడుతుంది. సామాన్య సంభాషణల్లో వినబడే అవాకులూ చెవాకులూ ఏ మాత్రం లక్ష్య పెట్టవాకు. జేసునాథునితో గల దృఢమైన స్నేహమే నిజానికి పౌరుషాన్ని, స్త్రీత్వాన్ని ప్రసాదిస్తుంది. మన ప్రభువుతో దృఢమైత్రిని సంపాదించుకోవడమే నీ జీవితంలోకల్లా మహత్తరమైన ఘట్టం.

అటువంటి మైత్రిలో ఉన్న రహస్యం కథోలిక్కు మతంలో మనకు గోచరిస్తుంది. నీ జీవితంలో మతానికి సరియైన స్థానాన్ని చూపించడానికి పాఠశాల ప్రయత్నిస్తుంది. అతి ప్రధానమైన ఈ పోరాటంలో నీ విక్కడ నెగ్గావంటే, పాపంకన్నా పుణ్యం గొప్పదనీ, సోమరిపోతుతనం మోసాలకన్న నిరంతరకృషి, గౌరవం ఎక్కువ విలువగలదనీ, పంచేంద్రియాలకూ లొంగిపోవడం కన్నా జితేంద్రియత్వమే పరమానందాన్నిస్తుందనీ తెలుసుకొంటావు.

నీ మతం మానవుడు కల్పించిందికాదు. అది మన అభిరుచుల్తో మారేదికాదు. దాని వెనకాల శతాబ్దాల చరిత్ర ఉంది. నీవు కొంత కాలం ఓపికపట్టి శ్రద్ధతో పరిశీలించావంటే, అది అత్యద్భుతమైన ఆనందాన్ని, అంతర్దృష్టినీ ప్రసాదిస్తుంది. జీవితానికి సంబంధించిన పెద్ద పెద్ద సమస్యలన్నిటికీ అది సరియైన సమాధానాలిచ్చి విజ్ఞానం కలిగిస్తుంది. దాని గుప్పిట్లో కోటానుకోట్లు జీవించారు, నశించారు. ఇంకా అది దృఢవిశ్వాసంతో భవిష్యత్తు వేపుచూస్తున్నది. యువకులకు నేటికీ తిరుసభ ఉత్సాహాన్ని కలిగించగలదు.

జీవితక్రీడలో జయం సాధించడానికీ, పాఠశాలలో ప్రవేశించడంలో గల ఉద్దేశ్యాన్ని నెరవేర్చుకోడానికీ ధైర్యమూ, దీక్షా, కొంత

వ్యవధీ కావాలి. అర్ఫ్యి. ఇన్యాసివారు తన ముప్పైమూడోఏట లాటిన్ భాష నేర్చుకోడానికి ప్రారంభించాడు. ఆయనలో నేర్చుకోవాలనే ఉద్దేశమూ, గట్టి పట్టుదలా ఉన్నందువల్లనే జయాన్ని సాధించాడు. సద్గుణా లలవర్చుకోని, మనఃపూర్వకంగా ప్రయత్నిస్తే నీవూ జయాన్ని పొందుతావు. ఈ సంవత్సరం బడిపోయిం తర్వాత, నీ తల్లి దండ్రులమీద అపారమైన భక్తి శ్రద్ధల్తో, వారి మానసిక, శారీరక సౌకర్యాలకోసం తాపత్రయపడే వ్యక్తిగా ఇంటికి పోతావని తలుస్తున్నాం. తరచుగా సత్ప్రసాదము, ప్రార్థన, ఉన్నతాదర్శాలూ, మంచి సంభాషణా, మంచి అలవాట్లూ, నీకు గొప్ప స్నేహితుల వంటివి. జేసు నాథునితో ఐక్యమైపోవడానికి నీవు సంకల్పించుకొన్న ఉద్దేశ్యాన్ని కవి సహాకారంగా ఉంటై.

**మత సంబంధమైన తరగతి** కథోలిక్కు పాఠశాలలు, తమ నియమాలకు కట్టుబడి విధేయంగా ఉండడానికి మత సంబంధమైన తరగతులు జరుపుతుంటై. ఈ తరగతులు నీలో ప్రతిభను అభివృద్ధి చేయడానికి మాత్రమే ఉద్దేశింపబడినవి కావు. ఎందుకంటే, కథోలిక్కు విశ్వాసమంటే తెలివితేటల్ని మాత్రమే పెంపొందించుకోవడంకాదు. జీవితము ఎడల మన మానసిక దృక్పథము దేవుని దృష్టి ననుసరించియుండేటట్లు అలవరచుకొనవలయును. సహకరించే వాళ్ళకు ఆధ్యాత్మికమైన సంపత్తిని సమకూర్చాలి. నీ మత సంబంధమైన తరగతుల్లో నీ పీ శక్తిని పెంపొందింప చేసుకోడానికి గట్టి ప్రయత్నం చేయాలి. తరతరాలనాటి విశ్వాసాన్ని విస్పష్టంచేసి, దానిలో లోతునూ, సౌందర్యాన్నీ, సత్యాన్నీ విప్పిచెప్పడానికి కథోలిక్కు పాఠశాలలు ఉపకరిస్తయ్. "విజ్ఞానాతీతమైన జేసునాథుని ఔదార్యాన్ని" అలవర్చుకోడానికి నీలో ఉత్సాహం కలిగిస్తయ్.

మతసబంధమైన తరగతి నీకు కేవలం సహాయంమాత్రమే. దైవానుగ్రహంవల్ల ప్రధానంగా నీవే కృషిచేసుకోవాలి. నీవు దైవంతో

పరిహరించడానికి చేసే ప్రయత్నాలమీదే నీ అంతిమ ఫలితాలు నిర్ణయింప బడ్తయ్. నీవొక నాడు శాశ్వతమైన ఆ న్యాయాధికారి యెదుట నిలబడి నీ మతంలో నీకేమీ గొప్పదనం కనపడ లేదని చెప్పడం విచారకరమైన విషయం కాదా? జేసునాధుని ప్రేమించడం ద్వారా స్త్రీలూ, పురుషులూ చెక్కుచెదరని సత్ప్రవర్తనకులౌతారన్నది ప్రపంచాని కంతటికీ తెలిసిన విషయమే. కాబట్టే, నీ తలిదండ్రులు, చుట్టాలూ, మంచి స్నేహితులూ, జేసునాధునిగా తయారు కావాలని నిన్ను తలుస్తారు. "నాలో ఉండు" అన్న జేసునాధుని సుభాషితంలో గల అర్థాన్ని ఆలోచించుకొనునట్లు నీకు మత సంబంధమైన తరగతి ఎక్కువ సహాయం చేయుగాక!.

**ఆచరణ** 1. జీవితంలో ఒక నిశ్చితమైన ఉద్దేశ్యాన్ని కలిగిన యువకుడికి కలిగిన మూడు లాభాలు వ్రాయ్?

దూరంగా చేని మధ్యలో ఉన్న చెట్టుదగ్గరికి పోవడానికి ఇద్దరు విద్యార్థులు బైలుదేరారు. ఒకడు చెట్టుపై తన దృష్టిని కేంద్రీకరించి పోవడం మొదలు పెట్టాడు. రెండోవాడు తన నడకమీద లక్ష్యం లగించాడు. ఇద్దరిలో ఎవరి పద్ధతి మంచిది?

2. తమల్ని మతపిచ్చిగల వాళ్ళుగా ఇతర్లనుకొంటారేమోనని భయపడే వాళ్ళల్లో ఉన్న లోపమేమి?

3 'జేసునాధునకు నిశ్చితమైన లక్ష్యం ఒకటుంది.' అన్న సారాంశం, క్రొత్తనిబంధనలో ఎక్కడైనా ఉన్నదేమో వెతుకు! అప్పుడిక ఈ క్రిందివాక్యాలకు నీ వ్యాఖ్యానం వ్రాయ్!

"ఆయన దీర్ఘాలోచనా నిమగ్నుడై ఉండడం మేం చూశాం చిన్నపిల్లలకు కూడా అర్థమయ్యేటట్లుగా సులభమైన భాషలో మాట్లాడినా, తెలివిగలవాళ్ళ మనుకొనేవాళ్ళను కూడా తికమకపెట్టే ఆయన వాక్చాతుర్యాన్ని విన్నాం. జీవితం సరిహద్దుల్ని దాటి అవతలి ప్రపం

చాన్ని చూస్తున్నా, తోటలో బాగా వికసించిన పువ్వునుగాని, ఆకాశంలో తిరుగాడే పక్షినిగాని, రోడ్డుప్రక్క పడివున్న వికలాంగునిగాని, మరచిపోలేదు. కృషిపూర్వకమైన మనస్సుతో, హృదయంతో, శరీరంతో, కష్టించాలనే ఆసక్తితో, ఆయన తోడుకావాల్సినప్పుడు, ఆయన ఉద్యమానికి విధేయులుగా ఉండటానికి మేం సర్వసిద్ధంగా ఉన్నాం. ఆయన తండ్రి గృహం చేరడానికి అత్యుత్సాహంతో ఉన్నాం. సత్య ధర్మాలమీద అమితానురాగంతో ఉన్నాం. ఆయన బాధలను భరిస్తున్నా, దయార్ద్రమైన మరియమాత మాదిరిగా మేమూ నవహానంతో దీనులమై ఉన్నాం."



# రెండవ అధ్యాయము

## 1. మానవునికి దేవుడు అవసరం.

**యవ్వన చాపల్యం** పాఠశాల ముగించి ప్రపంచంలో అడుగు పెట్టబోయేటప్పుడు, పిల్లలు సామాన్యంగా తాము గొప్ప వాళ్ళమైనామనీ, గెలిచి పోడిచామనీ ఊహలో ఉంటారు. వాళ్ళు పొంగివచ్చే యావనంలో ఉంటారు. మంచి ఉత్సాహం తోటీ, బలంతోటీ ఉంటారు. జీవితరంగంలోకి అడుగుపెట్టడానికి ఎక్కువ ఉబలాటంతో ఉంటారు. జీవితంలోని రహస్యాలన్నింటినీ ఆకళింపుచేసుకొని సర్వప్రకృతి విజ్ఞాను లనిపించుకొందామని ఉవ్విళ్ళూరుతుంటారు. వాళ్ళ దృష్టిలో ఎటువంటి సమస్యయైనా సరే ఇట్టే తేల్చి పారేసేదిగా కనబడుతుంది. ఎటువంటి విషయమైనా సరే మంచినీళ్ళ ప్రాయంగా గోచరిస్తుంది.

**ప్రకృతి రహస్యం** ఒక్క క్షణకాలం తీరిగ్గా ఆలోచించు. ఈ క్రింది కొన్ని ప్రశ్నలకు నీ అంతట నీవే స్వయంగా సమాధానాలు ఆలోచించు. పెద్దడొంకలో గుండా దూరంగా ఉన్న గ్రామానికి ప్రయాణం చేస్తున్నావనుకో. చుట్టుపక్కల ఎటుచూసినా బంగరు బైలుగా ఉందనుకో. అప్పుడొక పెద్దగాలి దుమారం లేచి, చూస్తుండగానే మబ్బులుపట్టి ఉఱుములు మెరుపుల్తో ఒక పెద్ద వాన ప్రారంభించిందనుకో. ఢణఢణమంటూ భయంకరమైన శబ్దం చేసుకొంటూ అక్కడక్కడా రెండుమూడు పిడుగులు కూడా పడటం తటస్థించిందనుకో. అప్పుడు నీ మనస్సెట్లా ఉంటుందో ఒక్క క్షణకాలం ఊహించుకో. నీ మనస్సప్పుడు సహాయంకోసం తహ తహలాడిపోదూ? లేకపోతే పడవమీద నదిలో ప్రయాణం చేస్తున్నా వనుకో. కొంతదూరం సాగింతర్వాత నడిపొంగి పెద్ద పెద్ద అలలు బయలుదేరి, నీ పడవను ఇదుగో ముంచుతున్నా, ఇదిగో ముంచుతున్నా అనేటట్లు చేస్తున్నవనుకో. అప్పుడా పెద్ద పెద్ద అలలముందు, మహావేగంతో

పొంగిపొరలి ఉరుకులూ పరుగులూ తీస్తున్న లోతైన ఆ నది ముందు నీ వెందుకూ పనికిరాని నిస్సహాయ నిరర్థక జీవివన్న ఊహ కలుగుతుందా? నీవు త్రొక్కిచూచే ఈ ప్రకృతిలోని అద్భుతాల్నొక్కసారి పరకాయించి చూడు! "అరుణోదయము భూమి దిగంతముల వరకు వ్యాపించునట్లును, అదిదుష్టులను తనలో నుండకుండ దులిపివేయునట్లును, నీ వెప్పుడైన ఉదయమును కలుగజేసితివా?" "నీవు హిమము యొక్క నిధులలోనికి చొచ్చితివా?" "జయ జయ ధ్వానములలోని నిధులను పరిగ్రహించితివా?" "జలరాసులు నిన్ను కప్పునట్లు మేఘములకు నీవు ఆజ్ఞఇవ్వగలవా?" "నీ ఆజ్ఞలకు లోబడి గ్రద్ద ఉన్నత ప్రదేశములందు గూడు కట్టుకొని నివసించునట్లు చేయగలవా?" (యోబు, 38 వ ప్రకరణం). 93,000,000 మైళ్ళ నుంచీ తన వేడిని ప్రసాదిస్తూ, సముద్రజలాల్ని ఆవిరిరూపంలో ఆకర్షించి, మళ్ళీ వర్షరూపంలో అనుగ్రహిస్తున్న సూర్యుణ్ణి ధిక్కరించి నీ వేమైనా చేయగలవా?

ప్రకృతిలో ఉన్న ఇటువంటి విషయాల్ని నీవు తల్లక్రిందులుగా తపస్సుచేసిన జయించలేవు. ఇటువంటి మహాద్భుత విషయా లెట్లా సంభవించినయ్యో, వీటినన్నిటినీ ఎట్లా సముదాయిస్తున్నాడో తెలుసు కోవాలంటే తప్పకుండా దైవ సహాయం కావాలికదూ?

**నీలో ఉన్న రహస్యం**

నిన్ను గురించి నీవే చెప్పలేని రహస్యం బోలెడంత ఉంది. 'నేను' అనే సర్వనామ శబ్దానికి నీవు బాగా అలవాటు పడితే, అర్చ్యు. చిన్నప్పగారు చెప్పిన ఈ వాక్యాన్నొకసారి గుర్తుకు తెచ్చుకో. "నీకు కలిగిన వాటిలో నీవు పొందనిది ఏది?" (1 కొరి 4,7) నీవీ ప్రపంచంలోకి రావడంవల్ల నీవు చేయవలసిన పని ఏమైనా ఉన్నదా? ఎప్పుడు, ఎటువంటి పరిస్థితుల్లో నీవీ ప్రపంచాన్ని వదలిపెట్ట బోతున్నావో నీకు తెలుసా? నీవు అదృష్ట వశాత్తు మంచి ఆరోగ్యవంతుడిగా పుట్టావనుకో. అప్పుడు ఈ నీ ఆరోగ్యాన్ని దుర్వినియోగం చేసుకోకుండా నిన్నడ్డుపెట్ట బోతున్న దేమిటి? నీ యిష్టం ప్రకారం నీవు పెరగగలవా? నీ స్వరూపాన్ని

మొలచిన మహా శిల్పిని (దేవుని) కాదని నీవు నీ కోరిక ప్రకారం స్వరూప నిర్ణయం చేసుకోగలవా?

ఇక్కడ నీ ఉనికిని ప్రపంచం ఎక్కువ శ్రద్ధతో గమనిస్తున్నదని అనుకొంటున్నావా? ఈ ప్రపంచంలోని శతకోటి జీవుల్లో నీవొక అణు మాత్రుడివి. ఎందుకంటే, "ఈ ప్రకృతిలో సంచరించే జీవులు, దీనిలో సుఖనిద్ర చెందిన కోటానకోట్ల జీవుల్లో (శత సహస్రాంశానికూడా సాటిరావు.) ఆవగింజలో ఆరవ వొయ్యో పాలు" ఐనప్పుడు, కొట్టవచ్చి నట్లు కనబడాలనే ఊహ నీలో కలుగడానికి పురికొల్పేదేది? సుఖంగా హాయిగా సంతోషంగా కాలక్షేపం చేస్తూ, నీ పేరు దిగ్దిగంతాలు వ్యాపించాలని నీ వెందుకు కోరుకొంటున్నావో చెప్పగలవా? నీకు నీ మతమనే విజ్ఞాన దీపికే లేకపోతే "నేనెవరిని?" "నేనెక్కణ్ణించి వచ్చాను?" "నేనెక్కడికి పోబోతున్నాను?" మొదలైన ప్రశ్నల కెట్లా సమాధానం ఇవ్వగల్గుతావు?

**జీవిత రహస్యం** జీవితాన్ని గురించిన అనేక విషయాలు ప్రతి విద్యార్థినీ కలసివేసేస్తుంటాయి. జీవితం పుట్టుక ఎక్కడిది? చచ్చిపోయిన తర్వాత మరో జీవితం ఉన్నదా? ఆ మరో బ్రతుకులో నీకు జరగబోయే పరిస్థితులేమిటి? చనిపోయిన తండ్రి మొగం గాని, తల్లి మొగంగాని నీవు చూచినప్పుడు నీలో పుట్టే ప్రశ్నలివ్వి. మీ నాన్న శూన్యంలోకి ప్రయాణం చేసాడని ఎవడైనా నీతో చెప్పితే వెంటనే వాడికి ఎదురు తిరుగుతావు. అనారోగ్యం, వ్యాధులూ, కష్టాలూ, దుఃఖమూ నిన్ను చుట్టు ముట్టేస్సినై. నీవు వాటినుంచి తప్పించుకో గలననుకొంటున్నావా? కొందరు రాత్రింబవళ్ళు రెక్కలు ముక్కలయ్యేటట్లు కష్టపడ్తూంటే, ఇంకా కొందరు అల్లాయి లొల్లాయి పదాలు పాడుకొంటూ కడుపులో చల్ల కదలకుండా సోమరిపోతులుగా తిరుగుతున్నారన్న విషయం కూడా నీవు గ్రహించే ఉంటావు. దుర్మార్గులకన్నా సన్మార్గులే ఎక్కువగా కష్ట నష్టాలకు గురియౌతున్నట్లు కూడా కనిపిస్తున్నది. ఎప్పుడు ఇది ఇట్లాగా సాగిపోతుందా? వీటిని చక్కదిద్దడ మంటూనే జరగదా?

**దేవుడు** ఇంతాచేస్తే, ప్రకృతిలోఉన్న అద్భుతాలముందు మానవ మాత్రుడు శోక సముద్రంలోని నీటిబిందువు వంటివాడు. తన మీదగాని, తన జీవితం మీదగాని తనకున్న అధికార లేశాన్ని ఆలోచించుకొంటే, మానవుడు విధేయతతో ఒక్కనారి తలవంచుకొంటాడు. నీ యంతట నీవే స్వయంగా జీవిత సమస్యను పరిష్కరించుకొందామనుకోవడం, గొర్రెపొటేలు కొండను ఢీకొనటం వంటిది కాదూ? జీవితమంటె ఏమిటో చెప్పాలంటే, జీవితానికి సరైన అర్థం ఇవ్వాలంటే, సృష్టికర్త, పిత, దర్శకుడూ ఐన దేవుడు నీకు తప్పకుండా కావాలి. ఈ రహస్యాలన్నింటికి వ్యాఖ్యానం ఆయన ఒక్కడే.

**ఆచరణ** 1. దేవుడితో నిమిత్తం లేకుండానే చాలామంది జీవిత యాత్ర చేస్తున్నట్లున్నదే, అటువంటప్పుడు దైవం అవసర మని మనం ఎట్లు నిరూపింపగలము ?

2) చాలామంది సంపదనో లేకపోతే సంతోషాన్నో దేవుని మాదిరిగా కొలుస్తుంటారు దేనికి? జీవిత సమస్యలో కొన్ని ముఖ్యమైన ప్రశ్నలకు ఒక రిచ్చే సమాధానాలే అతని మతము. ఎవరు కాని ఈ సమాధానాలు లేకుండా ఉండరు. ఎవరైనా దైవసూత్రాన్ని ఒప్పుకోకపోతే దాని స్థానంలో మరో సూత్రాన్ని ఆమోదిస్తాడు. అతడికి ధనమే జీవితలక్ష్యమైతే అతని మతం ధనమే. అతడు దేవుణ్ణి నిరాకరిస్తాడు. నీకు సత్యమైన దేవుడుకావాలా? లేకపోతే ఉత్తుత్త దేవుడుకావాలా?

3) నీకు శాంతి సంతోషాలు చేకూర్చి నీ మనస్సును సంతృప్తి పరచగల వాడు, దేవుడు మినహా మరెవ్వరున్నారు? నీలో ఆ కోరికలు వేళ్ళు పాతుకపోయినా నీకీ ప్రపంచం ప్రసాదించిన వాటితో మొగం మొత్తి విసుగెత్తి నిస్పృహ కలిగింది. నీలో అశాంతి చెలరేగింది.

4) ప్రతి ప్రశ్నకూ నీ మతం ఇచ్చిన సమాధానాన్ని, నాస్తికు డిచ్చిన సమాధానాన్ని పోల్చి చూచుకో. ఏది విశ్వసించదగ్గదో నిశ్చయించుకో.

## 2. మనల్ని సృష్టించి మన బాగోగుల్ని చూసే దేవుని అస్థిత్వం

**సృష్టికారకుడూ అనుశాసకుడూ**

నీ వేదైనా బ్రహ్మాండమైన శిల్పాన్ని చూచినప్పుడు ఎవడో ఒక అద్భుత కళాకారుడు దాన్ని చేసివుండాలి అని వెంటనే అంటావు. అట్లాగే ఈ ప్రపంచసృష్టి, తక్కిన గ్రహాలు, ఇందులో జీవించేకోటాను కోట్ల జీవరాసుల ఆకార విశేషాలు, ఇందులోగల కళాకౌశలత్వం ఒక్కసారి పరిశీలించి చూస్తే దీన్నంతటినీ ఒక అద్భుత ప్రతిభాసంపన్నుడైన మహాశిల్పి ఎవరో మలచిఉంటాడనే నిర్ణయానికి వస్తాం. ఈ గ్రహాలన్నింటినీ సక్రమంగా వాటి వాటి స్థానాల్లోఉంచిన ఈ జీవితానికంతటికీ ప్రధానకారకుడైన, విత్తనంలో మర్రిచెట్టును ఇమిడ్చిన ఆ మహావ్యక్తి శక్తినీ, ప్రతిభను ఒకసారి ఆలోచించు.

"ప్రతిభాసంపన్నుడైన, మహాశక్తిమంతుడైన ఒక అపూర్వ వ్యక్తి సహాయ సంకల్పాలు లేకపోతే ఈ సూర్యుడు మొదలైన గ్రహాలు ఇట్లా ఉండేవేకావు," అని ప్రసిద్ధ ఇంగ్లీషు శాస్త్రజ్ఞానవేత్త న్యూటన్ చెప్పాడు. తేనెటీగయొక్క ఆశ్చర్యకరమైన ఆకారాన్ని ఒకసారి జాగ్రత్తగా పరిశీలించు. ఆ తేనెటీగలో ఆ సహజాతాన్ని కల్పించిన వాడెవడు? తేనెపట్టు నిర్మాణంలో ఉన్న గణిత సమస్యల్ని ఒకసారి అధ్యయనం చెయ్యి.

ఈ వాదాన్ని కల్పనా వాద మంటారు. ఒక కల్పన ఉన్నదంటే తప్పకదాన్ని కల్పించిన వాడొకడు ఉండి తీరాలి. ఒక మంచి కారును చూచినప్పుడు నాలో ఆ కారును నిర్మించిన ప్రజ్ఞావంతుణ్ణి గూర్చిన ప్రశంస బయలుదేరుతుంది. ఐనప్పుడు మానవుణ్ణీ ఈ చరాచర జగత్తును నిర్మించిన అవాఙ్మానస గోచరుడైన మహా శిల్పి శక్తి సామర్థ్యాల్ని గూర్చి నీ వెంతగా ప్రశంసిస్తావు. ఇది చాలా పురాతనమైన వాదం. ఐనప్పటికి అరుణోదయం మాదిరిగా నిత్య నూతనమైంది.

బుద్ధిమంతు డెవడూ ఈనాడు ఈ అద్భుతాలన్నీ ఏదో కాక తాళీయంగా జరిగినవని ఊహించడు. "ప్రకృతి నియమాలను అంగీక రిస్తే, నియమకర్త ఒకడు ఉన్నాడు అన్న విషయాన్ని అంగీకరించడం సక్రమమైన పద్ధతి." ఈనాడు వాళ్ళు చెప్పే వాదన ఇది: ప్రకృతిలో శాసనం, నియమమూ ఉన్నాయి. మానవ మాత్రుడు సృష్టించినవి కావివి. కాబట్టి దేవుడే ప్రకృతిని ఈ విధంగా నిబంధించాడన్నది మనం తప్పకుండా నమ్మాలి. మానవ శరీరం అభివృద్ధి చెందటానికి దేవుడు కొన్ని నియమాల నేర్పరచాడు. ఆయనే సృష్టికారకుడు అనుశాసకుడూ.

**నీ సదసద్వి చార శక్తి**

నీ వేదైనా తప్పుచేస్తే ఎందుకంతగా భయపడతావు? ఇది కేవలం చదువుకొన్నందువలన వచ్చే ఫలితంకాదు. పూర్తిగా దుర్గుణాలకు లోబడని వ్యక్తి తాను చేసిన పనుల కన్నింటికీ తానే బాధ్యుణ్ణి అనుకుంటాడు. తన నియమాలను, తన విధినీ మానవచేతస్సులో ప్రవేశపెట్టిన అపౌరుషేయమైన ఒక మహానుశాసకుని ఆస్తిక్యతను అంగీకరించనంత వరకూ, నీ యావన దశనుంచీ నీలో కల్గిన విధికి, బాధ్యతలకు నీ వేమి కారణమిస్తావు? మానవుణ్ణి బాధపెట్టినందు కేగాక మానవాతీతుడైన ఒకానొక మహత్తరమూర్తికి తాను సమాధానం చెప్పుకోవలసిన బాధ్యత ఉన్నదని మనోసాక్షి వేదిస్తుంది. కాబట్టే దోషి తన తప్పిదానికి పరితాపం చెందుతున్నాడు. కొన్ని పనులను అంగీకరించడం, మరికొన్నిటిని నిరాకరించడం నీవు చేస్తున్నావంటే నీవుచేసే కృత్యాలన్నిటికి విచారించి శిక్షవిధించే దేవుడొక డున్నాడని తేలుతున్నది.

**పదార్థాల పుట్టుక**

ఈ ప్రపంచానికి, ఇందులో నివసించే చరాచర సంపత్తికి మొదలంటూ ఒకటున్నది. తమకు బాహ్యమై ప్రత్యేకంగా (వేరై) ఉన్న ఏదో ఒక కారణం లేకుండా ఈ పదార్థాలుండటానికి వీల్లేదు. కాబట్టి తమకు బాహ్యమై వేరైన కారణమేదో ఒకటి తప్పకుండా శాశ్వతంగా ఉన్నదన్నమాట. అదే ఆదికారణం.

ఉదాహరణ కొకటి తీసుకుందాం. జీవితం తనంతట తానే ప్రారం భం కాదు. ఆ ప్రప్రథమైన కారణరహితమైన కారణం వలననే జీవి తం ప్రారంభ మయింది. శాశ్వతమైన ఒక వ్యక్తి దగ్గరనుంచే దాని కదలిక ప్రారంభమై ఉండాలి. కాబట్టే దేవుడు శాశ్వతుడు, కారణ రహితుడు, అనంతుడు.

**సార్వజనీన విశ్వాసం** ప్రపంచంలో ఉన్న జాతులన్నీ ఏదో ఒక మానవా తీతమైన శక్తి ఒక టున్నదని, విశ్వసించినై, విశ్వసిస్తు న్నవి కూడా. ప్రార్థనగాని, దేవాలయంగాని, బలి సమర్పణగాని లేని జాతిలేదు. "ఏ మతమూలేని జాతులు కొన్ని ఉన్న వని చెప్పడానికి కారణం సరిగ్గా పరిశీలించక పోవడమన్నా కావాలి లేకపోతే అభిప్రాయాల తికమకలోనన్నా పడిపోయి ఉండాలి. మాన వాతీతమైన శక్తిలో విశ్వాసంలేని జాతిగాని, గుంపుగాని కలికానికి కూడా కానరాదు. కాబట్టి మతం, మానవజాతి కంతటికీ సహజమైన విధానమని వ్యవహరింపబడటం సక్రమం."

జాతులన్నీ దేవుణ్ణి విశ్వసిస్తున్నవంటే అవన్నీ పప్పులో కాలు వేసిన వన్న మాటేనా? కాలం గడచినకొద్దీ దైవ విశ్వాసం సన్నగిల్లి పోయిందంటే అదేమంత చెప్పుకోదగ్గ విషయం గాదు. మానవా తీత మైన శక్తి ఉన్నదన్న ఊహ కలకాలం నిలచి ఉన్నది.

పైన యిచ్చిన నాలుగు ఉపశీర్షికలూ అనంతుండు, సర్వజ్ఞుడు, ప్రతిభా సంపన్నుడూ అయిన దైవాస్థికతను నిరూపించే కారణ చతు ష్టయం. ప్రకృతిలో వున్న యీ పరస్పరానుకూల్యత, నియమం, చిన్న విత్తనంలో దాగివున్న ఆ అద్భుతశక్తి మొదలైన వాటికి సమా ధానాలు చెప్పడానికి మానవులెప్పుడూ ప్రయత్నించారన్నది నీకు తెలుసు. 'మానవుడు' అంటే ఏమిటి అన్నవిషయంమీద మానవులు కిందామీదా పడ్డారు. దాన్నంతా బాగా పరిశీలించిన తర్వాత వీట న్నిటికి వెనకాల దేవుడొకడున్నాడన్న నిశ్చయానికి వారందరూ వచ్చారు.

దేవుణ్ణి సృష్టికర్తయని అంటున్నాము. ఎందుకంటే ఆయన మహిమవలననే యీ చరాచర జగత్తు సృష్టింప బడ్డది. వీటన్నింటినీ సృష్టించడానికి ఆయనకు ఉద్దేశం తప్పకుండా వుండాలి. సామాన్య స్త్రీనిగానీ, పురుషుణ్ణిగానీ యింకేవిధమైన సమాధానం తృప్తిపరచ జాలదు. దైవ విశ్వాసం లేకుండా, ఆయనకే విధమైన బాధ్యతా చూపకుండా వాదించే వాళ్ళను నాస్తికులంటాం.

దేవుడులేని జీవితం అర్థరహితమైనది. కాబట్టి దైవాస్తిక్యతను నిరూపించే మతంతోటి మనం మన చదువును ప్రారంభించాం. జీవిత క్రీడకు సంబంధించిన సూత్రాలు తెలుసుకోవాలంటే జీవితాన్ని ప్రసాదించిన ఆయన దగ్గరకు నీవు తప్పకుండా పోవాలి. సహజంగా చాలా మంది దేవుణ్ణి విశ్వసిస్తారు. కొద్దిమంది తమకు విశ్వాసం లేనట్లు నటిస్తారు. చాలామంది ఆయనను గూర్చి అసలాలోచించనే ఆలోచించరు. ఇన్ని రకాల వాళ్ళనూ నీవు కలుసుకుంటావు. నీకు సత్యం తెలిసింది కాబట్టి యీ సందేశాన్నే బహుళ ప్రచారం చేయడానికి నీవు ఉత్సాహిస్తావ్. తక్కినవాళ్ళు తప్పుడు సిద్ధాంతాల్ని ప్రచారం చేస్తారు.

**ఆచరణ**

1) కొందరు నాస్తికులుగా వుండటానికి యిష్టపడతారెందుకో కారణం నీకు తెలుసా?

2) ప్రకృతి పరిశీలన ద్వారా, చావునుగూర్చి ఆలోచించడం ద్వారా చాలా మంది దేవుణ్ణి తెలిసికోలేరెందుచేత?

3) ఆదికాండమునుంచి మొదటి రెండు అధ్యాయాలు చదువు.

4) మొట్టమొదటి మానవులందరికీ దేవుణ్ణి గూర్చి విస్పష్టమైన అభిప్రాయం వున్నదనీ, కాలం గడచిన కొద్ది ఆ అభిప్రాయాన్ని భ్రష్టు పట్టించారని ఋజువైతున్నది. ఆదియందు మానవుడు దైవజ్ఞాన రహితుడై కాలక్రమేణ దైవభావమందు పరిణామం జెందెననే తమ సిద్ధాంతమును భౌతికవాదులు ఋజువు చేయగలరా? కాలక్రమేణ యీ అభిప్రాయమే విస్పష్టమయింది అన్న భౌతిక వాద సిద్ధాంతాన్ని యిది కొట్టివేస్తుందా?

# మూడవ అధ్యాయము

## అవిష్కారణం.

**అవిష్కారణమంటే ఏమిటి?** మనోసాక్షివలన, సృష్టివస్తువుల పర్యాలోచన వలన సృష్టివస్తు బింబ ప్రతిబింబ భావంవలన, జగత్ శాసకుడైన దేవుడొకడున్నాడన్న విషయాన్ని మానవుడు తెలిసికోగలిగాడు. మానవజాతిని దేవుడు సృష్టించినపుడు, ఆయన మనస్సులో ఏమేమున్నదో మానవులు స్వయంగా తెలుసుకోలేకపోయారు. విషయాలన్నీ స్పష్టంగా అర్థం కాగలదులకు దేవుడు తనను గురించీ తాను వాళ్ళను సృష్టించడంలో గల ఉద్దేశాన్ని గురించీ చెప్పాడు. సత్యాన్ని అర్థం చేసుకోనేటట్లు చేయడం దేవుడంటే ఏమిటో యీ ప్రపంచములో మానవు డెందుకున్నాడో అన్న విషయాన్ని దేవుడుస్వయంగా మానవునికి చెప్పడమే 'అవిష్కారణము'. దేవుడు మానవజాతికి విజ్ఞానాన్ని ప్రసాదించి తెలుగు జూపించి తననుగూర్చిన కొన్ని సత్యాల్ని మానవులకు విశదీకరించాడు. ఈ సత్యాల్ని విశ్వసించడము ద్వారా దేవుణ్ణిగూర్చిన విశ్వాసనీయమైన విజ్ఞానాన్ని మానవులు పొందగల్గుతారు.

**అటువంటిది సాధ్యమా?** సృష్టికర్తకు సృష్టికి మధ్య అనూహ్యాకరమైన తారతమ్యముండుట వలన దైవం తన్నుగూర్చి మానవులకు తెలియపరచడం సాధ్యమా అని తలపోస్తారు. మానవుడు దేవుణ్ణిగూర్చి సర్వమూ అర్థం చేసుకోలేడు. కానీ అతడు ఆయన్ని గూర్చి కొంతవరకైనా నేర్చుకోగల్గుతాడు. మానవ ప్రకృతిని మలచిన తర్వాత తన సృష్టికే తన ఉద్దేశాన్ని తెలియ చేయలేకపోతే దేవుడు నిష్ప్రయోజకుడైన శిల్పి కాడూ? దేవుడు నిజంగా ప్రకృతి (గంధకర్త. ఆలోచనాశక్తి సంభాషణా శక్తి వీటి రెంటినీ సమన్వయింపగల నియమాన్ని దేవుడు మానవుడికి యిచ్చారు.

అటువంటప్పుడు ఈ నియమాల్నే మానవుడితో సంబంధాన్ని కల్పించుకోడానికి తాను ఉపయోగించుకోలేడా? పిల్లవాడికి అర్థ

మర్యోటట్లు మాట్లాడటానికి నీవు సమర్థుడవౌతున్నపుడు మానవ దౌర్బల్యానికి సరిపడేటట్లుగా ప్రవర్తించ డానికి దేవుని కెందుకు సాధ్యంకాదు?

**ఆవిష్కారణ అవసరం**

నిర్మాత ఒక మంచి కారును తయారుచేసి దిక్కూ దివాణీ లేకుండా, గమ్యస్థానం లేకుండా దాన్ని బైటికి పంపించడు. దేవుడు మనల్ని ఈ ప్రపంచములో సృష్టించి, ముక్కూ మొగమూ తెలియని మూఢులుగా దిగవిడుస్తాడా? "ప్రతిభా సంపన్నుడైన సృష్టికర్త ఉద్దేశము ప్రకారము మానవుడు ఒక ప్రత్యేకమైన ప్రయోజనం కోసమే సృష్టింపబడితే, అతడు దేవుని దగ్గరనుంచి ఆయన కోరికకు సంబంధించిన సూచనలూ, తన ప్రవర్తనకు సంబంధించిన ఆజ్ఞలూ తాను పొందియుండకపోతే, ఆ ప్రయోజనములోని తత్వాన్ని, తాను చేరవలసిన గమ్యస్థానాన్ని, దాన్ని పొందటానికి కావల్సిన పరిస్థితుల్ని అతనెట్లా నేర్చుకుంటాడు."?

వస్తువుల్ని చూడటానికి కంటికి వెల్తురెట్లా కావాలో, అట్లాగే జ్ఞాన నేత్రమైన మానవ వివేచనకు దేవుని ఉద్దేశాల్ని గ్రహించడానికి ఆవిష్కరణం కావాలి. నిస్సహాయమైన మానవ విజ్ఞానం ఎంత గొప్పదైనా పొరపాటు పడటాని కాస్కారమున్నది. మానవుడు కేవలం మానవ విజ్ఞానం మీదనే ఆధారపడి ఉంటే తనను గూర్చిన దైవ కాంక్షను ఇదమిద్ధమని నిర్ణయించలేక జీవితమంతా తప్పటడుగులు వేస్తుంటాడు. ఆవిష్కరణవల్ల నీ జీవితంలో వచ్చిన మార్పును ఆలోచించుకో. మహా మేధావుల్లో ఒకడైన సోక్రటీసును గూర్చి నీవు వినే ఉన్నావు. క్రీస్తునాథుడు అవతరించటానికి చాలా కాలం ముందుగానే "దేవుని విషయంలోను, మానవుల విషయంలోను మనం ఎట్లా ప్రవర్తించాలో విశదీకరించడానికి ఎవరో ఒకరు వచ్చేదాకా మనం నిరీక్షిస్తూ ఉండాల్సిన అవసరమున్నట్లు కనపడుతున్నది. అని సోక్రటీస్ ప్రవచించాడు.

**ఆవిష్కరణ ఎట్లా జరిగింది** పాత నిబంధనలో దేవుడు పితామహులకు, ప్రవక్తలకు తన్ను ఆవిష్కరించాడు. ఉదాహరణకు: ఆయన పదియాజ్ఞలను మోసెస్‌కు తెలియజేశాడు కొన్ని సమయాల్లో మానవాకృతుల్లో దేవదూతల్ని తన వార్తాహారులుగా మానవుడి వద్దకు పంపించాడు. (ఉదా: అబ్రహాం)

అందరికన్నా అత్యంత విశ్వాస పాత్రుడుగా మానవుడికి దేవ రహస్య వార్తాహరుడుగా వచ్చిన వ్యక్తి దేవుని కుమారుడు క్రీస్తునాథుడు. ఆయన ఎప్పుడూ దేవుడే. కానీ, సమయం వచ్చేటప్పటికి మనుష్యావతార మెత్తాడు, మానవుడుగా పెరిగాడు. ఒకే కాలమున దేవుడును మనుష్యుడును—

ఆయన ద్వారానే క్రైస్తవావిష్కరణ జరిగింది. ఆయన దేవుని అభీష్టాన్ని సర్వకాలాల వరకు మానవునికి తెలియజేశాడు. ఆయన ప్రపంచానికి దేవుణ్ణిగూర్చి ఉద్బోధించాడు. కొత్తనిబంధన అని పిలువబడే గ్రంథంలో ఆయన సుభాషితాలు చాలా నిక్షేపించబడి ఉన్నవి. ఆయన యీ జీవితాన్నుంచి వెళ్ళిపోయిన తర్వాత అర్చ్య॥ చిన్నప్పగారికి దర్శనమిచ్చి చాలా విషయాలు చెప్పాడు. (గలా 1,11—12) కొత్త నిబంధనలో చిట్ట చివరి గ్రంథాన్ని వ్రాసిన అర్చ్య॥ జ్వాన్నెను మరణించిన దగ్గరనుంచీ సాముదాయక ఆవిష్కరణ మంటూ లేనేలేదు.

విగ్రహారాధకులు జీవితార్థాల్ని తెలియచేయడానికి ప్రయత్నించి కొన్ని శతాబ్దాల పర్యంతం అంధకారంలో మునిగిపోయారు. క్రీస్తునాధుడు వచ్చి మానవుల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్న సమస్యలన్నింటికీ చక్కని సమాధానాలిచ్చాడు. ఆయన సత్య సుభాషితాలు ఆత్మకు ప్రశాంతినీ, జీవిత గమనాన్ని అనుగ్రహించినై. ఏ రైలు ఎక్కాలనో కూడా తెలియకుండా రైలుస్టేషనుకు ఎగరొప్పుతూ పరుగెత్తే వాళ్ళను నీవు చాలా మందిని చూశావు. క్రీస్తునాధుడు తెచ్చిన సత్యాన్ని నిరాకరించిన వాళ్ళు అట్లాగే ప్రవర్తించారు, ప్రవర్తిస్తున్నారు.

ఈ అనుక్రమణికలో మనం దేవుని ముద్దుబిడ్డను సంబంధించిన ప్రతి విషయాన్నీ నేర్చుకోబోతున్నాం. అప్పుడు జీవితక్రీడలో ఎట్లా ప్రవర్తించాలో నీకు బాగా తెలిసే అవకాశం లభిస్తుంది.

## క్రీస్తునాధుడు ఆవిష్కరించినదేమి?

1.) దేవుడు మన సృష్టికర్త, మనపిత: ఆయన మనల్ని వేయి కళ్లతో కాపాడుతుంటాడు.

2) మానవునికి ఆత్మను అనుగ్రహించి, ఆధ్యాత్మిక సహాయాన్ని ప్రసాదించి దేవుడు మానవుణ్ణి అభ్యుద్ధరించి తనకు కట్టుబడి ఉండేటట్లు చేసాడు.

3) మానవుడు తాను చేసిన కృత్యాలకు దేవునికి ఉత్తరవాది.

4) చావడంతో 'ఓ' పూర్తిగాని భవిష్యత్తు ఉంది. దైవ సాక్షాత్కారముపొంది ఆనందానుభూతుల్ని పొందడమో లేకపోతే నరక కూపంలో పడి నానాయాతన లనుభవించడమో మానవుడే నిర్ణయించుకోవాలి.

5) ఆదాము చేసిన తప్పును సరిదిద్ది మళ్లీ మానవులు దైవ సాక్షాత్కారం పొందేటట్లు చేయడానికి దేవుని ప్రియ కుమారుడు ఈ లోకానికి అవతరించాడు.

6) శాశ్వత జీవితాన్ని సాధించడానికి మానవజాతి క్రీస్తునాధుని ఆదేశాలను శిరసావహించ నన్నావహించాలి లేకపోతే వచ్చే ఫలితాలకు కట్టుబడైనా ఉండాలి.

## ఆచరణ

1) దేవుడు తన్నుతాను ఆవిష్కరించుకోగలడన్న విషయాన్ని మానవు లంగీకరించగూడదన్న దానికి కారణం చెప్పగలవా? (ఇజయాస్ 29, 16, చదువు)

2) చాలా మతాలకు సంబంధించినవాళ్లు దేవుడు తమకు కన్పించాడని ఊహించారు. అటువంటిదాన్ని నిర్ధారించడానికి వాళ్లల్లో సర్వ సామాన్యంగా లోపించినదేమిటి? ప్రవక్తల జీవితాల్లో గాని, అర్చ్యా! చిన్నప్పగారి జీవితంలో గాని వాళ్ల బోధల్ని ఋజువు

చేయగల శక్తి ఏమి ఉన్నది. (నిర్గమకాండము: 13, 21; జోషువ 3; 7-17; దానియేల్ 6, 22; 4 రాజులు 1, 12; కొలాసీయులు: 1, 18 మరియు 2, 8-9)

3) దేవుడే శిక్షించటానికిగాని రక్షించటానికిగాని అర్హమైన పరిస్థితుల్ని తామే కల్పించగల సమర్థులమని కొందరు తలుస్తుంటారు. ఈ సిద్ధాంతంలో ఉన్న తప్పేమిటి?

4) పది ఆజ్ఞలను ఇచ్చేటప్పుడున్న పరిస్థితుల్ని నిర్గమకాండము: 19 అ. 20 అ. ల్ని చూడు.

5) పాతనియమం ప్రకారం ఆజ్ఞలకు విధేయులుగా ఉండడంలో గల అంతర్యం ఏమిటి? క్రీస్తునాధుడు ఆ ఉద్దేశాన్ని మార్చాడా?

# నాల్గవ అధ్యాయము

విశ్వసనీయమైన క్రీస్తునాధుని చరిత్ర.

**ఈ చరిత్ర ప్రాధాన్యత**

ఇంతకు ముందు ప్రకరణంలో దైవావిష్కరణం వలన దైవాన్ని గురించి మనం చాలా సంగతులు నేర్చుకొన్నాం. మరిన్నీ మానవజాతికి దైవాన్ని గూర్చిన యీ విజ్ఞానాన్ని ప్రసాదించిన ప్రధాన వ్యక్తి క్రీస్తునాధుడే అని గుర్తించాం. జేసువు ప్రసాదించిన దాన్ని అంగీకరించ వలసిన బాధ్యత మీలో ప్రతివ్యక్తి మీదా— మన అందరి మీదా ఉన్నట్లయితే అప్పుడు మీకు ఆయన సుభాషితాల్ని గూర్చి, ఆయన చేసిన పనులనుగూర్చి సరియైన చరిత్ర ఉన్నదని మీకు హామీ ఇవ్వ వలసిన బాధ్యతకూడా ఉన్నది. క్రీస్తునాధుడు చెప్పిన సత్యాల మీద ఈనాడు తమ జీవితాలను నడుపుకొంటున్న కోటాన కోట్ల ప్రజల్ని గూర్చి కొంచెం ఆలోచించు. నీవు కతోలిక వ్యక్తివి కావటంచేత వ్రాసి వుంచిన చరిత్రమీదనే ఆధార పడవలసిన నిమిత్తం లేదనుకో. క్రీస్తునాధుని చరిత్ర లిఖిత గ్రంధాలను జాగ్రత్తగా సంరక్షించిన తిరుసభ యొక్క అమోఘమైన, సజీవమైన కంఠం నీకు వినిపిస్తున్నది.

పరిశుద్ధ గ్రంధానికి ప్రత్యేకమైన విశిష్టప్రయోజనాలున్నాయి. ప్రస్తుతానికి మటుకు క్రీస్తునాధుని లిఖిత జీవిత గ్రంధాన్ని మనం సామాన్య చరిత్ర మాదిరిగానే ఉపయోగించుకో బోతున్నాం. క్రొత్త నిబంధన జేసును గూర్చిన చరిత్ర సత్యాన్ని ప్రసాదిస్తున్నది.

**లౌకిక చరిత్రలో కొద్ది ఆధారాలు**

జేసునాధుడు ఉన్న రోజుల్లోనే ఆయన చాలా మందికి తెలియలేదు. ఎందుకంటే ఆయన జాతే యితర జాతులతో సంబంధంలేని జాతి. ఆయనకూడా స్వయంగా ముప్పది సంవత్సరాలపాటు యెవరికీ తెలియ కుండా యేకాంత వాసం చేశారు. చరిత్రలో యీ సుప్రసిద్ధమైన వ్యక్తి బహిరంగంగా జీవయాత్ర చేసింది మూడు సంవత్సరాలు మాత్రమే.

క్రొత్తనిబంధన మినహాయిస్తే, మొత్తం చరిత్ర గతినే మార్చి వేసిన ఆయనను గూర్చి స్వల్పమైన సమకాలిక విషయాలను మాత్రమే చరిత్ర మన కందిస్తున్నది. ఫ్లేవియస్ జోసఫ్ అనే యూద రచయిత క్రీస్తునాథుని జీవితాన్ని గూర్చి కొన్ని అక్కడక్కడ ఘట్టాలు మాత్రమే వ్రాశాడు. ఆయన యింకా చాలా చెప్పివుండే వాడే. కానీ ఆయన రోమనులను, విగ్రహారాధకులను సంతోష పెట్ట డంకోసం వ్రాస్తున్నందువలన ఆ పని చేయలేకపోయాడు. "క్రైస్తవ మత స్థాపకుడైన క్రీస్తునాథుడు టిబేరియస్ పరిపాలన కాలంలో పోంస్యు పిలాతు వలన చంపబడ్డాడు." అని 'టాసిటస్' అనే రోమన్ రచయిత తన పురావృత్త గాథలో చెప్పాడు.(Annals XV)

**క్రొత్తనిబంధన చరిత్రాత్మకము**

క్రొత్త నిబంధనలో మనకు లభించిన పురాతన మైన ప్రతి, నాల్గవ శతాబ్దానికి సంబంధించింది కాని, మూడు, రెండు, మొదటి శతాబ్దాల్లో కూడా కొన్ని మన క్రైస్తవులు వ్రాసిన వ్రాతలు మనకు వున్నవి. అవి తరచుగా క్రొత్త నిబంధనను గురించి ప్రస్తావించినై. వాళ్ళ ప్రస్తావనలు, క్రొత్త నిబంధనలో ఉన్న మాటలు సరిపోయినై. కాబట్టి మనకు లభించిన ప్రతులు సరైనవని తేల్తున్నది. ఆ కాలంలో లెక్కలేనన్ని వ్రాతలు తమవే సరైన జేసుస్వామి జీవిత చరిత్రలని చెప్పుకొంటూ ఉండేవి. కానీ, నాల్గో శతాబ్దానికి కొంచెముందు ఏది సత్యమైందో, ఏది అవిశ్వాసనీయమైందో తిరుసభ నికరంగా తేల్చి వేసింది. విశ్వాసనీయమైన క్రొత్త నిబంధనకు, అవిశ్వాసనీయమైన తక్కిన చరిత్రకు ఏనుగుకు, దోమకు వున్నంత తేడా వున్నది. క్రొత్త నిబంధనద్వారా మనకీనాడు కల్గిన గాఢ సత్యాన్ని తక్కిన వేమాత్రం కలిగించలేవు.

క్రొత్త నిబంధనలో గల ప్రామాణిక్యాన్ని గూర్చి గత రెండు శతాబ్దాల్లో లెక్కలేనన్ని దండయాత్రలు బైలుదేరినై. సువిశేషకులు వంచకులని పిలువ బడ్డారు. అద్భుతాల్ని, పుక్కిడి పురాణాలనీ కాకమ్మ పిచ్చికమ్మలాంటి కట్టుకథలనీ అన్నారు. ఆఖరికి జేసు చరిత్రను ఒక సుందరమైన తీయని గాథ అన్నారు. ఏది ఏమైనప్పటికి

దైవ భాషణం యింకా సురక్షితంగా చెక్కు చెదరకుండానే ఉన్నది. అడాల్ఫ హార్నక్ లాంటి కతోలికులుగాని పండిత ప్రకాండులు కూడా మొదటి మూడు సువిశేషాలు సత్యచరిత్రే అని గుర్తించారు. పరిశుద్ధ గ్రంథం విలువను శత్రువులింకా నిరాకరిస్తూనే ఉన్నప్పటికీ నిజమైన పండితులు చాలామంది తిరుసభ పక్షానే వున్నారు.

**ప్రామాణిక కాధారాలు** ఏగ్రంథమైనా తాను చెప్పిన విషయాలకు అచ్చుముగా సరిపోతే అది ప్రామాణికమైనదే. అమెరికా కతోలిక విశ్వవిద్యాలయానికి సంబధించిన డాకూపర్ కొత్త నిబంధనలోని గ్రంథాల ప్రామాణికాన్నిగూర్చి యీ క్రింద చెప్పబోయేరకంగా వాదన చేస్తున్నారు. 1) ఈ గ్రంథాలు ప్రత్యక్షముగా చూచిన వాళ్ళచేత గాని, సమకాలికులైన వారిచేతగానీ వ్రాయబడినై. మొదటి మూడు సువార్తలు క్రీస్తు తర్వాత 70వ సంవత్సరములో మత్తయి, మార్కు, లూకాసులచే వ్రాయబడినై. క్రీస్తుకు తర్వాత ప్రథమ శతాబ్దము పూర్తిగాకమునుపే నాల్గవ సువార్తను జాన్ వ్రాశాడు. అందరు తమ జ్ఞాపకాలను లక్ష్యాలను, అభిప్రాయాలను అతి విశ్వాసనీయంగా చిత్రించారు. అంతా మన ప్రభువును ప్రత్యక్షంగా చూచినవాళ్ళచేతా, సమకాలికులచేత రచింపబడినవే. వాళ్ళల్లో చాలామంది ఆయన అత్యంత సన్నిహిత మిత్రులు, శిష్యులున్నూ.

ఎందుకంటే (1) క్రైస్తవ మతంయొక్క మొట్టమొదటి రోజుల నుంచీ చెక్కు చెదరకుండా వస్తున్న సాంప్రదాయం, సువార్తలు అపోస్తలుల నుండి వస్తున్నట్టు నిర్ధారిస్తున్నది. (2) అపోస్తులనుండి వస్తున్నట్టు రుజువుగాని ఏవిషయములనైనను ప్రథమ క్రీస్తువులు పరిశుద్ధ గ్రంథంలో చేరనివ్వలేదు. (3) ఒక్క లూక్‌ను మినహాయిస్తే రచయితలు గ్రీకుభాష నుపయోగించినప్పటికీ సువార్తలన్నీ దృక్పథాల్లో, పద ప్రయోగాల్లో కచ్చితంగా యూదులకు సంబంధించినవిగానే కనపడుతున్నాయ్. (4) ఇతర ఆధారాల్నిబట్టి మనకు తెలుస్తున్న పాలస్తీనా జెరూసలేమ్‌ల భౌగోళిక, సాంఘిక, రాజకీయ, మత విషయాలు సువిశేషములలో చాలా కచ్చితంగా వ్యక్తమవుతున్నాయ్. (5) అవ్వి

జెరూసలేమ్‌ను యింకా అభివృద్ధి చెందుతున్న పట్టణంగా నే చిత్రించినా క్రీస్తు తర్వాత 70 వ సంవత్సరంలో రోమన్లు ఈ పట్టణాన్ని ముట్టడించి, నానాభీభత్సంచేసి సర్వనాశన కారకులై పాలస్తీనా దేశములో ప్రాచీన సంప్రదాయాలన్నింటినీ మట్టుపెట్టారన్న విషయాన్ని మనము గుర్తుకు తెచ్చుకుంటే, యీ చిట్టచివరి మూడు విషయాల్లో వున్న ప్రామాణికత నిస్సందేహంగా మనకు గోచరిస్తుంది.

2) అవి విశ్వాసనీయులైన ప్రత్యక్ష వ్యక్తులచేత సమకాలికులైన వారిచేత వ్రాయబడినవి. సువార్తలు వ్రాసిన కర్తలు వాళ్ళు స్వయంగా, కన్నవీ విన్నవీ, ఇంక తదితరులైన విశ్వాసనీయులైన సమకాలికులయిన సాక్షులద్వారా సేకరించినవి మాత్రమే చెప్పామని బల్లగుద్ది చెబుతున్నారు.

సువార్త రచయితలు సత్యం చెబుతున్నారని ఈ క్రింద అంశాలవల్ల అవగతమవుతున్నది. (1) నిరాడంబరమైన, కచ్చితమైన, నూతనమైనవారి ఉక్తి విధానం. (2) వాళ్ళు చేసిన తప్పిదాలు వాళ్ళల్లో ఉన్న పిరికితనం, భీతావహం, అరమరిక లేకుండా వాళ్ళంతట వాళ్ళే వ్రాసి ఉంచడం. (3) వాళ్ల ఆత్మ బలిదానం, చావడానికికూడ వెనుదీయని వారి ఉత్సాహం. ఆ రకమైన వ్యక్తులు మోసంతో, అబద్ధాలతో ఎప్పుడూ మృత్యుముఖంలో చొరబడరు. (4) తమ సమకాలికులకు తాము చెప్పిన విషయాల ప్రామాణిక బుద్ధి ఏర్పడేటట్లుగా చేయగల మహత్తరమైన విశ్వాసం. వ్యతిరేక విషయాన్ని సవాలు చేయడం. వాళ్ళు చెప్పిన విషయాలే గనుక సందేహాస్పదాలుగా ఉండి ఉంటే, వాళ్ళ శత్రువులు వాళ్ళ మాటల్ని తూర్పారపట్టడానికి మొదటి రకం సాక్ష్యాల్ని కోకొల్లలుగా తయారుచేసే వాళ్లే. (5) వాళ్ళు చిత్రించిన అద్భుతమైన జీవితం క్రీస్తునాథునియొక్క అసమానమైన మహిమాజ్వల గాథ. ఆనాడు ప్రచారంలో ఉన్న ఆదర్శాలకు విభిన్నమయిన చరిత్ర అది. ఇది అంతా యథార్థం కాకుండా కట్టు కథలే గనుక అయితే "నాయకుడికన్నా నాయకుణ్ణి సృష్టించిన వాడే గొప్పవాడై వుండాల్సింది."

**ఆచరణ**

1. తిరుసభకు సంబంధించిన మొట్టమొదటి రచయితల రచనలూ, పరిషత్తులకు సంబంధించిన రచనలూ, వివిధాలైన శాసనాలూ, స్మృతి సాధాలు ఇవి సాంప్రదాయం అనబడుచున్నవి. అవంతా ఎందుకు విశ్వాసనీయమో చెప్పగలవా?

2. ప్రతి సువిశేషకునకు ఒక ప్రత్యేకమైన చిహ్నం ఉన్నది ప్రతి చిహ్నానికిగల అర్థాన్ని చెప్పగలవా?
ఎజెకియల్ 1, 4-10 చూడు

3 క్రొత్తనిబంధనను వ్రాసిన వివిధ రచయితల పేర్లను నేర్చుకో.

4. అర్చ్య. లూకాసు వ్రాసిన సువార్తలోని మొదటి రెండు అధ్యాయాల్ని చాలా జాగ్రత్తగా చదువు. సరియైన చారిత్ర్య కాధారాలు నీ కందులో ఏం దొరుకుతాయో చూడు. క్రీస్తునాథుని బాల్యాన్ని గూర్చి నీ కేమి తోస్తుంది?

# ఐదవ అధ్యాయము

క్రీస్తునాథుని ప్రతిపాదనల సారాంశం.

మనకు లభించిన క్రీస్తునాథుని చరిత్ర సరైందన్న నమ్మకం ఏర్పరుచుకున్నాం గాబట్టి, ఆయన సుభాషితాల్ని, వాటిల్లో ఉన్న సత్యార్థాల్ని అంగీకరించడానికి సిద్ధమైనాం. ఆయన జీవితంతో సాన్నిహిత్యాన్ని సంపాదించుకోవడం తప్ప మీ మొత్తం విద్యాభ్యాసంలో మరో ప్రధానమైన కర్తవ్యంలేదు. మన ప్రభువుతో నీ కేలాంటి సంబంధం లేదను తలంపుకు నీ హృదయంలో ఎప్పుడూ స్థానమివ్వవద్దు. మానవ జాతి కోసమే క్రీస్తునాథుడు తానిక్కడున్నానని ప్రతిపాదించాడు. ఆయన సందేశం అందరికీ కావల్సిందే. కాబట్టి నీవు కూడా అందులో చేర్చబడ్డావు. "క్రీస్తునాథుడు ప్రతి ఆత్మకు సమకాలికుడు" ఆయన నిన్న నే ఉద్భవించినట్లన్నమాట

ఈ పాఠ్యభాగంలో ఆయన జీవిత విధానమును గురించి, ఆయన జీవిత సౌందర్యాన్ని గురించి పరిశీలింపక, ఆయన జీవితములోని అత్యంత ప్రధాన విషయములను మాత్రమే తెలిసికొన ప్రయత్నించుదము. పాతనిబంధనలోఉన్న దీర్ఘదర్శనాల్ని, అందులోను ఇసయాస్ పలుకుల్ని అధ్యయనం చేయడం మనకు చాలా ఉపయోగంగా ఉంటుంది.

"ఆలకించండి! కన్య గర్భవతియై కుమారునికని, అతనికి ఇమ్మానుయేలని పేరు పెట్టును." (అంటే "దేవుడు మనతో ఉంటాడని" అర్థం) (ఇజయాస్ 7, 14) ఈ దీర్ఘదర్శనం క్రీస్తునాథుని పుట్టుటకు పూర్వం 740 సంవత్సరంలో, ఇంకా అంతకు ముందో ఇవ్వబడినది. క్రీస్తునాథునిలో సఫలతను పొందిన యీ దీర్ఘదర్శనం ఆయన జీవితం మీద వెలుగును ప్రసాదించింది. కానీ మనం క్రొత్తనిబంధనలో చెప్పబడిన విషయాలను మాత్రమే గమనిస్తాము.

1. క్రీస్తునాథుడు మానవుడికన్నా అతీతుడనని చెప్పుకొనెను.

1) "అబ్రహాము పుట్టకమునుపే నే నున్నానని మీతో నిశ్చయముగా చెప్పుచున్నా ననెను." (జాన్ 8. 58.) ఆయన శాశ్వతుడు).

2) తన తండ్రి కార్యములను చనిపోయిన వారిని బ్రతికించుట మొదలగు కార్యములను తాను చేయుదునని పలికెను :ఆ విధముగ తన తండ్రితో తనను సమము చేసుకొనెను (జ్వాన్నేసు 5. 21)

3) ఆయన ప్రపంచాన్ని తీర్పుచేయుదునని చెప్పాడు. (మాత్యు 25. 31-46)

4) ఆహారంగా తన దేహాన్నీ, పానీయంగా తన రక్తాన్నీ ఇస్తానని ఆయన వాగ్దానం చేశాడు. (జాన్ 6. 51-52)

**2.** క్రీస్తునాథుడు తాను దేవుని కుమారుడనని చెప్పెను.

1) ఆయన రాయప్పగారి అంగీకారాన్ని ఒప్పుకున్నాడు "జీవించిఉన్న దేవుని కుమారుడగు జేసుస్వామివి నీవే." (మాత్యు 16, 16)

2) తాను స్వస్థతపరచినవారితో ఆయన ఇలా అన్నాడు. "నీవు దేవుని కుమారునియందు విశ్వాసముంచు చున్నావా" అని అడిగెను. అప్పుడావ్యక్తి ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు. "ప్రభువా ! నే నాయన యందు విశ్వాసముంచుటకు ఆయన ఎవడని అడగగా, క్రీస్తునాథుడు నీ వాయనను చూచుచున్నావు. నీతో మాటలాడు చున్నవాడు ఆయనే అనెను." (జాన్ 9. 33 37)

3) నన్ను చూచినవాడు-తండ్రిని చూచి ఉన్నాడు. (జాన్ 14,9) నేనును తండ్రియును ఏకమై ఉన్నామని వారితో చెప్పెను." "తండ్రి నాయందును, నేను తండ్రి యందును ఉన్నాము."(జాన్ 10, 30-38) ఆయన ఈ మాటలు చెప్పగానే యూదులు ఆయనను కొట్టడానికి రాళ్లు తీసుకొన్నారు. "నీవు మనుష్యుడవైఉండి, దేవుడనని చెప్పకొను చున్నావు." (జాన్ 10, 33) ఆయన తనను దేవునిగా భావించుకొంటున్నాడని యూదులు గ్రహించారు.

4) తాను దేవుని కుమారుడనని చెప్పిన, తనకు మరణదండన విధింపబడునని తెలిసియు, పై సత్యమును బహిరంగముగ ప్రకటించెను. (జాన్ 19,7)

**క్రీస్తునాధుడు నిజమైన మానవుడు - నిజమైన దైవంకూడా**

జేసుస్వామి మానవుడు, చరిత్రపురుషుడూ అన్న విషయంలో కొంచెం ఆలోచన గల వాడెవరు సందేహించరు. ఇక పోతే, పైకి అన్నివిధాల మానవుడుగా కన్పడుతున్న ఆయన్ని దేవునిగా ప్రతిపాదించడమన్నది మిగిలింది. అట్టి వ్యక్తిలో రెండు స్వభావా లుండాలి. (దైవత్వం, మానవత్వం) కేవలం కవిత్వపరంగా ఆయన దేవుని కుమారుడు కాడ. అదీ కాకుండా దత్తుపుత్రు డన్న అర్థంలోను ఆయన దేవుని కుమారుడు కాడు. ఆయన దేవుని కుమారుడూ, స్వయంగా దేవుడన్నూ. ఆయన ఆ విషయాన్ని నొక్కి చెప్పాడన్న సంగతి యూదులకు బాగా తెలుసు. ఆయన్ని వాళ్ళు ఆశ్చర్యంతో చూశారంటే అంత పెద్ద ఆశ్చర్యకరమైన సంగతేమీ కాదు. "దేవుడు మనతో ఉన్నాడు" అన్నది ఎటువంటి ఆశ్చర్యకరమైన భావన! యూదులకెటువంటి అదృష్టం! దైవత్వం, మానవత్వాలు గల్గిన దైవం!

**"నా తండ్రి పని"** తనతండ్రిపనిని తాను నెరవేర్చడానికి వచ్చానని తన ఉద్దేశమును తెలియజేసిన తర్వాత క్రీస్తుప్రభువు ఈ భూలోకంలో చిరకాలం ఉండలేదు. తన జీవిత ధర్మాన్ని ఆలోచించుకుంటునే పన్నెండేండ్ల వయస్సప్పుడు ఆయనచెప్పిన మొట్టమొదటి సుభాషితమిది. ఈ సుభాషితం చరిత్ర నిబంధమైంది. పన్నెండేండ్ల వయస్సు వచ్చిన పిల్లవాణ్ణి జూదులు యుక్తవయస్కుడనే నిర్ణయిస్తారు. బాల్యదశలోనున్న జేసువు తనపై తన తండ్రియైన దేవుడు మోపిన దుర్భరభారాన్ని బాగా గ్రహించగలిగాడు. (కష్టమైన భారాన్ని నిర్వహించడానికి నీవు భయపడతావా? జీవితంలో నీ పని ఏది?)

తన తండ్రిపనిని తాను చేయడమంటే ఏమిటి అన్నవిషయంలో జేసుస్వామి ప్రజలను అనుమానంలో ఉంచలేదు. ఆయన "దేవుని రాజ్యాన్ని బోధించడానికి వచ్చాను" (మార్కు 1,38) "పోగొట్టుకొన్నదాన్ని వెతకి సంరక్షించడానికి మానవసుతుడు వచ్చాడు." (లూకా 19,10) లేకపోతే అర్చ్యా॥ బప్తిస్తజ్వాన్నేను మాటల్లోనే

చెప్పాలంటే "అంధకారములోనున్న వారలకు వెలుగు నిచ్చుటకుగాను లోకమునకు వచ్చెను. నేను లోకమును రక్షించుటకే వచ్చితినిగాని లోకమునకు తీర్పుచేయుటకు రాలేదు." (జాన్ 10,12) "నేను మార్గమును, సత్యమును, జీవమును ఐ ఉన్నాను. నాద్వారానే తప్ప ఎవడును తండ్రియొద్దకు రాడు." (జాన్ 4,6) జనులు శాశ్వతత్వానికి ఎట్లా సంసిద్ధం కావాలో ఆయన ఒక్కడుమాత్రమే చెప్పగలడు. సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకు మానవునిలో అనారోగ్య అంధకారం ఆవరించి ఉంటుంది. ఈ అద్భుత కృషి మంతటిని ఏకైకాలోచన "చెదరిపోయినదానిని వెతకి కాపాడుటయే." నిశ్శా ప్రశాంత నిరీక్షణ సమయాల్లో స్వర్గపిత కాయన అనేక విన్నపాలు చేస్తాడు. "ఈమానవుని మాదిరిగా ఇంకా ఏమనుష్యుడు మాట్లాడ లేదు." అని ప్రజలు ఆశ్చర్యపడ్డారంటే నీకు ఆశ్చర్యంగా ఉందా?

**విమోచన క్రయం** క్రీస్తునాధుని బోధలవలన తేలిన సారాంశమేమంటే మానవజాతి తన గమ్యస్థానాన్ని చేరుకొనే సరైన మార్గాంలో ప్రయాణించడంలేదని. పాపము_ ఆదాము పాపం - తరతరాల పాపాలు దైవసాన్నిధ్యమునుండి ప్రజల్ని దూర దూరాలకు తీసుకుపోతున్నది.

ఈ పాపాలన్నిటికీ తన తండ్రిని తృప్తిపరచడానికే క్రీస్తునాధుడు వచ్చాడు. "మనుష్యకుమారుడు పరిచారము చేయించుకొనుటకు రాలేదు. కానీ పరిచారము చేయుటకును, అనేకులకు ప్రతిగా విమోచన క్రయధనంగా తన ప్రాణమునిచ్చుటకును వచ్చెను." (మత్తయి 20, 28) కడరాత్రి భోజనసమయంలో "పాపపరిహారార్థంగా తన రక్తాన్ని ధారపోస్తాను" అని ఆయన చెప్పాడు. క్రీస్తునాధుని ప్రధాన కృషి విమోచనమే. అంటే మానవులకు దైవదర్శనం సాధ్యమయ్యేటట్లు ఆయన చేస్తాడన్నమాట. "బంగారం, వెండివంటి కలుషిత పదార్థాలద్వారాగాదు మనం విమోచితులమయింది. క్రీస్తుయొక్క పవిత్ర రక్తంతో" అని రాయప్పగారు చెబుతున్నారు. (రాయ. నిరూ 1,18)

**ఆచరణ**

1) మనుష్యవతారమన్న శబ్దాని కర్థం ఏమిటి? తక్కిన జాతుల్లో కాకుండా యూదుల్లోనే క్రీస్తునాథుడు ఉద్భవించటం ఎట్లా సంభవించింది?

2) యూదుల నాయకులు క్రీస్తుప్రభువున కెందుకు స్వాగతం ఇవ్వలేదు? ఇంకా మెసయాస్ రాలేదని ఈనాటి యూదులు చెబుతున్నారు. ఆయనే మెస్సయాస్ అని నిరూపించబడ్డ వాక్యాల్ని అర్చ్చ మత్తయి సువార్తలో కనుక్కొని చూడు.

3) జన్మపాపం ఉన్నదని తిరుసభ ఎప్పుడూ బోధిస్తున్నది. రోమ్క. 5, 12, ను చూచి ఆది పాపం ఉన్నదని నమ్మడానికిగల లిఖితకారణాలను గ్రహించు.

4) విజయమంటే ఏమిటి? నీవు ఈ భూలోకంలో ఉండడంలో గల ఉద్దేశ మేమిటి?

---

# ఆరవ అధ్యాయము

క్రీస్తు ప్రతిపాదించిన వాటికి ప్రబల సాక్ష్యంగా ఆయన ప్రవర్తన:—

**మానవ విశ్వాసం నుంచి దైవ విశ్వాసం కలుగదు** జేసు దేవుడైతే, ఆయన జగత్ సృష్టికర్త యైన తండ్రి దగ్గరనుండి వచ్చినట్లైతే, ఆయన నీకు జీవితార్థాన్ని చెప్పగలడు. ఆయన భగవంతుడే అయినట్లయితే నీవు సక్రమ మార్గంలో వున్నావన్నమాటే. ఎందుకంటే నీవు క్రీస్తును అనుసరిస్తున్నావ్. క్రొత్త నిబంధనలో చిత్రింపబడినటువంటి జీవితమే ఆయన జీవితమయినట్లయితే నీ కప్పుడు దైవాదర్శం ఒకటి లభించిందన్న మాటే. నీవు శాశ్వతం (నిత్యం) వైపే ప్రయాణం సాగిస్తున్నావని నిరభ్యంతరంగా నమ్మకోవచ్చు.

జేసుయందు విశ్వాస ముంచడానికి గల మానవ హేతువుల్ని మన మీ అధ్యాయాల్లో తర్కించ బోతున్నాం. ఈ కారణాలు మానవదృష్టి ప్రకారం జేసులో నీకు విశ్వాసాన్ని కలిగిస్తాయ్. ఎందుకంటే ఆయన జీవితం "మనుష్యుల కుమారుల్లోకల్లా అత్యద్భుత సౌందర్య విలసితమైంది."

కానీ జ్ఞానస్నానం తీసుకొనేటప్పుడు నీ కివ్వబడిన దైవవిశ్వాసం, జేసు జీవితం అధ్యయనం చేయడంవల్ల కలిగే విశ్వాసానికి విభిన్నమయింది. దైవవిశ్వాసం మానవాతీతమైన వరప్రసాదం. చరిత్రలో నీవు నేర్చుకొన్నదంతా యీనాడు నీకున్న దైవవిశ్వాసానికి కారణం కాదన్న విషయాన్ని బాగా జ్ఞాపకముంచుకో. చాలామంది చరిత్రను చదివి మానవ విశ్వాసంతో క్రీస్తును అంగీకరిస్తారు. నీవూ అదే చేస్తున్నావ్. కాని నీ దైవవిశ్వాసం వున్నదే, అది దేవుడు నీకు ఉచితంగా అనుగ్రహించాడు కాబట్టి పూరకనే లభించిన వరం. విశ్వాసం నీ నమ్మకాల మొత్తం కూడిక.

**క్రీస్తుబోధలో వున్న అసామాన్య రూపం** క్రీస్తురాకతో దేవుణ్ణిగూర్చి ఒక క్రొత్త భావన ప్రపంచానికి అందజేయ బడింది పాతనిబంధనలో చెప్పినట్లుగా దేవుడు యజమాని అన్న భావం పోయి, ప్రేమపూర్ణుడు, ఆర్ద్రహృదయుడు, ఆదర

స్వభావుడైన తండ్రి అన్న క్రొత్తభావం కలిగించింది. ఇంతవరకూ యెవరూ జీవించని ఆదిమానవ జీవితాన్ని జీవించినది క్రీస్తు ఒక్కడే. (అనగా దేవుడు మొదట మానవుని సృష్టించి యే విధంగా జీవించాలని సూచించెనో ఆ విధంగా జీవించినవ్యక్తి క్రీస్తుమాత్రమే). రాబొయ్యే విపత్తులను చెప్పే భవిష్యత్ సూచకుడుగా గానీ, వాదించి నిర్వచించే వేదాంతజ్ఞుడుగా కానీ ఆయన రాలేదు. గాని అదృశ్య జగత్పిత అంతరాంతరాల్లోనుంచి అత్యంత ప్రజ్ఞ ప్రతిభలు ప్రేమవాత్సల్యాలుగల వినయమూర్తిగ ఆయన ఆవిర్భవించారు. శాశ్వత సౌందర్యం ఆయనలో ప్రకాశిస్తున్నది, ఆయన సుభాషితాల్లో తొంగిచూస్తున్నది. ఆయన సాక్షాత్కారంతో దేవుడు తెలియజేయబడ్డాడు. ఆయన మాట్లాడినప్పుడు ఆత్మల జీవాధారమైన సత్యం, ప్రేమ తెలియజేయబడ్డయ్.

జేసు జీవితం నిష్కళంకమైందని నీకు సులభంగానే తెలుస్తుంది. కానీ అన్నిబోధలకన్నా అతీతమైన సత్యాలు జేసు భూలోకానికెల్లా ప్రసాదించాడో తెలుసుకోడానికి చాలా సునిశితమైన ప్రజ్ఞ కావాలి. ఆయన చెప్పాడు, "మీ శత్రువులను ప్రేమించండి! మిమ్ము ద్వేషించువారికి మంచి చేయండి! మిమ్ము హింసించువారి కొరకై ప్రార్థన చేయండి!" (మత్తేయు-5, 44). ఆయన రోజుల్లో ప్రపంచాని కది క్రొత్త ఉపదేశం. ఆ ఉపదేశం జీవితాన్ని చాల మృదువుగా జేసింది.

క్రీస్తు స్త్రీని దుర్దశనుండి వుద్ధరించాడు. ఈనాడు స్త్రీజాతి వుద్ధరింపబడుతున్నదంటే మనం కృతజ్ఞతాభివందనాలు చెల్లించాల్సింది క్రీస్తుకే. గృహాన్ని ప్రేమపూర్ణ స్థానంగాచేసి పవిత్రతను కాపాడి, పిల్లల్ని దైవభక్తియందు పెంచడమే స్త్రీ విద్యుక్తధర్మమని జేసు ప్రపంచానికి తెలియజేశాడు. ఆత్మయందు తన గౌరవము గొప్పతనము అణగియున్నవని మానవునికి జేసువు నేర్పారు. "ఒక మనుష్యుడు లోకమంతయు సంపాదించుకొని తన ఆత్మను పోగొట్టుకొంటే అతని కేమి ప్రయోజనము?" (మత్తేయు 16, 26).

నీవు దేవునికొరకే నిర్దేశింపబడ్డావన్న నగ్నసత్యం తప్ప, నీ సౌందర్యం, సౌభాగ్యం, ప్రజ్ఞా, ప్రఖ్యాతి నిన్ను గొప్పవానిగా చేయలేవు.

**జేసు వ్యక్తిగత గుణాలు**

"నేను పాపం చేశానని మీలో నన్నెవరు ఒప్పించ గలరు?" తన శత్రువుల కటువంటి ప్రశ్న ఏ మానవమాత్ర నాయకుడు వేయగలడు? క్రీస్తు ప్రవర్తనలో యేమైనా దోషం వున్నట్లయితే జూదులు దాన్ని తరతరాలుగా ప్రకటిస్తుండే వాళ్ళే నని నీ వనుకోడంలేదూ? అనంత పవిత్ర సమ్ముఖమున వుండడమంటే యేమనిపిస్తుందో వూహించుకో! ఆ అనంత పవిత్ర సాక్షాత్కారం (Presence) మేరి మగ్దలెన్‌ను యేంచేసిందో ఆలోచించు. నీవూ ఆయన దర్శనంచేత నిలువెల్లా పులకరించి వుండే వాడివి కాదూ?

జేసు ఎట్టివాడు? ఆయన యేంచేశాడు? చిన్నవాళ్ళ నాకర్షించే ప్రశ్న లివి. ఆయన బాల్యజీవితాన్ని గడపలేదూ? ఆయన పెరిగి పెద్ద వాడూ కాలేదూ? ఆయన మాట్లాడినప్పుడు అందరూ చెవులు దోరగించుకొని వినలేదూ? ఆయన తన శ్రోతల్ని ఆశ్చర్యనిమగ్నుల్ని చేయ లేదూ? స్వార్థప్రయోజనాల్తో సతమతమయ్యే వాళ్ళనుంచి ఆయనకు యెదురునవాళ్ళు రాలేదూ?

క్రీస్తు సంభ్రమాలకనీ, వుత్తేజితాలకనీ తాపత్రయపడలేదు. ఆయన తన జీవితంలో చాల భాగం సామాన్య నిత్య దినకృత్యాల్లోనే గడిపాడు. (నీవు రోజూ పరిశ్రమిస్తూ ఆనందంగా వుండగలవా?). ఆయన రోజుల్లో సామాన్యులంతా ఆయన సుభాషితాల్ని 'ఆనందముగా' విన్నట్లే ఆయన దగ్గరికిపోయి జీవితాన్ని ఆనందమయంగా చేసుకోవడానికి ఇప్పటి సామాన్య మానవులందరికీ అవకాశాలూ వున్నయ్. ఆయన మానవుల మధ్య ఒక కుటుంబంలో సభ్యుడై సంఘములో అంగమై జీవించెను. ఆయన అనుచరులకు ఆయన ప్రాణాధారముగా వుండాలని కోరుకొన్నాడన్నది నీకు తెలుసు. ఆయన మానవ నాయకుడు. "నైతిక శాస్త్రజ్ఞుల నీతిబోధలు విన్నవాటికన్నా, వేదాంతుల ధర్మోపన్యాస సారాంశాల్ని రుచిచూచినదానికన్నా, ఆయన జీవితమును గూర్చి ధ్యానించడంచేతనే మానవజాతి యెక్కువగా అభ్యుద్ధరింపబడి పవిత్రీకృతం చేయబడింది." ఆయనలో పొంగి పొరలే మానవత్వంవలన దరిద్రులు, సామాన్య ప్రజ ఆయన సమక్షాన యేమి-

బిడియం చెందలేదు. అంటే ఆయనతో అంత అప్యాయంగా అంత సన్నిహితంగా మెలుగుతారని అర్థం. ఆయన జన్మించినప్పటినుంచి ఆయన తరువాత వచ్చిన మేధావులూ, ప్రజ్ఞానిధులూ ఆయనను అందుకోలేని లక్ష్యమువలె, ఆదర్శమువలె భావించారు.

"ప్రభూ! నీవు కోరితే నన్ను పరిశుభ్రునిగా చేయలేవా?" అన్న కుష్టువానిలో గల విశ్వాసాన్ని నీవు వూహించుకోగలవా? క్రీస్తు చిన్న పిల్లల్ని యెట్లా ఆదరించాడో నీవు జ్ఞాపకం చెసుకో. కాబట్టి అటువంటి వ్యక్తిత్వంతో సంబంధాన్ని యేర్పరచుకోగల అర్హత నీలో తప్పకుండా వుంది. నీ బలం ఆయన్లోనే వుంది. సమానత్వం, దృఢసంకల్పం, వినయం, కృతజ్ఞత, స్వార్థత్యాగం, దానం మొదలైన గుణాల్ని సంపాదిద్దామని నీవు యెంతగా కోరుకొంటే అంతగా యీ గుణాలన్నీ ఆయనలో జాజ్వల్యంగా ప్రకాశించివున్నవనీ, వాటిని నీవు అనుకరించటానికి వున్నవనీ గ్రహిస్తావ్.

## అద్భుతాలు—దీర్ఘదర్శనాలు

ఎవడన్నా తాను దేవుణ్ణి అని చెప్పుకుంటే యేదీ నీలో యేదన్నా అద్భుతశక్తి వుందేమో చూపించమని మొట్టమొదటి పరీక్ష పెడతావ్. క్రీస్తు అటువంటి అద్భుతాలు చేయడంకోసం చాలమంది వువ్విళ్ళూరారు. కాని ఆయన జీవితాన్ని నీవు చదివితే వాళ్ళల్లో వున్న వుత్సాహాన్ని సంతృప్తిపరచడంకోసం ఆయన యెన్నడూ ఒక్క అద్భుతమైనా చేయలేదని గ్రహిస్తావ్.

ఆయన కేవలం ఆధ్యాత్మిక ప్రయోజనాల కోసమనే అద్భుతాలు చేశాడు. తనలోవున్న దైవత్వాన్ని ప్రజలు విశ్వసించేందుకే చేశాడు. ఈ విషయంలో ప్రాచ్యఖండాలకు సంబంధించిన ఇంద్రజాలికులతో యీాయన విభేదిస్తాడు.

అట్లాగే ఆయన దీర్ఘదర్శనాలు కూడ ఆధ్యాత్మిక ప్రయోజనాలకే వుద్దేశింప బడ్డయ్. ఆయన తన మరణాన్ని, పునరుద్ధరణాన్నీ, జెరూసలేం నగరనాశనాన్నీ గూర్చి ముందే చెప్పాడు. ఈ దీర్ఘదర్శనాలు ఫలించడం ద్వారా ఆయన తాను దేవుడనని చెప్పిన విషయానికి మంచి బలం చేకూర్చినై.

**ఆచరణ** 1. అర్చ్యోశిష్ట మత్తెయి సువిశేషము 5, **6,** 7 అధ్యాయాల్లో వున్న కొండమీది ప్రసంగాన్ని చదువు.

2. దేవుడు మానవుడుగా అగుపడ్డాడన్న భావం నీ కేమి వుద్బోధిస్తున్నది?

3. క్రీస్తు శత్రువులే ఆయన చెప్పిన మాటల్లో మనకు విశ్వాసం కలిగేటట్లు సహాయ పడ్తున్నారు. ఎట్లా?

**4** క్షమించడంలో క్రీస్తు చూపించిన దయనూ, సమ్మతినీ, నీవు నీ సంభాషణల్లో అనుకరిస్తావా?

5. క్రీస్తు జీవితంలో ఒక విధమైన నిగ్రహాశక్తి వుందని కనపడింది. ఆయన మనుష్యుల మధ్యలోనే సంచరించాడు. కానీ వాళ్ల మాదిరిగా ప్రవర్తించలేదు. వాళ్ళ బలహీనతలకు ఆయన లొంగిపోలేదు. జగత్తులో వున్న చెడుకు లొంగిపోకుండా నీవూ వుండగలవా?

---

# ఏడవ అధ్యాయము

## పునరుత్థానము.

**మూల సత్యం** కతోలికు మతం తాను ప్రతిపాదించిన ప్రతిపాదనల సత్యాన్ని నిరూపించడానికి ఒక అద్భుతం మీద ఆధారపడివుండడానికి యెంతో వుద్యోగిస్తూ వున్నది. ఆ అద్భుతం క్రీస్తు పునరుత్థానం. "క్రీస్తు పునరుత్థానం కాకపోతే మా బోధలూ, మీ విశ్వాసం యెందుకూ కొరగాకుండాపోతై" (కొరి-15, 14). క్రీస్తు దేవుడు అని రుజువుచేయడానికి పునరుత్థానం అత్యంత ప్రధానాధారం. మానవుడు గొప్పగ ఆశ్చర్యమును కలిగించు కార్యములను చేయగలడనే నీవు గ్రహించి వున్నావ్. గాలిలో ప్రయాణం చేయగలడు, ఖండ ఖండాంతరాల్తో మాట్లాడగలడు, మరిన్ని అతడు గర్విష్టియై తాను స్వతంత్రుడనని భావించవచ్చు కానీ తన్ను మృత్యువు కబళించివేసిన తర్వాత మళ్ళీ తన జీవనాడుల్లో జీవరక్తాన్ని ప్రసరింప జేయగల్గిన మానవుడెవడున్నాడు? "తన ఆత్మను తన స్వాధీనంలో వుంచుకోడానికి గానీ, మృత్యువునుంచి తప్పించుకోడానికి గానీ మానవునకు శక్తి సామర్థ్యాలు లేవు" (ఎక్లెజి. 8,8)

క్రీస్తు నిజంగా చచ్చిపోయాడని, మళ్ళీ జీవించాడనీ గనక రుజువు చేయగలిగితే ఆయన తప్పకుండా ముమ్మాటికీ దేవుడే; ఆయన జీవితం దైవత్వం, మానవత్వాల్తో మిళితమైందే; ఆయన సుభాషితాలు జగత్ సృష్టికర్తయొక్క పలుకులే.

**1.** క్రీస్తు తాను పునరుత్థానమయ్యేదనని ముందుగానే చెప్పాడు.

"మళ్ళీ మూడోనాడు ఆయన తప్పకుండా పునరుత్థానం చెందుతాడు. (మత్తేయు: 20,19).

ఆయన సమాధి కొరకు కాపలాదారుడు కావాలని జూదులడిగారు. "అయ్యా! ఆ వంచకుడు సజీవుడై యుండినప్పుడు మూడుదినములైన తర్వాత నేను లేచెదను అని చెప్పినది మాకు జ్ఞాపకమున్నది

కాబట్టి మూడువదినము పర్యంతము సమాధిని భద్రముచేయ నాజ్ఞా పించుము" (మత్తయి. 27,63). ఈ విధంగా జూదులకు ఆయన చెప్పిన పునరుత్థాన విషయం బాగా తెలిసింది.

## 2. క్రీస్తు నిజంగా మరణించాడు.

ఆయన మరణవార్త అధికారరీత్యా పిలాతునకు తెలియచేయ బడింది. రోమను సిపాయీలు అటువంటి విషయాల్లో యేమాత్ర మైనా పొరపాటు చేయటానికి సాహసించరు బాధ, రక్తస్రావం ఆయన ప్రాణాల్ని బలిగొనియుండి యుంటవి. ఆయన ప్రక్కనుంచి కార్తున్న నెత్తురు, నీరు మరణానికి ఖచ్చితమైన గురుతు. సువిశేషకులందరూ ఆయన మరణించాడని అంగీకరిస్తారు. ప్రతిదీ ప్రత్యక్షంగా చూస్తేనే గాని నమ్మమనే ఆధునిక హేతువాదులకన్నా, మనం వీళ్లయందే విశ్వాసముంచ నక్కర్లేదూ?

## 3. క్రీస్తు శత్రువులే పునరుత్థానమునకు సాక్షులైరి.

ఆయన ముఖ్యస్నేహితులే మొదట్లో పునరుత్థానాన్ని అంగీక రించటానికి కొంచెము తటపటాయించారు. ప్రజలు సులభంగా బోల్తా పడ్డారని మాత్రం అనుకోవాకు ప్రపంచంలో యింకెవరికైనా దప్పించ వచ్చుగానీ, దొంగనటన జేసే జాతిని ఫరిసేయులను మాత్రం దప్పించ లేము. ఈ పునరుత్థానం నగ్నసత్యమే కాకపోతే వాళ్లు దీన్ని గూర్చిన ప్రసంగాన్ని చిన్నాభిన్నం చేసి నానారభసా పట్టించి వుండేవాళ్ళు కాదూ? వాళ్ళు నగ్నసత్యాన్ని కాదనలేకపోయారు. అందుకని ఈ పున రుత్థాన విషయం ప్రచారం కాకుండా వుండటానికి అనేక విధాల అడ్డు పెట్టారు. పునరుత్థానం అన్నది కలలోమాట, కట్టుకథ అని గనక వాళ్ళు లోకానికి నచ్చచెప్ప గలిగినట్లయితే అది వాళ్ళకు చాలా వుపయోగ కారిగా వుండేదన్న విషయం ఆలోచించు. కానీ వాళ్లాసత్యాన్ని కాదనలేక పోయారు.

## 4. నమ్మదగ్గ సాక్ష్యం

"ఆయన కేఫాకు, తరువాత పదకొండుగురికిని కనబడెను. తర్వాత ఐదువందల మందికన్నా యెక్కువైన సహోదరుల కొక్క

సమయమందే కనపడెను" (కొరిం. 15,5). ఈ ప్రత్యక్ష సాక్షుల ప్రవర్తన, మనం వీళ్ళు లోకాన్ని మోసం చేయడానికని యీ పునరుత్థానమనే కట్టుకథ అల్లి ప్రచారం చేశారని అనుకోవడానికి యేమాత్రము ఆస్కార మివ్వదు. ఆ విషయంలో వాళ్లు అంత చతురవంతులు కారు. పైగా యిటువంటి శుద్ధబద్ధాన్ని సృష్టించినందువల్ల వాళ్ళ కొరిగే ప్రయోజన మేముంది? వాళ్ళు చెప్పిన విషయాల్లో సత్యమున్నదని నిరూపించడానికి వాళ్ళ జీవితాలే బ్రహ్మాండమైన తార్కాణాలు. ఈ పునరుత్థాన విషయాన్ని అణచిపెట్టగలందులకు సినాగోగ్ చేసిన తెలివితక్కువ ప్రయత్నాలు యీ నగ్నసత్యానికి మరింత బలము చేకూర్చడానికి వుపయోగించినై (మత్తయి 28, 12-14). తిరుసభ అంతటి మహోజ్వలమైన సంస్థ, అత్యద్భుతమైన సంస్థ అబద్ధంమీద మోసం మీద నిర్మింపబడినదని యేలా అనుకోగలం? అబద్ధంమీద ఆధారపడి తిరుసభ యింత బ్రహ్మాండంగా అభివృద్ధిచెందుతున్నదన్న దాన్ని నీ వూహించగలవా?

## 5. ప్రబల సాక్ష్యం

అపోస్తులులు కలలుగనలేదు. కండ్లు చెదరలేదు వారికి. వాళ్లు చూచిన దృశ్యం యదార్థమైన క్రీస్తురూపమే. "నా చేతులను పాదములను స్పర్శించి చూడండి! నేనే ఆయన. నాకున్నట్లుగా మీారు చూచుచున్న యెముకలును, మాంసమును భూతమునకు వుండవు" (లూ. 24, 39). సామాన్య దృశ్యాలెక్కువసేపు వుండవన్న విషయాన్ని నీవు తెలుసుకొనే వుంటావు. కాని క్రీస్తు దర్శనాలు చాల కాలం సేపుదాకా వున్నాయ్. తమకు కనపడ్డట్లుగా వూహించుకోడానికి, అటువంటి మనస్థితిలో అపోస్తులులు గూడా లేరు. అపోస్తులులు యింతకు మునుపు క్రీస్తుచెప్పిన అనేక విషయాలు నమ్మడానికి ఏ విధముగ తటపటాయించారో అదేవిధముగ క్రీస్తు చెప్పిన పునరుత్థానమునకు వారెప్పుడు యెదురుచూడలేదు. పునరుత్థానమే యదార్థం కాకపోతే మందమతులూ, మూర్ఖులూ ఐన వీళ్ళలో పునరుత్థానాన్ని నమ్మే మార్పు కలిగిందంటే నీవేమిచెప్తావ్?. అభేధ్యమైన, అమోఘమైన సాక్ష్యం వాళ్ళముందు వుంది. వాళ్ళు దైవదత్తమైన విజ్ఞానం పొంది,

పునరుత్థానం జరిగిన పట్టణములోను, క్రీస్తును స్లీవలో కొట్టిన ప్రజల ముందూ ఆయన పునరుత్థానాన్ని బోధించారు. వాళ్ళను ప్రజలెందుకు నిరాకరించలేదు? వాళ్లందరు అబద్ధాలకోరులు, ఆత్మ వంచకులూ అయివుంటారా? "ఈ ఆలోచనగానీ, యీ కార్యముగానీ, మనుష్యుల వల్ల కలిగిందైతే వ్యర్థమై పోతుంది. కాని దేవుని వల్ల కలిగిందైతే మీరు దాన్ని త్రోసిరాజనలేరు." (అపోస్తుల చర్యలు. 5,38).

ఇందువల్ల యీ పునరుత్థానం, క్రీస్తు జీవితానికి, ఆయన చర్యలకు ప్రధాన భాగమవుతున్నది. ఆయన్ని విశ్వసించడానికి వేయి గొంతుకల్తో చరిత్ర వుద్ఘోషిస్తున్న మహత్తరమైన సహేతుకమైన కృత్యమది. మత విశ్వాసంలో నీవు సక్రమమైన మార్గంలోనే వున్నావనడానికి కది గొప్ప హా...ఈ విరుద్ధ ప్రపంచాన్ని యెదుర్కొనడానికీ, క్రీస్తు దైవత్వంలో విశ్వాసం కలుగజేయడానికీ నీ కిది మంచి బలం ధైర్యం యిస్తుంది.

**ఆచరణ** 1. క్రీస్తు దైవత్వమంటే అర్థమేమిటి? ఈ విషయాన్నింతకు ముందెన్నడూ వినని విగ్రహారాధకుడికి నీ వీ దైవత్వాన్ని యెట్లా రుజువు చేస్తావ్!

2. పునరుత్థానాన్ని గూర్చిన సత్యాలు యింకా బాగా తెలియడం కోసం, లూకాసు 24 వ అధ్యాయం చదువు. తర్వాత కతోలికు విజ్ఞాన సర్వస్వంలో (Cath. Encyclopedia) 'పునరుత్థానం' అన్న వ్యాసాన్ని చదువు.

3. అర్చ్యశిష్ట చిన్నప్పగారు కొలెసియన్లకు వ్రాసిన లేఖల్లో 3వ అధ్యాయం లోని మొదటి వచనములను చదువు.

4. అర్చ్యశిష్ట చిన్నప్పగారు కొరింథియన్లకు వ్రాసిన మొదటి లేఖలో 15 వ అధ్యాయంలో మన 'పునరుత్థానం' అన్నదాన్ని గూర్చి యేమి చెప్పారు?

5. క్రీస్తు పునరుత్థానం మోక్షారోహణం ఈ రెండు మన ఆలోచనలను అనశ్వర మోక్షభాగ్యము వైపు మరలించినాయి. మనం

అందుచేత సురక్షితమైన ఆశ కలిగివుండేటట్లు చేయబడ్డాం ఈ భద్రత, ఈ యాశ భూలోక జీవితాన్నే నమ్మేవారికి కలవర పరుస్తుంది. క్రీస్తును నీవు విశ్వసించడానికి నీ కేమి కావాలో తెలుసుకోటానికి ఫిలిప్పియను 1, 29, తిమతి3, 12 అధ్యాయాలు చూడు.

---

# ఎనిమిదవ అధ్యాయము

## మన నాయకుడు

**గట్టి పునాది** క్రీస్తునాథుని ప్రబోధ సూత్రాలను విద్యార్థులు తమ జీవితాలలో ఎట్లు ఆచరించగలరో ఈ ప్రకరణలో ఎక్కువగా వివరింపబడుతుంది. అందుకని మనకు గల ఆధారము లెంత గట్టివో, ముందుగా నిశ్చయించుకోవాలి. ఆయన సిద్ధాంతాలను మన మిదివరలో పరిశీలించాము. ఆయన చెప్పిన వాటికి నిదర్శనాలుగా ఆయన చేసిన కార్యాలను గూడ పరిశీలించాము. వాటిలోని సత్యాలను, వాటిలోని యథార్థాన్ని ఏమాత్రం స్థూలంగా గ్రహించుకున్నా ఆయన మామూలు మానవులకన్నా పైస్థాయిలో ఉన్నారని విశ్వసించక మానవు. ఆయన ప్రబోధాలు సామాన్యమానవుని మెదడులో ఉద్భవించేవిగావు. ఆయన దేవుడును-మానవుడని ఆయన పునరుత్థాన చరిత్రయే లోకానికి చాటుతుంది. అయితే ఇప్పటి ప్రశ్నలు యేమిటీ అంటే: మీ సంపూర్ణ విశ్వాసాన్ని చూరగొనటానికి ఆయనయందు కావల్సినంత సాధనసంపత్తి ఉందని నీవు అనుకోవ్వూ? మీ కోసమే ఆయనకంటే అధికంగా సేవచేసిన వారెవరు? అంతకన్నా ఎక్కువగా మీ కెవరు అనుగ్రహింపగలరు?

**మనము ఆయన కెట్లు ఋణపడియున్నాము** ఆయన ప్రబోధాలను ఆచరణలో ఆయన ఋజువు చేసివున్నట్లయితే ఆయన సందేశాన్ని గూడ మనం అంగీకరించితీరాలి. దాన్నే ఇంకొక విధంగా చెప్పాలి అంటే: ఆయన మన నాయకుడు. ఆయనను మనం శిరసానహించాలి. మన జీవితం ఎలాంటిది? మనం ఎందుకు జన్మించాం? మనం ఎక్కడికి పోతున్నాం? అనే ప్రశ్నలకు సరియైన సమాధానాల నివ్వటానికి ఆయన ప్రబోధాలే మనకు శరణ్యాలు. మనం జీవితాన్ని ఎలా గడపాలో చెప్పారు. మనం ఈ భౌతిక దేహాన్ని విడచిపెట్టిన తర్వాత శాశ్వత పరలోకానంద ప్రాప్తి-మోక్షానందం-ఎలా లభిస్తుందో చెప్పారు. దైవమంటె ఎట్టివాడో, ఆయనతో మనకుగల సంబంధ బాంధవ్యమెట్టిదో ఇదమిద్ధంగా

చెప్పారు. మనలో దేవునియందు విశ్వాసం కల్గటానికి ఆయనే మూలం. ఆయన కారణంగానే మనకు పూజబలి ఏర్పడింది. ఈ పూజబలే దైవారాధనకు సాధన.

దివ్యసత్ప్రసాదమనే ఆధ్యాత్మికాహారమును ఆయనే మనకు అద్భుతంగా ప్రసాదించారు. నిజమూలోచిస్తే వీటి అన్నిటికీ త్యాగ మనం ఆ క్రీస్తునాథునికి ఋణపడి ఉన్నా మనేది విస్మరింపరానిది.

అర్థం చేసుకోలేని ప్రజానీకం మధ్య నివసిస్తూ, అవమానాన్ని, ద్వేషాన్ని సహిస్తూ శిలువమీద దూషణను, బాధను ఓర్చుకొన టంలో ఆయన ఎలా శ్రమపడ్డారో మీకు తెలుసు. ఆయన ఆడంబరం కోసం దాన్ని చేయలేదు. మీ కోసమే ఆయన ఆ పనులను చేశారు. మీకు పాఠం నేర్పాలనే ఆయన అలా చేశారు. అందరిని తమవైపు ఆకర్షించుకోదలచారు. అందుకే ఎవరు ఊహింప నలవిగానట్టి అద్భు తాలను, స్వార్థత్యాగాలను ప్రదర్శించారు. ఆయన గావించిన స్వార్థ త్యాగం ఎంత ఆశ్చర్యకరమో గ్రహించుకోలేనంత కుర్రవాండ్రేమి గారు మీరు. మీరూ పరిణతి బొందిన జ్ఞానం గలవారే. మీరూ పెద్ద ఆలోచనాపరులే. ఆలోచనా ఫలితంగా మీరు ఆయన్ను మాన వుడని, దేవుడని గ్రహింపగలరు. ఆయన మానవస్వభావం గల్గిన దైవ వ్యక్తి. అదే ఆయనలో ఉన్న గొప్ప ప్రత్యేకత. మానవుడుగా ప్రవ ర్తించబట్టి బాధ అంటే ఎట్టిదో ఆయనకు తెలుసు. ఆయన జీవితాన్ని సరిగా అర్థం చేసుకొని దాన్ని ప్రశంసించిన నాడు, ఆయన జీవితం గుణ పాఠాన్ని నేర్పుతుందని మీరు గ్రహించిన నాడు అది మీకు నిజంగా పుణ్యదినం. అదే పర్వదినం. ప్రజానీకానికై ప్రజాబాహుళ్యానికై ఆయన ఏమిచేశారో దాన్ని గురించి ఆలోచించుకొనటానికై కొంత కాలాన్ని మీరు వినియోగించాలని ఆయన కోరిక. ఆయన ఎవరిని బలవంతము చేయరు. కాని "రండు, నా మాట లాలకించండి" అని మాత్రమే ఆయన చెబుతారు. అదొక్కటి చాలు ఇతరులను ప్రభావితు లనుగా చేయటానికి. అదే ఆయనలో ఉన్నది గూడ

సమర్థుడైన వ్యక్తి జీవితం విద్యార్థుల జీవితాలను ప్రభావితా లుగా చేస్తుంది. అలాంటి వ్యక్తి జీవితం వారి పురోగమనానికి యెంతో

అవసరం. అట్టి అవసరాన్ని జేసునాధుని జీవితమే తీర్చింది, తీర్చుతుంది, తీరుస్తున్నది గూడ. అదీ అసలు విషయం. ఆయన మాత్రమే మీలో నిగూఢంగా, లోతుగా వున్న భావాలలోనికి ప్రవేశించి, అవగాహన అగునట్లు చేయగలరు. మీ అంతరాంతరాలలోని ఉత్తమ శక్తులను బైటికి లాగగల వారు ఆయన ఒక్కరే. కొన్ని కొన్ని పద్ధతుల మీద మార్గాల మీద ఇతరులు మీ జీవితాలను నడిపించటానికి, మిమ్ము ప్రభావితులుగా చేయుటానికి ప్రయత్నించవచ్చు. కాని పూర్తిగా మీకుపయోగపడునట్లు వారు పనిచేయ శక్తిలేనివారై వుండవచ్చు. నిరంతరం పురోగమనానికి శక్తివంతులునుగా జేసి వెలుగు బాటలను చూపించగలవారు ఒక్క క్రీస్తునాధుడే. నీవు ఏవృత్తిలోనైనా వుండు ఎక్కడైనా ఉండు, నిన్ను ఆయన నడిపిస్తారు. నీకు మార్గాన్ని చూపి స్తారు. ఇతరులు మహా పురుషుల్లాగ కన్పించినా చివరకు వచ్చేటప్ప టికి మన మాశించిన దానికి పూర్తిగా విరుద్ధమే జరుగుతుంది. చివరకు వారు ఆశాభంగాన్ని కల్గిస్తారు. కాని క్రీస్తునాధుని తెలుసుకొనిన కొద్దీ మీ కెట్టి విశ్వాసం ఆయన యందు గల్గుతుందో, అంతకు మించిన సంతృప్తి గూడ గల్గుతుంది. సాధారణంగా యువకులు, స్వార్ధాన్ని జూచుకొననట్టి సౌజన్యము, సుహృద్భావంగల నాయకుని కోరుతారు. ఆ సందర్భంలో క్రీస్తునాధుడే అట్టి విశ్వాసానికి, సౌజన్యానికి, సుహృ ద్భావానికి ప్రత్యక్ష మూర్తిభావంగా వున్న మహా వ్యక్తి. ఆయన యీ యిహలోకంలోనే గాదు, పరలోకంలోను మహాపురుష పుంగవుడే. యదార్ధానికి మీరు గుర్తించ వలసింది ఏమిటి అంటే క్రీస్తునాధుని ద్వారానే దేవుని జేరగలమని.

చరిత్రను చదువండి. అప్పుడు మీకు ఆయన మానవ హృద యాలను ఎలా కదిలించిందీ తెలుస్తుంది. చిత్రకారులను, కవులను, సైని కులను, పరిశోధకులను, మహాత్ములను, యోగులను, రాజనీతి చతురు లను, వినమ్రులైన మత కన్యకలను ఆయన ఎట్లు ఆకర్షించినదీ అర్థ మవుతుంది.

అర్చ్యశిష్ఠులైన చిన్నప్పగారు, అసిస్సీ వాసి అయిన ఫ్రాన్సిస్, లొయోల ఇగ్నేషియస్, సియానోపురి కాథరీన్, తెరీజా, వీరి పట్ల

ఆయన పలుకుబడి ఎట్టిదో చదవండి. ఆయనకు పరిచర్య చేయు నిమిత్తం వేలాది స్త్రీ పురుషులు తమ ప్రాపంచిక పరిస్థితుల నెల్లు వదలి పెట్టినారో ఆలోచించండి. ఎందరు తల్లిదండ్రులకు ఆయన మార్గదర్శకుడై అండగా ఉన్నాడో తెలుసుకొనండి. ఆయనలో బలాన్ని, రక్షణను, కనుక్కొన్న మాతాపితరుల విషయం ఒక్కసారి ఆలోచనచేసి చూడండి. వడకం సమయంలో ఒక మహా ఐరిష్ వ్యక్తి తన జీవిత పంథాపట్ల ఈ విధంగా తీర్మానించు కున్నాడు. "శిలువ వేయబడిన నా రక్షకునికి నన్ను నేను పూర్తిగా అప్పగించుకొనుటతో ప్రతి దినాన్ని ఆరంభిస్తాను. అన్ని విషయాలలో తమ కాపుదల క్రిందకుతమ అదుపుక్రిందకు నన్ను ఉంచుకొనుటకు నేను వారిని అర్థిస్తున్నాను" (7).

ఆయన నీ కంటె చాలా పైస్థాయిలో ఉన్నారని నీకు అతీతులని అనుకోవచ్చు. అందరికీ అందుబాటులో ఉండేటందుకు దైవ గుణాలను మానవరూపంలో ప్రదర్శించేందుకు, ఆయన మానవ రూపాన్ని ధరించారు. కనుకనే ఆయన మీకు ఆధ్యాత్మిక నాయకులైనారు. నీవు కోరితే, నీ సోమరిపోతు తనాన్ని పోగొడతారు. ఇంద్రియాలను జయించుకొనునట్లు చేయగలరు. శక్తిసామర్థ్యాలు గల వ్యక్తులనుగాచేయగలరు. ఇతరులు మిమ్ములను గూర్చి అపోహపడుచున్నట్లు, మిమ్ములను తెగనాడుతున్నారని మీరు అనుకున్నపుడు, ఆయనను నీవు తలంచకపోయినను, ఆయన మాత్రము నీ కొరకు నిరీక్షిస్తుంటారు "ఆయన పరిచారకులు కొందరు మహా శేముషీ విశేషులున్నారు. వారి యందుగల సర్వగుణాలను మనము అనుకరింపలేక పోవచ్చును. గాని ఆయన యందున్న సద్గుణాలు మాత్రము అందరు అనుకరింప దగినవిగానే కన్పించును," అది నిజముగా గొప్ప విషయం. ఆయన లక్షణాలలో సరితూకము గలదు. ఎప్పుడూ ఒకే పక్షమవలంబించరు. ఆయన గుణాల్లో తప్పించలేము. ఏ లోపముగాని ఆయనలో లేదు. ఎట్టి లోపముగాని ఆయన లక్షణాల కళను తగ్గింపజాలదు.

### క్రీస్తునాథునియందు విశ్వాసం.

భూలోకంలో ఆయనకు శత్రువులున్నారు. ఈ నాటికీ "ఆయన శిలువ మరణాన్ని విశ్వసించని" వారున్నారు. సాధారణంగా

సంఘంలో ఎవరైనా మంచిపని చేస్తుంటే అతనికి, స్వార్థాన్ని ఆశించి ఆటంకాలను, అంతరాయాలను, అవరోధాలను కల్గిస్తుంటారు కొందరు. ఇదిసహజం. పైగా అతనికి తెలుసు తనకు ఇలాంటివి వస్తుంటవని. తెలిసి గూడ అతను తనపనిని మానడు. అలాగే ప్రజలుగూడా క్రీస్తునాధుని అనుసరించే సందర్భంలో తమ కార్యదీక్షను, పట్టుదలను విడనాడరాదు. క్రీస్తునాధుని యడల వారికిగల విశ్వాసాన్ని నాశనం చేయటానికి, ఆయననుండి వారిని విడదీయటానికి సైతాను ప్రత్యేక శ్రద్ధవహిస్తుంటుంది. తీవ్రంగా కృషి సల్పుతుంటుంది. అలా సల్పుతుంటుందని తెలిసిగూడ ప్రజలాయన ననుసరించుటయందు తమ ప్రయత్నాలను విడనాడరాదు. అప్పుడేవారు సైతాను పెట్టిన పరీక్షలో నెగ్గినట్లు. కనుక దేవుని ఎడల నీవు విశ్వాసాన్ని చూపుచున్న సమయంలో ఏదైనా పరీక్ష అంటూవస్తే నీవు దానికి ఆశ్చర్య చకితుడవు కావద్దు. గుండెనిబ్బరంగలిగి ఉండు. ఐతే, ఈ పరీక్ష అనేది ఏ ఆకారంలో వస్తుందో, ఏ సమయంలో వస్తుందో, ఏలాంటి రకపు మనిషి చేత చేయబడుతుందో ఎవరూ చెప్పలేరు. ఒక్కొక్కరి జీవితంలో ఒక్కొక్క రకంగా ఈ పరీక్ష వస్తుంటుంది. కనుక చాలా జాగ్రత్తగా కనిపెట్టి చూస్తుండు.

క్రీస్తునాధుని గూర్చి, కతోలిక మతాన్ని గూర్చి, మామూలు విధంగానే అర్థం చెప్పటానికి కొందరు చూస్తుంటారు. కాని మతాంతరీకుడైన ఒకవ్యక్తి ఒకసారి ఈలా అన్నాడు. "క్రీస్తునాధుడు కేవలం మిధ్యే అయినట్లయితే, అంత నిష్కల్మషమైన, అంత నిష్కలంకమైన, అంత పొందికగల, అంత జీవముతోగూడిన, అంత మానవాతీతమైన వ్యక్తిని ఎవరు సృష్టించగలరు. సర్వప్రపంచంలో మహత్తరమైన మార్పును తీసుకొనివచ్చిన మాటలు క్రీస్తునాధునివిగాక మరెవరివి? గలిలేయ దేశపు మందమతులైన బెస్తవారు ఇంతటి మేధావులా? బెస్తవారు అంతటి తెలివిగలవారు కానిపక్షమున అన్నికాలములకు వర్తించునట్టి అనుపమానమైన సుభాషితాలను ఏ మేధస్సు ప్రచురింపగలదు? మాదిరి దొరకని జీవితాన్ని ఎవరు ఊహించగలరు? ఈ సజీవమైన చరిత్రకు గ్రంథకర్త క్రీస్తునాధుడుతప్ప మరొకరులేరు గనుక" వేరే గ్రంథకర్త ఉన్నారనటానికి యే లిఖిత ప్రమాణమూ దొరకదు.

క్రీస్తునాథుని అంటిపెట్టుకొని ఉండడమనేది కేవలం గ్రంథాలు చదివితే రాదు. ఆ గ్రంథపఠనకు అంతర్వీక్షణ, ప్రార్థన సాధనాలుగా ఉండాలి. అప్పుడే సత్ఫలితాలు కనిపిస్తవి. అపుడే క్రీస్తునాథుని అంటి పెట్టుకొని ఉండడమంటే యేమిటో నీకు తెలుస్తుంది. నీవు ఎక్కడున్నా పరవాలేదు. ఏ వృత్తిలో ఉంటున్నా దిగులులేదు. వీటితో నిమిత్తం లేకుండానే ఆయనతో నీవు నీ స్నేహాన్ని ఉంచుకోగలవు. ఆయనను అంటిపెట్టుకొని ఉండగలవు.

**ఆచరణ** 1) యం. పిగాట్టు వ్రాసిన "No Handicap" అనే గ్రంథాన్ని చదివి, పేతురు పాత్రలోని భక్తి ప్రపత్తులను గమనించు. ఆ తర్వాత "Paul, Hero and Saint" అను గ్రంథాన్ని చదువు.

2) నీ దృష్టికి తరచుగా వచ్చే చరిత్ర ప్రసిద్ధమైన మహోదాత్త వ్యక్తి ఎవరు? చాలా గొప్ప వ్యక్తి ఎవరు? మహా పురుషపుంగవు డెవరు? ఆయన క్రీస్తునాథుడు గాదూ? ఆయనను గురించిన ఆలోచన నీకు తరచు ఏర్పడటానికి, ఆయనకు సంబంధించిన భావన నీకు తరచు ఏర్పడటానికి నీవు ఏం చేయాలి? ఏ పద్ధతి ననుసరించాలి? ఏ పంథా ననుసరించాలి?

3 రోమన్లకు వ్రాసిన లేఖలలోని ఎనిమిదవ ప్రకరణలోని 35, 39 పంక్తులను చదువు. ఐసయాసు దీర్ఘదర్శి: అ. 35,6, చదువు.

4) కార్డినల్ న్యూమెన్ వ్రాసిన ఈ క్రిందిదానికి నీ నిర్వచనమేమిటి- "మన రక్షకుని వ్యక్తిగతాంశాలను గూర్చిన సన్నిహిత జ్ఞానము లేక పోతే వారి యెడల విశ్వాసము హేతువాద పూర్వకమైన చర్చ అని చెప్పవచ్చును. విశ్వాసము జీవముగలదై ఉండాలంటే మనము క్రీస్తునాథుని ప్రేమించాలి. విశ్వాసానికి కర్త అయిన క్రీస్తునాథునియందు మనము ప్రేమ గలిగి జీవించాలి.

5) ఈ వాక్యాన్ని వివరించు. "ఒక మంచి నమూనా కోసం వెతుక్కొని, దాన్ని అనుసరించడమే మానవుని మొట్ట మొదటి అవసరం".

# తొమ్మిదవ అధ్యాయము

## మన నాయకుని పాలనా విధానము.

**తమ సిద్ధాంత వ్యాప్తికి జేసునాధుడు సహజంగా ఏమిచేసి యుందురు**

జేసునాధునికి అందరి మీాద శ్రద్ధ వున్నది. ఆయనకు అంతా కావాల్సిన వారే. తమ రాజ్యంలో ప్రవేశింపమని ఆయన అందరిని ఆహ్వానించారు. అంటే తమ జీవితాన్ని దైవావిష్కరణాన్ని అనుసరింపమని ఉద్బోధించినారని తాత్పర్యం. ప్రతిచోట ఆయన తమ సిద్ధాంతాలు, తమ సూక్తులు వ్యాప్తం కావాలని కోరారు. అపోస్తుల జీవితకాలములో యిది చేయబడుతుందని ఆయన అనుకోలేదు. కనుక విశ్వమానవకోటి కంతటికి తమ నాయకత్వాన్ని గూర్చి చెప్పటానికి ఆయన ఏ మేర్పాట్లు చేస్తారని నీవు అనుకుంటుంటావు.?

ఆయన తమ కార్యాచరణకై ఒక మహత్తరమైన, ఒక పరమ పవిత్రమైన సంస్థను ఏర్పాటుచేశారు. కాలిఫోర్నియా గవర్నరు వానిని దృష్టిలో వుంచుకొని ఇలా అన్నారు. "ఆయనను న్యాయాన్ని ప్రసాదించువారే యని, ధర్మశాస్త్ర విధాయకుడని మన మనుకున్నట్లయితే, తమ అనుచరులను ఒక బహిరంగ సంస్థరూపం క్రిందికి అవసరంగా వారు తీసుకువస్తారని గూడా అనుకోవాలి. ఒక శాసనాధిపతి ఒక పాలనా విధానాన్ని కనుగొన్నప్పుడు అతడు తన ప్రభుత్వాన్ని తనలో జేరిన మానవ లక్షణముల ప్రకారం సవరించుకుంటాడు. ఐహిక ప్రపంచానికి సంబంధించిన మానవుడే తన పని సాగటము కోసం యింత అవస్థపడుతుంటే, ప్రపంచాన్నంతటినీ ఒక కంట కనిపెట్ట వలసిన దేవుని కుమారుడు తమ వేదవ్యాప్తి నిమిత్తం ఒక సంస్థను ఏర్పాటు చేయక తప్పదు. భూభాగంమీాద అనుసరింపబడటానికి క్రీస్తునాధుడు ఒక శాసనాన్ని తయారుచేసి వున్నట్లయితే, ఆయన యిక్కడ ఒక ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి ఉండాలి. పాలింపబడుచున్న వారందరితో యేర్పాటయిన ఒక బహిరంగ సంస్థ అనేది లేకపోయినట్లయితే యీా ప్రభుత్వమనేది నిలువజాలదు నడువజాలదు." క్రీస్తునాధుడు చట్ట

ప్రదాత అని అనుకున్నట్లయితే యీ బహిరంగ సంస్థకూడ దాని కనుగుణంగానే వుండును."

## ఒక సంస్థ స్థాపనకుగల మంచి కారణాలు

1) క్రీస్తునాథుని సిద్ధాంతాలను, సత్యాలను ప్రజల మధ్య వ్యాప్తి నొందించుతున్న బహిరంగ సంస్థ అయిన తిరుసభ ఒక్కటే మానవ ప్రకృతికి అన్నివిధాల తగినట్టిది. సాధారణ మానవుడెల్లప్పుడు దైవ సత్యాలను దైవాధికార ముద్ర పొందిన ఒక సంస్థ ద్వారా ప్రచారమవటాన్ని వాంఛిస్తాడు. అంతేగాని దైవ సంబంధమైన జ్ఞానాన్ని సంపాదించుకొన్నామని ఊహాసౌధాలను నిర్మించుకునేవారి మీద, తదితరుల మీద ఆధారపడడు. కలలను, దర్శనాలను విశ్వసించడు. ఇవి విశ్వాసనియమాలు కూడ కావు. పైగా ఈ కలలు నిజమైనట్టివి అని ఋజువు పరచేవి ఏవీ లేవు. ఇలాంటి సందర్భంలో ఈ నమ్మకంలేని కలలను మానవుడు- అందులో సామాన్య మానవుడు- నమ్ముతాడు అంటే అర్థంలేదు. అనేకమంది ఫకీర్లు [illegible] వాళ్ళు తమ కలలను ప్రజానీకం మీద రుద్దటానికి, వాటిచే వారిని ప్రభావితులు చేయటానికి యత్నించినట్లు ప్రపంచ చరిత్ర మనకు చెబుతున్నది. కాని అలాంటి దానికన్నా, ఒక బహిరంగ సంస్థ అనేది అన్నివిధాల క్షేమకరం. శ్రేయస్కరమూను. ఒక సంస్థ ఉన్నపుడు అది తన వ్యవస్థీకరణ క్రీస్తుతో ఆరంభమైనదని చూపగలుగుతుంది. అప్పుడు సభ్యులు తన్నుతాను నాయకునిగా చేసుకోవాలని ప్రయత్నించే వారిపై ఆధారపడ నవసరంలేదు.

2) క్రీస్తునాథుడు చేసిన బోధలు, తెల్పిన సత్యాలు అందరికీ అంతుపట్టాలి అంటే వాటి విషయంలో ఖచ్చితమైన నిర్వచనం చేయాలి. సమగ్రమైన అర్థాల్ని చెప్పాలి. లేకపోతే కష్టం. పైగా వాటి వలన ప్రయోజనం లేకపోతుంది. ఆయన విశ్వమానవకోటి కందించ దలచిన సత్యాలు దుర్గ్రాహ్యాలు. హేతువాదం ద్వారా అర్థమయ్యేవి గావు. వాటిని ఒక దానితో ఒకటి కలిపి గందరగోళం చెయ్యొచ్చు. తప్పుడర్థాలను తీయవచ్చు. అపోహాలను గల్గించవచ్చు. కనుక ఇలాంటి సందర్భంలో వాటిని రక్షించే విషయంలో క్రీస్తునాథుడెంత జాగ్రత,

ఎంతశ్రద్ధ తీసుకొని ఉంటారు? తప్పక తీసుకోవాలి. లేనిపక్షంలో విశ్వ మానవకోటి తప్పుదారి త్రొక్కదూ? అది అసలు సమస్య. భారత ప్రభుత్వం తన రాజ్యాంగ చట్టాన్ని సంరక్షించు కోవటానికి దానికి సరిఅయిన సక్రమమయిన నిర్వచన మివ్వటానికి సుప్రీంకోర్టును స్థాపించింది. ఎవరు పడితేవారు తమ చిత్తం వచ్చినట్లు రాజ్యాంగ చట్టాన్ని నిర్వచించరాదు (అలా చేయటానికి వీల్లేదు). అలాగే జేసునాథుడు కూడ సత్యాల పరిరక్షణార్థం, వాటి సమన్వయార్థం, వాటి నిర్వచనార్థం ఒక "ఆధ్యాత్మిక సుప్రీం కోర్టును" స్థాపించ మన్నారని అనుకోవ్రూ? అలా అనుకోవలసిన అవసరంలేదూ? మానవులకు మరణం లేని ఆత్మలున్నవి గనుక, మోక్ష నరకాలున్నవి. గనుక జేసుస్వామి ఆజ్ఞల సరి అయిన నిర్వచనం మీద, వాటి అనుసరణమీద చాలా ఆధారపడి ఉంది. రానున్న తరాల వారికి ఆయన ఆజ్ఞలను సక్రమ విధానంలో అందించాలంటే ఒక మహత్తరమైన బహిరంగ సంస్థ అవసరం.

ఇది ఇలా వుండగా మరో అంశం:- 1) క్రీస్తునాథుడు జీవించి ఉన్నపుడు తమ అనుచరులలో కొందరికి జ్ఞానోదయాన్ని గల్గించారు. జ్ఞానమార్గావలంబకులుగా జేశారు. అంతమాత్రం చేత ఆయన సిద్ధాంతాల ప్రచారానికి నిర్వచనాలను చెప్పగలవారి ప్రమేయం తీరిపోయిందని అనుకోరాదు. కాని ఒక విషయం. ఆయన అందరిని తమ బోధలను వ్యాప్తిచేయమని చెప్పలేదు. బహు కొద్దిమందికి మాత్రమే ఆయన ఆ అకాధికారాన్ని ప్రసాదించారు. అసలు ఆయన జీవించి ఉన్నపుడే ఆ అత్యల్ప సంఖ్యాకులైన ప్రత్యేక శిష్యులమీద ఆధారపడ్డారు.

**ఆయన ఆదర్శాలను వ్యాప్తి చేయుదలచిన వారు అనుసరించదగు పద్ధతులు**

మానవరూపంలో క్రీస్తునాథుడు కన్పించారు. వారినుండి మానవులమధ్య తమకనుచరులుగా ఉండటానికి కొందరిని ఏరుకున్నారు. అంతేగాక వారిమధ్యనే నివసించి, వారితోనే మాట్లాడి వారి మధ్యనే తింటూ తిరుగుతూ జీవితాన్ని వెళ్ళ

బుచ్చారు. మానవమూర్తిగానే గోచరించి ఎన్నోపనులు చేశారు. అవి శిష్యులనే దిగ్భ్రాంతి పరచినాయి. వారి భావనా జగత్తును కదలించినాయి. అంతేగాక వారు మాట్లాడే భాషగూడ అందరికీ అర్థమయ్యేది. ఆయన ఏది మాట్లాడినా, ఇతరులు అర్థం చేసుకోవాలని మాట్లాడినారు. తదనుగుణంగా వారు మానసికంగా బాగుపడాలని ఒక ఉన్నత స్థితిని చేరగల మనఃపరివర్తన వారిలో గల్గాలని ఆయన అభిమతం. ఆయన తమ అనుచరులు గూడ యిలాగే మాట్లాడాలని ఆశించారు. యదార్థానికి యితరుల సహాయం లేకుండా, యితరుల ప్రమేయము లేకుండా తమంతట తామే ప్రజానీకానికి జ్ఞానం గల్గించాలని భావించి వుంటె, ఆయన మానవ రూపము దాల్చటందేనికి? ఆయన మానవ మూర్తిగా అగపడటం దేనికి? ఎవరు ఆయన బోధనలను యితరులైన లోకులకు ప్రత్యక్షముగా బోధించుటకై యేర్పడి వున్నారో వారి నుండి యే ప్రజ ఆయనను గూర్చి తెలిసికొనవలసింది అనటం సత్యదూరము గాదు. ఆయనకు బహిరంగంగా ప్రాతినిధ్యము వహించిన వారినుండి యే ప్రజ ఆయనను గూర్చి తెలుసుకోవాలి.

2) నిజానికి ఆయన జీవించివున్న రోజులలో ఆయన తన శిష్యులను మానవకోటి మధ్యకు పంపించారు. రోగ చికిత్స చేయటానికి, బోధించటానికి, సత్యప్రచారాన్ని సాగించటానికి, సత్యాన్ని గూర్చి ఇదమిద్ధంగా తెల్పటానికి ఆయన విస్వమానవకోటి వద్దకు తమ శిష్యులను పంపిచారు. అయితే వారిదంతా ఆయన అధికారము క్రిందనే చేయవలసి వుంది. ఆయనగూడ వారిని కనిపెట్టవలసివుంది. అంటె, వారితో ప్రత్యక్షముగా, బహిరంగంగా సంబంధం పెట్టుకొన్నారని, వుపదేశాలను బోధించటానికి ఆయన వారికి అధికారమిచ్చి వున్నారని అర్థం.

3) తమ సిద్ధాంతాలు, తమ ఆదర్శాలు, గ్రంథాల ద్వారా వ్యాప్తం కావాలని, వ్యాపింపబడాలని ఆయన యెక్కడా చెప్పలేదు. అందుకే ఆయన శిష్యులను ఏరుకొన్నారు. శిష్యులలో కొందరు ఆనాడు, తర్వాతగూడా అపాత్రులుంటారని ఆయన ముందుగానే గ్రహించారు కాని యెక్కడగూడా, బైబుల్ గ్రంథ అవశ్యకతకు సంబంధించిన సూచనను చేయలేదు. అసలు బైబులు అవసరమని

ఆయన అనుకొన్నట్లు తోచదు. నిజానికి స్వయంగా ఆయన వ్రాసింది లేదు. ఆ రోజుల్లో యూదులు వ్రాతపుస్తకాలమీద ఆధారపడినప్పటికీ ఆయనంతట ఆయన ఏమీ వ్రాయలేదు. అంతేగాదు, తమ శిష్యుల నెవ్వరినీ గ్రంథము వ్రాయుమని ఆయన ఆజ్ఞాపించలేదు. కాని ఒకటి శిష్యులను బోధిస్తూ వుండమని, జనాన్ని పునీతులనుగా చేయమని, వారిని పాలింపమని వారిని కాపాడుతూ రక్షింపమని ఆయన శాసించారు.

కనుక దీనిని బట్టి మనకు క్రీస్తుమతం గ్రంథస్థమై ఉన్నదని, ఒక వ్యక్తిగత వికాసములో ఉన్నదని, లేక దృశ్యమానమగు బహిరంగసంస్థ అవసరం లేదని చెప్పువారి వాదములోని బలహీనత్వము బయల్పడుచున్నది క్రీస్తును గూర్చి వ్రాయబడు యధార్థ రచనలను కృత్రిమ రచనలనుండి విడదీయటానికై ఆయన మతము లౌకికి కనపడే ఒక బహిరంగ సంస్థగా గోచరించింది. చాలా వరకు క్రైస్తవ ప్రపంచంయావత్తూ ఆరాధనలుగల గ్రంథాలనే అంగీకరిస్తుంది. ఏవి యథార్థమైన గ్రంథాలో తెలియజేసినట్టి ఆ సంస్థను సైతం ఎందుకంగీకరింపరాదు?.

(4) "మనుష్యుడు ఋజుప్రవర్తనతో పనుల నాచరిస్తుంటే, అతను దేన్ని విశ్వసించినా, అతని విశ్వాసమెట్టిదైనా పరవాలేదు." అని ఎక్కడా ఆయన చెప్పినట్లు కన్పించదు. పైపెచ్చు మానవునికి భక్తి విశ్వాసాలు ముఖ్యమని నొక్కి వక్కాణించారు. "నమ్మని వారికి శిక్షవిధింపబడును" (మార్కు. 16,16). "విశ్వాసంలేని మూర్ఖతనము వారలారా! నే నెంత కాలము మీతో ఉందును. ఎంతవరకు మిమ్ములను సహింతును (మత్తయి 16,17)". అవివేకులారా! ప్రవక్తలు చెప్పినమాటలన్నియు నమ్మని మందమతులారా! మీరు ఈ విధంగా ఉంటె ఎంతకాలము చూస్తుండేది అని అన్నారు (లూకా, 24,25).

5) ఆయన తమ మతసంస్థనుగూర్చి వివరాలు విపులంగా చెప్పయత్నించలేదు. ఆయన ఉపదేశాల్లో ఉన్న అంతరార్థం కాలం గడచిన కొద్దీ బయటికి తెలియబడుచుండెడిది. "నేను మీకు చెప్పవలసిన విషయాలు ఇంకా ఉన్నవి. కాని మీ రిప్పుడవి దృఢపరచుకోలేరు,

జీర్ణించుకోలేరు. ఆయన-సత్యస్పిరితు- వచ్చినప్పుడు ఉన్నయథార్థ మంతయు చెప్పును" (యోహాను 16,అ 12,). ఆయన విధానం క్రమేపి వృద్ధిలోనికి తేబడవలసియున్నది. క్రమక్రమంగా స్పష్టంచేయబడవలసియున్నది. ఉద్దీపనము పొందునట్టి ఒక బాహ్యాహావమైన, ఒక బహిరంగమైన సంస్థగ ఉండి ప్రజలకు జ్ఞానవెలుతురు నిచ్చుచుండేదిగా ఉండవలెనని ఆయన ఉద్దేశించినట్లు పై చెప్పబడిన విషయములనుబట్టి కనబడుచున్నది.

**నన్ను అనుసరించండి** తమ పతాకం క్రిందికి, తమరాజ్యంలోకి అందరిని చేరదీసు కోవాలని మన ప్రభువు సంకల్పం. అంతే గాదు తమ శిష్యులలో బాలురు, వృద్ధులు గూడ ఉండాలని ఆయన తలంపు. తదనుగుణంగానే ఆయన జీవించిన కాలంలో ప్రత్యేక శిష్యులను కొందరిని తీసుకొన్నారు తమ భవిష్యత్తు సంస్థలో గూడ మార్గదర్శకులైన నాయకులుండాలని ఆయన నిస్సంశయంగా అనుకొని ఉన్నారు. వీరు ఆయన చెప్పుచేతల క్రింద ఉంచి ప్రజలను ఆయనవైపు త్రిప్పాలి. ఆయన ఉపదేశాలు అనుష్ఠించ దలచిన ప్రజలు ఆయన ఎవరిని శిష్యులగా ఏరుకొనెనో వారు చెప్పిన ప్రకారం నడచుకోవాలి. ఆయన అనంతరం గూడ జాగ్రత్తగా ఏరుకొనబడిన నాయకులు చెప్పినట్లే ప్రజలు నడచుకోవాలి.

**ఆచరణ** 1) క్రీస్తునాథుడు ఎట్టి పని జరుగాలని వాంఛించారో, అందులోని అంతర్యాన్ని ఇదమిద్ధంగా తెలియజెప్పటానికై సమర్థులైనవారు అపోస్తలులా లేక ఈ నాటి సిద్ధాంతవాదులా?

2) జీవితమంటే ఫలానావిధంగా ఉండాలని, ఆత్మఅంటేఫలానా అని, క్రీస్తునాథుడు అంటే ఇట్టి వ్యక్తి అని తమ స్వంతభావాలేతో వెలిబుచ్చేవారు చెప్పేవాటిని విని వాటిని అనుసరించి నడచుకొనటం ఎందుకు క్షేమదాయకంగాదు?

3) జ్యోతిషం-శకునం-చెప్పేవారిదగ్గరకు ఎందరో పోతూండటం మీరెరుగుదురు. తమ భవిష్యత్తేమిటో తెలుసుకుందామని

ప్రేతగూ వంలో ఉన్న వారితో మాట్లాడే మధ్యవర్తులను దర్శించే వారిని గూర్చి ఆ మధ్యవర్తులద్వారా చనిపోయిన వారితో సంప్రదింపులు జరుపుతున్నామనే వారిని గూర్చి మీరు వినేఉంటారు. దాన్నిబట్టి క్రీస్తునాథు బోధనతో నిర్దుష్టంగా తెల్పటానికై తిరుసభ ఆవశ్యకత, విలువా మనకు వ్యక్తంగావటం లేదూ? తిరుసభయే అతనికి దేవుని గూర్చిన సత్యాన్ని తెలుపుచున్నది గాబట్టి ఉత్తముడైన క్తో లిక వ్యక్తి ఎన్నడూ ఈ మధ్యవర్తుల నాశింపడు.

---

# పదియవ అధ్యాయము

## తిరుసభ

**క్రీస్తు యథార్థముగ ఏమిచేసిరి** మనం దేన్నయితే కతోలికసభ అని అంటున్నామో, దానికి ఆ మహాసంస్థకు ఆయనే యథార్థంగా పునాదిరాళ్ళను వేశారు. తద్వారానే విశ్వమానవకోటి కంతటిలో తమ సత్యాలు ప్రచారం కావాలని వాంఛించారు. వాటినిగూర్చి సరిఅయిన నిర్వ చన మివ్వబడాలని, అవి భద్రం చేయబడాలని ఆయన ఆశించారు. కనుకనే

1. తమ ప్రత్యేక శిష్యులుగ ఉండటానికి ఒక పన్నెండు మందిని ఏరుకున్నారు.

2. ఆ పన్నెండుగురిలో ముఖ్యునిగా అర్చ్యశ్రీ రాయప్పను ఎన్నుకొన్నారు. అతని భుజస్కంధాల మీదనే తమ సంస్థను నిల్పు తామని వాగ్దానంచేసి యిలా అన్నారు. "నీవు రాయుడవు. ఈ రాతి మీద నాతిరుసభను స్థాపించుదును. పాతాళలోక శక్తులు దానిని జయింపలేవని నేను నీతో చెప్పుచున్నాను. పరలోక రాజ్యముయొక్క తాళపుచెవులు నీకిచ్చెదను. నీవు భూలోకమందు దేనిని బంధించు దువో అది పరలోకమందును బంధించబడును. భూలోకమందు దేనిని విప్పుదువో అది పరలోకమందును విప్పబడును" (మత్తయి-16,18).

ఈ మాటలనుండి నీవేమని గ్రహించుచున్నావు. క్రీస్తునాథుడు తమ సంస్థ అగోచారమైన దానిలాగ, రహస్యమైన దానిలాగ ఉండా లని వాంఛించారా? లేదు. ముమ్మాటికీ లేదు.

ఒక వ్యాపారసంస్థ అధిపతి నీతో ఇలాఅంటే "నిన్ను నేను మా ఆఫీసు మేనేజరుగా చేస్తాను. నీ ద్వారా నేను వ్యాపారం చేసు కుంటాను. ఏ కంట్రాక్టులను నీవు చేసినా, వాటిని నేను అంగీకరిస్తాను. నీకు అన్ని అధికారాలు ఉన్నాయి. (అంటే తాళపు చెవులుగూడ నీ కివ్వబడుతవని అర్థం)". నిన్నుఏరుకొని, నిన్ను నమ్మి, నీకు సర్వాధి

కారాలు ఇచ్చినట్లుగాదూ? తన తరఫున నన్ను ఆ సంస్థను నడపమని అనటంగాదూ? అలాగే క్రీస్తునాథుడు కూడా పేతురు విషయంలో చేశారు. ఆయన వారసుడు అవసరము లేదని అనుకొనియున్న పక్షంలో బహిరంగమైన తిరుసభ సంస్థ ఉండ అవసరము లేదని ఆయన తలంచియుండిన పక్షంలో ఆయన పై విధంగా ఎందుకు మాట్లాడుతారు?

3) ఒక అధికారంతో, ఒక శాసనాధికారంతో తిరుసభ ప్రవర్తించాలని క్రీస్తునాథుడు ఉద్దేశించారు. ఈ విషయం యీ క్రింది వాక్యాలవల్ల తెలుస్తున్నది. "మీ మాట వినువాడు నా మాట వినును. మిమ్ముల నిరాకరించువాడు నన్ను నిరాకరించును. నన్ను నిరాకరించువాడు నన్ను పంపిన వానిని నిరాకరించును (లూకాసు 10, 16).

కనుక దీన్నిబట్టి తాను శిష్యులు అనుసరింపదగు నియమాన్ని తమనిబంధనను తయారుచేయ గల ఒక సంస్థ విషయము ఆయన మనస్సులో వున్నదనే అవగతమవుతున్నది. ఆయన యోచించారనే చెప్పాలి. కనుక నే యీ సంస్థ- తిరుసభ- ఆయనతోపాటు ఆవిర్భవించినదని అనటం జరుగుచున్నది.

4) ఆయన పేత్రుకు చేసిన వాగ్దానాన్ని మోక్షారోహణమునకు ముందు హృదయాన్ని కదిలించే ఒక ఘట్టంలో నెరవేర్చిరి. ఆయన తమ అపోస్తలులకు వీడ్కోలివ్వనున్నారు. అప్పుడాయన సహజంగా భవిష్యత్తును గూర్చి, తమ సిద్ధాంతాల వ్యాప్తికి సంబంధించిన ప్రచారాన్ని గూర్చి ఆలోచిస్తున్నారు. ఇక భవిష్యత్కార్య క్రమం ఎలా జరుగాలి? ఈ సమయంలో ఆయన చెప్పే ప్రతి మాటలో చాలా అర్థమున్నది. ముమ్మారు పేత్రుని "నన్ను ప్రేమించుచున్నావా" అని ప్రశ్నించారు. "ప్రభూ, నేను మిమ్ము ప్రేమించుచున్నా"నని పేత్రుడు ప్రత్యుత్తర మిచ్చాడు. నిజముగా పేత్రుడు తన్ను ప్రేమిస్తున్నాడని తెలుసు. అప్పుడాయన ఆయన భుజస్కంధాలపై ఒక పెద్ద బాధ్యతను, ఒక పెద్ద బరువును పెట్టారు. "నా గొర్రెలను, నా గొర్రెపిల్లలను మేపు" (జ్వా. 21 అ. 15, 17). గొర్రెలు నాశనము కాకూడదు. వాటికి బహిరంగంగా కన్పించే నాయకుడు గావాలి.

గొర్రెల నిస్సహాయస్థితి నీకు తెలుసు. గొర్రెలకాపరి అంటూ ఒకడు లేకపోతే వాటికి దిక్కెవరు? వాటిని ఎవరు చూస్తారు? జీవితంలో ఎదురయ్యే సమస్యలను ఎదుర్కొనే విషయంలో మానవులు కూడ గొర్రెలవంటి వారే. వారికీ ఒక నాయకుడు గావాలి. 'లేకపోతే జరుగదు. వేలకొలదీ నాయకులు ప్రజలను నడిపిస్తామని బయల్దేరుచున్నారు. అలాగే అశేష జనానీకానికి శాంతి సుఖాలను ప్రసాదిస్తామంటూ అనేక సంస్థలు ఆవిర్భవిస్తున్నాయి. అలాంటి సందర్భంలో ఏ సంస్థ ఉత్తమమైనది, ఏ వ్యక్తి ఉత్తముడు, ఎవరు విశ్వాసనీయులు అనే విచక్షణా జ్ఞానంతో పరిశీలన చేయుట మొక్కటే విశ్వమానవ కోటికి ప్రస్తుత కర్తవ్యం.

యథార్థానికి ప్రజల యోగక్షేమాలను గూర్చి నిరంతరము ఆలోచన చేసే క్రీస్తునాథుడు ఈ ప్రజానీకాని కనుక్షణ మెదురయే సమస్యలను గూర్చి, వారికి సరిఅయిన నాయకుడు కావాల్సిన అంశాన్ని గూర్చి ఆలోచన చేయలేదంటారా? విషాహార మివ్వబడుట లోని ప్రమాదాన్ని ఆయన గుర్తించలేదంటారా? అందుకే ఎవరో ఒక మహావ్యక్తి పుష్టికరమైన ఆహారాన్ని ప్రసాదించటానికి, యథార్థమైన ధర్మ సూత్రాలను నిర్వచించటానికి, ప్రతిపాదించటానికి, క్రమబద్ధమైన జీవిత విధానాన్ని చూపించటానికి అవసరమైనారు.

ఇక కతోలికులమైన మేము జీవితాన్ని ఏ మార్గాన నడువవలసింది నచ్చచెప్ప అధికారము- ఆ మహా గౌరవము- అర్చ॥ పేత్రునకిచ్చినారని విశ్వసిస్తున్నాము. "జనసామాన్యమనెడి గొర్రెల మంద కావలాకై పేతురు అందరికీ ఉమ్మడి గొర్రెల కాపరిగా నియమింపబడ్డాడు." స్పిరితుసాంక్తు ఆయనకు జ్ఞానోద్దీపనము గల్గించి నడిపెను- పేతురు కూడ ప్రజలను సత్యమార్గమున నడపాలి గనుక, జ్ఞానోపార్జనాపరులుగా చేయాలి గనుక.

క్రీస్తునాథుడు తమ బృందంలోని ఒకరిని నాయకునిగా చేయక పోయినట్లయితే, ఆయన ఉత్త తెలివితక్కువ పని చేశారని యీనాడు మనము అని ఉండమా? తిరుసభలో, తిరుసభకు సంబంధించిన వారిలో సామరస్యాన్ని తీసుకురావటానికి, అధికారపూర్వకముగా

మాట్లాడటానికి తగిన ఏర్పాట్లు ఆయన చేయకపోయి యుంటే తిరుసభ ప్రతిష్ఠాపన సరియైన పద్ధతి కాదనేవారు, తిరుసభను కాదనేవారు, క్రీస్తునాథుని విమర్శింపరా? సత్యము కోసం ప్రార్థించేవారు ఆయన ఏర్పాట్లు మంచివని తెలిసికొని నమ్ముతారు.

5) మోక్షారోహణకు ముందు క్రీస్తునాథుడు అపోస్తులందరకు తను బోధనలను ప్రతి ప్రాంతములో ప్రచారం చేయమని ఆజ్ఞ యిచ్చారు. "జేసువు వారి వద్దకు 11 మంది వద్దకు వచ్చి పరలోకమందును, భూలోకమందును నాకు సర్వాధికారము ఈయబడినది. కాబట్టి మీరు వెళ్ళి సమస్త జనులకు బోధ చేయండి, శిష్యులనుగా చేయండి. పితయొక్కయు, సుతునియొక్కయు, స్పిరితుసాంతుయొక్కయు నామమున వారికి బప్తిస్మమిచ్చుచు నేను మీకై వేటిని ఆజ్ఞాపించితినో వాటినన్నింటిని గైకొనవలెనని వారికి బోధించండి. ఇదుగో నేను యుగసమాప్తి పర్యంతము మీతోనున్నాను" (మత్తయి 28, 18). ఈ మాటలు ఆయన అనుచరుల నందరితోను అనలేదని జ్ఞాపకముంచుకోండి. ఆయన నాయకులతో మాత్రమే ఇలా చెప్పారు. ఆయన జీవిత కాలంలో ఆయనకు ప్రతినిధులున్నారని గుర్తుంచుకోండి. తమ అనంతరం కూడ అదే పద్ధతి అని ఆయన తలంపు. అసలు అట్టి నాయకులతోనే ఆయన ఇలా చెప్పారు. "మీరెవరి పాపాలను క్షమించెదరో వారి పాపాలు క్షమించబడును. ఎవరి పాపాలు మీరు క్షమింపరో అవి క్షమింప బడవు (జ్వా. 20, 23). ఇది మీకొరకియ్యబడుచున్న నా శరీరం. నా జ్ఞాపకార్థం ఇది చేయండి." (లూకాసు 22,19).

అపోస్తులుగాని అర్చ్య॥ పేతురుగాని తిరుసభను స్థాపించలేదు. క్రీస్తునాథుడు తమంతటతామే దానిని స్థాపించారు. ఈ తిరుసభ ద్వారా బహిరంగంగా ఒకేఒక ఏకైక నాయకుని క్రింద ఆయన అనుచరులంతా కలిసి పని చేయుటమంటూ జరుగుతుంది. ఇందులో ఎంతో అభివృద్ధి అనేది జరిగింది. కాని అది ఆయన సూచించిన పద్ధతుల్లోనే జరిగింది. సర్వకాల ప్రజలకు తన సత్యములను అందజేయుటకు, వారిని ఒకే సత్యమార్గమున నడుపుటకు, వారికి ఆధ్యాత్మిక ఆహారము నిచ్చుటకు మననాథుడు తిరుసభను సాధముగ చేసిరి. అందుకే క్రీస్తు

నాథుడు ఈ బహిరంగ సంస్థను అపేక్షించారు. ఈనాడు ఆ మహా మహుని ఆలోచన కార్యరూపందాల్చి ఎంత గొప్పగా ఎంత సేవచేస్తు న్నదీ తలంచుకుంటే, అంచనా వేసుకుంటే ఆశ్చర్యంవేయక మానదు. నిజం చెప్పాలంటే తిరుసభే క్రీస్తునాథుడు. అంతకుతప్ప అన్యథా ఏదీ కాదు. ఆనాడెన్నడో ఆరంభించిన పనిని ఈనాటివరకు ఆయన ఆ సంస్థద్వారా కొనసాగిస్తూ, అందులోనే నిమగ్నమై ఉన్నారు.

**ఆచరణ** 1. మత్తయి 16అ. 18వ. వచనంతీసి సువిశేషకులు క్రీస్తు నాథుడు పేతురుని తిరుసభ అధిపతిగా ఎన్నుకొన్న అంశాన్నిగూర్చి వ్రాసిన విషయాన్ని తెలుసుకో. తర్వాత "క్రీస్తు నాథుడు ఏ సంస్థను స్థాపించలేదు. ఏ పాలకవర్గాన్ని స్థాపించలేదు." అన్న ఒక మూఢుని మాటలను గమనించు.

నీవు ఏదైనా ఆటఆడుతుంటే ఏవో కొన్ని నియమాలను పాటి స్తావు. అలా చేస్తేనేగాని ఆ ఆట సాఫీగా, ఏ గల్లంతులేకుండా నడ వదు. రక్తికట్టదు. ఈ లోకయాత్రకు దైవ నిర్మితమైన తిరుసభ ద్వారా క్రీస్తునాథుని నియమాలను అందజేయుట వలన కలుగు సదు పాయాలేవి?

2) ఆయన తిరుసభను స్థాపించలేదని, దాని నాయన కోరలే దని అన్న ఉద్దేశం సరిఅయినది కానట్లైతే ఇంకా ఏ యితర ప్రణాళిక సరిఅయినది. ఎవరైనా ఒకపనిని ఆరంభిస్తే దాన్ని ఇతరులు విమర్శి స్తారు. మాట సహాయమైనా చేయరు. ఎందువలనంటే ఆ పనికిగల అభి ప్రాయం, ఊహ తమవిగావు. కేవలం తమ ఊహాలు కానంతమాత్రం చేత, తమతో సంప్రతించి పనిచేయనంత మాత్రంచేత ఏ విధాన సహా యం చేయని, కనీసం సానుభూతి వాక్యాలయినా పలకని వ్యక్తు లెం దరో ఉన్నారు. ఇలాగే తిరుసభ తమ ఊహాల ననుసరించి నిర్మితం కాలేదు. కాబట్టి వారంతా తిరుసభ సంస్థను విమర్శిస్తున్నారు. నిరసి స్తున్నారు. ఆ సంస్థను తామే స్థాపించి ఉన్నట్లయితే, అది మంచిదే అయ్యేది.

3) నీకు తిరుసభ ఎలా మాతృశ్రీ అయినది?

---

# పదకొండవ అధ్యాయము

## అపోస్తలుల తిరుసభ

అపోస్తలులు నిరాడంబరులు, ఋజువర్తనులు. వారు క్రీస్తు నాథుని ఆశయముల ఎడల గౌరవప్రపత్తులుగల్గి ఉంటారని మనం సహజంగా అనుకుంటాము. అపోస్తలులు, వారిచే ఏరుకొనబడిన వ్యక్తులు, తమ నాయకునిచే ఆరంభింపబడిన కార్యక్రమాన్ని ఎలా కొనసాగిస్తున్నదీ, నేడు మనం కతోలిక చర్చి అని అంటున్న సంస్థకు ఏ విధంగా స్పిరితుసాంక్తు ఆధిపత్యం క్రింద ఎలా రూపురేఖలు దిద్దుతున్నదీ, రానున్న ప్రకరణాల్లో మనం తెలుసుకోనున్నాము.

అపోస్తలుల చర్యలు ఈ మొదటి క్రైస్తవ సంఘాల చరిత్రను విశదం చేస్తవి. ప్రస్తుతమునకు నేటి తిరుసభ పరిస్థితి, విషయమును మరచిపోయి క్రైస్తవమత చరిత్ర ఆరంభానికి నీ దృష్టిని త్రిప్పు. ఆ నాడు తమ నాయకుడు కంటికి కనబడకుండా ఉన్న రోజుల్లో పేతురు, జేమ్సు, జాన్, ఆండ్రూ, మొదలైన వారి పరిస్థితి ఎలా ఉందో గమనించు. ఆరంభంలో దిగులుపడ్డారు. స్పిరితుసాంక్తు వారిపై దిగివచ్చిన పిమ్మట వారియందు స్వామిభక్తి అధికమైనది. తర్వాత సిర్పితుసాంక్తు సహాయంతో క్రీస్తుకోరికల తన ననుసరించి. దేవమాత వాక్యములతో ఉత్సాహపూరితులై శత్రు ప్రపంచమును ఎదుర్కొన్నారు. తమ అధిపతి కోసం సాధారణులైన ఆ పదకొండుమంది. వారు ప్రపంచాని జయించాలని కంకణం కట్టుకోవడము ఎంత వీరోచితముగ నున్నది. వారిని దేవమాత ప్రభావితులనుగా చేసిందని నీవు అనుకోవా? బాధతోల గూడిన పాత్రను ఇదివరకే ధరించి ఆమె వారిని ఇప్పుడు ఇక్కట్లలో అధిక మింప చేయగలదు. యథార్థానికి మానవులుగా వారు బలహీనులు. కాని దైవికంగా బలాఢ్యులు. అలాంటి కొద్దిమందే అపోస్తలుల తిరుసభకు మూలస్తంభాలు. వారే పునాదిరాళ్ళు. నిజానికి వారికి తెలుసు క్రీస్తునాథుడేమికోరింది. ఆయన పంథాను గూర్చి ఆయన పద్ధతులను గూర్చి వారు ఎరుగుదురు. పాతభావాలను వారు కొంచెము నిదానముగా వదలికొన్నారు. ఎందుకంటే భక్తిశ్రద్ధలుగల యూదీయుడు

తనమతాన్ని అత్యధికంగా ప్రేమించాడు. కాని అదేసమయంలో ఈ క్రింది అంశాలు కూడా స్పష్టమవుతాయి.

**ఆమోదింపబడిన నాయకుడు** అర్చ్య॥ పేతురు ఈ సమూహమునకు నాయకుడు. ఆయన మొట్టమొదటి అద్భుతాన్ని చేశాడు. (అ. చర్యలు: 3అ.). మొట్టమొదటి సారిగా ఆయన మతాంతరులనుగా చేశాడు. (అ. చర్యలు. 11-1-18) వేదసంబంధమైన శిక్షను మొట్టమొదటిసారిగా విధించాడు. వేద సత్యాన్ని గూర్చి మొట్టమొదటిసారిగా తీర్మానంచేసింది ఈయనే. (అ.చర్యలు 15,7).

ఈ అపోస్తలుల చర్యలలో పేతురు పేరు యాభయిసార్లకు పైగా చెప్పబడ్డది. ఆయన తర్వాత ఉండేరెండవపేరు ఎనిమిదిసార్లు మాత్రమే చెప్పబడ్డది. దీన్ని బట్టి క్రీస్తునాథుని చేతనే పేతురు ముఖ్యునిగా ఎన్నుకొనబడినట్లు అపోస్తలులు గుర్తించినట్లు తెలుస్తున్నది. ఒక సందర్భంలో అర్చ్య॥ పౌలునకు అర్చ్య॥ పేతురుతో ఒక చిన్న ఘర్షణ వచ్చింది (గలాసీయులు. 2,11). అది సిద్ధాంతాల విషయము కాక కొన్ని విధానాలపైన మాత్రమే. ఒకచోట పేతురును చూడటానికి జెరూసలేముకి తాను వెళ్ళినట్లు పాల్ అంగీకరించాడు. క్రొత్తనిబంధనలో అపోస్తలుల పేర్లు జాబితా నాల్గుసారులు ఉదహరించ బడ్డది. ఈ అన్నిటిలో గూడ పేతురు పేరే ముందుగా ఉన్నది.

**అపోస్తలుల అధికారాన్ని ప్రజగుర్తించారు** అపోస్తలులను ప్రజలంగీకరించారు అని చెప్పటం సులభం. ఎందు చేత నంటే "వీరు అపోస్తలుల బోధన యందు, సహవాసమందును, రొట్టె విరుచుటయందును, ప్రార్థన చేయుటయందును ఎడతెగక ఉండిరి "(అ. పొ, 11, 42) అంతేగాక ప్రజలు తమదగ్గరున్న దానిని తెచ్చి" "వారిపాదములవద్ద పెట్టిరి" (4, 35). ఈ విధంగా వారు చేయటం చాలా సాధారణమైన అంశం. నిజానికి వారు అపోస్తలులను పూర్తిగా విశ్వసించారు. వారి కొరకు ప్రార్థించారు. దివ్యసత్ప్రసాదాన్ని గూడ స్వీకరించారు. ఇదంతా

సహాజంగా కన్పించటం లేమా? ఇదాంతా గూడ 35. క్రీ. శ. లో జరిగింది.

**అపోస్తలుల తిరుసభ బహిరంగ సంస్థ**

అపోస్తలులు క్రీస్తునాధుని సిద్ధాంతాల ప్రచారానికి బహిరంగంగా కృషి చేశారు. అందుకు తగిన పద్ధతులను, విధానాలను, అనుసరించారు. అలా అనుసరిస్తూ చాలా కాలం వచ్చారు. ఈ విధమైన క్రియలవలన క్రీస్తునాథుడు తమ అనుచరుల మధ్య పనిచేయటానికి ఒక బహిరంగ సంస్థ నుద్దేశించినారని మరింత దృఢపడ్డది. ఆయన ఎన్నడూ అనుకొనని తిరుసభను వారు ప్రారంభించారనిగాని, ఆయన తలంచని విధంగా వారు దానిని అభివృద్ధి పరచారని అనుకోవటంగాని హేతువాదానికి నిలబడే అంశంగాదు. వారు స్వార్థంతో పని చేయలేదు. వారు ప్రతి పనిని ప్రేమతో చేశారు.క్రీస్తునాధుని యందుగల అపారప్రేమే వారిని సంఘటిత పరచింది. వారిని సమైక్యంచేసింది.

ఆసియామైనరులో చాలా సంవత్సరాలు పనిచేసిన అనంతరం అర్చ్యు॥ పేతురు రోమునగరానికి వెళ్ళాడు. అచ్చట ఆయన పావుగారికి సంబంధించిన కార్యాలయాన్ని నెలకొల్పాడని మనం ఒక నిశ్చయానికి రావచ్చు. మిగతా అపోస్తలులు మిగతా ప్రాంతాలకు వెళ్ళారు. తర్వాత ఆయన జెరూసలేం నగరానికి తిరిగి వచ్చారు. అక్కడ ఆయన ఒక్క సంఘానికి అధ్యక్షత వహించినట్లు మనకు తెలుస్తుంది (అపోస్తల చర్యలు:15,6). ఇది క్రీస్తునాధుని పునరుత్థానం జరిగిన 20 సంవత్సరాలకుజరిగింది.

స్పిరితుసాంక్తు ఆ రోజుల్లో వారిని నేరుగా అనేకవిధాల ప్రభావితులనుగా చేశారు అనేది సత్యం. అద్భుతాలను చేయు వరాలు ఇవ్వబడినట్లుగా అనేక సాక్ష్యాలున్నాయి. అనేక సమావేశాలు బహిరంగంగా జరపబడనందున బహిరంగవ్యవస్థ అయిన తిరుసభ ఎప్పుడూ ఉండినప్పటికీ, ఉన్నట్లు బైటికి స్పష్టంగా గోచరించి ఉండలేదు.

**ఆచరణ** 1. కార్డినల్ వైజ్‌మెన్ వ్రాసిన 'ఫాభియోలా' అనే గ్రంథాన్ని చదవండి.

2. అపోస్తులులు వారి శిష్యులు ఒక క్రొత్త రాజ్యాంగం ఏర్పడనున్నదని మానవ హృదయ రాజ్యంలో జయించబడని ప్రాంతానికి అధిపతి ఒకరు రానున్నారని, ప్రజానీకానికి చెప్పి వారల హృదయాలను చూరగొన్నారు. వారలను తమ ప్రచార ప్రాగల్భ్యాలచేత వశీకృత చిత్తులనుగా చేశారు. (10) ఈనాడుగూడ అలాంటి అవకాశం క్రీస్తునాథుని అనుచరుల కున్నదని నీవు చెప్పవూ? ఆయన బోధల నాలకించటానికి ప్రజలు సిద్ధంగా లేరా?

3. అపోస్తలుల కార్యాలు 6, 7, ప్రకరణాలు చదువు. స్తెఫెన్ చెప్పిన గుణాలను గూర్చి ఒక వ్యాసం వ్రాయి.

4. భద్రమైన అభ్యంగము నెరవేర్చే విషయమై అపోస్తలుల చర్యలు 8వ ప్రకరణం 16, 18, వరకు చూడు. దానిని నెరవేర్చినదెవరు? దానిఫలితము లేవి?

# పంద్రెండవ అధ్యాయము

## అపోస్తులుల తిరుసభ సాగుదల

**మొదటి శతాబ్దం** అపోస్తులులను నాయకులనుగా స్వీకరించి క్రైస్తవులు ఒక బహిరంగ సంస్థకు, ఒక కూటమికి చెందిన వారుగా మొదటిరోజుల్లో ఉన్నారని క్రీస్తునాథుని బోధలనే అనుసరించి ఉన్నారని గత ప్రకరణంలో తెలుపబడింది.

క్రీస్తునాథుడు మోక్షారోహణం అయిన తరువాత 40 సంవత్సరాలలో దాదాపు అపోస్తులులందరు వేదసాక్షులు త్రొక్కిన త్రోవనే త్రొక్కి యశస్కాములైనారు. వారి అనంతరం వచ్చిన మతబోధకులను గూర్చి మనమిప్పుడు తెలుసుకోవాలి. క్రీస్తునాథునికి చాలామంది అనుచరులున్నారని, వారుచాలా విశ్వాస పాత్రులని మనకు తెలుసు. కాని, అందరిలో చరిత్ర ఒక్కనికే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చింది. ఆయన మన ప్రభువుననుసరించిన వారిలో గొప్పవ్యక్తిఅయి ఉంటాడు. ఎంతవరకు క్రీస్తునాథుని బోధల నర్థం చేసుకొన్నాడో ఎంత వరకు ఆ బోధల నాచరణలోపెట్టి విజయశ్రీని చేపట్టాడో అంతవరకు అతను గొప్పవ్యక్తే. అతను "నేను బ్రతుకుట క్రీస్తు సేవకొరకు. ఆయనను నా హృదయ పీఠమున వహించుచున్నాను." అనిచెప్పినాడు. అతడే అర్చ్యశిష్టపాల్.

మొట్టమొదట శతాబ్దంలో ఎవరు క్రైస్తవమతంలోనికి వచ్చి, ఆయన బోధల ననుసరించ సాహసించారో చెప్పటం సులభం. "క్రైస్తవులు" అనిహేళనగా పిలువబడుకూటమి అప్పటికే రోం, జెరుసలేం అంటియాక్, కొరింతి, అలెగ్జాంద్రియా నగరాలలో ప్రసిద్ధిగాంచారు. అందుకు ఈ క్రింది కారణాలు పేర్కొనదగినవి:

1) క్రీస్తునాథునికి అత్యధికంగా అంటిపెట్టుకొని ఉన్నారు. ఈ అంశం అర్చ్య॥ వేదసాక్షుల ఇతి వృత్తాలలో కనిపిస్తున్నది.

2) క్రీస్తు సిద్ధాంతాల ననుసరించటం వలన వారి జీవితంలోనే మహత్తరమైన, పరిపూర్ణమైన మార్పు అనేది కనబడింది. "ఈ

క్రైస్తవులు ఒకరినొకరు ఎంతగా ప్రేమించుకుంటారు." అని రోమనులు అన్నారు. నిజానికి జీవితంలో వచ్చిన పరిపూర్ణమైన మార్పులలో ఒకరి నొకరు ప్రేమించు కొనటమనేది ముఖ్యంగా చెప్పదగినది. ఒకరినొకరు ప్రేమించుకొనటం జరిగింది అంటే ఒకరు బాగుపడడం మరొకరి కిష్టమని, ఒకరి అభ్యుదయానికి మరొకరు తోడ్పడట సంభవమని తెలుస్తున్నది. ఈ ప్రేమ అనేది ఉన్నచోట ద్వేషానికి తావు లేదు. ఈ అంశాన్ని కూడా మనం బాగుగా గమనించాలి. క్రీస్తుమత అత్యున్నత స్థానాన్ని అధిరోహించటానికి కారణం అది ప్రేమ సిద్ధాంతానికి అనన్య సామాన్యమైన ప్రాధాన్యత, ప్రాముఖ్యత ఇవ్వటమే. క్రీస్తువుల ప్రేమ సిద్ధాంతాన్ని ఆ నాటి రోమనులలో ప్రబలంగా ప్రబలిన ద్వేషాన్ని పోల్చుము.

3) ఒక బహిరంగ మైన నాయకత్వం ప్రాతిపదికగా క్రైస్తవ మతవ్యాప్తి జరుగుతున్నది. నాయకత్వమంటూ సుస్థిరమైన దొకటి ఉండటం వలననే అనేక ప్రాంతాల్లో క్రీస్తుమతం అవిచ్ఛిన్నంగా వ్యాప్తమవుతూ వచ్చింది. క్రూరుడైన డోమిషియను చక్రవర్తి రాజ్యమేలుతున్న కాలంలో 90 నుండి99 వరకు పోపుగారిగా ఉన్న క్లైమెంటు, గ్రీస్ లోని కొరింతీయనుల కొకలేఖ వ్రాస్తూ ఆయన ఇలా ఉల్లేఖించారు. "రోములోనున్న దేవుని తిరుసభ కొరింత్‌లోనున్న దేవుని తిరుసభకు." ఈవిధంగా అనటం వలన క్రైస్తవమతం ఎలా పరివ్యాప్త మవుతున్నదీ అవగతమవు తున్నది. పోపుల పేర్లైనా, పరిస్థితులు వేరైనా, ఒకరికొకరికి మధ్య కొన్ని వందల కొన్ని వేల మైళ్ళ దూరంలో ఉన్నా, నిరభ్యంతరంగా, నిరాక్షేపణీయంగా క్రైస్తవమతం అనే బ్రహ్మాండమైన తేరు సాగిపోతూనేఉన్నది. ఇది ఎవరూ కాదనలేని మహా సత్యం.

ఒకసారి మేత్రాణులుగా ఉన్నవారి విషయంలోను, గురువులుగా ఉన్నవారి విషయంలోను, కొరింతీయనులు తర్జన భర్జన పడ్డారు. అప్పుడు పోపుగారు "మీరు పేతురు పౌలులవలె అణకువగల్గి ఉండటం నేర్చుకోవాలని హితబోధ చేశారు. ఆ తర్వాత క్రైస్తవులు ఆరంభ దశలో తిరుసభను ఎలా చూశారో పోపుగారు ఈ క్రింది వాక్యాలలో తెలియజేస్తున్నారు" ప్రభువైన క్రీస్తునాథుని పాదపద్మాల వద్ద

అపొస్తులు మన కోసం సత్యవేదం బోధింప బడ్డది. క్రీస్తునాధుడు మనకోసమని దేవుని వద్దనుండి వచ్చారు. ఆయన దగ్గరనుండి అపొస్తులులు మన కోసమని వచ్చారు. ఇలా వారు దేవుని వద్దనుండి, దేవుని కుమారుని వద్దనుండి రావటం వలన దేవుని ఆజ్ఞలకు బద్ధులై దైవచిత్తాన్ని నెరవేర్చటానికి నిరంతరం కృషి చేశారు......నగరాల్లో, గ్రామాల్లో మతప్రచారం చేశారు. ఆ సందర్భంలో స్పిరితు సాంక్తు వారివెంట నుండటం వలన చాలా పనిజరిగింది. వారు పని చేసిన ప్రతి ప్రాంతంలోను అనేకులను క్రైస్తవ మతావలంబకులనుగా చేశారు. వారిలో కొందరిని మేత్రాణులగా కొందరిని డీకన్సుగా నియమించారు.

యథాస్థానానికి తమమీద మతాధిపతులుగా ఉన్నవారి ఎడల కొరింతేయనుల కిష్టంలేదు కాని క్లెమెంటు "తమ తర్వాత ఈ వచ్చిన వారిని అపొస్తులులే నిర్ణయించి, ఏర్పాటు చేసిపోయినా"రని కొరింతీయనులకు చెప్పారు. "మేత్రాణుల పదవికి సంబంధించిన, హోదా విషయంలో ఘర్షణ ఉంటుందని మన అపొస్తులకు క్రీస్తుద్వారా తెలుసు. వారు మేత్రాణులను, తదితర తిరుసభ పెద్దలను ఏర్పాటుచేసి తమ మృతి అనంతరం పరీక్షకు నిలిచిన అనుభవజ్ఞులైన పరిణతజ్ఞానం విశేషంగా గల వీరికి తమ అధికారము రావలయునని ఏర్పాటుచేసిరి. తిరుసభ మొత్తం అభిలషించిన మీదట అపొస్తులులవద్ద పదవులను స్వీకరించిన వారిని దైవయాజకములో నుండి తీసివేయుట చాలా అన్యాయం.

పాపుగారైన క్లెమెంటు రోంలో, రోమన్లనే ద్వేషం గల మరొక జాతీయులకు ప్రసంగిస్తూ, మతవిషయాలలో సర్వ అధికారంతో గూడిన పాపుగారిని క్రీస్తునాధుడు ఏర్పాటు చేయాలని ఉద్దేశించి ఉంటే తప్ప క్లెమెంటు ఆ అధికారాన్ని ఆ పదవిని అర్చ్యి॥ జాన్ సజీవులై ఉండగా ఎలా అక్రమముగా లాగుకొని యుండగలరు? అలా జరగటానికి క్రైస్తవు లంగీకరిస్తారా? ఎన్నటి కంగీకరించరు. వారు క్లెమెంటు మాటలు విన్నారు. అంటె, ఆయన అర్చ్యి॥ పేతురునకు బదులుగ మూడవవారుగ పర్చరచ బడ్డవారలని తెలియబడేది. గురువుపదవులు అనేవి క్రీస్తునాధుని దగ్గరనుండి, అపొస్తల దగ్గరనుండి వస్తున్న

వని, వారికి విధేయులై ఉండాలని క్లెమెంటుగారు అన్నవలుకులు గ్రీసులో కూడ ప్రతి గురువు ఈ నాటి గురువువలె క్రీస్తు నాటినుండి వస్తున్నారని వ్యక్తం చేస్తుంది. కొన్ని సంవత్సరాలపాటు కొరింతీయులు దేవగ్రంథంతో పాటు క్లెమెంటు లేఖలనుకూడ దగ్గరపెట్టుకొని పఠన చేశారు. కనుక క్రీస్తుచర్చి ఆ నాటి మొట్టమొదటి శతాబ్దంలోనే పావురాలిని లోకం ఎలా గుర్తించిందీ తెలుస్తున్నది.

మొదటి శతాబ్ది చివరికి మనకు ముఖ్యంగా కన్పించే పేర్లు రెండు: అంటియోక్ పట్టణపు అర్చ్య॥ ఇగ్నేషియస్, స్మయర్నా నగర అర్చ్య॥ పోలికార్ప్. ఈ ఇరువురు వ్యక్తులు అర్చ్య॥ జాను శిష్యులు. అర్చ్య॥ పోలికార్ప్ దూరప్రాచ్యంనుండి పాస్కపండుగ విషయంగూర్చి తెలుసుకొని, దాని విషయంలో ఒక ఏర్పాటు చేసుకొనటానికి రోం నగరానికి వచ్చారు. ఈ విషయం తేలకపోయినా (ఇది మత సిద్ధాంతానికి సంబంధించిన అంశంగాదు) ఆయన రోం లో ఉండటం వలన అనేక మంది క్రైస్తవమతస్థులైనారు. మనదగ్గర వారు వ్రాసిన లేఖలు సైతం ఉన్నాయి. అవి ఎన్నో విషయాలను చెబుతవి.

**క్రైస్తవుల ఆచరణ** 1883 లో డిడకె (12 గురు అపోస్తులుల సిద్ధాంతాలు) అనుగ్రంథం బైటపడింది. అది. క్రీ. శ. 100 వ సంవత్సరానికి పూర్వమే రచింపబడినదై ఉండాలి. అందులో జ్ఞానస్నానం గూర్చి పేర్కొనబడింది. ఈ పూజబలిని అర్పించు మేత్రాణులు గురుపట్టాభిషేకము పొందవలెనని చెప్పబడినది. అదియును గాక పాపసంకీర్తనము గూర్చి కూడ పేర్కొంటున్నది.

ఈ విధంగా ఈనాడు తిరుసభ వేటిని అమలు జరుపుతున్నదో. వాటిని ఆనాడు కూడ అమలుజరుపుట మనం చూస్తున్నాము. ఆ నాటి ఒక రచయిత ఇలా వ్రాస్తున్నాడు. "మీరు ప్రతి ఆదివారము గుమిగూడిన తర్వాత మీ బలి పవిత్రంగా ఉండగలందులకు, పాపసంకీర్తనము చేసి రొట్టెనుతుంచి దేవునికి స్తోత్రము చేయుడు. (బలి సమర్పింపుడు.)

**2 వ శతాబ్దం.** వేసిన ఆవగింజ ఈ శతాబ్దినాటికి వృద్ధి కాజొచ్చినది. అన్ని చోట్ల క్రీస్తువులున్నారు. ఈ నాడు

మేత్రాణులకు పోలిన నాయకులు ఆ నాడు వారిని నడుపుచుండిరి. ఈ రెండవ శతాబ్దినాటికి బహుశ అర్చ్యి॥ ఇగ్నేషియస్ గారు సజీవులై ఉండి ఉండవచ్చును. ఆయన మేత్రాణుల ఉనికిని గూర్చి, వారి పనిని గూర్చి ఇదమిద్ధంగా చెప్పారు.

ఈ శతాబ్దిలో చాలావరకు క్రైస్తవమత ప్రాబల్యం పెరిగి పోయింది. జర్మనీ, స్పెయిను, ఫ్రాన్సు, ఈజిప్టు, ప్రాచ్య దేశాలు, ఇంకా ఇతరత్రా కొన్ని ప్రాంతాలు సత్యవేద జ్యోతితో ప్రకాశమానాలైనాయి. అనేకమంది యువకులు సత్యవేదం కోసం నానాయాతనలనుభవించారు. కొందరు మేత్రాణులైనారు. అనేకులు గురువులైనారు. ఫ్రాన్సు దేశములోని లయన్సు నగరంలోని ఒక యువక గురువు మేత్రాణి అయినారు. పాస్కపండగ గూర్చి చర్చించడానికి ఆయన రోంనగరం వెళ్ళి పాపుగారిని ఈ సందర్భంలో ఒక ఏర్పాటును ఒక నిర్ణయాన్ని చేయుమని అర్థించారు. ఈ విధంగా అడగటం వలన పాపుగారిని వారు గుర్తించినట్లు తెలుస్తున్నది.

177 క్రీ. శ. ప్రాంతంలో రోమను చక్రవర్తి అయిన ఔరేలియన్ క్రైస్తవులను శిక్షించమని లయన్సుకి ఉత్తరువులు పంపారు. దానికి ప్రత్యుత్తరంగా అచ్చటి వేదసాక్షులు ఈ క్రిందివిధంగా చెప్పారు. "వియన్నా, లయన్సు, పట్టణాలలో నివసిస్తూ ఉన్న క్రీస్తునాథుని సేవకులు తమతో కూడ ఒకే విశ్వాస, ఒకే నమ్మకంగల ఆసియాలోని, ఫ్రిజియాలోని సోదరులకు పితయైన సర్వేశ్వరునుండి, క్రీస్తునాథునినుండి సమాధానము మహిమ మీకు కలుగునుగాక!"

దీన్నిబట్టి దూరదూరంగా పలుప్రాంతాలలో విడిపోయి ఉన్న క్రీస్తువులందరిని ఒకే త్రాటిపై నడిపించగల ఐక్యతఅనే మహత్తర శక్తి వారిలో ఎంత ఎక్కువగా, ఎంత అద్భుతంగా ఉన్నదీ ద్యోతక మవుతున్నది. లయన్సు నగరంలో వేదసాక్షుల బాధలు, వారి గొప్పతనానికి ప్రబలమైన ప్రత్యక్షమైన తార్కాణాలు. వారు తమను గురించి తాము ఆలోచించుకోవటం మాని ఇతరుల ఓదార్చుటలోను, ఇతరులను ప్రోత్సహించుటలోను నిమగ్నమైనారు. అదే వారి ప్రత్యే

కత. అలాంటి ప్రత్యేకతే క్రైస్తవుల మహోన్నత లక్షణాలలో అగ్రస్థానం వహిస్తున్నది.

ఈ వేదసాక్షులు జెరూసలేం, రోం, ఆసియా ప్రాంతాలలోని క్రైస్తవ బృందాలకు దూరంగా ఉన్న క్రైస్తవులంతా ఒకటేనన్న మహోజ్వల సత్యాన్ని వారు గ్రహించారు. గ్రహించటమేగాదు, వారు దానిని ఆచరణలో పెట్ట ప్రయత్నించారు కూడ. ఈ సత్యాన్ని యథాతథంగా, ఉన్నదున్నట్లుగా, సమగ్రంగా, సక్రమంగా అర్థం చేసుకుంటేగాని అందులోని ప్రాధాన్యత, ప్రాముఖ్యత గోచరం గావు

క్రైస్తవుల మతానికి రెండవ శతాబ్దిలోని కతోలిక మతానికి న్యాయతః శాసనరూపమైన హక్కు లేదు ఉండడానికి. అలా ఐనప్పటికీ క్రీస్తునామము రోమను సామ్రాజ్య మూల మూలలకు పరివ్యాప్తమయింది.

**ఆచరణ** (1) రోమనులకు అర్చ్య॥ పౌలు 'క్రీస్తుని ధరించు'మని నుడివిరి (రోమనులు 13 అధ్యా. 14 వ.) ఆయన దీన్ని ఏ విధంగా అర్థంచేసుకున్నారని నీవు అంటావు? రోమనులు ఏంచేశారు.)

(2) నీవు క్రీస్తునాధుని అనుసరించ దలచుకున్నట్లయితే, నీ జీవిత విధానంలో మార్పు అనేది ఉండవలదా? ఈ మార్పు కనుపించునటు లుండవలదా?

(3) ప్రారంభ కతోలికులు, లోక సంబంధమైన వాటికి గాక పరలోక సంబంధమైన వాటిలో పట్టుదల కల్గి ఉండిరి ఇదివిట్లు లోక సంబంధమైన వాటికి ప్రాధాన్యత ఇచ్చి లోక సుఖాలను గోరే అన్య మతస్తులను సత్యవేదాన్ని అవలంబించునట్లు చేసింది.

4) వేదసాక్షి జస్టిన్ జీవితాన్ని పరిశీలించు. అతను మొదట క్రీస్తును నమ్మిన వ్యక్తిగాదు. అయితే అతను కతోలిక చర్చిలోకి వచ్చాడు. అలా అతను రావటానికి ఏది తోడ్పడింది.

5) అపోస్తుల చర్యలలోని తొమ్మిదవ ప్రకరణాన్ని చదువు. క్రీస్తునాధుడు అర్చ్య॥ చిన్నప్పగారిని ఎందుకు ఎన్నుకున్నారు. అర్చ్య॥

చిన్నప్పగారు వారితో సహకరించాడా? ఆయన ప్రభువు కోసం బాధలు పడ్డారా? ఫిలిప్పీయులకు వ్రాసిన లేఖలలో, 1 అధ్యా. 21 3 అధ్యా. 8, 10, 13, వచనాలలో ఉదహరించబడిన ఆయన జీవితాశయాన్ని గూర్చి తెలుసుకో. తర్వాత అర్చ్యు॥ చిన్నప్పగారు విశ్వాసాన్ని ఎలా నిలబెట్టేది తెలుసుకోవటానికి తిమోతి 4 లో 7, 8, చదువు.

---

# పదమూడవ అధ్యాయము

క్రీస్తుప్రభువుని మెుదటి పథకమును నిలబెట్టుట.

**మూడవశతాబ్దం** మూడవశతాబ్దం ఆరంభంలో రోమను సెనేటు ఉద్దేశించి క్రీస్తువుడైన టెర్టూలియన్ ఈ విధంగా అన్నాడు. "మేము నిన్నటివాళ్ళమే. మేము మీ నగరాలను మీ కార్యాలయాలను, మీ శాసన సభాలను, మీ కోటలను ఆక్ర మించు కుంటాము. మీ రాజమందిరాల్లోను ప్రవేశిస్తాము." ఇక్కడ "మేము" అంటే నజరేను అనుచరులైన క్రైస్తవులని అర్థం.

దాదాపు రెండు శతాబ్దాలపాటు ప్రపంచమంతటా క్రైస్తవు లున్నారు. అనేక ప్రాంతాలలో వ్యాపించి ఉన్నారు. దేశాలు, సంప్ర దాయాలు మారినా, వేరు వేరు సిద్ధాంతాల ననుసరించారా? ముమ్మా టికీలేదు. అనాదినుండి ఉన్న సిద్ధాంతాలకు స్వస్తి చెప్పారా? లేదు. క్రీస్తునాథుడే వారి జీవితాలను నడిపించారు. ఆయనే వారి లక్ష్యమయి నారు. అనేకులు వారి ననుసరించారు. మందస్మిత వదనారవిందులై ఉన్నత కుటుంబానికి చెందిన అర్చ్యశ్రీ శేశీల్య, అర్చ్యశ్రీ అగాతావంటి వేదసాక్షులు మృత్యుముఖంలోకి ప్రవేశించారు తిరుసభ బీదలనేకు లను పోషించుచుండెడిది. అర్చ్యశ్రీ. లారెన్సు అనువారు వేదసాక్షి మర ణాము పొందుటకు ముందు, తిరుసభ బొక్కసము నంతటిని బయటికి తీసుకరమ్మని ఆజ్ఞాపింపబడినపుడు, ఆయన భీదల నందరిని జేర్చి పాల కులకు "వీరు తిరుసభ బొక్కసములని" చూపించెను.

ఈ మూడవ శతాబ్దంలో క్రీస్తునాథుని పేరు అంటేనే ద్వేషా సూయలు విపరీతంగా ప్రబలినాయి. అంతమాత్రం చేత క్రైస్తవులు సత్యవేదం కోసం ఉత్సాహంతో పనిచేయటాన్ని మానలేదు. బాధలు ఎక్కువైన కొలదీ వారిలో దేవునికోసం ఉత్సాహాతిశయాలు హెచ్చు పెరిగినాయి. రాజులలో గూడ కాలం జరిగినకొలదీ హృదయపరివర్తన రాసాగింది. కొందరు సహృదయంతోనే పరిశీలించారు. క్రైస్తవమత వ్యాప్తిని ఉదాహరణకు సెవరస్ అను చక్రవర్తి (222-225) తన భవనంలోని దేవాలయంలో క్రీస్తునాథుని స్వరూపాన్ని నెలకొల్పి తన

సేనాధిపతులను, న్యాయాధిపతులను, క్రీస్తునాధుని అనుచరులైన మైత్రాణుల వివేకమును ఐకమత్యమును అనుసరించమని ఉద్బోధించాడు. దీన్నిబట్టి చక్రవర్తులు ఆయన సిద్ధాంతాలను ఆశ్చర్యచకితులైనారని స్పష్టంగా తెలుస్తుంది.

మొత్తం మీాద క్రైస్తవులలో కొందరు బాధలు పడలేక, మతానికి కట్టుబడక పోయినా క్రైస్తవజీవితం మాత్రం సుస్థిరంగానే నిలబడిపోయింది అనిచెప్పాలి.

**3 వ శతాబ్దిలోని క్రైస్తవుల వైఖరి**

"కతోలికమతం అనేది (3వ శతాబ్దంలో) ఒక అభిప్రాయం గాదు. ఒక పోకుగాదు. తత్వశాస్త్రంగాదు. ఒక మానసిక సిద్ధాంతం గాదు. ఒక అలవాటుగాదు. అది స్పష్టంగా నిర్వచింపబడిన సమాజం. నిర్దుష్టములైన అనేక సత్యాలపై ఆధారపడి ఉన్నది. ఐక్యతవిషయమై, విశిష్టమైన నిర్వచన విషయమై, చాలా పట్టుదల గలిగిఉండేది. ఆ కాలంలో ఏ సమాజంలోను లేనట్టి పరిపూర్ణనమ్మకాలను గలిగిఉండేది. తిరుసభ చాలా శిక్షణగల్గిన, బలవత్తరమైన, క్రమాభివృద్ధిని పొందుచున్న ఒక మహా సంస్థ అని సాక్ష్యం ఉన్నది. ఐక్యతను చెదరనీయకుండా ఉంచుటలో పట్టుదల ఏకనిష్ట గలిగి మైత్రాణులచే పరిపాలితమైన సంస్థ ఈ తిరుసభ.

చారిత్రక పురుషుడైన క్రీస్తుని యందు దైవావతారం కేంద్ర సత్యమై ఉండెడిది. సంస్కార (సాంగ్యాల) కాండలలో రొట్టెయు, ద్రాక్షారసమును గురువులచే క్రీస్తునాధుని శరీరముగను రక్తముగను మార్చబడి క్రీస్తువులచే భుజింపబడుచున్న సాంగ్యము ప్రధానమైన పరమ రహస్యముగా తిరుసభ పరిగణించెడిది."

మూడవ శతబ్దంలో ప్రబలిన ఈ రకమైన వైఖరికి అపోస్తులుల కాలం నాటినుండి ఉన్న ఒక మహత్తరమైన సాంప్రదాయమే కారణం. కాలానుగుణంగా క్రీస్తునాధుని సిద్ధాంతాలను మార్చక, వాటిలోని అసలు నిజస్వరూపాన్ని యధాతథంగా గుర్తించాలని ఆ సాంప్రదాయం చెబుతున్నది. అట్టి సాంప్రదాయానికి బద్ధులై ఉండ

టం వలననే క్రైస్తవులు అంతగా బాధపడడం జరిగింది. క్రైస్తవ మతం అంతగా వ్యాప్తిని పొందింది. నిజానికి క్రీస్తునాథుడు ఏ ఉద్దేశంతో ఆయా మాటలను చెప్పారో, ఏ అర్థాన్ని ఆయా మాటలకు ఆరోపించారో ఆ ఉద్దేశాన్ని, ఆ అర్థాన్ని ఉన్నదున్నట్లు గ్రహించిననాడే మతానికి గొప్పతనం, ప్రత్యేకతను. దాన్ని ఎంతఘనంగా భావించవలసింది అర్చ్యి॥ చిన్నప్పగారి ఈ క్రింది వాక్యాల వలన తెలుస్తున్నది. "మేము మీకు ప్రకటించిన సువిశేషమును గాక, మరియొక సువిశేషమును మేమైనను, పరలోకమునుండి వచ్చిన ఒక దూతయైనను మీకు ప్రకటించిన ఎడల అతడు శాపగ్రస్తుడగును గాక." (గలేషియను 1, అ. 8వ)

అర్చ్యి॥ చిన్నప్పగారు తీసికొన్న ఈ జాగ్రత్త క్రీసువుల మధ్య ఒక సాంప్రదాయమయ్యేను. క్రీస్తు చట్టాలను మార్చరాదను నియమము దేశ దేశాలలో చెదరియున్న క్రీసువుల కెంతయో తోడ్పడింది. మత సత్యాలను కలుషితము చేయువారినుండి వాటిని కాపాడే విధానాలను కనుగొనడానికి చాలా కాలము పట్టింది. వివిధ దేశాలలోని వివిధ సాంప్రదాయాచారములు వెవ్వేరు దైవారాధన విధానములకు కారణభూతములయ్యాయి. ఇన్ని భేదములున్నా క్రైస్తవులు క్రీస్తు బోధన యథాతథముగ నిల్పుకొన్నారు.

క్రీస్తుకు ఇష్టములేని సత్యాలను వేగసాక్షులు మతము లోనికి తెచ్చారనడం క్రూరముగాదా? అక్కడక్కడ కొందరు వ్యక్తులు క్రీస్తు బోధనను కలుషితము చేసియుండవచ్చును, కాని క్రైస్తవ సముదాయము మాత్రము క్రీస్తు బోధన యందు అత్యంత గౌరవము గలవారగుటచే దాన్ని బహు జాగ్రత్తగ కాపాడుకొని వచ్చుదురు.

**వేదహింసలు.** ఇక, క్రైస్తవ మత-కోసం వేదసాక్షులు పడిన బాధలు వర్ణనాతీతులు గద! సహృదయులైన వ్యక్తులు తప్ప ఇతరులెవరు క్రైస్తవులను సరిగా అర్థం చేసుకోలేదు. కనికరించలేదు. అందుకే మూడవ శతాబ్దంలో క్రైస్తవులరక్తం వెల్లువలై ప్రవహించింది. అసలు ఈ శతాబ్దములోని చక్రవర్తులు డేసియన్, వలేరియన్ — క్రైస్తవ మతాన్ని దేశంనుండి తరిమివేయటానికి తమ.

సర్వ శక్తులను ధారపోశారు. చాలామంది బాధపడ్డారు. మొట్టమొదటి 31 మంది పాపుగార్లలో ఒకరు తప్ప మిగిలిన వారందరు వేదసాక్షులే సత్యవేదం కోసం ప్రాణాల్ని ధారవోసినవారే.

అఫ్రికాలోని కార్తేజి ప్రాంతమందలి బిషప్పుగాఉన్న సిప్రియన్ అను ఆయన 25 లో కారాగార బద్ధుడైనాడు. ఒక సంవత్సరం శిక్ష అనుభవించాడు. "అపవిత్రమైన ఊహాలుగల కొందరు వ్యక్తులకు నాయకు" డని ఈయనమీద త్వరగా నేరారోపణ చేయబడింది. తత్ఫలితంగా ఈయన కత్తితో వధించబడ్డాడు. అనేకులు ఈ రకమైన చావుకే గురి అయినారు. రోమను సామ్రాజ్య మంతటా ఈ వధలు, ఈ బాధలు కొన్ని శతాబ్దాలపాటు కొనసాగినై. ఇవి ఈ విధంగా జరిగిన కొద్ది క్రైస్తవమతం మహోజ్వలంగా మహోన్నతంగా అభివృద్ధి అయింది. ఉత్తమస్థాయి నందుకొన్నది.

**వైజ్ఞానిక యుద్ధాలు** క్రైస్తవ మతమును గురించి క్రీస్తునాథుని కొరకు చనిపోయిన వారిని 'వేద కోవిదు'లని పిలచిరి. ఇలాంటి వారు ప్రపంచంలో ప్రతిచోట ఉన్నారు. ప్రతి ప్రాంతంలో కన్పించారు.

మూడవ శతాబ్దిలో ఆఫ్రికాలో గొప్ప ప్రసిద్ధికివచ్చిన వ్యక్తి "ఒరిజన్" అను నతను. ఇతడు క్రైస్తవమతం నిమిత్తం చేసిన సేవ, పడినపాట్లు అపారం; ఇక, మతాన్ని గూర్చి సమగ్రంగా చెప్పటానికి, వివరించటానికీ, అలెగ్జాండ్రియా నగరంలో ఒక ప్రసిద్ధమైన కళాశాల ఉండేది. అచ్చట క్రైస్తవ విజ్ఞానం మహానదియై పొంగులు పారింది.

మూడవశతాబ్దం ఆఖరికి రోమను సామ్రాజ్యంలో "మనికీయనులు" అను ఒక కొత్త మతస్తులు బైలుదేరారు. వారు పాత మతాల్లో ఏరుకొనగలిగినదంతా సమగ్రంగా ఏరుకొని, క్రైస్తవమతం మీద దాడి సాగించారు. ఈ పాషాండులు అగస్తీనును సైతం తమ వైపునకు లాక్కొన్నారు. కొంతకాలంపాటు అంతటితో ఆగక క్రీస్తుమతంలోని కొన్ని సత్యాలను తమ మతంలోకి ప్రవేశింపచేసుకొని తిరుసభకు వ్యతిరేకంగా అన్ని మతాలవారిని సమీకరించ ప్రయ

త్నించినట్లు గుర్తున్నది. ఇదే పాషాండమతం వారి ఆఖరు ప్రయత్నం తిరుసభను వ్యతిరేకించటానికి.

అక్కడక్కడ అభిప్రాయభేదాలున్నా, విపరీతంగా క్రూరమైన బాధలకు, ఇక్కట్లకు క్రైస్తవులు లోనయినా, మూడవ శతాబ్దిలోని ప్రజ ఏ విధంగా రోం నగరంవైపుకి దృష్టిని సారించింది, అక్కడికి వెళ్ళి క్రైస్తవ మతాన్ని ఎలా ఆకళింపుచేసుకొన్నది, తెలుసుకుంటే మాత్రం ఆనందాహ్లాదాలు కలుగక మానవు. క్రీస్తునాథుని ప్రాతి పదిక చెక్కు చెదరకుండా కాపాడ బడినది.

**ఆచరణ** (1) కార్డినల్ న్యూమెన్ వ్రాసిన "కల్లిస్టా" అను గ్రంథాన్ని చదువు. 2) 3వ శతాబ్దిలో (250) డెసియస్ అధ్వర్యం క్రింద బాధలు, హింసలు ప్రారంభమైనాయి. మేత్రాణుల సందరిని చంపాలని ఆ కఠినాత్ముడైన రాజు యోచించాడు. దీన్నిబట్టి మేత్రాణుల పదవి పలు చోట్ల తెలియబడినట్లు విరోధులు కూడ దీన్ని గుర్తించినట్లు తెలుస్తున్నది. మేత్రాణులపదవి అంతకు పూర్వం శతాబ్దిలోనే మానవునిచే వర్ణింప బడినచో తిరుసభ శత్రువులు దానిని కనుగొని ప్రచారం చేసేవారే.

(3) రోం నగరంలోని అర్చ్య॥ శేసీలియ, గాల్ దేశంలోని అర్చ్య॥ అగాతా, అర్చ్య॥ ఇరేనియస్, అర్చ్య॥ లారెన్స్ పారిస్ మేత్రాణులైన అర్చ్య॥ డెన్నిస్ గారలు వేదసాక్షులైనారు. వారలా కావటానికి సంబంధంగల పరిస్థితుల నాలోచించు.

(4) జాన్ అ. 14 26;16,13 చదువు. మొట్ట మొదటి రోజుల్లో తిరుసభకు ఏది మార్గం చూపి, సత్యవేదాన్ని కాపాడినట్లు చేసింది గమనించు—

# పదునాలుగవ అధ్యాయము

నాల్గవ శతాబ్దంలో తిరుసభ సాధించిన విజయాలు.

**పాషాండ మతం విూద విజయం**

క్రైస్తవ సిద్ధాంతాలు, అలవాట్లు, పాషాండ మతస్థులకు పూర్తిగావ్యతిరేకం. క్రైస్తవజీవితాలన్నీ, వారు దేనినైతే నమ్మి ఆచరణలో పెట్టారో దానివలన నడురబకుచుండెడివి. వారిమీద పాషాండ మతావలంబికులకు పూర్తిగా ద్వేషం. అందుకే "క్రైస్తవుల నామం తుడిచివేయబడుగాక" అనే ఉద్దేశంతో, సంకల్పంతో ఈ పాషాండ మతస్థులు బైలుదేరి చాలా క్రూరకార్యములను చేశారు, చేయించారు. సామ్రాజ్యంలో కతోలిక మతాన్ని లేకుండా చేయటానికి దయాదాక్షిణ్యాలు లేనిరాజులు, అధికారులు ముష్కరులైన జనం గుంపులు, చేయవలసిన పనులన్ని చేశాగని, సర్వశక్తు లుపయోగించారని చరిత్రమనకు చెబుతున్నది 83 నుండి 313 వరకు క్రీస్తువేదంపై తీరని దాడి జరిగింది. రోమను సామ్రాజ్య గొప్పదనాన్ని నాశనం చేస్తున్నారని సామ్రాజ్య ద్రోహులని క్రైస్తవులను నిందించారు. అయినా వీరు శాంతంగా దయగా ఉన్నారు. కాని వీరి శాంతం, వీరిదయ దుర్జనులైన మతమూఢులైన వారిని మరింత ప్రకాశింప చేసినాయి.

313 సం. లో కాన్స్టెంటయిన్ జారీచేసిన ఒక ఉత్తరువు రోము సామ్రాజ్యము లో మార్పుకలిగించింది. ఆ చక్రవర్తి క్రైస్తవుడయినాడు. అలా కావటం వలన క్రీస్తువులకు కొంత మనశ్శాంతి లభించింది. కొంత విశ్రాంతి దొరికింది. పాషాండమతం మీాద వారికి విజయం కల్గటము వలన వారికి ఎంత ఉపశాంతి కల్గింది! ఎలాగైనా, చక్రవర్తే తమ మతానుయాయి అయినపుడు ఇక తాము భయపడవలసిన అవసర మేముంది.

కాని మొత్తంమీాద 280 సంవత్సరాలపాటు జరిగిన వేద హింసా కాండమాత్రం మఱువరానిదీ, భయానకమైనదీను. అట్టి వేద హింసలకు గుఱికావటంలోనే క్రీస్తునాథుని ఎడల గల భక్తి, గౌరవ ప్రపత్తులు వెల్లడి అవుతున్నాయి. అలాంటివాటిని ప్రదర్శించిన వారు

ఆర్చ్బి॥ అథానాసియస్, అర్చ్బి॥ జాన్ క్రిసొస్టొమ్ (పేరు 4 వ శతాబ్దిలోని వారు.) అర్చ్బి॥ అగ్నేసు గారలు. ఈ అర్చ్బి॥ అగ్నేసు అను వ్యక్తి కన్యక, వేదసాక్షి కూడ. ఆమె సౌందర్యమూర్తి. తత్కారణంగా ఆమెను ఒక ఉన్నతోద్యోగి వివాహం చేసుకోవాలని అనుకున్నారు. కాని ఆమె అంగీకరించలేదు క్రీస్తునాథుని పాదదాసిగానే ఉండాలని కోరుకున్నది. అలాంటి వ్యక్తిని దహనం చేస్తున్నప్పుడు మంటలు సైతం ఆమెను తాకలేదు. ఆమెకు తగలలేదు. అప్పుడు ఆ అనాథను (15 సంవత్సరాల ప్రాయంలో ఉన్నది) తలను నరికివేశారు. అబ్బ! ఎంతదారుణం!! క్రైస్తవులు కేవలం బాధాసహన వ్రతులు కావడమే కాదు. నాటినుంచీ, వాళ్లు మానవ జీవితాలకు చాలా దోహదం చేస్తున్నారు. "క్రీస్తుమతం, ప్రతి వ్యక్తికీ జేసు స్వామి కోసం బ్రతకడం, చావడం నేర్పినట్లే, ప్రతివ్యక్తినీ పరమ పవిత్ర మూర్తిగా తీర్చిదిద్దింది. కుటుంబజీవితంలో, క్రీస్తుమతం, బాగా లక్ష్యముంచింది కాబట్టి కుటుంబాన్ని కూడ పరమ పవిత్రంగా మలచి, పవిత్రతను, దైవారాధనను నెలకొల్పింది. పరస్పర ప్రేమ పాశబద్ధులుగా జేసి, దంపతుల్ని, సంతానాన్ని, గృహ సుజనాన్ని పవిత్రులుగా చేసింది. అందువల్ల, క్రమక్రమంగా, ఇంటగెలిచి రచ్చగెలిచిన సామెతగా, మానవ సమాజమంతా పరిణామాన్ని పొంది, నిష్కళంకమైన ఆశయాల్తో. కొత్తబలాన్ని, కొత్త శక్తి సామర్థ్యాల్ని పుంజుకొని అగ్రస్థానం సంపాదించింది. మానవాతీతమైన నైతిక విధానానికీ, సంస్కృతికి తిరుపథ అగ్రేసరమైంది స్వర్గానికి, భూమికీ తిరుపథ మధ్యవర్తి. అది బానిసకు వ్యక్తి మానవత్వాన్ని ప్రసాదించింది. ఇప్పటి వరకూ నీచంగా పరిగణింపబడే శ్రామిక జీవితానికి అది ఉదాత్తతను అనుగ్రహించింది. దరిద్రంతో లజ్జతో క్రుంగిపోయిన ప్రజల్ని, కులీన వంశజులైన కుబేరుల ప్రక్కకు తీసుకువచ్చి పీఠమిచ్చి వాళ్లతో పాటు సమానహోదాలో సత్కరించింది. జీవిత తుచ్ఛ వాంఛల్ని, స్వార్థభావాన్ని ఎట్లా పరిత్యజించాలో అది మానవజీవితానికి నేర్పింది. దాని యొక్క విజయ పతాక ప్రియత్వం సచ్ఛీలత ద్వారా గౌరవ విషయాలు మొలకెత్తినై. అది నవ్యమానవుల్ని సృజించి, నవ్యజీవనం అనుగ్రహించింది. వీరల్ని ధర్మపరాయణులుగా మలచింది. ప్రతి జీవిత

# పదునాలుగవ అధ్యాయము

## నాల్గవ శతాబ్దంలో తిరుసభ సాధించిన విజయాలు.

**పాషాండ మతం మీద విజయం** క్రైస్తవ సిద్ధాంతాలు, అలవాట్లు, పాషాండ మతస్తులకు పూర్తిగా వ్యతిరేకం. క్రైస్తవజీవితాలన్నీ, వారు దేనినైతే నమ్మి ఆచరణలో పెట్టారో దాని వలన నడుపబడుచుండెడివి. వారిమీద పాషాండ మతావలంబికులకు పూర్తిగా ద్వేషం. అందుకే "క్రైస్తవుల నామం తుడిచివేయబడుగాక" అనే ఉద్దేశంతో, సంకల్పంతో ఈ పాషాండ మతస్తులు బైలుదేరి చాలా క్రూరకార్యములను చేశారు, చేయించారు. సామ్రాజ్యంలో కతోలికమతాన్ని లేకుండా చేయటానికి దయాదాక్షిణ్యాలు లేనిరాజులు, అధికారులు ముష్కరులై జనం గుంపులు, చేయవలసిన పనులన్ని చేశారని, సర్వశక్తులుపయోగించారని చరిత్రమనకు చెబుతున్నది 83 నుండి 313 వరకు క్రీస్తువేదంపై తీరని దాడి జరిగింది. రోమను సామ్రాజ్య గొప్పదనాన్ని నాశనం చేస్తున్నారని సామ్రాజ్య ద్రోహులని క్రైస్తవులను నిందించారు. అయినా వీరు శాంతంగా దయగా ఉన్నారు. కాని వీరి శాంతం, వీరిదయ దుర్జనులైన మతమూఢులైన వారిని మరింత ప్రకాశింప చేసినాయి.

313 సం. లో కాన్స్టెంటయిన్ జారీచేసిన ఒక ఉత్తరువు రోము సాంమ్రాజ్యము లో మార్పుకలిగించింది. ఆ చక్రవర్తి క్రైస్తవుడయినాడు. అలా కావటం వలన క్రీస్తువులకు కొంత మనశ్శాంతి లభించింది. కొంత విశ్రాంతి దొరికింది. పాషాండమతం మీద వారికి విజయం కల్గటము వలన వారికి ఎంత ఉపశాంతి కల్గింది! ఎలాగైనా, చక్రవర్తే తమ మతానుయాయి అయినపుడు ఇక తాము భయపడవలసిన అవసర మేముంది.

కాని మొత్తంమీద 280 సంవత్సరాలపాటు జరిగిన వేద హింసా కాండమాత్రం మఱువరానిదీ, భయానకమైనదీను. అట్టి వేద హింసలకు గురికావటంలోనే క్రీస్తునాధుని ఎడల గల భక్తి, గౌరవ ప్రపత్తులు వెల్లడి అవుతున్నాయి. అలాంటివాటిని ప్రదర్శించిన వారు

అర్చ్యశ్రీ అతానాసియస్, అర్చ్యశ్రీ జాన్ క్రిసోస్టాంటమ్ (పేరు 4 వ శతాబ్దిలోని వారు.) అర్చ్యశ్రీ ఆగ్నేసు గారలు. ఈ అర్చ్యశ్రీ ఆగ్నేసు అను వ్యక్తి కన్యక, వేదసాక్షి కూడ. ఆమె సౌదర్యమూర్తి. తత్కారణంగా ఆమెను ఒక ఉన్నతోద్యోగి వివాహం చేసుకోవాలని అనుకున్నాడు. కాని ఆమె అంగీకరించలేదు క్రీస్తునాథుని పాదదాసిగానే ఉండాలని కోరుకున్నది. అలాంటి వ్యక్తిని దహనం చేస్తున్నప్పుడు మంటలు సైతం ఆమెను తాకలేదు. ఆమెకు తగలలేదు. అప్పుడు ఆ అనాథ్మాయి (15 సంవత్సరాల ప్రాయంలో ఉన్నది) తలను నరికివేశారు. అబ్బ! ఎంతదారుణం!! క్రైస్తవులు కేవలం బాధాసహన ప్రవృత్తులు కావడమే కాదు. నాటినుంచీ, వాళ్లు మానవ జీవితాలకు చాలా దోహదం చేస్తున్నారు. "క్రీస్తుమతం, ప్రతి వ్యక్తికీ జేసుస్వామి కోసం బతకడం, చావడం నేర్పినట్లే, ప్రతివ్యక్తినీ పరమ పవిత్ర మూర్తిగా తీర్చిదిద్దింది. కుటుంబజీవితంలో, క్రీస్తుమతం, తానా లక్ష్య ఉంచింది కాబట్టి కుటుంబాన్ని కూడ పరమ పవిత్రంగా మన్నన, పవిత్రతన, దైవారాధనను నెలకొల్పింది. పరస్పర ప్రేమ పాశబద్ధులుగా జేసి, దంపతుల్ని, సంతానాన్ని, గృహ యజమాన్ని పవిత్రులుగా చేసింది. అందువల్ల, క్రమక్రమంగా, ఇంట గెలచి రచ్చగెలిచిన సామెతగా, మానవ సమాజమంతా పరిణామాన్ని పొంది, నిష్కళంకమైన ఆశయాల్తో, కొత్తబలాన్నీ, కొత్త శక్తిసామర్థ్యాల్ని పుంజుకొని అగ్రస్థానం సంపాదించింది. మానవాతీతమైన నైతిక విధానానికీ, సంస్కృతికీ తిరుగని అగ్రేసరమైంది స్వర్గానికి, భూమికీ తిరుగని మధ్యవర్తి. అది బానిసకు వ్యక్తి మానవత్వాన్ని ప్రసాదించింది. ఇప్పటివరకూ నీచంగా పరిగణింపబడే శ్రామిక జీవితానికి అది ఉదాత్తతను అనుగ్రహించింది. దరిద్రంలో లజ్జలో క్రుంగిపోయిన ప్రజల్ని, కులీన వంశజులైన కుబేరుల ప్రక్కకు తీసుకువచ్చి పీటమిచ్చి వాళ్లతో పాటు సమానహోదాలో కైకరించింది. జీవిత తుచ్ఛ వాంఛల్ని, స్వార్థ ప్రయోజనాల్నీ ఎట్లా పరిత్యజించాలో అది మానవజీవితానికి నేర్పింది. దాని యొక్క విజయ జనిత ప్రియత్వం సచ్ఛీలత ద్వారా గౌరవ విషయాలు మొలకెత్తినై. అది నవ్యమానవుల్ని సృజించి, నవ్యజీవనం అనుగ్రహించింది. వీరల్ని ధర్మపరాయణులుగా మలచింది. ప్రతి జీవిత

రంగంలోనూ వాళ్ళను నిజమైన సచ్ఛీలురుగా, మహాదాత్ములుగా, తీర్చిదిద్దింది. ఈ అన్ని విషయాల్లోను అది క్రీస్తువాళ యాలకు రూపు రేఖలు దిద్దింది. ఆ కర్తవ్యాన్నే పరిపూర్ణ స్థాయికి తీసుకుపోతూ నాటినుండి అది పరిశ్రమిస్తూ నేడు ది. ప్రాచీన సమాజాల్లో అది అనాథులకూ, దురదృష్టజీవులకూ, ఆత్మసంతృప్తినీ, ఆధ్యాత్మికతత్వా సుధనూ నిరంతరాయంగా అనుగ్రహిస్తుంది. నిజానికి అది, మానవ ప్రపంచాన్ని నవనవానంద జగతిగా మార్చివేసింది.

కాన్‌స్టైంటయిన్ శాసనానికి కొద్దిసంవత్సరాలు ముందుగానే డయోక్లీసియన్ చక్రవర్తి తీవ్రమైన హింసలు పెట్టి తాను చేసిన కార్యానికి ప్రత్యక్ష నిదర్శనంగా ఒక పతకాన్ని చెక్కించుకున్నాడు. దానిమీద "క్రైస్తవ మతాన్ని డయోక్లిసియన్ నాశనం చేశాడు" అని వ్రాయించుకొన్నాడు! మత మూర్ఖత్వ మనేది ఎలాంటిదో చూడండి.

శరీరం మీద గల వ్యామోహం చేత అన్యమతస్తులు క్రైస్తవ మత సౌందర్యాలను చూడలేక పోయారు. అలాగే రోం సామ్రాజ్యానికి క్రీస్తుమతం చేసిన మేలులను గూడ గుర్తించలేక పోయారు. ఆ చక్రవర్తి సైతం తన ప్రయత్నాల నిరుపయోగాన్ని గమనించలేక పోయాడు. కాని ప్రతి క్రీస్తువుడు క్రీస్తునాథుని అనుసరించాడని చెప్పలేము. క్రీస్తువులలోను నీతిదప్పిన జీవితాలను, దుష్ప్రవర్తనను కల్గిన వారుంటారు. కాని మొత్తంమీద క్రీస్తువమతం ఆ రోజుల్లో చేసిన పరిశ్రమ అత్యంత అద్భుతమైంది.

**పతిత్త సిద్ధాంతంపై విజయం**

ప్రపంచం తన అనుచరులను ద్వేషిస్తుంది అని క్రీస్తునాథుడు దీర్ఘదర్శనం చెప్పారు. దానితోపాటు ఆయన ఇంకా ఈ క్రింది విషయాలను గూడ చెప్పారు. అబద్ధీకులైన ప్రవక్తల విషయమై జాగ్రత్త వహించుడు. మీవద్దకు గొఱ్ఱెచర్మము కప్పుకొని వస్తారు. కాని వారు అంతరంగికంగా తోడేళ్ళవంటివారు. ఈ మాటలు అక్షరాలా నిజం. తిరుసభకు తనలోనున్న శత్రువుల ప్రమాదం హెచ్చు.

క్రీస్తునాథుని సత్యాల వివరణ విషయంలో తిరుసభ చేసే నిర్వచనాలకన్న తాము చెప్పే వివరణలు గొప్పవని, సమంజసమైనవని కొందరన్నారు. వీరే పతితులు. కొందరు నాయకులు అప్పటినుండి ఇప్పటివరకు క్రీస్తుసంఘమునుండి తొలగిపోతూనే ఉంటారు. అలా తొలగిపోయి వ్యతిరేక ప్రచారం చేసినవారిలో 'ఆరియస్' అనునతను—నాల్గవశతాబ్దంలోని వ్యక్తి—ప్రముఖుడు. అతను క్రీస్తుప్రభువు దేవుడు గాడని, దేవునికన్నా తక్కువ వారని ప్రచారంచేయసాగాడు. ఈ ప్రచారం కొన్ని శతాబ్దాల పర్యంతం ప్రపంచాన్ని కలవరపరచింది. అప్పుడనేకమంది మెత్రాణులు 325 లో "నిసియా"లో పాపుగారైన 1 వ సిల్వెస్టర్ సూచనల ప్రకారం, కాన్‌స్టైంటయిన్ రక్షణ క్రింద సమావేశమై ఈ విపరీత ప్రచారాన్ని, ఈ పతితమత వాదాన్ని తీవ్రంగా ఖండించారు. క్రీస్తునాథుని దైవత్వ విషయంగూర్చి, తిరుసభ ప్రవచనాన్ని స్పష్టాతి స్పష్టంగా గట్టిగా నొక్కి చెప్పారు.

కనుకనే ఏదిచెప్పినా సూటిగా, కచ్చితంగా ఉండాలనటం, కొన్నిమాటలు అర్థాలపై కొందరు వాదవిమర్శలు జరుపుచుండ తిరుసభ తన సత్యములను సూటిగ చెప్పఅవసరము కలిగెను. పతితులు ఎప్పుడూ ఉంటున్నారు, చివరకు అర్చ్యు॥ పౌలు రోజులలో గూడ పతితులుండిరి. వారిలో తరచుగా జనాన్ని ఆకర్షించగల పెద్ద విద్యావంతులుంటున్నారు. క్రీస్తువ సిద్ధాంతాలను, యధాతథంగా నమ్మటానికి తగిన లక్షణాలు వారిలో లేవు. వారిలో ప్రత్యక్షంగా, అనుక్షణం బాగా కన్పించేవల్లా రెండే. అవే గర్వం, బౌతికదృష్టిను. ఈ రెండూ జీర్ణించిన వ్యక్తి కతోలికు కాలేడు. ఇవి విశ్వాసమునకు అవసరమైన దైవ అనుగ్రహానికి అడ్డము వస్తాయి. కతోలికు కావాలంటే అణకువ సౌమ్యత ఈ రెండూ కొంతవరకు అవసరం. ఇవిఉంటేనేగాని తిరుసభ చెప్పినవాటిని విమర్శించకుండా అంగీకరించలేరు. మన నిర్ణయం కన్నా, తిరుసభ నిర్ణయం గొప్పదని మహోన్నతమైనదని గుర్తించలేరు. ఆవిష్కృత సత్యముల విషయములో స్వబుద్ధిపై ఆధారపడక పొరపాటుబడని తిరుసభపై ఆధారపడవలె నిజానికితిరుసభ చెప్పే సత్యాలు చేసే ప్రవచనాలు మానవులవిగావు. అవి, మానవులు చర్చించి చర్చించి చేసిన అంచనాల ఫలితంగా వెలువడినవిగావు. అవి

క్రీస్తునాథుని దగ్గర నుండే వచ్చినవనుకొంటిమి. దైవికములనవియును, ఆయనను మనము విశ్వసిస్తున్నాము గనుక ఆయన సత్యాలను ఆయన బోధలను విశ్వసించాలి. అటువంటి సామ్యత లేనందువల్ల గర్విష్ఠులై క్రీస్తునాథుని గూర్చి సిద్ధాంతాలు చేయగల శక్తి గలవారము అని కొందరు తలంచుటను సులభంగా అర్థం చేసికొనవచ్చు.

నాల్గవశతాబ్దంలో కతోలిక మత కోసం పోరాడిన యోధులు చాలా మంది ఉన్నారు. వీరి సహాయము తోనే తిరుసభ 325 లో "నిసియా" సమావేశములో పతిత మతస్థుల పై అనేక విజయాలను సాధించినది. నేడు క్రీస్తునాథుని దైవత్వాన్ని ఏ కతోలిక వ్యక్తి శంకించడు. జరిగిన పోరాటమంతటిలో, అంతా సమసిపోయాక పాపుగారితోను మేత్రాణులతోను ఉన్నవారే సత్యమైన మార్గంలో ఉన్నారని తెలిసింది. కొందరు పతితులు కొన్ని క్రీస్తవమత శాఖలలో కొంతమంది అనుయాయులను కొన్ని శతాబ్దముల వరకు కలిగియున్నారు గాని అది అంత ముఖ్యముగాదు

**అర్చ్య॥ అగుస్తీను.** నాల్గవ శతాబ్దంలో చెప్పుకోదగిన వ్యక్తి అర్చ్య॥ అగుస్తీను. మహా ప్రజ్ఞానిధి, ప్రతిభాశాలి. ఈయన ఆనాటి పతితమతస్థుల వలలో చిక్కుకొన్నాడు. ప్రపంచం అత్యంతాకర్షణీయంగా కన్పించింది. కాని తర్వాత కొద్దికాలం మీద ఈయనకు జ్ఞానోదయ మయింది. పతితమతస్థులతోను, స్వేచ్ఛాచరణగాను, ఆత్మకు సంతృప్తినిచ్చుటకు ఏ విధానాలు తోడ్పడలేదు. కనుక గాని తన 33 వ ఏట అర్చ్య॥ అంబ్రోసు మేత్రాణుల మహత్తర బోధలను పొంది తల్లి జపాలవల్ల తిరుసభలో చేరాడు. క్రీస్తునాథుని అనుయాయి అయినాడు. క్రీస్తు జయించిన వారిలో అర్చ్య॥ పౌలప్పగారి తరువాత అంతటి వాడ చెప్పుకోదగ్గ వ్యక్తి అర్చ్య॥ అగుస్తీనువారే. ఈయన అర్చ్య॥ గావటమే గాకుండా పతితమతస్థులను దూరంగా పారద్రోలినాడు. ఈ నాటికి కతోలికులు స్మరిస్తున్న చాలా రచనలను గూడ అర్చ్య॥ అగుస్తీనువారు వ్రాశారు. ఈయన వ్రాసిన, దేవా! మీరు మమ్ముల్ని మీ కొరకు చేశారు మీయందు విశ్రమించునంతవరకు మా హృదయాలకు శాంతిలేదు. అన్న ప్రసిద్ధవాక్యం మరువరానిది. నిరాశాహతుడైనపుడు, శోధింపబడినపుడు ఈ వాక్యాన్ని జ్ఞాపకం చేసుకో.

**దైవసాధనాలు:** ఒకానొక చరిత్ర కారుడైన గిబ్బన్, మతాంతరీకరణకు కాలమాన పరిస్థితులు పతిత మతంమీద అసహ్యత, విరక్తి అనేవి కారణాలని చెప్పాడు. చరిత్ర చదివినవారు సహజ కారణాలకంటె అధికమైన కారణాలున్నాయని గుర్తిస్తారు. తిరుసభ విజయాలను కైకొనే స్థితికి రాగల్గింది అంటే దానికి దైవిక సహాయం ఉన్నదని అంగీకరించాలి. దాని స్థాపకులైన దైవకుమారుడు దానికి అండగా నిలవబట్టే ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఎన్ని ఇబ్బందులు గల్గినా అన్నిటినీ అధిగమించి దినదినాభివృద్ధి పొందింది. పొందుతున్నది. ఆయన ఏ నాడో చెప్పారు ఇలా హింసలు, బాధలు, యాతనలు వస్తాయని, అవి అనుభవించక తప్పదని. ఆయన సత్యాలకు వ్యతిరేకంగా చెడువచ్చి ఏలా పోరాడేది ఆయన దీర్ఘదర్శనం చెప్పారు. ప్రపంచంలో చాలా మంది మోసపోతారని అన్నారు. ఆయన ఇంకా "నే ఎల్లప్పుడు మీతోనే ఉన్నాను" అని కూడ అన్నారు. ఈ కారణంచేతనే తిరుసభ ఎన్నడూ ధైర్యాన్ని పోగొట్టుకోలేదు.

మానవ సాధనాల ద్వారా తిరుసభ ప్రపంచాన్ని ఎదుర్కొన లేదు. అగుస్తీను, అతనాసియస్ వంటి సుప్రసిద్ధ వక్తల గంభీర వాగ్ధోరణి వలన పతిత మతస్తుల దాడులను ఎదుర్కొన లేదు. కనిపించని నాయకుని అనన్య సామాన్యమైన సహాయం వెనుక అండగా ఉన్నది. సత్యజ్యోతిని జగజ్జేగీయమానంగా ప్రకాశించునట్లు చేసింది, చేస్తున్నది క్రీస్తునాథుడే. తిరుసభ విజయాలకు కారకులు అందలి నాయకులని అనుకోవటం ఉత్త భ్రమ. తిరుసభ కేవలం మానవ స్థాపితమైన సంస్థే అయినట్లయితే, అన్నిటితోపాటు అది ఏనాడో అంతరించి ఉండేది. అది మాత్రం యధార్థం.

**ఆచరణ** (1) ఈ నాడు పతిత మతస్తుల అలవాట్లను పునరుద్ధరించటానికి ఏ ప్రయత్నాలు చేయబడుతున్నాయి.?

(2) చరిత్రననుసరించి, దాని ఆధారంగా ఈ నాడు సంఘసంస్కరణకు సరిఅయిన, ఉత్తమమైన పద్ధతి ఏది?

(3) అర్చ్య॥ అగుస్తీను తల్లి అయిన అర్చ్య॥ మోనిక విషయంలో ఏ ప్రార్థనా పాఠాలు కనిపిస్తాయి? గొప్ప గొప్ప అర్చ్యశిష్టుల మీద

తమ తల్లుల ప్రభావం ఎలా పడ్డది అంచనా వెయ్యి. రోమను స్త్రీ అయిన పౌల, ఆమె కుమార్తెలు చేసిన పనిని గూర్చి చదువు.

(4) జేసునాథుడు దేవుడు అని ఘంటా పథంగా చెప్పిన అర్చ్బి॥ అతనాసియస్, మేత్రిణులయిన అర్చ్బి॥ అంబ్రోస్, ప్రసిద్ధ తత్వవేత్త అయిన అర్చ్బి॥ అగుస్తీను, ఆయన విఖ్యాత వ్యక్తి. అర్చ్బి॥ జాన్ క్రిసాస్టామ్, ప్రాచ్య తిరుసభలో పతిత మతస్థునికి ప్రబహ్మాండమైన శత్రువగు అర్చ్బి॥ బేసిల్, బైబుల్‌లో పెద్ద విద్యాంసు డయిన అర్చ్బి॥ జెరోం, తత్వవేత్త అయిన నజయన్జన్‌లోని అర్చ్బి॥ గ్రెగరి వీరల జీవితాలను పఠించు. వీరంతా నాల్గవ శతాబ్ది యందు క్రీస్తునాథుని మిత్రులు. వారి జీవిత చరిత్రను చదివిన తర్వాత క్రీస్తునాథుని సత్యాలను వివరించుటానికి నీవు ఏ విధంగా తయారవుతావు.

# పదునైదవ అధ్యాయము

నూతన కర్తవ్యము.

**అనాగరిక సమస్య** 313లో క్రైస్తవులు చట్టబద్ధమైన నివాసార్హతను పొందిన తర్వాత, రోమను సామ్రాజ్యములో తమకు స్థానమున్న దని గుర్తించినప్పుడు వారు చాలా సంతోసించి ఉండాలని చెప్పాము. వారు ఇప్పుడు అల్పసంఖ్యాకులు గాక అధికసంఖ్యాకు లైనారు. కాని ఒక ప్రక్క పతితమతం ఉండనే ఉన్నది. ద్వేషాసూయలు వారిమీద ఉండనే ఉన్నాయి. ఏది ఎలా అయినప్పటికీ, చక్రవర్తులు, సేనాధిపతులు, ధనవంతులు వీరిలో చాలామంది క్రీస్తువులుగ ఉండిరి.

క్రీస్తు దైవత్వ వివరణ నిమిత్తం బ్రహ్మాండమైన పోరాటాన్ని సాగించిన "నిసియా" సమావేశం (325) కూడ చెప్పుకోదగిన తిరుసభ విజయాలలో ఒకటి. కాని ఈ విజయఫలితాన్ని క్రైస్తవులంతా అనుభవించలేదు. ఎందువలనంటే తిరుసభ రాజ్యాంగం పాలకులలో కొందరు ఇంకా ఏరియన్ వాదము ప్రాబల్య ప్రాభవాలకు లొంగిపోయే ఉన్నారు. ఈ ఏరియన్ వాదము వారులే క్రీస్తుదేవుడు కాదని, దేవునికన్నా తక్కువవ్యక్తి అని ప్రచారం చేశారు. ఈ ప్రచారం కొన్ని శతాబ్దాలవరకు ప్రపంచాన్ని ముంచెత్తింది. అది వెనుక ఉదాహరించబడ్డది.

ఒక రకంగా విరామం, ఉపశమనము లభ్యమైనప్పటికీ మరొక రకంగా కష్టాలు మొలకెత్తినాయి. కొన్ని శతాబ్దములపాటు తన ఉత్తర సరిహద్దులలో విరుచుకుబడిన అనాగరిక జాతులను రోమను సామ్రాజ్యం ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ జాతుల గుంపులలో అనేకం అనేక సమయాల్లో నాశనం చేయబడినా ఇంకావారు విజృంభిస్తూనేఉన్నారు. కొందరు శాంతంగానే రోమను రాష్ట్రాలలోనికి ప్రవేశించారు. సేనలోనికి అనేకమంది ప్రవేశించారు. క్రమంగా రోమనుల అధికారం, బలం, సన్నగిల్లుటవల్ల ఈ అటవికజాతులు బలవంతులయ్యారు. పతనావస్థలోనున్న రోమను సామ్రాజ్యాన్ని కాపాడటానికి

రోమను చక్రవర్తులకు దుర్లభమయింది. దేశంలో అల్లకల్లోలం, అరాచకత్వం బైలుదేరినాయి. నాగరికత పతనావస్థకు వచ్చింది 410 లో రోము దోపిడీ చేయబడింది. ఈ నగరం దోపిడికి, కత్తికి, అగ్నికి ఆహుతికావటం ఇదే ఆఖరిసారిగాదు.

ఇలాంటి భయంకర పరిస్థితుల్లో—దుర్భరమైన బాధలకు, హింసలకు తట్టుకోజాలిన తిరుసభ, రోమను పతితమతంమీద విజయాన్ని సాధించిన తిరుసభ, క్రీస్తునాధుని సత్యాలను పరీక్షించడంలో ఆరితేరిన తిరుసభ — ఈ క్రింది విధమైన పరిస్థితిని ఎదుర్కొనవలసి వచ్చింది.

(1) రోమను సామ్రాజ్య బలం పూర్తిగా పోనే పోయింది.

(2) యూరపులోని దాదాపు అన్ని ప్రాంతాలను అనాగరిక జాతులు అధీనంలో ఉంచుకొన్నాయి. వారు ఏమిచేస్తారో ఎవరూ చెప్పలేకున్నారు.

(3) ఈ అనాగరిక జాతుల్లో అత్యధిక సంఖ్యాకులు కతోలిక మతానికి విరోధులైన పతిత మతానుయాయులై ఉన్నారు. అంటే వీరు ఏరియన్ మతంలోకి మార్చబడ్డారన్న మాట!

(4) ఈ అనాగరిక జాతుల మత మూఢ్యత, మూఢవిశ్వాసములు మూఢుమంతులు కతోలిక సత్యాలకు, అలవాట్లకు వ్యతిరేకమయ్యాయి.

ఇదీ ఆనాటి పరిస్థితి. తిరుసభకు లోపలావిరోధులే! బైటా విరోధులే!! ఇలాంటి సమయంలో తిరుసభ భవిష్యత్తు అగమ్యంగా ఉంది. అందుకని నాగరిక ప్రపంచం యావత్తు పాపుగారిని ఏదైనా మార్గమాలోచించమని అర్థించింది. నిజానికి తిరుసభకు అనాగరిక జాతులను నాగరికులుగా జేసి, తద్వారా వారిని నిజమైన క్రైస్తవులులాగ తయారుచేయటం తప్పితే మరొకమార్గం లేదు. దానితోపాటు పతిత మతావలంబికులైన రాజులను, తదితరులను ఎదుర్కొని ఈ రెంటి ద్వారానే కతోలిక మతం స్థిరత్వాన్ని సంపాదించుకో గలదు.

**అనాగరిక జాతుల లక్షణాలు** "ఈ అనాగరికులైన దండయాత్రీకులు అటవికజాతుల కన్నా కొంచెం మెరుగు. పురుషులు చేపలు పడతారు. వేటాడుతారు. జూదమాడుతారు. త్రాగుతారు. స్త్రీలు గృహకృత్యాల్లో నిమగ్నులై ఉంటారు. కొద్దిగా గోధుమలు పండిస్తారు. వారికి నగరాలంటే ఏమిటో తెలియదు. శిల్పిగాని, పరిశ్రమలుగాని, సాహిత్యంగాని (వీరికి వ్రాయటంగూడ తెలియదు) నాగరికతకు సంబంధించిన తదితర అంశాలను గూర్చిగాని తెలియదు. వీరిని గురించే హిలరీ బెల్లాక్ అనునతడు ఈ విధంగా ఉల్లేఖించాడు. "వారికి స్త్రీలంటే చెప్పుకోదగిన గౌరవమేదీలేదు. వారివి బానిసలతో గూడిన సంఘాలు. వారివి స్వాతంత్ర్య సంఘాలుగావు". వారు ఒక ప్రాంతంనుండి మరియొక ప్రాంతానికి తిరుగుతుంటారు. కేవలం ఇంద్రియ సుఖాలనుకోరే రోమనులకన్నా, వారిలో నాగరికులు కావటానికి తగిన లక్షణాలున్నాయి. కాని వారి జీవితంలో మూఢ నమ్మకాలు విపరీతంగా ఉన్నాయి. అవి ఉండటంవలననే వారిని మార్చటం కష్టము.

**ప్రయత్నము** యూరపులో ఐదవ శతాబ్దములోని విషమ పరిస్థితులు చాలామందిని అక్కడనుండి పారిపోవునట్లు చేసినాయి. కాని మేత్రాణులు, పాపుగార్లు, లోపల బైట చెప్పరానన్ని ప్రమాదాలున్నా వాటిన్నింటిని ఎదుర్కొంటూ క్రీస్తునాధుని సేవలోనే ఎక్కువగా నిమగ్నమయ్యారు. అనేక కష్టాలు పడ్డారు. అనేక బాధలు పడ్డారు. ఒక్కరోజు మన పెద్దనగరాలలో పోలీసు రక్షణ, బందోబస్తు లేకపోతే ఏమవుతుందో ఊహించండి. అలాంటిది అక్కడ రక్షణ అనేది లేదు. అంతా దోపిడే. అన్నీ దొంగతనాలు. ప్రతిచోటా లూటీలు. ఈలాంటి భయంకర వాతావరణంలో ఏమిటి చెయ్యాల ?

అప్పుడు పేత్రునకు క్రీస్తునాథుడు "సముద్రము లోపలకు వెళ్లుడు" అని చెప్పారు. అదేవిధముగ పాపుగారు చేసారు. దీర్ఘంగా ఆలోచించి నాగరికతా రక్షణార్థం చాలా చాలా పనులు చేయుటమేగాక వేదవ్యాపక కార్యక్రమాన్ని విరివిగా కొనసాగించి క్రొత్త క్రొత్త ప్రయత్నాలు చేశారు ఈ కార్యభారాన్నంతా వహించింది పరిశుద

పావుగారైన గ్రిగోరిగారు. ఈయన సర్వశక్తివంతులు, సర్వతోముఖ ప్రజ్ఞావంతులు, ఒక మహావ్యక్తి, రాజకీయవేత్త, పెద్దరచయిత, అనుభవజ్ఞుడైన పరిపాలకుడు, ఒక మహా వేదవ్యాపకుడు. అన్ని రంగాల్లో వారికి కూలంకషమైన అనుభవము, ధీపాటవము ఉన్నాయి- ఆయన జబ్బుచే మంచము పట్టినను ఆయన ఉత్సాహము మొక్కవోలేదు.

ఆయన ఆధ్వర్యం క్రిందనే వేదవ్యాపకులు పాత రోమను సామ్రాజ్యంలోనే గాక ఉత్తరాన ఉన్న దుర్గమారణ్యాలలోకి, బాడవ ప్రాంతాలకు వెళ్లి చాలా కృషి జేశారు. అనాగరిక జాతులకు నూతన జీవాన్ని పోశారు. ఒక నూతన తేజాన్ని తీసుకు రావటానికి అనేక విధాల శ్రమపడ్డారు. ఐదవ శతాబ్దిలో ఐర్లండులోగూడ అర్చ॥ పాత్రిక్ ఎటువంటి పనులు జేసింది మన అందరికి తెలిసిన అంశమే. ఆరవ శతాబ్దంలో అగస్తీను మఠసోదరుడు- నాల్గవ శతాబ్దిలోని మేతాృఇులు కాదు- ఇంగ్లండు వెళ్లాడు. ఇక్కడ రోములో ఈ నగరానికి 40 మైళ్ల దూరంలోఉన్న సుబయూకోవద్ద ఒక మఠాన్ని అర్చ॥ బెనెడిక్టుగారు స్థాపించారు.

ఈ మఠం నుండి వచ్చిన సన్యాసులంతా వ్యవసాయదారులై, ఉపాధ్యాయులై, వేదవ్యాపకులై యూరపు అంతట వ్యాపించారు. వీరి వద్దనే ఆ అనాగరిక జాతులు భూమిని దున్నటం నేర్చుకున్నారు. వారు వెలిగించిన జ్ఞానజ్యోతినే వీరు ఆధారం చేసుకున్నారు. వీరి వల్లనే సారస్వతము రక్షింపబడినది. వారి దగ్గరనుండి కాయకష్టంలో ఉండే గౌరవాన్ని, స్వయంకృషిని సాధించటాన్ని నేర్చుకున్నారు. మొత్తం మీద వివిధ మఠసన్యాసులు ఈ అనాగరికులు క్రైస్తవ మతావలంబకులయ్యేవరకు తమ కృషిని మానలేదు. సుమారు 50 సంవత్సరాల పాటు నిరంతరం కష్టించారు. తమ కాయకష్టములు శాస్త్రపరిజ్ఞానముతో జపతపాలను జోడించారు. 14 వ శతాబ్ద ఆరంభం నాటికి వారి కృషి ఫలితంగా 37 వేల మఠాలు ఏర్పడినాయి.

ఇక ఐర్లండునుండి సన్యాసులు యూరపునకు 6,7 శతాబ్దాలలో వచ్చి అనన్య సామాన్యమైన కార్యాలను సాధించి

ఫ్రాన్సు, ఇటలీ, స్విజర్లాండు, జర్మనీల చరిత్రల్లో అమరజీవులయినారు. కొలంబ అంటే (D 615) స్కాట్లండు మహా గౌరవమును చూపించుచున్నది. అర్చ్యుకొలంబానుసు ఫ్రాన్సులో 20 సంవత్సరాలు పని చేశారు. తర్వాత జర్మనీ, ఇటలీలలో వేదవ్యాపక కార్యాన్ని కొనసాగించారు. ఇక్కడ యూరపులో పరిస్థితులిలా ఉంటే ఐర్లండులో ఏ గందరగోళములేదు. ఏ దోపిడీలేదు. ఏ అల్లర్లులేవు. ఐర్లండు "అర్చ్యశిష్టులకు, విద్వాంసులకు నిలయమయింది."

ఇంకా మరికొందరు వేదవ్యాపకులను గూర్చి, అర్చ్యశిష్టులను గూర్చి తెలుసుకుందాము. ఇటలీలో కాసిడోరిన్ (d 583) అనునతడు గోత్ లను రోమనులను భావ భాష సాంప్రదాయములలో ఏకంచేయుటానికి ప్రయత్నించాడు. అర్చ్య॥ బోనిఫస్-ఇతను ఇంగ్లండు దేశపు వ్యక్తి-ఎనిమిదవ శతాబ్దంలో వేదవ్యాపక కార్యక్రమానికి పూనుకొని జర్మనీ దేశంలో పేరు ప్రఖ్యాతులను సంపాదించాడు. యూరపులో (735-804) ఇంగ్లండు దేశీయుడైన ఆల్క్విన్ మహత్తరంగా విద్యావ్యాసంగాన్ని కొనసాగించాడు. విద్యవిషయంలో అతని భావముల చేత ఆనాడు ప్రభావితం కాని ప్రాంతంలేదు. ఈ విధంగా ఒక దేశం మరొక దేశానికి ఒక్కొక్క విధంగా సాయపడ్డది. ఆ దేశపు వ్యక్తులు ఈ దేశానికి, ఈ దేశపు వ్యక్తులు ఆ దేశానికి వెళ్ళి అటు సాంఘికంగా ఇటు వైజ్ఞానికంగా చాలా కృషిచేశారు.

**ఫలితాలు** అయితే వీరంతా ఇంతపని చేశారుఅంటే, మహత్తరమైన ఫలితాలను సాధించారు అంటే, అది సామాన్య విషయంగాదు. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క వేదవ్యాపకునికి ఒక్కొక్క రకమైన కష్టాలు, ఒక్కొక్క రకమైన అవాంతరాలు ఏర్పడినాయి. ఇవన్నీ అధిగమించినపుడే వారికి విజయశ్రీ లభ్యమయ్యేది. ఐర్లండులో త్వరితముగ వారికి విజయము లభించింది. కొన్ని దేశాల్లో కొన్ని శతాబ్దాల వరకు ఏ ఫలితాలు కన్పడలేదు. కాని వేదవ్యాపక పనిమాత్రం జరుగుతూనే యుండినది.

ఫ్రాంక్సు అను తెగలలో జరిగిన కృషివలన మంచి ఫలితాలు కన్పించినాయి. వారు యూరపునకు పాలకులైనారు. వారే పావు

గారికి రక్షకులైనారు. హింసాపూరిత అమానుష స్వభావముగల వారిని మార్చి స్లీవకు మోకరిల్లునట్లు చేసెను.

నిజానికి ఈ వేదవ్యాపకుల వలన తిరుసభ వలన యూరపులో జరిగిన పని అద్వితీయము, అసామాన్యము అనటంలో అతిశయోక్తిలేదు. "ఐదారు శతాబ్దాలపాటు మానవులకు సరిగా రాతిమీద చెక్కటం రాలేదు. సరిగా వ్రాయటం తెలియలేదు. రోడ్లను మరమ్మత్తు చేసుకోవటం చేతకాలేదు. ప్రభుత్వ యంత్రాంగము హీనదశ నందుకొన్నది. కాని కొంతకాలం గడిచేటప్పటికి అక్షరజ్ఞానం, భాషాజ్ఞానం, సాహిత్య వికాసం, కళాపిపాస, ఇలాంటివన్నీ చేకూరి ఐదవ శతాబ్దికి, పదకొండవ శతాబ్దికి మధ్యగల అఖాతం పూడిపోయింది. అంతేగాక దీర్ఘకాలంపాటు నిద్రావస్థలో మునిగిన జాతి వికసించటాని కావల్సిన లక్షణాలన్నీ ఏర్పడినాయి. అభ్యుదయ పథాన్ని అనుగమించగల వాతావరణ మాసన్నమైంది. అయితే ఇంతపని ఎలా సాధ్యమయింది అంటే తిరుసభవంటి మహత్తర సంస్థ వలననే.

**ఆచరణ** 1) యూరపు పటం దగ్గరకు వెళ్ళి వేదవ్యాపకులు పని చేసిన పెద్ద ప్రాంతాలను గుర్తించు. ఇంగ్లండులో అర్చ్య॥ అగుస్తీను, అర్చ్య॥ బొనిఫెస్, నూర్సియాలోని అర్చ॥ బెనిడిక్టు, కాసిడొరస్, అర్చ్య॥ కొలంబ, అర్చ్య॥ కొలంబానుస్, చార్లమెన్, సెవితిలోని అర్చ్య॥ ఇసడోర్-వీరలపని గూర్చి కతోలిక విజ్ఞాన సర్వస్వము నీకు వివరాలను తెల్పుతుంది.

2) ఈనాడు మనదేశంలో కతోలికులకు ఏ కష్టాలు ప్రత్యక్షమౌతున్నాయి. మీరాష్ట్రంలోని మొదటి కతోలికుల మత విషయక పరిస్థితి లేమిటి?

3) ఆదికాండము 2,15, చూడు. పని అనేదాన్ని శాపంగా స్వీకరించాలనా? లేక ఆశీర్వాదంగా స్వీకరించాలనా? పతనానికి ముందు ఆదాము, హేవమ్మలు ఏం చేయాల్సిఉంది?

—:o:—

# పదునారవ అధ్యాయము

## ప్రతిష్ఠాపనాధికారము — క్రూసేడులు

**మహమ్మదీయుల వలన ఆటంకాలు** తిరుసభ స్థాపించ బడిన మొదటి 10 శతాబ్దాల్లోను యే దశాబ్దమూ కష్టాలు బాధలు లేకుండా యుండ లేదు. ప్రతి దశాబ్దములోను తిరుసభకు అంతరాయాలే, అవస్థలే. కాని యెన్ని వున్నప్పటికీ తిరుసభ అన్నిటినీ అదిగమించుతూ వచ్చి ఒక మహాసంస్థగా వుండి పోయింది. ఒక ప్రపంచ శక్తిగా నిలబడి పోయింది. పేతుృని నౌక యెఱుగని సముద్రాలెన్నిటికో పయనించి వివిధ రకాల నావికులను అందులోకి యెక్కించు కున్నది. అంతేగాక మరొక శుభ చిహ్నం గూడ తిరుసభలో కన్పించింది. అ నాగరిక జాతులని చెప్పబడిన వారందరు నాగరికులై క్రమేపీ క్రైస్తవ మతానలంబకులై తిరుసభ రక్షకులైనారు. పాపుగార్లను రక్షించిన ఫ్రాంక్సు అను వారు వారికి స్వతంత్రాలు, ప్రతిపత్తి కల్గించటానికి కొన్ని భూములను సైతం యిచ్చారు. ఈ విధముగా పాపుగార్లకు లౌకిక అధికారాన్ని కూడా వారిచ్చారు. ఇది 755 నుండి 1870 వఱకు కొన సాగింది.

మనం వెనుక అనాగరిక జాతులని చెప్పుకున్న వాళ్లు యింకా పూర్తిగా నాగరికులు కాలేదు. వారు పరిపూర్ణత్వాన్ని - నాగరికత విషయంలో - అందుకొనక ముందే యూరపులో తురుష్క జాతివారు ప్రవేశించారు. మహమ్మదు చేత స్థాపితమైన ఇస్లాం మతం మొదట్లో అరబ్బులను తరువాత తురుష్క జాతిని తన వైపుకు త్రిప్పుకున్నది. ఈ మతసిద్ధాంతాలన్నీ కొరాన్ గ్రంథంలో కనిపిస్తాయి. ఈ మతం వ్యాప్తి కావడానికి ఖడ్గమే సాధన మయింది. ఈ మతంలో జూదమతం, క్రైస్తవ మతం, పతిత మత భావాలు మిశ్రమై వున్నాయి.

అరేబియాలో బయలుదేరి యీ మహమ్మదీయ మతం బ్రహ్మాండమైన వేగంతో ఉత్తరాఫ్రికా అంతటా వ్యాపించింది. అక్కడితో ఆగలేదు. స్పెయిన్, ఫ్రాన్సు దేశాల్లోకి చొచ్చుకు పోయింది. కాని యింకా పురోగమించక పూర్వమే 732 లో ఫ్రాంక్ అయిన

చార్లెస్ మార్టెల్ అనునతను టూర్సు నగరం వద్ద తురుష్కులతో తొమ్మిది రోజులు యుద్ధం చేసి పరిస్థితిని అదుపులోకి తెచ్చాడు. ఈ యుద్ధమే జరుగక పోయి వున్నట్లయితే యూరపంతా యిస్లాం మయ మైపోయి వుండేది. 846 లో రోం నగరాన్ని సారాసీనులను వారు కొంత వరకు దోచుకున్నారు. తర్వాత 10 వ శతాబ్దంలో కొత్త రక మైన అనాగరిక జాతులు మాగ్యర్ అను పేరుగల వారు నైరుతి యూరపు ప్రాంతాలలో కన్పించారు. ఇంతే గాక ఫ్రాన్సు సముద్ర తీర ప్రాంతాలన్నిటినీ నార్సెమెన్ అను భయంకరమైన జాతివారు దోచుకున్నారు. మొత్తం మీద వివిధ జాతీయుల దండయాత్రలతో యూరపు అంతా గందరగోళంగా వున్నది.

**కష్టాలు ఆటంకాలు** కష్టాలంటూ, విపత్తులంటూ యేవైనా వచ్చినపుడే సాధారణంగా జనమంతా యేకమౌతారు. ఇలా యేక మవటమన్నది అన్ని దేశాల్లోనూ వున్నదే. అంతు లేకుండా వచ్చే దాడులన్నిటిని యెదుర్కొన డానికి మొదటి రోజుల్లో క్రైస్తవులు ఒకే ప్రదేశంలో దగ్గర దగ్గరగా నివసించారు.

ఈ లాంటి పరిస్థితుల ఫలితంగానే ఫ్యూడలిజం బయలు దేరింది. రక్షణని మిత్తం బ్రహ్మాండమైన కోటలు నిర్మింప బడినాయి. ఈ కోటలపైన యజమాయిషీ చేయటానికి ఫ్యూడల్ నాయకులుండిరి. వీరు ఆ చుట్టు ప్రక్కల ప్రదేశాన్నంతా కావలా కాస్తుంటారు. భూ స్వాములకు, తదితరులకు రక్షణ యిస్తుంటారు. అందుకు ప్రతి ఫలంగా వారిచేత యీ నాయకులు తమ భూములను దున్నించుకుంటారు.

పరిస్థితులను చక్కగా అదుపులోకి తీసుకరాగల వారు తగినంత మంది లేనందున ఆనాడు అనేకమంది మేత్రానులే ఫ్యూడల్ నాయ కులై పనుల నిర్వహించారు. కాని యీ పనుల నిర్వహించుట యను నది లౌకిక సంబంధమైనది గనుక మామూలు రాజ్యపాలకులు కొం దరు మేత్రానుల యెన్నికలయందు క్రమేపి కొంత కొంత పలుకుబడిని సంపాదించుకొనిరి. ఈ విధంగా అవకాశంకల్గుట యెప్పుడు ప్రారంభ మయిందో అప్పుడే అర్హతలేనివారు లౌకిక వ్యామోహితుల్లు మేత్రా

గాపున్నైరి. ఇదే లౌకికులు ప్రతిష్టాపనాధి కారముతో సంబంధము కలిగి యుండుటకు మూలం. అనగా లౌకిక పాలకులు మేత్రాణులను, మఠాధి పతులను యెన్నుకొంటువారిని సింహాసనాధీశులజేయు హక్కు కలిగి యుండ అనుమతిబొందిరి. ఇది కొంతకాలమునకు పెద్ద ప్రతిబంధక మయ్యెను. ఇది తిరుసభ పాలకులు చేయవలసిన ఆత్మ సంబంధ కార్య ములకు అడ్డుతగులుచుండెను. దీనికి కారణము లౌకిక పాలకులు అనర్హు లైనవారిని, అసమర్థులను ఆధ్యాత్మిక పదవులలో కూర్చుండ బెట్టిరి.

పతితుల దండయాత్రలు జరిగినంతకాలము లౌకిక, ఆధ్యాత్మిక అధికారులు కలసి పనిచేయుటవసరమే, కాని ఆ అపాయము పోయి నప్పుడు రాజ్యాధికారులు తమకిష్టమైనవారిని ఆధ్యాత్మిక పదవులలో కూర్చోబెట్టడానికి ప్రయత్నించడం హర్షనీయంగాదు. ఈ విధంగా ప్రతిష్టాపనాధికారం తిరుసభకు అనర్ధదాయకమాయెను. ఇట్టి అనర్హు లైన నాయకులకు తమ పదవులకు రాజీనామ యివ్వమని చెప్పుటకు, తిరుసభ యెట్లు నడుపబడవలయునో అను సూచనల నొసంగు లౌకిక పరిపాలకుల నోరుమూయించుటకు ధైర్యశాలియగు ఒక నాయకుడవ సర మయ్యెను.

రోం నగరంలో బెనెడిక్టు విద్యాలయాల్లో మంచి ఆత్మబలం గల ఒక యువకుడు హిల్డర్ బ్రాండ్ అనునతను సన్యాసి అయినారు. తర్వాత యితనే 7 వ గ్రెగోరి పాపుగారు అయినారు. రాజ్యాంగము నకు తిరుసభపై యున్న పట్టును తుత్తునియలు చేయటానికి అతని శక్తి యంతయు అవసరమయ్యెను. ఇతను చరిత్రలో ప్రసిద్ధికెక్కిన మహా వ్యక్తి అయినాడు. కాని యితను మొట్టమొదట సామాన్యుడే. ఒక వడ్రంగి కుమారుడితను. అలాంటి వ్యక్తి పాపుగారయినారంటే యెంత అనన్య సామాన్యమైన వ్యక్తిత్వం, ఆత్మశక్తి, ఉపజ్ఞా ప్రతిభలు గలవాడో వూహించండి.

చాలకాలంనుండి జీర్ణించుకుపోయిన లోపాలను లోటుపాట్లను సరిదిద్దాలంటే యెంతటి ధైర్య సాహసాలు కావలెనో ఆలోచించండి. "అలాంటి వ్యక్తులు యెదుర్కొనవలసిన కష్టాలను గూర్చి, అవాంత రాలను గూర్చి చరిత్ర చెబుతుంటుంది. వారు ఘర్షణ పడవలసింది

ఒక శిష్ట వారితోనే గాదు, సోమరిపోతులతో కూడ ఏపనిచేయక స్తబ్ధంగావుండే వారిని, సరియైన దృక్పథం, సరియైన దృష్టి లేనివారిని వారు మేల్కొల్పాలి. ఇట్టి మహావ్యక్తులు, గ్రెగోరి చనిపోయేముందు అనుకున్నట్లు, తాము ఓడిపోయామనే అనుకుంటారు. కాని రాబొయ్యే తరాలముందు తమకు తెలియకుండానే తాము అందరికంటె అధికమైన విజయాలు సాధించామని నిరూపించుకుంటారు."

**ఆటంకం నుండి విముక్తి**

పైనచెప్పబడిన హిల్డబ్రాండు ప్రజల పాపుగారు. ఆయన పొందిన విజయం ఫలితంగా ప్రజలంతా తమ ఆధ్యాత్మిక నాయకులయందు పరిపూర్ణ విశ్వాసముంచుట కారంభించిరి. యూరపు 11 వ శతాబ్దములో జీవితమందు నూతన శ్రద్ధను చూపడానికి పైవిషయ మొక కారణం. దీన్నుంచే మధ్యయుగాల ప్రతిభ జనించినది. ఆ శకాలు "ఒక నవజీవనంతో కూడిన నాగరికతను" సృష్టించినాయి. మనజాతికి, మనకు తెలిసినంతవరకు, ఆ నాగరికత వుత్తమోత్తమయినది, గొప్పదీను. అది యూరపు స్వభావమునకు తగినట్టిది. అతని స్వభావాన్ని తృప్తిపరచునట్టిది. అంతేగాక మానవునికి ఆదర్శమైన సౌఖ్యాన్ని ప్రసాదించునట్టిది కూడా.

ఇక మధ్య యుగాల నాటి విషయం. వీటి చరిత్ర వినతగ్గది. స్పెయిన్ దేశీయులు మూరులపై జరిపిన యుద్ధాలు ధైర్య సాహసాలతో కూడినట్టివి. ఆనాటి ప్రజలు అలాంటి సాహసాలను ప్రేమించి వాటిని వినియోగింప సాహసించేవారు. మనకు ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే: ఈనాటి సాహిత్యంలో, వాఙ్మయంలో గల భావాలు, అభిప్రాయాలు చాలవరకు ఆ యుగాలలో జన్మించినట్టివే. నేటి జీవితంతో పోల్చిచూచుకుంటే ఆనాటి జీవితం చాల కఠినమైనది. అయినప్పటికి ప్రజలు దానికి సిద్ధపడ్డారు. దానితో వారు సుఖపడ్డారు కూడ. వీరకృత్యాలపై గల వ్యామోహం ఆనాటి కష్టజీవితాన్ని కొంతవరకు మరపింపజేశాయి.

**క్రూసేడులు**

అది పదకొండవ శతాబ్దం. పవిత్ర స్థలమైన జెరూసలేం నగరాన్ని ఆక్రమించిన తురుష్కులు అచ్చటి

యాత్రకై వెళ్తున్న క్రైస్తవులను విపరీతంగా హింసపెట్టారు. దానితో క్రైస్తవ ప్రపంచమంతా ఆగ్రహపడింది. తక్షణం మతయుద్ధం ప్రారంభమయింది మొట్టమొదట మత యుద్ధమంటే దురాక్రమణకు గురైన పవిత్రస్థలాల్ని వశపరచుకొనడానికి దాన్ని విముక్తి చేయడానికి కంకణం కట్టుకున్న సేనాధిపతులు, మరికొందరు యోధులు వెళ్ళేవారు. క్రూసేడు అనునది అంతస్వల్పంగాదు. ప్రాచ్య క్రైస్తవులు పాశ్చాత్య యుద్ధబలములతో సహకరించేవారుకారు. నేలమీద వెళ్ళాలంటే రెండువేల మైళ్ళు నడువవలసినదే. అదికూడా శత్రుదేశాల మీదుగా. స్పెయిను యుద్ధములు క్రైస్తవులకు యుద్ధోపాయములను నేర్పినవి. కాని ఐకమత్యం లేనందున అనేక పర్యాయములు మంచి ప్లానులుకూడ నిరుపయోగమయ్యాయి.

క్రైస్తవులంతా- పిన్నాపెద్దా, స్త్రీ పురుషులు, బాల బాలికా- శిలువలను ధరించి తమ ఉత్సాహాన్ని చూపారు. 1096 లో మొదటి శిలువయాత్ర జరిగింది. ఆఖరినారి 1268 లో మళ్ళీ వెళ్ళారు. వారు జెరూసలేం నగరాన్ని స్వాధీన పరుచుకున్నారు. కాని నిలబెట్టుకోలేక పోయారు. అందువలన వారి లక్ష్యం నెరవేరలేదు కాని అనుభవాలు మాత్రం చాల కలిగినాయి. అనేక లాభాలూ కల్గినాయి. "ధైర్య సాహసాల స్మృతిమానవత్వం చాలా భాగ్యవంతమైనది." ప్రజల్లో ప్రజాస్వామిక దృష్టిని పెంపొందింప జేశారు. నౌకాయాన పరిశ్రమకు దోహదం కల్పించారు, వర్తక వాణిజ్యాలు వృద్ధికి తీసుకరాబడినాయి. ఇక తురుష్కుడా - తనూ - రక్షణ మార్గాన్ని వెతుక్కొనవలసిన వాడైనాడు.

**ఆచరణ** 1) గాడ్ ఫ్రెయిమ్యా, సింహ హృదయ రిచర్డ్, అర్చ్య శిష్ట బెర్నార్డు, 3 వ ఇన్నొసెంట్, ఫ్రాన్సురాజు అర్చ్యశిష్ట లూయీస్ వారిని గూర్చి చదువు.

2) ఈనాడు కతోలిక విద్యార్థులు చేస్తున్న, 'మిషన్ క్రూసేడ్లను' ఆనాటి 'క్రూసేడ్ల' తో పోల్చినూడు.

3) ఈనాడు పాపుగారినిగానీ, మేత్రాణులనుగానీ యేరుకొనటంలో రాజ్యాంగానికి యేమైనా సంభంధమున్నదా ?

4) ఈనాటి కతోలిక మతానికి ప్రమాదంగావున్న పెద్ద ఆటంకం, అవాంతరం యేది ?

---

# పదునేడవ అధ్యాయము

## వికాసం—ఉజ్జ్వలదశ

ఒక పెద్ద పోటీ ఫలితాన్ని నిరీక్షిస్తూన్నవుడు పాఠాలను చదవడం యెంత కష్టమో నీకు తెలుసు. అదే విధంగా యూరపులో జరుగుచున్న వివిధ దండయాత్రలు, పోరాటాలు, అల్లకల్లోలాలు యూరప్ దేశస్తుల మనస్సును యుద్ధములపై త్రిప్పినవి, కాని కళలపై పోనివ్వ లేదు. పరిస్థితి కొంచెము కుదుట బడిన తర్వాత వైజ్ఞానిక జీవితం విజృంభించుటకు మొదలెట్టినది. గొప్ప నాగరికతా ఫలితాలననుభవించడానికి ప్రజలను అనేక శతాబ్దాలు తయారుచేయవలసి వచ్చినది. ఆ ఫలితాలు 13 వ శతాబ్దంలో కలిగినవి.

ఈ విధంగా మధ్య యుగంలో అనన్యసామాన్య ఫలితాలుకలిగి 13వ శతాబ్దం చరిత్రలో ప్రాముఖ్యమైన శతాబ్దముగా గుర్తించబడింది.

**విద్వత్తుపై ఉత్సాహం** విజ్ఞానవంతులం కావాలనే విజిగీష (ఆశ) యూరపులో ప్రబలం కాసాగింది. దీని ఫలితంగా విశ్వవిద్యాలయములు స్థాపింపబడెను. ఇవి 13 వ శతాబ్దంలో ప్రసిద్ధి చెందినవి. 16వ శతాబ్దానికి పూర్వం 81 విశ్వవిద్యాలయాలు-వాటిలో చాల వరకు-పోపుగారి అధ్వర్యాన స్థాపించబడినాయి. వీటిలో కొన్ని వేలమంది విద్యార్థులు పఠనం చేశారు. పారిస్ విశ్వ విద్యాలయంలో 6 వేల మంది, బొలోగ్న విశ్వవిద్యాలయంలో 7 వేల మంది, విద్యనభ్యసించారు. నేటి విద్యార్థి జీవితం వలె ఆ నాటి విద్యార్థి జీవితం సుఖముగ లేదు. కష్టములతో కూడినది. పుస్తకాలు అచ్చుపడటమనేది యింకా అప్పటికి రాలేదు. 1850వ సంవత్సరం వరకు ముద్రణాలయం కనిపెట్టబడ లేదు. ఇన్ని యిబ్బందులు పడినా వారు ఆ నాడు అంతగా విద్యావంతులైనారు అంటే దానికి కారణం వారిలో వివరీతంగా వున్న విద్యాభిరుచి తప్ప మరొకటికాదు.

ఆ విద్యా విధానాన్ని చక్కగా అమర్చారు. లాటినే సామాన్య భాష. పాఠ్యవిషయములు అన్నిచోట్ల ఒకటేగనుక విద్యార్థులు ఒక

దేశ విశ్వవిద్యాలయమునుండి మరొక దేశ విశ్వవిద్యాలయానికి వెళ్ల టం సులభమైంది. అదేవిధంగా లెక్చరర్లు కూడా చేసేవారు. లెక్చర ర్లలో, ప్రొఫెసర్లలో స్త్రీలు కూడా వున్నారు.

లాటిన్ భాష రాని కారణమున అనేకమంది వున్నత విద్య నభ్యసించలేక పోయిరి. వ్రాయుట చదువుట తెలియని వార లనేకు లుండిరి. అంతమాత్రము చేత మనము వారిని విద్యా విహీనులని చెప్ప గూడదు. ఈ నాడు విద్య అంటే మనకు పుస్తకాలు అవసరం. కాని వారు పుస్తకాలు కాకుండా యితర మార్గముల ద్వారా నేర్చు కొనిరి. నటకులు వివిధ ప్రాంతములు తిరిగి ప్రజల జీవితంలోనికి నాట కములు తెచ్చిరి. కవులు దేశదేశములు తిరుగుచూ వారి కావ్యముల వలన ప్రజల జీవితములలో ముఖ్యమైన విషయములపై వారిదృష్టిని ద్రిప్పిరి. కవులనుండి ప్రజలువిన్న పాటలు, వృదములు వారు సర్వదా జ్ఞాపకముంచుకొనగా అవి వారి వైజ్ఞానిక, సాంఘిక, నైతిక జీవిత పురోగమనమునకు తోడ్పడెను. దేవాలయములందున్న సంకేతములు వారికెంతయో జ్ఞానమిచ్చెను. శిల్పకళావకాశముండుటవలన వారి పనులద్వారా ప్రజలలో కళాపిపాస అధికమాయెను.

వైజ్ఞానికంగా వున్నతస్థితిని పొందినవారు ఆ పదమూడవ శతా బ్దంలో యెందరో వున్నారు. వారిలో చెప్పకోతగినవారు తిరుసభ యొక్క ప్రసిద్ధ తాత్వికవేత్త అర్చ్యశిష్ట తోమాస్ అక్వినాస్ (1225-1274), సైంటిస్ట్ రోజర్ బేకన్స్ (1214-1275), అర్చ్య శిష్ట ఆల్బర్ట్స్ మాగ్నస్, అర్చ్యశిష్ట బోనవెన్చర్ గారలు.

వీరితర్వాత చెప్పకోతగిన మహావ్యక్తి ప్రసిద్ధ సాహిత్యవేత్త డాంటె మహాశయుడు. ఇతడు ప్రపంచంలోని మహాకవులైన ముగ్గు రిలో ఒకరు. ఆ రోజుల్లో పద్యగేయ రచన యేలా ప్రజలను ప్రభావి తులనుగా చేసిందో తెలిసికోవాల టే సంచార సంగీతకుల చరిత్రలు చదవాలి. ఈనాడు మనం సత్ప్రసాద ఆశీర్వాదములో పాడుచున్న లాటిన్ పాటలన్నీ అర్చ్యశిష్ట తోమాస్ అక్వినాస్ గారు వ్రాసినవే. ఆనాటి తాత్వికులు గణిత శాస్త్రంమీద, సైన్సు మీద బ్రహ్మాండ మైన వ్యాసాలు వ్రాశారని ప్రొఫెసర్ ఢారస్ డైక్ అన్నాడు.

**కళలలో సాధించిన విజయాలు** గోతిక్ దేవాలయాలు నేటికి కూడ ప్రపంచ విఖ్యాతి పొందినాయి. వాటిని మెచ్చుకుంటున్నవారు అత్యధిక సంఖ్యాకులు. " ఈ మహా దేవాలయాలకు సంబంధించిన విషయం వాటి మీదగల చెక్కడపుపని, యివి ఒకనాటితో చూడడంతో తరిగేపనికాదు. గురువులు, మతసోదరులు, తాపీమేస్త్రీలతో పాటు సరసన నిల్చొని పని చేశారు. వీరైనంత మహెూదాత్తమైన దేవాలయాన్ని నిర్మించాలనే చూచారు. ప్రతి భాగాన్ని, ప్రతి అంశాన్ని ప్రతి స్వల్ప విషయాన్ని చాల నిశితంగా పరీక్షించి, అత్యంత జాగ్రత్తగా, శ్రద్ధగా, దీర్ఘంగా ఆలోచనచేసి అనుకున్న భావం, అనుకున్న వ్యూహ, పూర్తిగా చిత్రిత మౌనట్లు ఆ దేవాలయాలను తీర్చిదిద్దారు. గొప్ప దేవాలయాలను జీవితకాలము యావత్తు తిరిగి చూచినా, ఆ చూచినవారు దేవాలయంలోని ప్రతి అంశాన్ని పరిశీలించాడా లేదా అనే సంశయం రాక మానదు. తమ ముందు కన్పిస్తున్న బ్రహ్మాండమైన యీ కట్టడం యీ విధంగా తయారైనందుకు గల కారణాలను గానీ, అందులో అమలునకు తీసుకొనిరాబడిన ప్రయోగాలుగానీ అతనికి ఆ ఒక్క జీవితకాలంలో అంతుపడతవనుకోవడం సంశయాస్పదమే." వాటి కిటికీలకు గల బొమ్మలతో కూడిన రంగు రంగు అద్దాలకు సరిపోలునవి యీ నాటి యే దేవాలయంలోనూ కనపడవు. వాటికి అవే సాటి.

**ప్రభుత్వం** ఈ పదమూడవ శతాబ్దంలోనే రాజకీయపుటాలోచన చాల లోతుగా, గాఢంగా వుండసాగింది. ఈనాడు మనకు ప్రభుత్వమును గూర్చి యేర్పడిన భావాలు ఆనాటివే. ప్రభుత్వ విధానాలకు, ప్రభుత్వ పద్ధతులకు ఆనాడే నాంది వచనం పలుకబడింది. మనం అనుకుంటుండే మాగ్నకార్ట ఆనాటిదే. అది 1215లో ఆవిర్భవించింది. తిరుసభ పాలనయందు దోమినిక్ సభవారు ప్రతినిధుల ప్రభుత్వ పద్ధతిని ప్రవేశపెట్టిరి. ప్రతి మఠము ఒక ప్రతినిధిని యెన్నుకొనెడిది. వీరు సభ సమావేశమునకు పంపబడెడివారు. గురువులు ఆనాటి ప్రభుత్వమందు పలుకు బడి కలిగి యుండెడివారు గాన (దోమినిక్ సభవారు కొన్ని స్థలములలో వుపదేశకులుగ నుండెడివారు) త్వరలో ప్రాతినిధ్య ప్రభుత్వమనునది రాజ్యాంగమున వేళ్లు

పాతుకొనెను. తిరుసభ ప్రాతినిధ్య ప్రభుత్వాన్నారంభించెను. రాజ్యాంగము దాన్ని పరిగ్రహించెను. "మనుష్యులంతా ఒకటే, ప్రకృతి రీత్యా అందరూ సమానులే"నని అర్చ్యశిష్ట తోమాస్‌గారు వ్రాసిరి. "శాసనములు చేయుటకు ప్రజాసముదాయమునకు లేక ప్రజాసంరక్షకులకు అధికారమున్న"దని కూడ వ్రాసెను. స్వేచ్ఛను గురించి వ్రాస్తూ "విశ్వాసాన్ని అంగీకరించనివారు అంగీకరించమని బలవంతిపెట్టబడరన్నారు. 1300లో దుబ్వా అనునతడు ప్రపంచ న్యాయస్థానముండుట ఉత్తమని ప్రతిపాదించాడు. యుద్ధాలను తగ్గించి వేయటానికి తిరుసభ యెంతో ప్రయాసపడినది.

13 వ. శతాబ్ద రాజులు అసాధారణ వ్యక్తులు. వారిలో చెప్పుకోదగినవారు సెంట్ లూయిగాస్-ఫ్రాన్సురాజు, స్పెయిన్ ప్రభువైన ఫెర్డినండ్, కాస్టిల్ ప్రభువైన అల్ఫోన్సో, ఇంగ్లండులోని మొదటి ఎడ్వర్డు ప్రభువు, పాపుగారైన 3 వ. పోపు గారలు. ఆ నాటి విశ్వవిద్యాలయాల్లో విద్యార్థి ప్రభుత్వాలు గూడ వుండేవట.

**సాంఘిక జీవితం**

అవి యింగ్లండుకు సంతోషకరమైన రోజులు. అనాటి ప్రబలదైనందిన జీవిత వాతావరణం, జీవిత పరిస్థితులు మనకు మోటుగా కన్పిస్తాయి. మంచి నాగరికత అనే దానికి ఋజువు అది ప్రజలకు సంతోషానందాలు కూర్చగలిగనపుడే. ఆలాంటి సంతోషానందాలు ఆపద మూడవ శతాబ్దంలో ప్రజల ముఖసీమల్లో నృత్యోత్సవం చేసినాయి. ప్రజలలో ఒకరియెడల ఒకరికి సహకార సంపత్తులున్నాయి. వర్తక వాణిజ్యాల్లో పనిచేస్తున్న వారు రోగపీడితులైనప్పుడు, వయోవృద్ధులైనప్పుడు వారిని ఆదుకోటానికి వర్తక సంఘాలు వున్నాయి. "అందరికీ ఒకే విశ్వాసం; ఒకే సాంగ్యములు, ఒకే వృత్తి, ఒకే పవిత్రమైన భాష, ఒకే ఆలయం, ఒకే విధమైన ఆచారములు, ఒకే విధమైన సంఘం, ఒకే ఒక కట్టుబాటు, ఒకే ఒక విద్యావిధానం, మంచి, సత్యం, సౌందర్యం వీటిలో ఒకే ప్రామాణికత కలిగియుండిరి. ప్రపంచలో ఒక సగభాగం చేస్తున్న పనిని గూర్చి హేళన చేయడంగాని, వారితో పోట్లాడటంగాని చేయ లేదు. తమ ఆదర్శాలే మంచివని, వాటిలోనే నిమగ్నమవుతూ,

యితరుల వాటిని దుయ్య బట్టటం జరుగలేదు. వెవ్వేరు స్వభావములు కలిగియున్న స్టెఫిన్ లాంగ్టన్, సెంట్ ఫ్రాంసీస్, సెంట్ థామస్, రోజర్ బేకన్, డాన్టే, గెట్టో, సెంట్‌లూయియా, 1వ ఎడ్వర్డుగారలు గూడ అందరికి పనికి వచ్చే వుమ్మడి భావములను అంగీకరించారు. అంతా ఒకే పనిమీద వున్నామని అనుకొన్నారు. "ఆనాటి యోధుల పనులు, సాహస కృత్యాలు గేయ, కథా రూపాలలో మహోన్నతంగా మహోజ్జ్వలంగా వర్ణింపబడినాయి. వారికి స్త్రీలంటే గౌరవం. స్త్రీలను గౌరవించే విషయంలో వారు పేరుపొందినవారు.

**ఆచరణ**

(1) సెంట్‌లూయియాపై తల్లి అయిన రాణి బ్లాన్చ్‌కి గల పలుకుబడిని ప్రభావాన్ని గూర్చి నీవేమి నేర్చుకొనగలవో చూడు.

(2) చరిత్రను బాగా చదివే వారిలో అధిక సంఖ్యాకులు తిరుసభను మెచ్చుకుంటారు. దానికి కారణమేమిటో నీవు వూహిస్తావా?

(3) అర్చ్యశిష్ట దోమినికు, అర్చ్యశిష్ట ఫ్రాన్సిసిస్ గారల జీవిత గాథలు చదువు. అప్పుడు వారు రెండు గొప్ప సన్యాససభ స్థాపకులని నీవు తెలుసుకుంటావు. అప్పుడు అర్చ్యశిష్ట ఫ్రాంచీస్‌నకు సహాయం చేయటానికి అర్చ్యశిష్ట క్లారమ్మ యేమి చేసిందో చూడు. ఈ క్రింది వాక్యంలోని అర్థాన్ని గమనించు. ఒకరికి సేవ చేసే విషయంలో గల బుద్ధిపూర్వక దారిద్ర్య భావన క్రైస్తవ ప్రపంచాన్ని వుత్తేజపరుస్తుంది. అంతేగాక ప్రపంచంలో అదొక మహాశక్తిగా నిలబడిపోతుంది."

(4) యంత్రం మాదిరి పనిచేసే కార్మికునకు "అతని పని ద్వారా మానసికంగా వున్నత స్థితికి రావడం సాధ్యంగాని పని" అని అంటారు. అట్టి కార్మికునకు విశ్రాంతి కోసం యేకార్యక్రమాన్ని యివ్వగలవు?

(5) ఈనాటి 'ట్రేడ్ యూనియన్' సంస్థలతో ఆనాటి 'ట్రేడ్ గిల్డ్సు'ను పోల్చిచూడు.

---

# పదునెనిమిదవ అధ్యాయము

## విప్లవం

**దుర్వినియోగాలు** (1) సంవత్సర సంవత్సరం మానవుణ్ణి సక్రమ మార్గంలో నడిపించటం, ఋజుమార్గాను వర్తియై యుండునట్లు చేయటం కష్టంతో కూడిన పని. కొంతకాలం పోయే టప్పటికి మానవుడు తిరిగి తప్పటడుగు వేస్తుంటాడు. అలాగే 13 వ శతాబ్దంలో క్రైస్తవ జీవితం చాలా చక్కగావున్నది. ఉన్నత స్థాయిని అందుకున్నది. అటాంటివల్లా 14-15 శతాబ్దాలు వచ్చేటప్పటికి తారు మారయింది. క్రీస్తునాథుని తత్వానుసరణ తగ్గిపోయింది. తిరుసభ చాలా అధికా సౌన్నత్యానికి వచ్చింది. ఆ రావటంతో ఆ ధనాన్నంతా మత పాలకులు చాలామంది దుర్వినియోగం చేశారు. దాంతో ప్రజల్లో అసంతృప్తి బయలుదేరింది. అది అలావుండగా 'ట్రేడ్ గిల్డ్స్' అను పేరుతో పనిచేస్తున్న వర్తక సంస్థల్లో దానగుణం, సహృదయత్వం, ఉదారిత్వం లోపించినాయి. కొన్ని మతాలు నయితం తప్పుదోవను త్రొక్కాయి. సాహిత్యోద్యమం కూడ పెడత్రోవ దొక్కింది. సాహిత్యార్చకులు గ్రీకు రోమను సాహిత్యమును పఠించుటవలన నిశిత మేధాశక్తిని సంపాదించారు. క్రమేపి యీ సాహిత్యార్చకులు; యీ వైజ్ఞానికులు, గర్విష్ఠులు దైవసత్యములందు నమ్మకం లేనివారుగా తయారైనారు. తత్ఫలితంగా ప్రజలు సంశయాత్ములు, అవినీతిపరులూ అయ్యారు.

(2) 14 వ శతాబ్దంలో 40 సంవత్సరములపాటు వ్యతిరేక పాపుగార్లుండిరి. ఈ శతాబ్దారంభంలో కార్డినలుల మధ్య ఫ్రెంచివారి ప్రభావం యెక్కువగా నున్నది. ఫ్రెంచిరాజు ఫిలిప్ తన రాజ్యాధికారంచేత ఒక ఫ్రెంచి కార్డినలును పాపుగారుగా యెన్నుకొన బడునట్లు చేసెను. ఆ పాపుగారు తన సింహాసనమును ఫ్రాన్సు దేశానికి మార్చారు. 70 సంవత్సరాలపాటు పాపుగారలు అవిగ్నన్ పట్టణంలో వుండి ఫ్రెంచి ప్రాభవానికి లొంగిపోయారు.

ఇంతలో కతోలికులందరు పాపుగార్లను రోం నగరానికి రమ్మనమని బలవంతపరచారు. 1378లో ఒక ఇటాలియన్ పాపుగారును యేరు

కోవటంతో ఆయన రోం నగరానికి రావటం జరిగింది. ఈ పాపుగారు న్యాయతః యెన్నికైనవారే. సక్రమముగా పట్టాభిషిక్తు లైనవారే. వీరిని 6 వ అర్బన్ అని పిలిచారు. కాని యీయన వైఖరి చాలామంది కార్డినలులకు రుచించలేదు. అందువలన మొదట తాము చేసినపని బలంమీాద చేసినదని (పాపుగార్ని యెన్నుకొనుటలో) చెబుతూ ఫ్రాన్సుకు తిరిగి వెళ్ళి 7 వ క్లెమెంటును పాపుగారినిగా యెన్ను కొన్నారు. ఈ విధంగా ఆ పాపుగారికి వ్యతిరేకంగా మరొక పాపుగారు (ప్రత్యర్థిగా) యెన్నికైనా రన్నమాట. వీరు అవిగ్నాన్ లోనే వున్నారు

ఈ విధంగా తగాదా ఆరంభమయింది. ప్రతిపక్షంవారు తాము న్యాయస్తులమని తమ ప్రతినిధే సక్రమంగా యెన్నికైనవారని చెప్పు కున్నారు. ఇంతలో యే ఒక పార్టీపాపుగారైన చనిపోయినపుడు వారికి విషయ విధేయులైన ఆ వర్గీయులైన కార్డినలులందరు కలిసి మరొక పాపుగారిని—అనగా గతించినవారికి వారసునిగా—యెన్నుకొన్నారు. దానితో పరిస్థితులు తారుమారైనాయి. పరిస్థితులు యింకా విషమిం చటానికేమో అన్నట్లుగా మరొక గూపుకు చెందిన కార్డినలులు గూడ మూడవ పాపుగారి నొకరిని యెన్నుకున్నారు. యీలా కావ టంవలన యిరువురు పాపుగార్లు పోటీగా నున్నారన్నమాట. ఇరువురు ప్రత్యర్థులు నిలుచున్నారన్నమాట. ప్రజలుమాత్రం తిరుసభలో ఒక్కరి కంటె యెక్కువ పాపుగార్లు వుండవలయునని తలంచలేదు. కానీ తమ పార్టీవారే పాపుగారుగా యుండవలయునని, యెవరు నిజమైన పాపు గారో నిర్ణయించుకొనుటకు శ్రద్ధ తీసుకొనలేదు. కాని యిది యెక్కువ కాలం సాగలేదు ఇంతలో 1414 లో యీ యిరువురు పాపుగార్లు "కాన్ స్టన్స్" సమావేశమునందు పదవీచ్యుతులైనారు. రోమను పాపు గారు కూడా అలాగే పదవిని విడిచిపెట్టారు. ఆ తర్వాత క్రొత్త పాపుగారుగా 5 వ. మార్టిను యెన్నుకోబడ్డారు. అప్పుడే శాంతి వాతావరణం నెలకొనటం జరిగింది.

నిజానికి యిదంతా చూస్తుంటే మనకు చాలా బాధగా వుంటుంది. కాని కార్డినలులను రాజు యెన్నుకొనేటప్పుడు యెట్టి అధికారాన్ని వుపయోగించాడో గమనించాలి. సహజంగా అంత

వున్నత పదవిలో వున్నప్పటికి తమ్ము ఆ పదవిలో పెట్టిన వారి ప్రభావానికి లొంగక తప్పదు. ఆ కాలంలో రోమను పాపుగారే అర్చ్యశిష్ట పేత్రుయొక్క న్యాయ సమ్మతమైన వారసులని చరిత్రకారులు అంగీకరిస్తున్నారు. తత్కారణంగా పాపుగారంటూ లేకుండా ప్రపంచ ముండలేదు. అందరు సత్యమైన పాపుగారిని గుర్తించకపోవచ్చు. దీన్ని యెవరూ కాదనలేరు.

ఈ తగాదాను పాశ్చాత్య భేదనయందురు. ఇది నిజంగా విభాగమగుట కాదు. మతములో చీలికయగుట కాదు. ఇది నాయకుల నెన్నుకొనుటలో కొందరు తమ పలుకుబడిని తప్పుగ ప్రయోగించుట, దాని వలన వచ్చిన అనర్ధకాలు. కార్డినలులను యెన్నుకొనుటలో చాల లౌకిక పలుకుబడి కారణముగ నుండెను. వీటి నన్నింటిని తిరుసభ అధిగమించిందంటే అది దైవనిర్మితము కావడం వలననే.

కొన్ని కాలములలో మతాధికారులలో నున్న బలహీనత, లోపములు తిరుసభకు సహాయముగ దైవశక్తి యున్నదని, ఆ శక్తి తిరుసభను సదా కాపాడు చున్నదని మనకు మరింత స్పష్టంచేయు చున్నవి. 1400 సంవత్సరాల కాలం తిరుసభ నిలిచివున్నదనే విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి. నిజంగా యిది యెంత దీర్ఘకాలమో ఆలోచించండి.

(3) మతనియమాలను కాపాడుటకు, మత విషయాలలోని నిబంధనలను అతిక్రమించువారిని విచారించి, శిక్షించగలందులకు యేర్పడిన న్యాయస్థానము (Inquisition) తిరుసభ యొక్క కఠినమైన పద్ధతులకు ప్రత్యక్ష నిదర్శనంగా వున్నదని పేర్కొన బడుచున్నది. ఆ న్యాయస్థానం పద్ధతులు, అది వుపయోగించు సాధనాలు క్రూరంగా వుండవచ్చును. కాని యేది క్రూరము అను విషయమున మన ఈ కాలపు వారికిని ఆకాలపు వారికిని భేదముకలదు. ఇక యీ తిరుసభను నిందించేముందు ఆ న్యాయస్థానానికి ప్రజలు, రాజ్యాంగము, తిరుసభ చేయూత నిచ్చినవని జ్ఞాపకం వుంచుకోవాలి. అందుకని యీ నిందను యీ మూడు వర్గాలవారు పంచుకోవాలి.

మధ్యయుగాల ప్రజలు కతోలిక మతాన్ని ప్రేమించారు. వారికది పవిత్రమైన మతంగా వుండేది. వారికి దాని యెడల గాఢ విశ్వాసం కలదు. అలాంటిదాన్ని కూలద్రోయటానికి ప్రయత్నించిన వారిని దాన్ని విశ్వసించేవారు శిక్షిస్తారు. కనుక యీలాంటి సందర్భంలో తిరుసభలోనే యెవరైనా ఒక శత్రువు బయలుదేరి రహస్యంగా పతిత మతపుటూహాలను వ్యాపింపజేయటానికి పూను కుంటె వాన్ని చూస్తూ పోనివ్వరు. ఉదాహరణకు అల్బె జెన్సెన్ అను వారు పిశాచం దేవుడంత శక్తివంతమైనదని, ప్రపంచమంతా పిశాచ మయమని, చెడ్డ అని, దానికి కారణం ప్రపంచం అనేది పిశాచి యొక్క పని కావడమేనని, ఆత్మహత్య మంచిదని ప్రజానీకానికి నేర్పారు. కాని యిది ఆనాటి కతోలికులకు నచ్చలేదు. అందుకని యీలాంటి తప్పుడు భావాలను, అసంబద్ధపు టూహాలను, నీచాభి ప్రాయాలను ప్రజలలో వ్యాప్తిజేస్తున్న వారిని పట్టుకొని శిక్షించ టానికై ఒక కోర్టు (Inquisition) యేర్పరచబడింది. పతిత మతావలం బకులని అనుమానింపబడిన వారంతా పట్టుకోబడ్డారు. అటు తిరుసభకు, యిటు రాజ్యాంగానికి పతిత మతం అనేది నేరం. అందుకని ఆ రకమైన నేరస్తులంతా బంధీలు కావల్సి వచ్చింది. ఈ విధముగ తప్పుడు భావాలను ప్రచారము చేయువారు తమ భావాలను మార్చుకొనని పక్షమున వారిని శిక్షకై రాజ్యాంగమున కప్పగించెడివారు.

స్పెయిన్‌లో యీ మత పరీక్ష అనునది మూరులకు, జూదులకు ప్రయోగింపబడినది. వారు రాజ్యాంగమును కూలద్రోయవలయునని రహస్య ప్రయత్నములు చేయుచుండిరి. స్పానిషు కోర్టులు రాజ్యాంగ కోర్టులు కొంత వరకు తమ హద్దుల మించెను. కాని ఆ కాలపు దబ్బర సిద్ధాంతుల, రాజద్రోహుల పద్ధతులను తెలుసు కొనిన పక్షమున నీవు త్వరపడి పై కోర్టులను నిందించవు.

(4) నాల్గవ శతాబ్దంలో రోమన్ చక్రవర్తులచేత కాన్‌స్టాన్‌టి నోపుల్ నగరం రాజకీయ కేంద్రముగ చేయబడినది. ఈ విధంగా దాని కొక ప్రతిప్రత్తి, హోదా యేర్పడినవి. కాని కొన్ని శతాబ్దాలు గడిచిన తర్వాత ఆ నగరంలోని పేట్రియార్కు చుట్టు ప్రక్కల

నున్న మేత్రాణులపై అధికారమును హరించి క్రమంగా రోంనగరంతో పోటీ మొదలుపెట్టెను.

కాన్‌స్టాన్‌టి నోపుల్ చుట్టూవున్న తిరుసభ వ్యవహారాలన్నీ గ్రీకు భాషలో జరగటం వలన, రోంనగరంలోని పూజ విధానానికి, తూర్పు ప్రాంతంలో జరిగే పూజాక్రమాలకు తేడ కన్పడటం వలన ఒక రకమైన తగాదా బయలుదేరటానికి అవకాశం లభించింది. ఈ ప్రాచ్య దేశాల రాజులకు మత సంబంధమైన కార్య కలాపాల్లో చాలా పలుకుబడివుంది. అది అలా వుండగా రోంనగరం మీద విద్వేషం కూడ బుద్ధి పూర్వకంగా రెచ్చగొట్టబడింది. అప్పుడు ప్రాచ్య దేశాల తిరుసభ నాయకులు రోంనగరం నుండి విడిపోతామని బెదరించారు. తూర్పురాజులు తమకు అండగా నిలుస్తారని వారికి పూర్తి విశ్వాసమున్నది.

తత్ఫలితంగా 1054లో విడిపోవటం జరిగింది. మధ్య మధ్యలో మరల యీ విభేదాలు సరిజేసుకోబడ్డాయి. ఆఖరికి 1472లో పూర్తిగా విడిపోవటం సంభవించింది. అది యీనాటి వరకు అలాగే నిలిచి వుంది. ఈ విడిపోవుట ప్రాచ్యభేదనమందురు.

ఈ విడిపోవటం అనేది పతిత మతసంబంధమైనట్టిదిగాదు. కేవలం యిది ద్వేషంకొద్దీ తిరుసభ అధికారాన్ని యెదిరించటమే. ఈ నాటికి కూడా గ్రీకులకు చాల వరకు కతోలిక సిద్ధాంతాలున్నాయి. కాని వారి పనిలో చురుకు తనంలేదు. దానికి కారణం మత కేంద్రముతో విడిపోవటమే. కాన్‌స్టాన్‌టినోపుల్ రాజకీయ ప్రాముఖ్యతను పోగొట్టుకుంది. ఇక ప్రాచ్య తిరుసభ తన ప్రాధాన్యతను కోల్పోతుంది. కాని యీనాడు రోంతో కలియడానికి ఒక బలవత్తరమైన వుద్యమం ప్రారంభమయింది.

ఐనా 14, 15 శతాబ్దాలలో దుష్క్రియలు విరివిగా నల్దెసల వ్యాప్తమయినాయని అనుకోవద్దు. పాపుగార్లకు వ్యతిరేకంగా పాపుగార్లు బయలుదేరుచున్న కారణంగా ఆనాడు మంచి గుణానికి స్థానంలేదని అనుకోరాదు. నిజానికి ఆనాడు గొప్ప గొప్ప వ్యక్తు

లున్నారు. ఆనాటి అర్చ్యశిష్టులలో జాన్ నెపొము స్సెన్ (1340-1393) ప్రముఖులు. ఆయన పాపసంకీర్తనమునకై మరణ మొందెను. ఆసియా నోపుర అర్చ్యశిష్ట కత్తరీనమ్మ (d 1380) క్రీస్తునాథుని తత్వాన్ని యెల్లెడల వ్యాపింపజేసింది. అర్చ్యశిష్ట విన్సెంట్ ఫెర్రర్ (d 1419), అర్చ్యశిష్ట జాన్ కెఫిస్త్రాన్ (d 1456), అర్చ్యశిష్ట ఎలిజబేతమ్మ (d 1336) పోర్చుగల్ రాణి వీరు అర్చ్యశిష్టులలో ప్రముఖులు. సెవెనారోల ఇటలీలోని ఫ్లారెన్సు నగరాన్ని సంస్కరించటానికి ప్రయత్నించాడు.

సంస్కరణకై చాలా సభలు జరిగినాయి. ఒకవైపు వేద వ్యాపక కార్యక్రమాలు కొనసాగింప బడుతున్నా, అధికారులమీద అగౌరవం, సాంఘికంగా అశాంతి పెచ్చు పెరిగినాయి. కాని తిరుసభ పాలకులనేకులు అసంతృప్తిని, అలజడి తగ్గించడానికి, ఈ పరిస్థితులను సరిదిద్దటానికి యే చర్యలను తీసుకోలేదు. అప్పటితో పరిస్థితులు విషమించాయి. రాజులు అధికారాన్ని బలత్కారముగ స్వీకరించి తిరుసభకు వ్యతిరేకంగా తీవ్ర ప్రచారాన్ని, అసంతృప్తిని బయల్దేరదీశారు. పైగా మతముతాలూకూ ఆస్తి పాస్తుల నన్నిటిని వశపరుచుకొన్నారు.

**విప్లవ ప్రారంభం** జర్మనీలో 16 వ శతాబ్దంలో లూథర్ నామము గల ఒక అగుస్తీను సన్యాసి వుండె. ఇతను చాలా తల తిక్కమనిషి, చపల చిత్తుడు. ఒక రోజు చాలా సంతోషంగా కనిపిస్తాడు! మరుసటి రోజు విచారంతో వుంటాడు. తన ఆత్మ నరకం పాలైనట్లు భావించి విచారపడుతుండే వాడు. తన అభిప్రాయాలను యెక్కువగా ప్రేమించాడు. అమితగర్వం కలవాడు గాన అనేక బాధలు పడేవాడు. అతనొకసారి యీలా అన్నాడు "హద్దు పద్దులేని అహంభావం నన్నెంత బాధపెట్టింది! ఇంకెంతగా నన్ను హింస పెట్టును?"

లూథర్ పెద్ద రచయిత, పెద్ద వక్త. బైబుల్ విశేషంగా చదివే వాడు. దాన్ని బాగా అవగాహన చేసుకొన్న మీదట 1517 లో తిరుసభ బోధలకు వ్యతిరేకంగా తన స్వంత అభిప్రాయాలను సమీకరించ ప్రారంభించాడు. తన్నెదిరించే వారిని దూషించేవాడు. మనం అతన్ని

ఖండిస్తున్నామంటే అతను సంస్కరణావశ్యకతను గుర్తించాడనిగాదు, (సంస్కరణ కావాలని మనకు తెలుసు) కాని క్రీస్తునాధుడు చెప్పిన వాటిని బుద్ధి పూర్వకంగా మార్చాడని. అతడు తిరుసభకు గల అధికారాన్ని కాదన్నాడు. పూజబలి, పాపసంకీర్తనం, అర్చ్యశిష్టులను వేడుకోవడం, సత్క్రియ లావశ్యకత, స్వేచ్ఛాచిత్తం—వీటిని అతను కాదన్నాడు. అనగా వీటిని అంగీకరించ లేదని అర్థం. "మానవులు మతంచేత పరివర్తనం చెందవలయుగాని మనుష్యులచేత మతం మార్చబడరాదు" అన్న విషయా న్నతడు మరిచి పోయాడు.

క్రీస్తునాధుని గూర్చి నిర్వచించే సందర్భంలో తనే ఆ విషయంలో సమర్థుడనని ప్రత్యేకించు కొన్నందులకు చరిత్ర లూథర్‌ను దూషించింది. ఈలూథరునకు పూర్వమే తిరుసభ వున్నది. ఇంకా వుంటుంది. దాని సిద్ధాంతాలు కూడ వెనుకటి మాదిరే వుంటున్నవి. ఉంటాయి. దానికి సరియైన పద్ధతులు లేకపోయినట్లతే దేవుడు దాన్ని ఆశీర్వదించేవారు గాదు. దేవుని దగ్గరనుండి వచ్చిన వ్యక్తినని చెప్పుకొనే వ్యక్తి వద్ద మనము ఆశించే లక్షణాలు, అంశాలు లూథరు వద్ద లేవు. క్రీస్తునాధుడు అంతగా ప్రార్థించిన ఐక్యతనుపాడుచేయుట కంటె, నాశనం చేయటంకంటె, అతను తిరుసభ పాలకులుగా మంచివారుండునట్లు యెందుకు ప్రయత్నించలేదు?

**విప్లవం ఎందుకు వ్యాపించింది** లూథరు ప్రారంభించిన విప్లవాన్ని 16 శతాబ్ది మధ్యలో కాల్విన్, ఇంగ్లండు రాజైన 8వ హెన్రీ గారలు కొనసాగించారు. త్వరలోనే ఇంగ్లండు, స్కాట్లండు, జర్మనీలో చాలా భాగం, హాలెండు, స్విట్జర్లండు, హంగేరీ, పోలెండు దేశాలలో కొన్ని భాగాలు ప్రొటెస్టంటు ప్రాబల్యం క్రిందకి వచ్చాయి. ఇంత త్వరలో ప్రొటెస్టంటు మతం వ్యాప్తి కావటానికి యెక్కువగా ఆర్థిక కారణాలే కనిపిస్తున్నాయి.

1) అశాపరులైన రాజులు పాపుగారి అధికారాన్ని హస్తగతం చేసుకోవాలని చూశారు.

2) ధనవంతమైన మఠాలను, తిరుసభ భూములను తిరుసభ అలంకారాలను నవరాకుమారులు, అధిపతులు ఈర్ష్యాసూయలతో చూశారు.

(3) సంస్కరణ వాదులు బయలుదేర దీసిన సిద్ధాంతాలు రెండు విధాల ప్రజల నాకర్షించాయి. (I) అవి క్రొత్తవి. క్రొత్తవి యెల్లప్పుడు ఆకర్షిస్తాయి (II) నైతికంగా యెక్కువ స్వేచ్ఛ ప్రసాదింప బడింది. నైతిక విలువలు యెప్పుడైతే సడలింప బడినాయో అప్పుడే ప్రజలు ప్రొటెస్టాంటు మతం వైపుకు తిరిగారు. విశ్వాసమే రక్షణము నకు చాలు. దాని వలన మానవుడు నీతిమంతుడౌతాడు. మానవునికి స్వేచ్ఛ లేదను సిద్ధాంతాన్ని కల్పించాడు లూథర్. ఈ రెండు బల హీనులైన మానవులకు యిష్టం వచ్చినట్లు ప్రవర్తించటానికి అవకాశ మిచ్చాయి.

(4) క్రీస్తునాధుని రక్తముగా మార్చబడిన ద్రాక్షారసం పానం చేయుట, మతవిషయకమైన కార్యాల్లో దేశీయ భాషలను వాడుట— యివి చాలామందిని ఆకర్షించాయి.

(5) మధ్య యుగాలలో, అప్పుయిచ్చిన పైకంమీద వడ్డీ తీసు కొన కూడదని తిరుసభ చెప్పింది. కాని కాల్విన్ అధిక వడ్డీని దీసుకో వచ్చునని చెప్పాడు. ఈలా చెప్పటం యెక్కువమందిని ఆకర్షించాయి.

(6) పాపుగారి ఆస్థానమున కొన్ని దురాచారాలు వున్నందున విదేశ ప్రభుత్వాలనకు యేలాటి రాజభక్తి చూపకూడదన్న విషయము ప్రజలకు నచ్చింది.

**ఫలితాలు** మత విషయకంగా వున్న ఐక్యత యీ పైవిధమున జరి గిన విప్లవ ఫలితంగా ఛిన్నా భిన్న మయింది. దాని స్థాన ములో నిరంకుశ సివిలు అధికారం బయలుదేరింది. అంతర్యుద్ధాలు బయలుదేరాయి. అవి కొన్ని దశాబ్దాలపాటు వున్నాయి. ఈ యుద్ధా లమూలమున ప్రజలు కొంత కాలముపాటు విపరీతంగా లూథరుల పాలయ్యారు. కళాఖండాల సంపదలు, విలువగలిగిన వ్రాత ప్రతులు

సర్వనాశన మైనాయి. అశాంతి, అరాచకత్వాలు, ప్రబలినాయి. అందాకా యెందుకు? ఒకే కుటుంభములో వ్యక్తులమధ్య విద్వేష బీజాలు నాటబడినాయి. నాలుగు శతాబ్దాలు గడచిపోయి నప్పటికీ యింకను చాలామంది పాపుగార్లను గురించి, గురువులను గురించి, తిరుసభ విధానాలను గురించి చేయబడిన నిందారోపణలను విశ్వసిస్తున్నారు. ఈ తిరుగుబాటు వలన కల్గిన విపత్తుకు విజ్ఞానవంతులైన నాయకులకే సంతాపం కల్గింది. మెలంకోటక్ యీ విధంగా చెప్పాడు. "ఈ తిరుగుబాటువలన యేర్పడిన దౌర్భాగ్యాన్ని గూర్చి విలపించుటకు ఎల్బ్నదీ జలమంతయు చాలదు" (లేఖలు-4 వ పుస్తకం; 100 వ లేఖ)

ఈ విప్లవం జరిగినానంతరం బైబుల్‌ను యెక్కువగా చదవటం జరిగింది. అసలిలా జరగటానికి ప్రధానకారణం అచ్చుపడట మనేది అమలుకు రావటమే.

కాని యీ విప్లవంవలన కలిగిన ఫలితాలనుగూర్చి, లాభాలను గూర్చి తమ అభిప్రాయాలను మార్చుకోటానికి నేటి విఖ్యాత విద్వాంసులు కొందరు ప్రయత్నిస్తున్నారు. కొన్ని శతాబ్దాల పర్యంతం చాలా మంది చరిత్రకారులు కతోలిక దృక్పథాన్ని, వారు చెప్పే మాటల్ని వినటానికే అంగీకరించలేదు. "అది ఒకే వర్గంవారి దృక్పథం. క్రొత్త యుగాల్ని సృష్టించిన మానవుడు (యుగపురుషుడు) వికాశాన్ని కలిగించిన దిట్ట, అధునాతన దృక్పథాన్ని సృష్టించిన సృష్టికర్తయైన లూథరును స్తుతించటానికి ఆ వర్గంవారు బుద్ధిపూర్వకంగానే వున్న సత్యాలను గమనించలేదు. యథా తథంగావున్న వాటిని గుర్తించ లేదు."

**ఆచరణ** (1) కార్డినల్ న్యూమన్‌గారు ఒకపుడు కతోలికేతరులు. కాని చరిత్ర పఠనానంతరం కతోలిక వాదమే సత్యమయి వదని ఆయనకు తోచింది. అప్పుడు ఆయన తిరుసభలో ప్రవేశించాడు. "క్రైస్తవ సిద్ధాంతాభివృద్ధి" అనే గ్రంథాన్నికూడ వ్రాశారు. అందులో వారు "చరిత్రను బాగా చదివితే ప్రొటెస్టంటుగా వుండటం జరుగదు." అని అన్నారు. సరియైన చరిత్రను అందివ్వటానికి నీవేలా సహాయపడతావు?

(2) ఈ నాడు చాలామంది సద్భావంతోనే లూథర్‌ను విశ్వసిస్తున్నారు. వారు ఆలాంటి దృక్పథాన్ని అవలంబించటానికి, అట్టి స్థితికి రావటానికి యేలాజరిగిందో నీవు చెప్పగలవా? వారి నిష్కపటత్వం వారిని సరియైన మార్గములో పెట్టునా?

(3) కాస్టిల్ వాసియైన ఇసబెల్లా రాణి జీవితాన్ని చదువు.

(4) నీ మతాను సరణనుండి నిన్ను యెవరైనా విడదీయ చూస్తుంటే దానికి తలఒగ్గుతావా?

---

# పందొమ్మిదవ అధ్యాయము

## తిరిగి బలాన్ని చేకూర్చుకొనుట

**అవినీతి సవరణ** క్రీస్తునాథుడు యీలా అన్నారు: "మానవులముందు మీ కాంతిని, మీ వెలుగును ప్రకాశింప జేయండి. మీ మంచి పనులనుజూచి పరలోకములోవున్న మీ తండ్రిని స్తుతించుదురు." కాని యీ మాటలవలన యెక్కువ సార్థకత లేకపోయింది. 15 వ శతాబ్దములో చాలామంది నాయకులు యీ వెలుగును, యీ కాంతిని ప్రసరింప జేయలేదు. చేసినా కొద్దిగా మాత్రమే చేశారు. తత్ఫలితంగా యెక్కువమంది దృష్టి దేవునివైపు మరల్చబడలేదు. ఉత్సాహవంతులైన నాయకులు, అర్చ్యశిష్టులు సంస్కరణ కోసం ఆరాటపడ్డారు. కాని లాభం లేకపోయింది. జరుగవలసినంతపని జరుగ లేదు అప్పుడు పరిశుద్ధపాపుగారైన 3 వ పాల్ (1534-1549) గారు తగిన విధంగా పనిచేయసాగారు. పదవుల్లో సరియైనవారిని పెట్టారు.

1545 లో ట్రెంట్ కౌన్సిల్ సమావేశం జరిగింది. ఇది చరిత్ర ప్రసిద్ధమైన సమావేశము. ఈ సమావేశంలోనే జ్ఞానఫలముల విషయమై జరుగుచున్న లౌకిక దృష్టిగల దురాచారాలు తీసివేయబడినవి. తిరుసభ అధికారులు పదవులనుండి తీసివేయబడ్డారు. సెమినరీలు స్థాపించ బడ్డాయి. అవినీతిచర్యలు సవరింప బడినాయి. మానవమాత్రునికి క్రీస్తునాథుని సిద్ధాంతాలను మార్చే హక్కు లేదని యీ సమావేశం ఖచ్చితంగా చెప్పేసింది. ఇక సంస్కరణ అంటే విశ్వాసాన్ని మార్చడం కాదని, విశ్వాసులను మంచివారలుగ చేయటమని తెలిపోయింది. నిజానికి మంచివాళ్ళు, వుత్తములు యెల్లపుడూ వుండనే వున్నారు. కాని వారికి పదవులు లేవు. అందువలన వారి ప్రభావం, వారి పలుకుబడి జనుల కందుబాటులో లేవు. కాని, వారికి తగిన అవకాశం వచ్చినపుడు పరిస్థితులు చక్కబడినాయి.

**ఆధ్యాత్మిక విషయాల వైపుదృష్టి** "మీరు పరలోక రాజ్యమును అన్వేషించుడు." మాతృక ద్వారా, ప్రయత్నము ద్వారా దేవుని వాక్యాన్ని వ్యాప్తి చేయటం తిరుసభ పాలకుల గురుతర బాధ్యత, విధీను. ఇదే 3 వ పాల్ పాపుగారు

చేసింది, వారి తర్వాత వచ్చిన ధృఢ చిత్తులైన పాపుగార్లు చేసిందీను. గొప్ప గొప్ప మేత్రాణులు, ఉత్సాహ వంతులైన మతనాయకులు, గురువులు పవుగారికి వారి కార్యక్రమాల్లో సహకరించారు. అర్చ్యశిష్టులు చార్లెస్ బొర్రోమియో, ఫిలిప్ నీరై, విన్సెంట్ డిపాల్, ఫ్రాన్సిస్ డిసేల్సు గారలు క్రీస్తునాధుని బోధను గూర్చి సరియైన నిర్వచనం చేసిన వారిలో ప్రముఖులు. వారి ప్రభావం యీ నాటి వరకు కన్పిస్తూనే వుంది. వారిలాగే అర్చ్యశిష్ట తెరేజమ్మ (1515-1582) ప్రపంచానికి చేసిన మంచి, శతాబ్దాల తరబడి నిలిచివున్నది. అలాగే జేసుసభకు చెందిన అర్చ్యశిష్ట పీటరు కనీసియస్ జర్మనుభాషమాట్లాడే ప్రాంతాలన్నిటిలో చాలా కృషిచేశాడు. ఆయనకు అర్చ్యశిష్ట పట్టం గట్టు సందర్భంలో వారి గొప్ప కార్యములు వెల్లడియైనవి.

చరిత్రలో బాగా చెప్పుకోదగిన వాళ్ళు జేసుసభకు చెందిన వాళ్ళే. వీళ్ళు సంభ్రమాశ్చర్యాలు కలిగేటట్లు పనిచేశారు. వీరి సభ (జేసుసభ) 1534 లో స్థాపించబడ్డది. 1707 కల్లా ఈ సభ అధ్వర్యాన 777 కళాశాలలు పనిచేయ నారంభించినాయి. ఒకసారి ఈ కళాశాలలో చదివిన అత్యధికులైన విద్యార్థుల సంఖ్య 2, 10, 000. వీరి వలన క్రైస్తవ మతానికి జరిగిన సేవ అపారము, అనన్య సామాన్యమూను. వీరు 16, 17 శతాబ్దాలలో చేసిన కృషిని గూర్చి ఒక్కసారి ఆలోచించు. వీరిని గూర్చే ప్రొటెస్టాంటు చరిత్ర కారుడైన రాంక్ అను నతడు ఈ విధంగా వ్రాశాడు: "సైన్యంతో అంతులేని ఉత్సాహం, పఠనంతో వక్తృత్వం, పరిపూర్ణత్వంతో త్యాగం, ప్రపంచ వ్యాప్తమైన ప్రచారంతో యేకైక ఉద్దేశం, వీటి యేకీకరణ యిప్పుడున్నట్లు యెన్నడూ లేదు. ఇంక ఆలాంటి దెప్పుడు వుండబోదు కూడ."

ఈ విధంగా చూచుకుంటే ఈ ఆధ్యాత్మికోత్తేజానికి ప్రబల కారణం మరల ఆధ్యాత్మిక అవసరాల నిమిత్తం తగిన శ్రమ, శ్రద్ధ తీసుకోబడటమే అనాలి. అందుకనే యెక్కువ విజయాలు గలిగాయి. పైగా నాయకులు కూడ తాము చెప్పిన దానిని ఆచరణలో పెట్టి చూపించారు. మరొకప్రక్క స్వార్థ పీడితులైన రాజులు పాపుగార్లను హింసించవచ్చు. కాని ప్రజలకు వారి ఆధ్యాత్మిక నాయకులమీద

వున్న విశ్వాసాన్ని సడలించలేక పోయారు. వారు దేవుని సామ్రాజ్యాన్ని ఆశించిన వారు కనుక యెన్ని కష్టాలకైనా తలొగ్గారు. ఐరిష్ వారిని ఆంగ్లేయులు యెన్ని బాధలు పెట్టినా శతాబ్దాల తరబడి తమ విశ్వాసాన్ని ఏడలేదు. ప్రాపంచిక సుఖాల దృష్ట్యా వారు తమ విశ్వాసాన్ని అమ్ముకోదలుచు కోలేదు. వీరి మాదిరే ఫ్రెంచి విప్లవం (1789) వచ్చి నానా గల్లంతు చేసినా ఫ్రెంచివారు అదరకుండా బెదరకుండా నిలిచి వున్నారు. ఆస్ట్రియనులను రెండవ జోసఫ్ నానా అవస్థల పాలుజేశారు. ఏం చేసినా వారేమీ చలించలేదు. ఇక జర్మను దేశీయులూ అంతే. ఈ విధంగా అన్ని దేశాలవారు సత్యవేదానికి ఒక ప్రక్క బద్ధులై యుంటూ మరొక ప్రక్క అధిపతుల దౌర్జన్య దౌష్ట్యాలకు తలొగ్గివున్నారు.

ఈ మత విశ్వాసాన్ని కాపాడుకోవడం ఫ్రాన్సులో అధ్యధికంగా కనబడుతుంది. ఫ్రెంచి విప్లవం ఫ్రాన్సులో అవిశ్వాసానికి బీజాలు నాటింది. మతము అంటే హేళన చేసింది దేవునియందు, తిరుసభయందు, తిరుసభ నాయకులయందు గల విశ్వాసాన్ని, నమ్మకాన్ని సడలించటానికి రూపుమాపడానికి సర్వవిధాలా ప్రయత్నం చేసింది. ఇప్పటికీ ఆ ప్రయత్నాన్ని కొనసాగిస్తూనే వున్నారు.

## వేదవ్యాపక కార్యక్రమం

ప్రొటెస్టంటు విప్లవానంతరం యూరపులో రోజులు నిరాశాపూరితంగా యున్నాయని గాని, లౌకిక రాజుల ధారుణ దండయాత్రలు పాపుగార్లను నిరసంగా చేశాయనిగాని నీవు అనుకున్నట్లయితే అది సరిఅయినది గాదు. ఆ కష్టకాలంలోనే ఆ విపత్కర పరిస్థితులలోనే ప్రపంచ నలుమూలలకు పాపుగారి ఆజ్ఞలను శిరసావహించి వేదవ్యాపకులు ప్రచారం నిమిత్తం వెళ్లారు. ఫ్రాంసిస్ సభవారు, దోమినిక్ సభవారు, అగుస్తీను సభవారు, జేసు సభవారు యింక యితరులు దేశాన్వేషకుల వెంబడి వెళ్లారు. ఈ దేశాన్వేషకులు యెచ్చటెచ్చటికి వెళ్లారో అచ్చటికివెళ్ళి నాగరికతను, విశ్వాసాన్ని వ్యాప్తము చేశారు. యూరపులో ఒకవైపు తిరుసభ వ్యతిరేకులు దానికంతరాయాలను కల్గిస్తున్నా, వేదవ్యాప

లైన మిషనరీలు, గురువులు అచంచల భేత్యోబద్ధులై యితర దేశా లలో అనేక మందిని తిరుసభలో జేర్చారు.

ఇటు భారత దేశంలో కూడ 1534లో, అటు ఫిలిప్పీయిను దీవులలో 1577లో వేదవ్యాపక ప్రచారమారంభమయింది.

1548లో జపానులో సెంట్ ఫ్రాన్సిస్ జేవియర్ అనేక మందికి జ్ఞానస్నానాన్ని యిచ్చారు. అదే సంవత్సరములో జేసుసభ గురువులు బ్రెజిల్ దేశము వెళ్ళి, అక్కడ వేదవ్యాపక కార్య క్రమాన్ని కొనసాగించారు. కొద్ది కాలంలోనే దక్షిణ అమెరికా అంతా కతోలికమయమయింది మెక్సికో దేశం అంతా కతోలికులతో నిండిపోయింది. ఆ దేశీయులు త్వరలో విద్యను నేర్చుకొనగా వారి కొఱకు వివిధ దేశీయ భాషలలో జ్ఞానోపదేశము తర్జుమా చేయ బడింది. అమెరికాలోని మొదటి విద్యాలయాలు ఫ్రాన్సిస్కన్ ఘనుల చేత స్థాపించబడినవే. వీరు ఫ్లారిడా, నూతన మెక్సికోలలో నుండేవారు. అమెరికాలో తూర్పున వున్న 13 కాలనీలలో 1633లో మొదటి విద్యాలయములు స్థాపించబడెను. కాని అంతకు నాలుగేండ్ల పూర్వమే క్రొత్త మెక్సికోలో దేశీయులకు విద్యాలయములు స్థాపించబడెను.

16, 17 శతాబ్దాలలో యీ విధంగా వుంటూ వచ్చింది. ఈ వీరోచితాత్మక మిషనరీలు దేవుని రాజ్యాన్ని విస్తరింపచేయుటకు నలుదిశల వెళ్ళారు. ఇంగ్లండులో ఒక వైపు మత మూఢులు కొందరు బయలుదేరి పూజాపీఠాలను నాశనము చేయసాగారు. మరొక ప్రక్క మిషనరీలు అనాగరిక ప్రాంతాలలో బ్రహ్మాండమైన సత్యవేద వ్యాప్తి జేయుచుండిరి.

మిషనరీలు కేవలం అటవీ ప్రాంతాలలోనే పని పాటలు సాగించారని అనుకోనవసరం లేదు. యూరపులోని మఠములలో ప్రేషితులకు (మిషనరీలకు) దైవశక్తి ప్రసాదింపబడునట్లు ప్రార్థించుచుండిరి. అర్చ్యశిష్ట ఫ్రాన్సిస్ జేవియర్ చేసిన మతాంతరీకరణాలు, అర్చ్యశిష్ట తెరెజమ్మగారు తమ జపము ద్వారా చేసిన మతాంతరీకరణాలు రెండూ సమానాలని చెప్పబడింది.

ఇంక అమెరికాలో వేద ప్రచారకులు చేసిన కార్యకలాపాలను గూర్చి తెలుసుకుందాం. అమెరికాలో వివిధ మేత్రానన గురువులు నిర్వహించిన కార్యకలాపాలను గురించి చరిత్ర తగిన విధంగా యింకా స్తుతించవలసియున్నది. పలు ప్రాంతాలలో చెల్లాచెదరై వున్న విశ్వాసులను సమైక్య పరచరి. వారు గొప్ప నిర్మాతలు. వారిని గురించి వారు చేసిన విధానాలలో మేత్రానవాళ్లో తప్ప బైటివారికి తెలియదు. బైట ప్రపంచానికి తెలియనివారి వలననే తిరుసభ అభివృద్ధి అయింది. ఈనాటి వారికి తెలిసిన శ్రద్ధాత మేత్రానులు, అతిమేత్రానులు, కార్డినలులు వెలసిరి. ఎప్పటికైనా గొప్పగానుండి మహత్తరసేవ చేసిన వారు అనంతరం లోకాలాభ్యులౌతారు.

ప్రేమ పూరిత హృదయులైన ఐవరుస్ మేత్రానులు వంగని జోస్టను వ్యాపారిటనులను లోంగదీసుకొనెను ఇంగ్లండు అను పేరుగల మేత్రానులు అట్టలు పోయిన బూట్లు వేసుకొని తిరుగుచున్నను వారిని కాంగ్రెసు తమ ముందుర మాట్లాడుటకు ఆహ్వానించింది. కతోలిక బదుల హక్కులకు పోరాడిన వారును, 9వ భక్తినాథుల పాపుగారికి సహాయముగ యెప్పుడు నిలుచున్న హ్యూ అతి మేత్రానులు ప్రేంచివారు అంతర్యుద్ధ సమయ లో అమెరికాలో వున్న కాన్ఫెడరసీ (సమైక్యతను) గుర్తించకుండ యుండునట్లు చేసెను. కార్డినల్ గిబ్బన్స్ అమెరికా తొలి పౌరుడని అన్ని మతముల వారు, తరగతులవారు గుర్తించారు.

## ఫలితాలు

ప్రొటెస్టంటు విప్లవం అయినాక అనేకమంది అనేక సార్లు తిరుసభ పతనమవుతుందనిచెప్పారు. రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచినకొలది తిరుసభ గట్టిపడసాగింది. వారనుకున్నట్లు పతనావస్థకు రాలేదు. నేటి అవిశ్వాస ప్రపంచంలో దాని శక్తి గమనించు. ట్రెంట్ కౌన్సిలు సమావేశానంతరం దాని ఆధ్వర్యం క్రింద జరిగిన బ్రహ్మాండమైన వేద వ్యాపకోద్యమాన్ని గమనించు. ఎందరు సత్యవేదాన్ని స్వీకరించారు. నిజంగా యెంతపనిజరిగింది!! ఎందరు ఆధ్యాత్మిక, నైతిక వున్నతకు తీసుకరాబడ్డారు!!! ఈ సందర్భంలోనే ఒకసారి మెకాలె యీలా అన్నాడు. "పాత ప్రపంచంలో

పోగొట్టుకొన్నదానికన్నా క్రొత్త ప్రపంచంలో [illegible] ఆ నష్టానికి యీ లాభం సరిపోయింది." అన్ని కాలాల్లో [illegible] రాజకీయ విప్లవాలకి [illegible]

**ఆచరణ** (1) [illegible] తిరుసభను. ఈ పని నెలా నిర్వహించిందో చూడు. అందులో చాలా క్లిష్ట పరిస్థితుల్లో కష్టకాలాల్లో [illegible] నిర్వహించిందో గమనించుము.

(2) ద్వేషంచేత చాలమంది తిరుసభ వద్దకు వెళ్ళటానికి భయపడ్డారు. వారిని సరియయిన దారిలోకి తీసుకరావటానికి నీవేంచేయ గలవు?

(3) తిరుసభ ప్రవాసము చరిత్ర యెంతగానున్నదో తెలిసికొనటానికి, తిరుసభ యెన్ని కష్టాలు అనుభవించినా అంత్యాన యేవిధంగా విజయాన్ని పొందేది తెలిసికోడానికి పట్రోబియాన్ (1788-1848) "జెనిసిస్ ఆఫ్ క్రిష్టియానిటీ" అనే పుస్తకాన్ని, న్యూమన్ గారి "ది సెకండ్ స్ప్రింగ్"ను చదువు.

(4) మనం చేసిన ప్రతిపాపానికి యేదో ఒక పరిహారముండాలి. ఆ వ్యక్తి శిక్షకు లోనుగావాలి. దేవునికి పరిహారము చెల్లించుటకు వ్యక్తిగతంగా మనం పాపములకు కొంత పరిహారము పొందగల శక్తి వంతులునుగా చేయటానికి క్రీస్తు నాథుడు వచ్చారు. ఆయన దేవునికి పాప పరిహారము చేయుటయేగాక పాపం వలన వచ్చే శిక్షను కూడా తీసివేయుటకు అనంత ఫలములను పొందారు. వారి పాటుల ఫలితము లను మనకు వర్తింప జేయటానికి క్రీస్తునాథుని దగ్గరనుండి తిరుసభ అధికారమును పొందియున్నది. ఆ అధికారాన్ని బట్టి తిరుసభ జ్ఞానఫలితములను అనుగ్రహిస్తుంది. ఆ ఫలం పాపాన్ని పోగొట్టలేదు. కాని పాపం చేసినందువలన వచ్చే అశాశ్వతమైన శిక్షను క్షమిస్తుంది. అంతెగాక పాపనేరము తొలగింపబడువరకు ఫలము అనేది పొందబడ జాలదు. క్రీస్తునాథుని అనంతపాటుల ఫలితములతో మరియమ్మగారి యొక్క, అర్చ్యశిష్టుల యొక్క ఫలితములు బొక్కసములో నింప

బడినవి. తిరుసభ ఫలములిచ్చేటప్పుడు యీ బొక్కసము నుండి వాటిని తీసుకుంటుంది. ఒక పుణ్యాత్ముని 300 రోజుల తపస్సు వలన యెంత శిక్ష తగ్గింపబడునో, 300 రోజుల ఫలము యివ్వబడిన అంత శిక్ష తగ్గుతుంది. ఇన్సూరెన్సు కంపెనీ వారు యేవిధముగ ఇతర సభ్యులు కట్టిన ప్రీమియమును అవసరమున్న సభ్యులకిచ్చెదరో అదే విధముగ తిరుసభ కూడ అవసరమున్న సభ్యులకు వారు కొన్ని నియమములు నెరవేర్చిన యితరుల ఫలితమును యిచ్చును.

---

# ఇరువదియవ అధ్యాయము

## తిరుసభ ప్రపంచవ్యాప్తము

19 శతాబ్దాల కాలము అంటే యెంతో ఆలోచించుకో. అనేక అవాంతరాలను, అనేక కష్టాలను తిరుసభ యెదుర్కొన్నది. కొన్ని పర్యాయములు అపజయమును గూడ పొందింది. కాని యింత యెదుర్కొన్నా, యిన్ని బాధలుపడ్డా, యీనాటికీ నిత్యనూతనంగా, నిత్య యవ్వనంతో తిరుసభ ప్రకాశిస్తూనేవుంది తిరుసభ నిరంతరం సజీవమైనదే. అంతేగాక నాగరికత గల మనిషి అడుగుపెట్టినచోటల్లా తన పాదాన్ని నిలిపింది. తన తేజఃపుంజాలను ప్రసరింపజేసింది ఒక దేశంలో అడుగు బెట్టడములో అది ఆగలేదు. ఒక జాతిని వికాసవంతం చేయటంలో అది తృప్తిపడలేదు. ప్రపంచమంతా వ్యాపించింది.

## 1953 సం॥ లెక్కల ప్రకారము కొన్ని దేశములలోని కతోలికు సంఖ్యా బలము క్రింద ఇవ్వబడినది.

| | జనాభా | కతోలికులు |
|---|---|---|
| ఆస్ట్రేలియా | 81,85 539 | 14,29.216 |
| ఆస్ట్రియా | 68,65,980 | 60,98,050 |
| బెల్జియము | 86,19 478 | 85,16,044 |
| బ్రెజిల్ | 500 00,000 | 475,00 000 |
| బర్మా | 160,64,443 | 1,42,983 |
| కెనడా | 140,09,429 | 62,60,327 |
| సిలోన్ | 65,04,561 | 5 51,004 |
| చైనా | 45,13,02,000 | 32,74,740 |
| జెకోస్లవేకియా | 124,09,000 | 93,00,000 |
| ఇంగ్లండు | 407,19 942 | 27,17,345 |
| ఫ్రాన్సు | 418,00 000 | 353,62 800 |
| జర్మనీ | 724,62 995 | 268 29,306 |
| హంగరీ | 93,16,612 | 61,22 583 |

| | జనాభా | కతోలికులు |
|---|---|---|
| ఇండియా | 36 00 00,000 | 43,50,000 |
| ఇండోనేషియా | 708,61,015 | 8,21,607 |
| ఇజ్రాయేలు | 150 00,000 | 12 873 |
| ఇరాక్ | 50,00,000 | 1 35'000 |
| ఇటలీ | 461,23,000 | 462,37 308 |
| జపాన్ | 845,45,187 | 171.785 |
| కొరియా | 258 87,000 | 169,440 |
| మలయా | 62,42,002 | 95,624 |
| మాల్టా | 311,950 | 309,950 |
| మెక్సికో | 255 81,250 | 240,56,376 |
| హాలండు | 101 25,000 | 40,47,765 |
| న్యూజిలాండు | 18,56,447 | 212,975 |
| నార్వే | 31,56,950 | 4,905 |
| పాకిస్థాన్ | 852,89,703 | 2,42 905 |
| పోలండు | 249,76,926 | 212,30,387 |
| | (1950) | |
| స్పెయిను | 86,23,880 | 285,69,576 |
| రష్యా | 19,32,00,000 | 80,00 000 |
| స్వీడను | 70,46,920 | 18,000 |
| స్విట్జరులాండు | 47,00,297 | 19,77,121 |
| అమెరికా | 15,06,97,261 | 204,25,015 |
| | (1950) | |
| యుగోస్లావియా | 157,72 098 | 54,33. 488 |

## ప్రపంచములోని మొత్తము

| | |
|---|---|
| కతోలికులు | 45,86,69 000 |
| ప్రొటెస్టాంటులు | 19,65,03,520 |

| | |
|---|---|
| సిస్మాటికులు | 12,12,80,414 |
| జూదులు | 1,15,32,500 |
| మహమ్మదీయులు | 31,56,99,603 |
| హిందువులు షుమారు | 30,00,00,000 |
| ఇతరులు | 99,02,12,744 |

కతోలికులందరు తమ మతమును పూర్ణముగ అనుసరించుచున్నారని మేము అనుటలేదు. కాని ప్రతి కతోలికుడు తన విశ్వాసాన్ని గురించి గౌరవము కలిగి ఉంటాడు. కొందఱు జారిపోతారు చాలమంది తిరిగి వస్తారు చాలమంది ప్రతి సంవత్సరము క్రైస్తవులు అగుచున్నారు. పై సంఖ్యలు కతోలికుల వ్యాప్తిని చూపును.

## తిరుసభ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు

మిగత విషయాల్లో గూడా తిరుసభ అంతర్జాతీయము. ఇది పెట్టుబడి దారుల చేతి క్రింద నడుపబడుట లేదు. ఏ రాజులవలన పరిపాలింపబడటంలేదు. ఏ శాసన సభ్యుల వలన చూడబడటంలేదు. అంతేగాక యే ఒక జాతికీ పరిమితమైనట్టిదిగాదు. ఏ ఒకే ఒక భావనాజగత్తుకు కట్టుబడినదిగాదు. దాని మీద యే దేశ ప్రభుత్వానికి హక్కుగాని, అధికారంగాని లేదు. అందుకే దీని దృష్టి అంతర్జాతీయమైనట్టిదని, వివిధ జాతులకు చెందినదని అనవలసివస్తుంది దీని మీద కొన్ని ప్రభుత్వాలు పెత్తనం చేయాలని ప్రయత్నించినాయి కొన్నిమాత్రం కొన్ని విషయాల్లో విజయం సాధించినాయి. కాని అది తాత్కాలికం. అయితే యీనాడు తిరుసభకున్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ప్రపంచ చరిత్రలో యింతవరకెన్నడూ యెరుగనట్టివి. అది మాత్రం వాస్తవం. వెనుక ఫ్రాన్సు జర్మని, ఇంగ్లండు దేశాలు తిరుసభను తమ ఆధీనం క్రింద వుంచుకోవాలని చూశాయి. కాని క్రీస్తునాధుని తిరుసభ యేజాతికీ చెందినదిగాదు. ఆమె జాతికి అతీతురాలు. ఎందువలనంటె ఆమె ప్రపంచమానవులందరి ఆత్మలను వుద్ధరించాలి కనుక. పదియవ భక్తినాధ పాపుగారు చెప్పినట్లు ఆమె జాతికతీతమైనట్టిది.

**ఆమె ఐక్యత** కతోలిక సభలో వెయ్యికిమించి మేత్రాసనాలున్నాయి. ప్రతి విచారణ ఒక మేత్రాసనానికి ప్రతి మేత్రాసనం రోం నగరమునకు అనుబంధితమై వున్నది. ఈ విధంగా కతోలిక తిరుసభ అంతా తమ మందను మేపటానికి క్రీస్తునాథునిచే ప్రత్యేకించబడిన యేకైక ఆధ్యాత్మిక నాయకునితో సంబంధ బాంధవ్యాలు కల్గివున్నది. సత్య సుగుణాలనుండి మానవులను తొలగద్రోయటానికి చాలదుష్ట శక్తులు పని జేస్తుంటాయని మనకు తెలుసు. అలాంటి సందర్భంలో తిరుసభ ప్రపంచం మొత్తంమీద ప్రతి వ్యక్తికి తన్నుగూర్చి తన భవిష్యద్గతినిగూర్చి సత్యాన్ని యదార్థంగా తెలియజేయటము ఆశ్చర్యజనకంగదూ !

ఒకే దేవ ద్రవ్యానుమానము ఒకే విధంగా అటు ఆఫ్రికాలో చనిపోతున్న నీగ్రోకు యిటు రోం లోని కార్డినల్ గారికి యివ్వబడతాయి. ఎక్కువతక్కువ లేమీలేవు. ఇటు యిండియా బిడ్డకు అటు అమెరికా పాపకు ఒకే జ్ఞానస్నానమివ్వబడుతుంది. వారువేరు వీరువేరుగాదు. కనుక యీవిధమైన యేకీభావం ప్రపంచంలో యెక్కడా కన్పించదు. ఉదాహరణకు సిలోనులోవున్న బౌద్ధమతానికి జపానులో వున్న బౌద్ధమతానికి తేడావున్నది. ఇక పూజబలి విషయం. నీవు చికాగో వెళ్లినా, రోం వెళ్లినా, కలకత్తా వెళ్లినా లేక పెకింగ్ దర్శించినా ఒకే రకమైన పూజబలిని చూస్తావు. నిజంగా యిది ఆశ్చర్యజనకంగా లేదూ? దీన్నిబట్టి దేశాలు మారినా వ్యక్తులు మారినా వీరంతా ఒకేతాటిమీద నడుస్తున్నారని అర్థమవుతుంది. నీవు యిట్టి గొప్పసంస్థయందు సభ్యుడవై యున్నావని తెలుసుకో. జాతులమధ్య, రంగులమధ్య, యెంత భేదమున్నను ఆ భిన్నత్వములోనే యేకత్వాన్ని మనం చూడవచ్చు. ఈ ఐక్యత అనేది తిరుసభ నైతిక చట్టాలలో మరీ స్వచ్ఛంగా కనబడుతుంది. అందరి వద్దనుండి ఒకే విరక్తత్వమును, ఒకే విధమైన పాప సంకీర్తనమును, ఆదివార పూజను కోరుచున్నది.

**భారతీయులకు నీవేమి చేస్తావు** విచారణలో తిరుసభ యేంచేస్తుందో నీకు తెలుసు. ఆదేపనిని ప్రపంచమంతటాకూడ చేస్తుంది. కనుక

యే ప్రాంతంలో నైనా, యెన్నడైనా తిరుసభ కార్యకలాపాల్లో బేధాలంటూ యేవీలేవు. అదిమాత్రం గమనార్హ్యం.తన ఆధీనం క్రింద గల వారల ఆత్మోద్ధరణకోసం, వారి ఆధ్యాత్మికోన్నతికోసం కృషి చేయటమే తిరుసభ పని.

తిరుసభ ప్రపంచామంతా పరివ్యాప్తమై వుండటంవలన దీనికి దేశభక్తిలేదు అనటం పరిపాటయింది. దీనికి కొన్ని రాజకీయపు పెత్తులున్నాయని నిందారోపణ చేయుబడుతున్నది. విజ్ఞులెవరూ యిలా భావించరు. విజ్ఞులైనవారు కతోలిక ఐక్యత అనేది ఆధ్యాత్మిక విష యాలలో కనిపిస్తున్నదని అనుకుంటారు. తెలుసుకుంటారు. ఇండి యాలో యే కతోలిక వ్యక్తికూడా పరిశుద్ధపాపుగారి దగ్గరనుండి మతవిషయకమైన సాయంతప్ప అన్యథా యేదీ వాంఛించడు. ఆలోచనా పాటవంలేని వ్యక్తికి, సులభంగా తప్పుదోవ త్రొక్కేవానికి, బుద్ధి వికా సాన్ని కల్గించి నీ జీవిత విధానంద్వారా తిరుసభ ప్రపంచ వ్యాప్త మైనదనీ, నైతికంగా ఆధ్యాత్మికంగా మానవునికి వున్నతిని కల్గిస్తుం దని, తిరుసభకు ఆర్ధిక రాజకీయ విషయాలతో ప్రమేయం లేదని స్పష్టంచెయ్యి. తిరుసభ మూలంగానే అశేష జనం తమదేశం యెడల ఋజువర్తనులై, నీతిపరులై, న్యాయధర్మాను వర్తనులై వుంటున్నారు. కుటుంబ జీవితమున పట్టుదల గల్గివున్నారు. ప్రపం చంలో నేరం, మోసం, చెడు, విడాకులు యీలాంటివి కన్పించినప్పు డల్లా తిరుసభ వాటిని యెదుర్కొంటున్నది. శ్రమజీవికి అతను పడే కష్టంలోనే గొప్పతనముందని తిరుసభ ప్రవచిస్తున్నది. అతనిలో నిరం తరము ఆశను పురికొల్పుతుంది. మానవుడు పరిస్థితుల ప్రాబల్యానికి లొంగి జీవించవలసినవాడని, అతడు కొన్ని వికారములకు బానిస అని చెప్పువారిని వ్యతిరేకించి మానవునికి స్వేచ్ఛనిచ్చును, గౌరవము చూపును. యదార్ధమైన కతోలిక జీవితాన్ని జీవించటంవల్ల తిరుసభ బలము ఆధ్యాత్మిక సాధనములలో నున్నదని నీవు లోకానికి చూప గలవు. తన బోధ యేవిధంగా లోక కళ్యాణమునకు సహకారియగునో లోకమునకు తమ నడవడి వలన రూపించమని జేసువు కోరుతున్నారు.

# ఇరువది యొకటవ అధ్యాయము

తిరిగి క్రీస్తును పొడుచుచున్నారు.

మానవులు యెల్లప్పుడు క్రీస్తునాధునిచే ఆకర్షింపబడతారు. కాని అందరు ఆయనను పూర్తిగా, సక్రమముగా అవగాహన చేసుకోలేరు. హృదయంలేని విద్వాంసులు క్రీస్తువు ఒక పుణ్యకోటి పురాణ పురుషుడంటారు. కాని సత్యాన్వేషకులు మాత్రం క్రీస్తునాధుడు "తమప్రభువు, తమ దేవుడు" అని అంటారు

ఐతే యిప్పుడు వచ్చిన ప్రశ్నల్లా యేమిటంటే: "క్రీస్తునాధుని గూర్చి సరియైన నిర్వచనము యెక్కడలభిస్తుంది?" అన్నది మాత్రమే. క్రీస్తునాధుని గూర్చి ఖచ్చితమైన అభిప్రాయం యే క్రైస్తవ సభకైనా వున్నదా? తమ ఆ విషయాన్ని గూర్చి వ్యక్తిగతంగా యెవరికివారు తమ అభిప్రాయాన్ని కల్గి వుండవచ్చునని క్రీస్తునాధుడు కోరారని అనుకోవడానికేమీ ఆధారంలేదు. క్రీస్తుచు తెలిసికొన దలిచినవారు అధికారులు మారినప్పటికిని అధికారులతోపాటు భావాలు మారని సంస్థయేదైనావుందా అని తెలిసికోవలె. సంస్థ, అందులో వుంటూ వస్తున్న అసలు తత్వాన్ని చంపి, జీవచ్ఛవంగా వున్న పైపంచిన కార్యక్రమాన్ని కేవలం పటాటోపాన్ని, ఆడంబరాన్ని మిగుల్చుకుంటుందా? నిజమాలోచిస్తే యీలా జరుగడమంటూ లేకపోలేదు. ఎన్ని సంస్థలు నామకః నిలిచి వున్నాయి. వాటిలో అసలు ఆరంభంనాటి జీవంగాని, ఆనాటి ఖచ్చితమైన అభిప్రాయాలుగాని, భావాలుగాని వుండటం లేదనటం సత్యదూరంగాదు.

ఖచ్చితమైన విశ్వాస సత్యములులేని క్రైస్తవ సంస్థలకు యేమి జరుగుచున్నదో మనం చూస్తూనే వున్నాము. ఒకసారి సత్యాన్ని బోధించిన తర్వాత దాన్ని సంరక్షించుకోవాల; జేసునాధుని జూదులు చీల్చివేసినట్లు, సత్యాన్ని పతితులు చిన్నాభిన్నము చేయ ప్రయత్నిస్తారు. జేసువుకు విరోధముగ అన్ని పన్నాగములు పన్నినపుడు నేటి ఫరిజేయులు ఆయన సత్యమును నాశనము జేయుటకు యెన్నివిధాలుగా ప్రయత్నించరు? వీరు తిరుసభ చెప్పిన దానిమీద దుమ్మెత్తి పోస్తుం

టారు. అదే పేరిటని. సంశయవాదులు కొందరు తిరుసభ క్రీస్తును, క్రీస్తుబోధనలను కొన్ని సూత్రాలలో యిమిడ్చి జీవరహితం చేసిందని నిందిస్తుంటారు. అతి సూక్ష్మమైన విధానాల ద్వారా తిరుసభపై దుమ్మెత్తిపోస్తుంటారు ఇలా చేయడంవల్ల వారు ప్రజలనుండి నిజమైన తిరుసభను కప్పిపుచ్చగలమని భావిస్తారు. యథాతథంగా గోచరము కాదని భావిస్తారు.

క్రీస్తు నిజంగా జీవంలేని సూత్రాలకు విరోధి. కాని ప్రతి వ్యక్తి తన యిష్టము వచ్చినట్లు క్రీస్తును గురించి, వారి బోధనలను గురించి అర్థం చెప్పగలనంటే క్రీస్తు దాన్ని యెప్పుడు వొప్పుకొనడు. జీవిత విషయములోనే మానవులు వివిధ దృక్పథములు కలిగి యుండిరి. అందరు ఒప్పు కా నేరరు. ఎవరి భావములు గాని ప్రపంచమంతటా అంగీకరింపబడలేదు. తిరుసభ కంటే యేవ్యక్తి, యేసంస్థ క్రీస్తును పోలి నట్లు లోకమునకు చూపించుకొనగలదు?

**సత్యసభ ప్రమాణములు** (1) కతోలిక సభ ఒక్కటే దాని స్థాపకుడు క్రీస్తునాథుడని చరిత్ర పూర్వకముగ ఋజువు చేసికొనగలదు. మిగిలిన సంఘము లన్నియు మానవులచే నెలకొల్పబడినవే. క్రీస్తునాథుడు యిలా అన్నారు. "నీవు రాయుడవు. ఈ రాతిమీద నే నా సభను నిర్మిస్తున్నాను." ఏ మతసంఘము చెప్పుకోగలదు తాను రాయప్పగారి మీద నిర్మింపబడ్డానని. రాయప్పగారు రోంనగరం వెళ్లి అక్కడ తన సింహాసనాన్ని నెలకొల్పాడు. ఆనాటి నుంచీ కతోలిక మతం రోం నగరంలో స్థాపితమైంది.

క్రీస్తునాథుడు కోరినట్లు తిరుసభ పాలకులు అంతా క్రీస్తునాథుని మాదిరి లేనందు వలన తిరుసభను అంగీకరించకుండుటకు కారణము కారాదు. ఎవరో అధములు వున్నంత మాత్రాన అసలు సంస్థను నిందించడం, దూషించడం భావ్యంగాదు. అలాంటి వారు వుంటే వారిని సరిదిద్దవలెను. ఒక అధమస్తుడెవరో ఇండియా అధ్యక్షుడైతే దాని రాజ్యాంగ చట్టాన్ని మనం దూషించరాదు. దాన్ని కాదన

రాదు. అతన్ని పదవీచ్యుతునిగా జేసి రాజాంగచట్టాన్ని నిలబెట్టు కుంటాము. అప్పుడే గౌరవం. అలాగే క్రీస్తునాథుని శిష్యులలో (అపోస్తులలో) జూదాస్ వున్నంతమాత్రాన తదితర అపోస్తులను అంగీకరించక పోము.

(2) క్రీస్తునాథుడు ఐక్యతను కోరారు. దానికి ఉదాహరణంగా యీ వాక్యం చాలు. "ఓ పితా! మీరు నాయందును, నేను మీయందు వుండెడి రీతిగా వీరలందరును యేకమై వుండవలయు ననియు, వారలు కూడ మనయందు యేకమై యుండవలయుననియు (ప్రార్థించుచున్నాను.)" (జ్వా. 17-21). దీన్ని బట్టి విశ్వాసంలో ఏకత్వముండాలని అర్థము. ఈ యేకత్వమనేది కేవలం సాంఘికంగా మాత్రమే కాదు. "ఆయనయందు నమ్మకం, ఆయనలో విశ్వాసం ప్రపంచాని కుండాలని ఆయన వాంఛించారు. (జ్వా 17-20). నన్ను మీరు పంపారని విశ్వసించాలి"అని ఆయన అన్నాడు (17-21). ఈ ప్రవచనాలను బట్టి ఆయనను విశ్వసించే విషయములో అంతా ఒకటిగానే వుండాలని తెల్పుతున్నది. విశ్వాసములో యేకత్వం, అంతర్జాతీయదృష్టి తిరుసభకు మినహా మరి యే క్రీస్తు సంఘానికిలేవు. ఇది మనం గమనించాల్సింది.

(3) క్రీస్తునాథుడీలా అన్నారు. 'ఆ చిన్న బిడ్డలను నా యొద్దకు రానివ్వండి (మార్కు 10, 13_16). క్రీస్తునాథునకై ఆ పసిబిడ్డల రక్షణ విషయంలో తిరుసభ పడుతున్నట్లు యెవరు కష్టపడుటలేదు.

(4) ఆయన యీలా అన్నారు: "వారు నన్ను హింసిచేపక్షమున మిమ్ములను హింసించెదరు" (జ్వా 15,20). కతోలికులనే యెందుకు బాధపెడతారు. మిగిలిన క్రైస్తవ సంఘాల నెందుకు బాధపెట్టరు?

(5) క్రీస్తు ప్రభువు యిలా అన్నారు, "ఇది నా శరీరం. ఇది నా రక్తం. నా జ్ఞాపకార్థం దీనిని చేయుడు" (లూకా 22,19). కతోలికులోకులే దివ్య సత్ప్రసాదములో క్రీస్తునాథుడున్నాడని విశ్వసిస్తారు. ఆ విశ్వాసమే వారిని ఆయనకు మరీ సన్నిహితులునుగా జేస్తుంది.

(6) [illegible] ఆరాధించ [illegible] ఏ సంస్థ [illegible] క్రీస్తు [illegible] దేవాలయము మానవులను [illegible] "కతోలిక దేవాలయాలు [illegible]" అన్నారు.

(7) "ఒక వ్యక్తి కేవలం భక్తి ప్రపత్తులపై ఆరంభంలో క్రైస్తవ మతాన్ని [illegible] నేను కతోలిక మతం ఒకటి విధా[illegible] తిరుసభ వంటి ఒక బహిరంగ సంస్థకు తన భక్తి ప్రపత్తులను చూపిస్తున్నది" అని చెప్పబడుతున్నది. దివ్య సత్ప్రసాదంలో క్రీస్తు నాథుడే స్వయంగా వచ్చి వున్నాడని కతోలికుల భావనగదా! కతోలికులు ఆయనను జీవంతో నే దర్శిస్తున్నామని, ఆహ్వానిస్తున్నామని నమ్ముతున్నారు. ఇంకా యింతకన్న వ్యక్తిగత బాంధవ్యమేముండాలి. కతోలిక సభ కేవలం సత్యవేదాన్ని ప్రజల చేత పఠింప చేయడమే గాక వారివద్దకు ప్రభువుని కూడ తీసుకొని వస్తున్నదే! కనుక దీన్ని బట్టి వ్యక్తిగతంగా కూడ క్రీస్తునాథునితో సంపర్కమున్నదని తేలుతున్నది.

(8) కాలం గడ్డి కతోలికు తిరుసభ క్రీస్తునాథుని సత్యాల విషయంలో తమకు గల భావాలను అభిప్రాయాలను మార్చదు. మార్చుకోదు. తిరుసభ బైటవస్తున్న మార్పులను విచారణ చెయ్యదు.

(9) కతోలికు సభలోనికి వచ్చిన ప్రసిద్ధ వ్యక్తులను గమనించు. వారు చేసిన త్యాగాలను గూర్చి తెలుసుకో. వారు యిచ్చిన తీర్పులను, నిర్ణయాలను పరిశీలించు. అప్పుడు తిరుసభ క్రీస్తుపోలికని నీకు బోధపడుతుంది.

(10) క్రీస్తు నాథుడిలా అన్నారు "దేవుడు వేటిని కలిపారో మానవుడు వాటిని విడదీయకుండుగాక." (మార్కు, 10,9) విడాకుల విషయంలో యే క్రైస్తవ సభ పై వాక్యమును అనుసరిస్తున్నది?

**తిరుసభకు మంచి అవకాశం**

నాల్గువందల సంవత్సరాల పాటు చాల వరకు తప్పుగా తెలిసికొన్న ప్రస్తుత చరిత్రలు మానవులు చదివారు. వారి మనస్సుల్ని తిరుసభకు వ్యతిరేకంగా చేయబడిన ద్వేషపూరితాలుగా చేయబడినవి. ఫలితంగా తిరుసభ వచనాలను వినేవారు అల్పసంఖ్యాకులు. కాని కతోలిక మతంలోకి వచ్చినవారు, వెనుక తమ హృదయాలలోని ఏయే దురభిప్రాయాలు, యే తప్పుడు భావాలు పోషింపబడినవో చెబుతారు.

కతోలిక తిరుసభ యెడల అయిష్టత గలవారు చాల వరకు నిజాయితీ పరులని, మంచివారని మేము గ్రహిస్తున్నాం. కాని తిరుసభ ఒకటే - అందులోని కొందరు సభ్యులు, కొందరు నాయకులు తప్పులు చేసి నప్పటికీ-యథార్థంగా క్రీస్తునాథుని అనుసరిస్తున్నదని, క్రీస్తు ప్రతిబింబమేనని మేము చెబుతాము. అయితే కతోలికేతరులకు సదుద్దేశాలు లేవని గాని, వారి మీద విరోధంకొద్దిగాని మేము అట్లు అనడంలేదు. కాని, తిరుసభ యెడల అయిష్టతగల వ్యక్తులు నీతి నిజాయితి పరులే కావచ్చు-నిజమేదో లోతుగా చూచి తెలుసుకోకుండా ప్రవర్తిస్తున్నారనని మేము విశ్వసిస్తున్నాము.

క్రీస్తునాథుడు ఒక సంఘం వుండాలని వాంఛించారు. గనుక తిరుసభలోనే ఆయన సత్యాలు సరైన విధంగా ప్రబోధించబడతాయని మేము చెప్పదలచాము.

బైటివారలు సత్యాన్ని తెలుసుకో గల్గితే, క్రీస్తునాథునికి భక్తి గౌరవ ప్రపత్తులు గల్గియుండటం ఆయన్ని అనుసరించటం. ఈ రెండే కతోలికుల హృదయ పూర్వకోద్దేశాలని గ్రహించగలరు. ఈ అధునిక ప్రపంచానికి సరైన విధంగా, తప్పులులేకుండా, ఖచ్చితంగా, సూటిగా క్రీస్తునాథుని, కతోలికులు అందచేయ ప్రయత్నిస్తున్నారని కూడ వారు గ్రహించగలరు. కేవలం క్రీస్తునాథుని కోసం వేలకొలదీ మతబోధకులు తమ సుఖాలను వదలపెట్టుకుంటున్నారని వారు

తెలుసుకోగలరు. ఆ మార్గాలనే యితరు లిదివరకు అనుసరించారు కూడ. పాప సంకీర్తనం అనేది మనశ్శాంతి దాయకమని కూడ వారు గుర్తిస్తారు.

మానవులు తప్పుడు నిర్వచనాలకు పాల్పడతారు గనుక, తిరుసభ తన సిద్ధాంతాల విషయంలో ఖచ్చితంగా సూటిగా వుంటున్నది. అంతమాత్రంచేత క్రీస్తుతత్వాన్ని, క్రీస్తుతత్వంలోని అసలు రూపాన్ని తిరుసభ సక్రమంగా గమనించటం లేదని అనుకోరాదు. కతోలికులు ప్రసంగాన్నివింటున్నప్పుడు, గురువు క్రీస్తునాథుని గూర్చి తన స్వంత అభిప్రాయాలను వెలిబుచ్చుతున్నారని వారు అనుకోరు. అది ఒక అధికారికమైన అభిప్రాయమని గుర్తిస్తారు. అది నిజమైన క్రైస్తవాభిప్రాయమని, మానవునిచేత తయారుకాబడిన అభిప్రాయము కాదని, అదొక వ్యక్తిగతాభిప్రాయం కాదని వారికి తెలుసు.

**ఆచరణ** 1) తిరుసభలో ప్రవేశించే వారిమీద సాంఘికంగా ఒత్తిడి తీసుకరాబడిన సంఘటనలు నీకు తెలుసా? మతములోకి చేరదామనుకునే వారికి నీవు యేలా సహాయపడతావు?

2) కతోలికు సాహిత్య సభ వారిచే ప్రచురింపబడిన కరపత్రాలనుసంపాదించు. నీకుపకరించ గలవని అనుకొన్నవాటిని నీదగ్గర వుంచుకో.

3) ఒకరు యిలా అన్నారు. "క్రీస్తునాథుని ప్రవర్తన, ఆయన గుణసంపద, ఆయన మాటలు, ఆయన కార్యాలు, ఆయన బాధలు, ఆయన పని—ఇవే మన భక్తికి ఆహారం కావాలి. ఇవే నియమబద్ధమైన జీవితాని కాధారాలు". ఆలాంటి ఆలోచన, తరచు లోగొనే దివ్య సత్ప్రసాదము యివిరెండు నిన్ను క్రీస్తుఅనుసరులుగా చేయవూ?

4) యథార్థమైన కతోలికవ్యక్తి కతోలి కేతరులను దూషించడు. కతోలిక తిరుసభను నమ్మటానికి కూడా తగిన విశ్వాసం వుండాలి. తిరుసభనుగూర్చి తెలుసుకొన గోరేవారి విషయంలో దయగావుండు. మన తిరుసభ శతాబ్దాల తరబడి తన వునికిని సార్థక

తరచు కొన్నది. కొందరు తిరుసభకు వ్యతిరేకంగా వాదించడం ప్రారంభిస్తారు. ఆలాంటి వారినుండి మనల్ని గ్రహించుకోవటం మాని, మనం గాక వాళ్ళు తమ సిద్ధాంతాలను నిరూపించే బాధ్యత వారిపై బెట్టు. వారికొరకై, ఆర్థికోన్నతి కొరకై కొందరు తిరుసభమీద దాడి చేస్తుంటారు. నిందిస్తుంటారు. అట్టివారితో నీవు ప్రమేయము పెట్టుకోవద్దు.

---

# ఇరువదిరెండవ అధ్యాయము

## మానవ ప్రమాణముల అపజయము.

**స్వయం సమృద్ధత** ఆధ్యాత్మిక విలువలకు సంబంధించిన విషయాల్లో, జీవిత రంగానికి సంబంధించిన నియమాల సందర్భంలో, తిరుసభను సరియైన మార్గదర్శిగా తీసుకొనవచ్చునని వెనుకటి అధ్యాయములో తెలుపబడినది. కొందరు మాత్రము తమ అభిప్రాయాల మీదనే ఆధారపడతారు. ఈ ఆధారపడట మనేది మతసంబంధంగా నాయకులమని చెప్పుకునేవారిలో యెక్కువగా కనిపిస్తుంటుంది. జీవితమంటే "యేమిటి"? జీవితం "యెందుకు"? జీవితంలో "యెక్కడికి" గమిస్తున్నావు? "యెక్కడ జీవిస్తున్నావు" అనే సమస్యలను పరిష్కారము చేయడములో తాము తమ తోటివారలను నడిపించగలమని భావిస్తుంటారు. తిరుసభవంటి ఒక బహిరంగ సంస్థ యెడల ఆక్షేపణలు తెలుపుతుంటారు. తమ భావాలు యితరులచేత ఆచరణలో పెట్టబడాలని, తమ అభిప్రాయాలలో యితరులు యేకీభవించాలని అంటుంటారు. అంటే మానవుడు నిర్మించుకున్న భావసౌధాల్లోనే విహారించాలని చెప్పటం.

జీవితానికి సంబంధించిన పెద్ద ప్రశ్నలకు క్రీస్తునాధుడు, ఖచ్చితంగా, సూటిగా సమాధానాలిచ్చారని, యీ ప్రశ్నలకు సమాధానాలివ్వడం-వీటికి సరియైన వివరణ లివ్వటం-ఈ పనులను క్రీస్తునాధుడు తిరుసభ పెద్దల కప్పగించారని, ఆయన వివరణలను, సమాధానాలను వున్నవి వున్నట్లు యిప్పటికీ నిల్పింది ఒక్క తిరుసభేయని విశ్వసించటానికి కొంత అణుకువ, వినయం అవసరం. సత్యాన్ని-దైవ సత్యాన్ని నమ్మటానికి తమ స్వంత అభిప్రాయాన్ని అణచుకోవాలి. కాని అలాంటి పని మాకు మేము సంపూర్ణుల మనుకొనే వారికి సాధ్యపడదు. నిజానికి స్వయం సమృద్ధులం స్వయంపూర్ణులం అనుకొనే వ్యక్తులు అహంభావ పూరితులు గనుక తమ అభిప్రాయాలను, తమ వూహలను కాదని దేవుని ప్రవచనాలను వినలేరు.

**క్రీస్తునాధుని వివరించ లేక పోవుట** అనేకులు క్రీస్తునాధుని అంగీకరిస్తామని ఒప్పుకుంటారు. కాని తిరుసభ చెప్పే వివరణలను అంగీకరించడానికి ఒప్పుకోరు. ప్రతి ఒక్కరూ (ఎవరికి వారు) క్రీస్తునాధుని అర్థం చేసుకోగల సత్తా వున్నవారమని చెప్పుకుంటుంటారు. బ్రహ్మాండమైన పదజాలం వుపయోగించి ప్రజానీకం ముందు తమ భావాలను పెడతారు. కొందరికి క్రీస్తునాధుడు దేవుడు, కొందరికి మానవాతీతులు, కొందరికి మతమూఢుడు, ఇంకా కొందరికి యేదో పుక్కిటిపురాణాలలో కన్పించే సాధారణ వ్యక్తి. ఒకరి భావాలతో మరియొకరి భావాలు పొందికలేవు. ఇలా తలకొకరికి తలోక రకంగా కన్పించారు. కాని, ఈ నాడు యే మాత్రం బుద్ధి జ్ఞానం వున్న మనిషికైనా క్రీస్తునాధుడు ఈ పలురకాలుగా వుండటానికి వీలులేదని యేదో ఒకటే అని అంటారు. ఆయనను గూర్చి ఒకే ఒక ఖచ్చితమైన భావం, సూటిఅయిన అభిప్రాయం వుండాలి. తిరుసభ చెప్పే సత్యాలను వ్యతిరేకించి క్రీస్తును గురించి మరియొక విధంగా చేసిన బోధ ప్రపంచానికి యెప్పుడూ తృప్తి నివ్వలేదు. అది కాల పరీక్షకు తట్టుకోలేదు. కొంత పరిజ్ఞానమున్నవారు ఈ విషయాన్ని వెంటనే చూస్తారు. బోస్వే యేమన్నాడంటే "మీరు మీ సత్యాలను మారుస్తూవుంటారు. కాబట్టి అవి సత్యాలుగావు." దైవసత్యాలు యెప్పుడూ పాతవికావు; అవి యెప్పుడూ మారవు. వాటికి ముసలితనం అనేది లేదు. అవి యెప్పుడూ ఒకటే. క్రీస్తు మారడు. అలాంటి మారని క్రీస్తుని గురించి ఈ స్వయం సంపూర్ణుల మనుకొనేవారు యేకాభిప్రాయానికి రాలేకపోయారు.

ప్రతి తరంలోను యెవరో ఒక ప్రసిద్ధ రచయిత వుంటుంటాడు. వారికి జనాన్ని ఆకర్షించగల వక్తృత్వపాటవం, రచనాశక్తి, మేధా సంపద వుంటాయి. మాటల్లో గట్టిగాని క్రియల్లో బలహీనుడు. జనం గంభీర వాగ్ధోరణికి, పదాడంబరానికి మోసపోతారు. ఎవరి అధికార బోధనమీద క్రీస్తును నమ్మకూడదు; స్వంతంగా తెలుసుకోవాలంటాడు. తను చెప్పేవాటిని నమ్మమంటాడు. నిదర్శనం యేదీ లేకుండా, మంచితనం, అవినీతి, క్రీస్తునాధుడు—ఈ అంశాలను గురించి తన స్వంత అభిప్రాయాలేవో చెప్పి వాటిని జనం నెత్తిన రుద్దప్రయత్నిస్తాడు. వీని బోధనను అంగీకరించే వారిలో కలిగే ఫలితాలు ఎప్పుడూ ఒకటే.

ఆ ఫలితాలు ఏమంటే—తిరస్కృతలలు, భగ్నహృదయాలు. నిరాశ. దైవ సత్యాలను తిరస్కరించినప్పుడు జనం కొన్ని అసత్యాలు నమ్మేటట్లుగా చేయవచ్చు. అంత్యాన వారు శూన్యాన్నే కనుగొంటారు వాటిల్లో.

**యదార్థ జీవితంలో మానవ నిర్మిత ప్రమాణాల నిష్ప్రయోజనం**

జీవితంనుండి దేవుని తొలగించగలం అని డాబులు కొట్టినవారి చేతనే కొన్నిదశాబ్దాల పర్యంతం ఫ్రాన్సు పరిపాలింప బడ్డది. 'దేవుడు' అనే పదం స్కూలు పుస్తకాలలో కూడ వుపయోగింప బడనివ్వలేదు. సన్యాసులు దేశమునుండి వెళ్లగొట్ట బడ్డారు. ఫ్రెంచి విజ్ఞానులు మతపు మూఢ నమ్మకాలను ధ్వంసంచేశారని అందువలన మోక్షంలో దైవంలేదని కార్మికులకు చెప్పారు.

కాని ప్రపంచయుద్ధం వచ్చింది. అప్పుడు ఫ్రాన్సు దేశంలో దేవుని నమ్మిన సేనానులు, సైనికులు నిజమైన దేశభక్తులయ్యారు. అప్పుడు యిదివరకు వెళ్లగొట్టబడిన మతదృష్టిగల వారందరూ తిరిగి దేశానికి రప్పించబడినారు! దేశంలో తిరిగి దేవునిమీద నమ్మకం యేర్పడసాగింది. దేశానికి ప్రమాదస్థితి వచ్చేటప్పటికి దేశరక్షణలో పని చేసే సేనానులు,సైనికులు భగవద్భక్తి పరులయ్యేటప్పటికి వెనుక దేవుడున్నాడనే మూఢనమ్మకాన్ని పోగొట్టినామని కార్మిక లోకానికి చెప్పిన విద్యావంతులలో ఒకరూ గొంతెత్తిమాట్లాడలేదు. ఒకరూ మతం అనేది లేదనికాని, దేవుడు లేడనిగాని ప్రచారం చేయలేదు. వీరేమీ మాట్లాడలేక పోవడం ఒకవైపునవుంటే, మరొకవైపు కందకాల్లో పనిచేసే సైనికులు "మతం అనేది జీవితాన్ని దేవునిమీదపణం ఒడ్డటం" అని అనసాగారు. కనుక యీవిధంగా కాలమాన పరిస్థితులు తారుమారయ్యేటప్పటికి మానవుడు తనకు తాను నిర్మించుకున్న ప్రమాణాలు నిలువలేక పోయాయి. దేవుని ప్రమాణమే నిలువగల్గింది. ఎల్ల కాలం నిల్చేది అదే.

**అబద్ధీకులైన**

సైన్సు మంచిదే. అది దేవుని దగ్గర శాస్త్రజ్ఞుల ఓటమి నుండి వచ్చినది. అది చాలామందిని దేవుని

దగ్గరకు తీసుకొని వచ్చినది. కాని యీనాడు పరిస్థితులు మారినాయి. మన జీవితాన్నుండి దేవుని వేరుచేయ ప్రయత్నిస్తున్నారు. ప్రతి కార్యమును సైన్సుద్వారా వివరించడానికి ప్రయాస పడుతున్నారు. సైన్సుతోనే జీవితమంతా వున్నదని, సైన్సులేకుండా జీవితంలేదని, సైన్సే తమ ఆరాధ్య దైవమని అంటున్నారీనాడు. ఈ మధ్యఒక స్వేచ్ఛావాది అన్నాడు "వాళ్లు తమ దృష్టిని గురువు దగ్గరనుండి, గుడిదగ్గరనుండి, విద్యావంతుని వైపునకు, పండితుల వైపునకు లేబొరెటరీ వైపునకుమరల్చారు."

ఒక విద్యావంతుని దగ్గరకు, ఒక లేబొరెటరీ వైపునకు ఒక గ్రంథాలయం దగ్గరకు ఆ యా అవసరాల నిమిత్తం వెళ్లటం మంచిదే కాని క్రీస్తునాథుని దగ్గరనుండి ప్రపంచానికి దేవుని ప్రకటనను, వృత్తాంతాన్ని గురువులు అందించారనే అంశాన్ని కాదంటున్నారు. అంటే దాన్నిబట్టి మానవుడు (తనకు తాను) పెట్టుకున్న ప్రమాణాలు విఫలమయ్యాయని అర్థమవుతుంది.

అలాంటి వ్యక్తుల ఓటమి మతాంతరుడైన ఒకవ్యక్తి చెప్పిన మాటలవలన అవగతమవుతుంది. "మేము దేవునిని, ఆయన ప్రపంచ పరిపాలనను నమ్మలేదు. కారణమేమిటంటే: సైన్సు అలాంటి వేవీ లేవని ఋజువుచేసిందని మేమనుకున్నాము. కాని యథార్థానికి మాకన్న కొంచెము పెద్దవారు, ఒకరిని చూస్తే ఒకరిని గిట్టనివారు అయిన అల్ప సంఖ్యాకుల అధికారంమీద మా నమ్మకాన్ని ఆధారం చేసుకున్నాం. అది అలావుండగా పెద్దవారైన చాల గొప్పవారైన సైంటిస్టుల ప్రకటనలను మేము కాదన్నాము. అక్కడితో ఆగక 1900 సంవత్సరాలనుండి అచంచలంగా నిలబడివున్న సత్సంప్రదాయాలు గలిగిన తిరుసభ అధికారాన్ని దూషణతో తిరస్కరించాం. "మానవాభివృద్ధికి, మానవ పురోగమనానికి యంత్రసంబంధమైన పరిశోధనలు నిదర్శనాలుగా నిలిచినాయని మేము విశ్వసించాం. కాని కాలం గడచినకొలది నాగరికతకు, అభ్యుదయానికి, నీతినిజాయితీ లొక్కటే నిజమైన కొలబద్దలని, క్రమక్రమంగా పతనావస్థకు వస్తున్న మానవునకు వ్యక్తిగతమైన సుఖభోగాలేవీ సహాయంచేయలేవని మేం గ్రహించసాగాం. డబ్బు సంపాదించటంలో డబ్బును వ్యయంచేయటంలో సుఖమున్నదని అనుకొన్నాం.

కాని యీనాడు అదంతా వృత్త భ్రమని గుర్తించగల్గాం ప్రస్తుతం మాకు దేవుని విషయంలోగల అపనమ్మకంవలన ప్రపంచ కష్టాలనుండి విముక్తిలేకపోగా యీవున్న పరిస్థితులవలన మాకు అసంతృప్తి విపరీతంగా పెరిగిపోయింది. భవిష్యత్తు విషయమై యేమాత్రము కనుచూపు మేరలో ఆశ అనేది కనిపించటం లేదు."

యథార్థమైన సైంటిస్టులు మాత్రం- వీరి మాట, వీరి అధికారం శతాబ్దాల తరబడి నిలబడే వుంటున్నవి- జీవితరంగంనుండి దేవుని తీసివేయటంలో, ఆయన స్థానంలో మానవుని ప్రతిష్టాపితం చేయటంలో ప్రయత్నిస్తున్న స్వయం సంపూర్ణు లనుకొనేవారి కార్య కలాపాలను నిరసిస్తూనే వున్నారు. దేవునియెడల పట్టుదల చూపించే సైంటిస్టులలో చెప్పుకోదగిన ప్రముఖులు న్యూటన్, కెప్లర్, పాస్టర్, ఫెబర్, మెండల్‌గారలు. వీరు ప్రపంచానికి చాలా సేవ జేసినా దేవునియందు మాత్రం నమ్మకం పోగొట్టుకోలేక పోయారు.

**కతోలిక నమ్మకం** క్రీస్తునాథుని ద్వారా దేవుని వాక్యం, ఆవిష్కరణ అని పిలువబడే సందేశం ఒకటి వచ్చిందని కతోలికులు విశ్వసిస్తున్నారు. ఈ ఆవిష్కరణ స్త్రీ పురుషు లందరికీ, బాలబాలిక లందరికీ, వయోవృద్ధు లందరికీ ఒక మార్గాన్ని చూపిస్తున్నది. నీ జీవితాన్ని యేలా గడపాలో అది చెబుతుంది. ఎప్పటికైనా దేవుని వాక్యాన్ని దేవుని శక్తిని విశ్వసించినపుడే జీవితనౌక నిర్విఘ్నంగా కాల మహాసముద్రంలో పయనిస్తుంది. అందుకనే అపోస్తులుడైన పౌలుడు కొరింథీయులకు వ్రాసిన మొదటిలేఖలో "మీ విశ్వాసము మనుష్యుల జ్ఞానము నాధారము చేసికొనక దేవుని శక్తి నాధారము చేసికొని వుండాలి" అని వ్రాసినారు. దేవుడు ప్రకటించినదానిమీదనే నీ నిర్ణయాలు ఆధారపడాలి. నీ స్వంతంగా కొన్ని ప్రమాణాలు పెట్టుకోరాదు. ప్రతివ్యక్తి ఆధ్యాత్మిక సంబంధమైన ఆత్మ వున్నదని, ప్రతి ఆత్మ మోక్షాని కర్హమైనదని కతోలికులు తమంతట తాము భావించలేరు. ఈ భావన అనేది క్రీస్తునాథుని వద్దనుండి వచ్చినటువంటిదే.

దైవావిష్కరణ వున్నదని దాన్ని తిరుసభ కప్పగించారని విశ్వసించనివారు తమ జీవితాంతంవరకు దారీ తెన్నూ లేకుండా వుంటారు.

వారు యేలాంటివారో అర్చుశిష్ట చిన్నప్పగా రిలాఅన్నారు. "ఎల్లప్పుడు నేర్చుకొనటమేగాని సత్యవిషయమైన జ్ఞానంపొందరు. (2 తిమొత్తి 3,7)

వారిస్థితి అలావుంటే కతోలికులు క్రీస్తునాధుడు తెచ్చిన దేవుని వాక్యంలోని అంతర్యాన్ని గురించి ధ్యానించి దినాలు గడసినకొలది ఆయన ప్రవసించిన సత్యాలను, బాధలను జీవితానికి అన్వయింప జేసుకుంటారు. వాటిని తరచినకొలదీ వాటిలో యేవో క్రొత్తభావాలు కన్పిస్తున్నాయి. ఎప్పటి కప్పుడవి క్రొత్తగానే వుంటుంటాయి. అదే వాటిలోని ప్రత్యేకత. దాన్నిబట్టే అగాధమైన తలకాయలను సైతం పరీక్షించగల సత్యం, మంచి పట్టుదలగల విద్యార్థులను బహూకరించ గల సత్తువ తిరుసభ కున్నదని వ్యక్త మవుతున్నది.

మానవుడు పెట్టుకున్న, నిర్మించుకున్న ప్రమాణాలు దేవుని సత్యాలను నిరసించాయి. వాటిని కాదన్నాయి గనుక అవి నిలువలేక పోయాయి. కాల పరీక్షకు తట్టుకోలేక పోతున్నవి. పైగా మానవ హృదయ వాంఛలను, అభీప్సితాలను తృప్తిపరచలేక పోతున్నాయి.

**ఆచరణ**

(1) దేవుని సత్యాలకు పాత క్రొత్తలనిలేవు ఎందువలన?

(2) యథార్థమైన సైన్సు, యథార్థమైన మతం—ఈ రెండు ఒకదాని కొకటి యేలా సహకరించుకుంటాయి.

(3) కుటుంబ నియంత్రణ అసాధారణులైన పిల్లలపెంపకం, వైద్యుడు తన దైనందిన జీవితంలో యే విధముగ దైవ ప్రమాణాలను సమర్థించ వలయునో చెప్పుము.

# ఇరువదిమూడవ అధ్యాయము

## పొరబడని స్వరం.

**సత్యాన్వేషకులు** నీవు పెరిగి పెద్దవాడ వవుతున్నకొలదీ, అవిశ్వాసులు ఎన్ని చెప్పినప్పటికి జీవితసత్యాన్ని తెలుసుకుంటానికి ప్రయత్నించే ఋజువర్తనులైన స్త్రీ పురుషులు అసంఖ్యాకంగా వున్నారని కనుగొనగలవు. కాని వారి మాటలు యెక్కువ మందిని యేలా ఆకర్షించలేవో అలాగే యెక్కువ కాలమూ నిలబడ లేవు. సాధారణంగా మొదట్లో ప్రజలు కొద్దిమంది మాటలను నమ్మి వాటికి మోసపోయినా అనంతరం అది తమ హృదయాలకు తృప్తి కలిగించలేక పోయేటప్పటికి తాము అడిగినవాటికి సరియైన సమాధానాలు ఆ నాయకులదగ్గరనుండి రాకపోయే టప్పటికి మనస్సులు మార్చుకొంటారు. జీవితమంటే యేమిటో, జీవితానికి సంబంధించిన స్వరూప స్వభావాలేమిటో కచ్చితంగా సూటిగా చెప్పగల సంస్థ అంటూ యేదైనా వున్నదేమోనని నలువైపుల అన్వేషణ ప్రారంభిస్తారు. అప్పుడేనీవు అలాంటి వ్యక్తులకు తోడ్పడాలి. మీకు కావలసిన సమాచారాన్ని తిరుసభ అందివ్వగలదని వారికి స్పష్టంచేయాలి. అందివ్వటంలో స్పష్టం మాత్రమేగాక ఖచ్చితంగా, పొరపాటులేకుండా చెబుతుందని వారికి నీవుచెప్పాలి. తిరుసభ అధ్యాత్మిక సత్యాలను మానవులకు నేర్పుటకు క్రీస్తుచే స్థాపితమైంది. క్రీస్తు పొరబడని తనము యెల్లప్పుడు తిరుసభకు సహాయంగా వుంటుంది.

**పొర బడని తనము అంటే యేమిటి? యేమిటి కాదు?** పొరబాటు పడకుండా వుండటమనేది, ఒక మహత్తరమైన, ఒక లోకాతీతమైన అసాధారణశక్తి. తిరుసభ — ప్రత్యేకమైన దేవుని సహాయంతో — విశ్వాస సత్యాలను, నైతిక సంబంధమైన విషయాలను లోకాని కంద జేయుడంలో పొరబడదు. ఈ పని నిర్వాహణలో యెక్కడ తప్పు లేకుండా క్రీస్తునాధుడు సహాయం చేయుదురు. శతాబ్దాల తరబడి యీ పని చేస్తున్నా, యెక్కడ యేవిధమైన లోటుపాట్లు రావడంలేదు, దానికి

కారణం పొరపాటంటూ యెఱుగక పోవడమే. ఇది ప్రేరణవంటిది కాదు. తిరుసభకు దైవసత్యాలను తెలియజేయడం వంటిదిగాదు. ఇది వఱకేవున్న దైవసత్యాలను, సత్యోపదేశాలను వివరణ జేయటంలో తప్పుచేయకుండా వుండగలందులకు ఆస్కారం కలిగించడమే దీని పని. క్రీస్తునాథుని తిరుసభకు ప్రధాన గురువుగానుండి, పరిశుద్ధ పాపుగారు అధికారికంగా విశ్వాసాన్ని, నీతిని లోకానికి ప్రబోధించిన, యింక అందులో- ఆశీర్వచనంలో- తప్పుండదు.

ఐతే, దానిబట్టి అనగా పొరబడని తనాన్ని గల్గి వుండటాన్ని బట్టి పాపుగారు యే తప్పు చేయరని అర్థంకాదు. వారు పాపం చేయరని అర్థంగాదు. మామూలు మానవవ్యవహారాలలో వారు తప్పులు చేయరని అర్థంగాదు.

**కతోలికులు పొరబడని తనంలో (అభ్రాంతత) యెందుకు విశ్వాసముంచుతున్నారు**

క్రీస్తునాథుడీ విధంగా ప్రవచించారని చరిత్ర చెబుతున్నది. "పరమండలము లోను భూమిమీద నాకు సర్వాధికారం యివ్వబడింది. మీరు వెళ్ళి సమస్తజనులను నా శిష్యులుగా జేయండి. ఇదిగో యుగసమాప్తి పర్యంతం సదాకాలం మీతో కూడా నున్నాను." (మత్తే. 28, 18-20). నమ్మనివానికి శిక్ష విధింపబడును. (మార్కు. 16, 16)

క్రీస్తునాథుడే పొరపాటు యెరుగనివాడు. పొరబడనివారు వారు తిరుసభతో సంబంధం గల్గి వున్నారంటే తిరుసభ పొరబడదనేగా అర్థం.

పైగా తిరుసభ బోధించినదాన్ని నమ్మమని క్రీస్తునాథుడు చెప్పారు. తిరుసభ సైతం మామూలు మానవవ్యక్తి మాదిరి తప్పు చేస్తుంటే క్రీస్తునాథుడు నమ్మనివారిని యే విధంగా శిక్షింపగలరు? అసలు పొరబడని తనమంటూ లేకుండా తిరుసభ సక్రమ మార్గంలో మన్నదను హామీయేలేదు. ఒక సత్యాన్ని నమ్మమని ఆజ్ఞాపించే ముందు ఆ సత్యాన్ని చెప్పేవారియెడల కొంత నమ్మకం అవసరం.

విశ్వాస సత్యాలను, నైతిక ధర్మాలను నిర్వచనం చేయడంలో పరిశుద్ధ పాపుగారు పీఠాధిపతులతో నిమిత్తం లేకున్నను పొరబడరని మేము నమ్ముచున్నాము. ఎందువలనంటే అర్చశిష్ట రాయప్పగారి వారసులుగా వారు క్రీస్తునాథునినుండి సహాయ సంపదలను అవిచ్ఛిన్నంగా స్వీకరిస్తుంటారు ఈ నాటి గొర్రెలమందకు వారే గొర్రెల కాపరిగా వుంటున్నారు. ఆనాడుమాదిరిగా నేడు సయితం ఆధ్యాత్మి కాహారాన్ని అందజేయాలి. పైగా ఆ ఆహారంలో కల్తీ లేకుండ చూచుకోవాలి. ఆలా చేయగల్గింది పొరపాటు పడని పాపుగారు మాత్రమే.

**అభ్రాంతత మన విజ్ఞానానికి సహాయ పడుతుంది**

కొందరు పొరబడని తనాన్ని అపార్థం చేసుకుంటూరు. దాన్ని తప్పుగా భావిస్తారు. పొరబడనితనం అనే సిద్ధాంతానికి కట్టుబడి వుండటం వలన సత్యాన్వేషణకు మొదదుచేసే ప్రయత్నాల కాటంకం కల్గునని, మానవుడు స్వేచ్ఛగా ఆలోచించలేడని వారు అంటుంటారు. మానవునికి ఆలోచించటానికి స్వేచ్ఛవున్నది అంటే సత్యాన్ని గ్రహించిన తర్వాత, అసత్యాన్ని అంగీకరించగలడని అర్థంకాదు. దాన్ని కాదనగలడని అర్థంకాదు. ఢిల్లీ నగరం వున్నదని నీకు తెలుసు. కాని ఆలోచించటానికి స్వేచ్ఛ వుండటంచేత ఆ నగరం లేదని యెలా అనగలవు? అంటే నీకు పేరు ప్రతిష్ట లేమైనా పెరుగుతావా? కతోలికులు తాము సత్యాన్ని తెలుసుకున్నామని తెలుసు. అలాంటి సమయంలో వారు అసత్యాలైన అభిప్రాయాలను గల్గి వుండవలసిన అవసరమేమున్నది?

ఒక సత్యాన్ని-ఏ సందర్భంలో నైనా - అంగీకరిస్తున్నంత మాత్రం చేత ఆ వ్యక్తి వైజ్ఞానికంగా బానిసకాడు ఆలాగే దైవసత్యాలను అంగీకరిస్తున్నపుడు కూడా. పై పెచ్చు దైవ సత్యాలను అంగీకరించిన వాళ్ళే యథార్థంగా స్వేచ్ఛగల్గిన వాళ్ళు. "సత్యాన్ని తెలుసుకో. సత్యమే నిన్ను స్వతంత్రునిగా జేయును." (జాన్ 8,32) అన్న వాక్యాన్ని స్ఫురణకు తెచ్చుకో.

వివేకాన్ని సరిగా వుపయోగించమని తిరుసభ చెబుతుంది. దేవుడెక్కడైతే స్పష్టాతిస్పష్టంగాచెప్పారో, ఖచ్చితంగాచెప్పారో, అక్కడ

మానవుడింకేమీ వివరించలేడు. అసలు అంతకన్నా అర్థమయ్యేటట్లు సూటిగా చెప్పనుకూడ చెప్పలేడేమో? దేవుని వివరణను మనం అంగీకరిస్తున్నాం. కాని దేవుడు వివరించనవి, విడిచిపెట్టినవి, మానవుడు తెలుసుకొనవలసినవి కొన్ని అంశాలున్నాయి. ప్రకృతికి, ప్రభుత్వానికి, విద్యకు యింకా జీవితంలోని వివిధ రంగాలకు సంబంధించినట్టివి యెన్నో వున్నాయి. దైవచిత్తాన్ని, దైవోద్దేశాలను కనుగొనవలసినప్పుడు పొరపాటుపడనితనమే మనకు మార్గము, శరణ్యము. మనబుద్ధి మనకు అనిశ్చయము, అనస్థితను యివ్వగా పొరపాటు పడనితనము మనకు నిశ్చయముగా తెలియజేయును.

**పరీక్ష** వెనుక గలిలెయోను రోమన్ సభ (Congregation of Index) 1616 లో ఖండించింది. దానికి కారణం గ్రహకూటమికి సూర్యుడే కేంద్రమని, సూర్యునిచుట్టూ భూమితిరుగుతున్నపుడు సూర్యుడు కదలకుండా వుంటాడని అతను చెప్పటమే. ఈ విషయంలో పొరపాటుపడని తనమున కేలాటి లోపము తీసుకొనిరాదు. అసలు వేదసత్యములను నిర్వచించుటకు ఈ సంఘానికి అధికారంలేదు. ఆ రోజుల్లో చాలా సంస్థలు బయలుదేరి క్రీస్తుమతాన్ని నాశనం చేయటానికి కృషి చేస్తున్నాయి. అందుకని ఈ గలిలెయో బోధల వలన బైబిల్ లో విశ్వాసము, నమ్మకం యెక్కడ తగ్గుతుందో అని పై చెప్పబడిన రోమన్ సభకు జెందిన కార్డినలులు భయపడి కలత జెందారు. తత్కారణంగానే "ప్రమాదకరమైన వని, వుపద్రవకరమైనవని నిర్ణయం చేయబడిన రచనలు వ్యాప్తి కాకుండా నిషేధించడానికి" పాపుగారు సమ్మతినిచ్చారు. కాని వారు, వారితో యేకీభవించిన వారి నిర్ణయం విషయం పొరపాటు కావచ్చు. కాని మనం ఆ నిర్ణయం యొక్క స్వభావమును తెలిసుకోవాలి. అది వేదసత్యంకాదు. అది పూర్ణ అధికారంతో ప్రపంచానికంతకు విశ్వసింపవలయునని శాసింప బడలేదు. నీవు పరిస్థితులను బాగా తెలుసుకొన్నట్లయితే ఈ నిర్ణయం ఏలా జరిగిందో తేలుస్తుంది.

1473-1543 లో కతోలికులు అయిన కోపర్నికస్ యిర్వురు కార్డినలులతో కలసి ప్రపంచానికి కోపర్నికస్ సిద్ధాంతాన్ని అందజేశాడు. దీన్ని గలిలెయో ప్రచారంలోకి తెచ్చాడు. కాని ఈ సిద్ధాం

తాన్ని మొట్టమొదట వ్యతిరేకించినవారు ప్రొటెస్టంటులు. గలిలెయో కేసు పొరపాటుపడని తనానికి వ్యతిరేకంకాదు.

**ఆచరణ** 1) పొరబడని తనాన్ని త్రోసివేయువారు తమకు మరణంలేని ఆత్మలున్నాయో లేవో రూఢిగా నిజంగా చెప్పగలరా?

2) తిరుసభ సభ్యుడివిగా నీకు పొరబడని తనం వలన గల్గిన మేలులను పేర్కొనుము.

3) తప్పుత్రోవలో పడిన ముగ్గురు వేదాంతులను పేర్కొనుము.

---

# ఇరువదినాలుగవ అధ్యాయము

బైబుల్—ప్రేరణ

**బైబుల్ అంటే ఏమిటి?** క్రీ. పూ. 1400 — క్రీ. శ. 100 సంవత్సరాల మధ్యలో దేవునిచే ప్రేరేపితులై 40 మంది ప్రముఖులు వ్రాసిన రచనల సంపుటియే బైబుల్ మహా గ్రంథం. ప్రపంచంలో దేవుడు యేలా మెలిగింది వివరించే గ్రంథ రాజమే యీ వేదగ్రంథం. మొదటి భాగం పాతనిబంధన అని పిలువ బడుతుంది. ఇందు 45 పుస్తకాలున్నాయి. రెండవ భాగముపేరు క్రొత్తనిబంధన. ఇందులో 27 పుస్తకాలున్నాయి. క్రీస్తునాథుని జీవితానికి ఆయన ప్రవచనాలకి సంబంధించిన విశేషములు, కొందరు సువిశేషకులు, అపోస్తులులు చెప్పిన మాటలు యీ క్రొత్తనిబంధనలో వున్నాయి. ప్రతి విద్యార్థి ఆదికాండము, జోబ్, దావీదు కీర్తనలు, ఇజయాస్‌ల పుస్తకాలను కొంతవరకైనా తెలుసుకొని వుండాలి. ఇక క్రొత్తనిబంధనలో సువిశేషములు, అపోస్తులుల చర్యలు, అర్చ్ఛిష్ట పౌలుని వుత్తరాలలో కొన్నిటినైనను తెలిసికొని వుండాలి. నీవు జీవితాంతంవరకు బైబుల్‌ను పఠిస్తూవున్నా, నీకు క్రొత్తదనం కనిపిస్తూనే వుంటుంది.

**బైబుల్ చరిత్ర** క్రీస్తునాథునికి కొన్ని శతాబ్దాల పూర్వం జూదులు తమ సమావేశాల్లో బైబుల్—అనగా పాతనిబంధనలోని కొన్ని భాగాలను— చదువుతుండేవారు. కొన్ని భాగాలను తమ వెంట బెట్టుకొని చదివేవారు యెప్పుడు. నిజానికి, జూదులు చాల అభినివేశంతో, చాల పట్టుదలతో ఆ వేదగ్రంథాన్ని కాపాడుకొన్నారు. జూదులు దైవ సంబంధమైన పుస్తకాలని అనుకున్నవాటిని గూర్చి (క్రీ. శ. 37—101) ఫ్లావియెస్, జోసఫస్ తెలియజేస్తూ "వాటికోసం అవసరమైతే ప్రాణాన్నైనా పణమొడ్డ నున్నా"రని అన్నాడు.

అలాగే క్రొత్త నిబంధనను సైతం క్రైస్తవులు చాల భక్తి శ్రద్ధలతో గౌరవించారు. చారిత్రాత్మకంగా నమ్మతగిన గ్రంథం అని అంటున్నారు. (అసలు కతోలికు తిరుసభ వలననే మనకు సరియైన

బైబుల్ ప్రతులు దొరకినాయి.) ఈ గ్రంథాన్ని వ్రాసిన రచయిత లలో కొన్ని విభేదాలున్నట్లు కనిపించవచ్చు. కాని గ్రంథం మొత్తం చదివితే ఒకరితో ఒకరు యేకీభవిస్తూ తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టు కోవకుండా వున్నారని వ్యక్తమవుతుంది

క్రీస్తునాధుని జీవితాన్ని గూర్చి అతిశయోక్తులుగా చెప్పబడిన కొన్ని పుస్తకాలు చాలవరకు మొదటి శతాబ్దంలో త్రోసివేయ బడి నాయి. తర్వాత శతాబ్దాలలో తప్పుడు కాపీలు ప్రచారంలోకి వచ్చాయి. అందుకని తిరుసభ కొన్ని పరిస్థితులలో బైబుల్‌ని చదవ రాదని గూడ నిషేధించింది. ఈ నాటికి కొందరు తమ తమ వూహల ప్రకారం బైబుల్‌ను ప్రచురిస్తూనే వున్నారు. అవే బైబుల్ యొక్క పరియైన ప్రతులని వారు అంటున్నారు. తిరుసభ గనుక తగిన విధంగా యీ వేదగ్రంథాన్ని రక్షించుకొనక పోయినట్లయితే యీ నాటికి అసలు మొత్తం మొత్తం యేలా మారిపోయేదో వూహాతీతం.

అచ్చుయంత్రాలు రాకపూర్వం అనేకమంది స్త్రీ పురుషులు బైబుల్‌ను వ్రాయడంలో తమ జీవితాన్ని గడిపారు. కొన్నిటిలో చక్కని బొమ్మలను సైతం వ్రాసుకున్నారు. వాటికన్ గ్రంథాలయ ములో పూర్తిగా బంగారపు అక్షరాలతోనున్న 11వ శతాబ్దము నాటి గ్రీకుల నిబంధన వున్నది.

అచ్చుయంత్రం 1450 కి ముందువచ్చింది. మొట్టమొదట వచ్చిన అచ్చుయంత్రం యీనాడు మోటుగా వుంటుంది. కాని అది వచ్చిన 100 సంవత్సరాల లోపల బైబుల్ మొత్తంగాగాని అందులోని కొన్ని భాగాలు గాని 629 ముద్రణలు వెలువడినాయి. 1500 లకు పూర్వం స్వదేశ భాషలలో గూడ బైబులు ముద్రణలు చాల వెలు వడినాయి. ఒక జర్మన్ భాషలోనే లూథర్ రాకపూర్వం బైబుల్ పూర్తిగా 30 సార్లు ముద్రితమైంది.

**బైబుల్ ప్రేరణ** ఈ వేద గ్రంథం మానవుని ఆలోచనా ఫలిత ముగా వెలువడినది గాదు. దీనికి కర్త దేవుడని కతోలికులు విశ్వసించ వలె. "స్పిరితుసాంక్తు" తన మానవాతీతమైన శక్తివలన బైబుల్

రచయితల నందరిని బైబుల్ వ్రాయమని ప్రోత్సహించి ఆచరణ సమయంలో వారికి సహాయపడిరి. దేవుడు ఆజ్ఞాపించింది తప్ప మిగతాదేదనీ వ్రాయనీయకుండా వుండటంలో, వ్రాసిన దానిని పొరపాటు లేకుండ నిర్దుష్టపదములతో వుండునట్లు స్పిరితుసాంక్తు వారికి సహాయపడెను. అట్లు కాని పక్షమున దైవము దీనికి కర్త కారు.

కనుక సారాంశమేమన:

1) దేవుడు రచయితలు వ్రాయవలయునని చిత్తగించిన దాన్ని వ్రాయటానికి స్పిరితుసాంక్తు ప్రేరణ, ప్రోత్సాహం కలిగించిరి.

2) ఇదివరకు తెలియనట్టి సత్యాలను ఆవిష్కరించటం ద్వారాగానీ, లేక రచయితల విజ్ఞానాన్ని బట్టి వారి విజ్ఞాన ప్రపంచంలో వున్నట్టి విషయాలనే సూచించడాన్ని బట్టి వ్రాయవలసిన విషయములను ప్రేరేపించెను.

3) అన్ని విషయాలను పొరపాటులేకుండా వ్రాయడంలో స్పిరితుసాంక్తు వారికి సహాయపడిరి.

ఇంతేగాక యీ క్రింది అంశాలను సైతం జ్ఞాపకముంచుకోవాలి

1) తాము స్పిరితుసాంక్తుచే ప్రేరేపితులైనట్లు ఆ పవిత్ర రచయితలు తెలుసుకొని వుండకపోవచ్చును.

2) వ్యక్తిగతమైన ప్రయత్నాలను వారు విరమించుకోలేదు అందులోని శైలి వారిదే.

3) అసలు మూలంలో తప్పులులేవు. ఎందువలనంటే అది పరమ పవిత్రులైన రచయితల చేతనే వ్రాయబడినది (తప్పులు అనేవి మనకు కన్పిస్తున్నాయి అంటే అవి ఆ మూలాన్ని కాపీ చేస్తున్నపుడు వచ్చినవే).

4) బైబుల్‌లోని ప్రతి భాగం–విశ్వాసానికి, నీతికి సంబంధినదే గాక_ప్రేరణవలన వ్రాయబడినదే.

**బైబుల్ కర్తవ్యం**

1) క్రీస్తునాథుడు జీవించారని రుజువువర్చటానికి తిరుసభ పుట్టుకను నిదర్శన పూర్వకంగా చూపించటానికి మనం బైబుల్‌ను ఒక యథార్థమైన చరిత్రగా నుపయో-

గించవచ్చు. తిరుసభ దైవస్థాపితమైనదని చెప్పటానికి బైబుల్‌లో నిదర్శనాలు చాల వున్నాయి. తిరుసభ దైవసంబంధమైనదని మనం ఒక్కసారి గుర్తించిన తర్వాత బైబుల్ ఒక నిజమైన చరిత్రేగాక అది దైవ ప్రేరితమైనదని కూడా తిరుసభ చెప్పినపుడు మనం ఆ మాటలను నమ్మగలం. బైబుల్ ప్రేరణవలన తయారైందని మొదట మనం చెప్పం. ఆటుతర్వాత తిరుసభను నిదర్శనా పూర్వకంగా సమర్థించ ప్రయత్నించం. కాని బైబుల్ ఒక యథార్థమైన చరిత్ర మాత్రమే గాదని, అది దేవుని వాక్యమని తెలుసుకొనటానికి తిరుసభమీద ఆధారపడతాము.

2) సైన్సును గాక మతాన్ని బోధించటమే బైబుల్‌పని. శాస్త్రీయ పరిభాషలో మనకు బైబుల్ బోధచేయదు. సైన్సుకు సంబంధించిన విషయాల కోసం నిదర్శనాలకోసం మనం బైబులును చూడం. మానవ ప్రకృతిని గూర్చి, దేవునిగూర్చి చేయబడిన ఆవిష్కరణను తెలుసుకొనటానికి మనము బైబుల్‌ను చదువుతాము. బైబుల్, తిరుసభ అంటే యేమిటో జాగ్రత్తగా, సక్రమంగా అర్థం చేసుకొన్నట్లయితే అవి సైన్సుకు భయపడ నవసరంలేదు.

3) ఒక గ్రంథంలో తమ మతం వున్నదని క్రీస్తునాథుడు యే సూచనచేయలేదని మేము చెప్పాము. కాని ఆయన తమ సత్యాలను నిర్వచనార్థం తిరుసభను యేర్పాటు చేశారని చెప్పాము. ఒక అసంపూర్ణమైన గ్రంథంమీద నీవుయేలా ఆధారపడతావు? యెప్పటికైనా మారటానికి అవకాశం గల గ్రంథాన్ని ఏలా ఆధారంగా తీసుకోగలవు? ప్రతి వ్యక్తిని బైబుల్‌లో చెయ్యి పెట్టనివ్వడం, అర్థం చెప్పనివ్వడం తెలివితక్కువ తనంగదూ? క్రీస్తునాథుడు చెప్పిన మాటలే—సరిగా అవ్వే—బైబుల్‌లో వున్నాయని, తిరుసభ లేకుండా మనం ఏలా తెలుసుకోగలం? అసంభవం గదూ!

4) బైబుల్ ప్రతి కతోలికునకు ఒక స్నేహితుని వంటిది. "అందులో సుఖదుఃఖాలున్నాయి. అది దయ, సానుభూతులను వివరిస్తుంది. ప్రతిమానవ హృదయం యొక్క ఆధ్యాత్మిక గాథ అందులో వున్నది. అదిఅందరి మనస్తత్వాలకు తగినటువంటిది." క్రీస్తునాథుని

గూర్చి నేర్చుకోవాలనే వ్యక్తికి బైబుల్ సమగ్రమైన గ్రంథం కాదని చెప్పటంలో, బైబుల్‌కుండే సరియైన విలువ తిరుసభ తొలగించటం లేదు. బైబుల్‌ను చదవటం వలన తిరుసభ ఫలములు నిస్తుంది. దాన్ని పట్టుదలతో చదవమని తిరుసభ చెబుతున్నది. దేవుని వాక్యములో గర్భితమైన సత్య సౌందర్యాలను పూర్తిగా తెలుసుకొని పూర్తిగా ఆనందించాలంటే కొన్ని సంవత్సరాలు నిరంతర ప్రయత్నం, కృషి అవసరం. నిశితంగా, దీర్ఘంగా, లోతుగా ఆ పేజీలను ఆలోచించిన తర్వాతనే నిజం అందలి సత్యాల, ఉపదేశాల యథార్థతత్వం గోచర మవుతుంది.

**ఆచరణ**

(1) బైబులు గ్రంథాలు స్వల్పంగా వున్నపుడు గుడిగోడలన్నీ బైబులు సత్యాలకు సంబంధించిన చిత్రాలతో అలంకరింపబడినవి. ఈ విధంగా చేయటం "బైబుల్‌ను ప్రజల కందివ్వటం గాదూ?"

(2) మధ్య యుగాలలో సువిశేషాలు దివ్య సత్ప్రసాదంతో పాటు సత్ప్రసాద పెట్టెలో నుంచబడేవి. దానిని బట్టి బైబుల్ విషయమై తిరుసభ తన వైఖరిని యెట్లా చూపుచుండునో తెలుసుకోనవచ్చు. సువిశేషాలలోనివి శాశ్వతసత్యాలు. సువిశేషము యెదుట పూజబలి సమయంలో హారతి యీయబడుచున్నది.

(3) పాతనిబంధన గ్రంథాల పేర్లన్నీ నేర్చుకో. అప్పుడప్పుడు కీర్తనలను, ఇజయాసులోని కొన్ని ప్రకరణాలను చదువుతుండు.

## ఇరువది యైదవ అధ్యాయము

### అద్భుతములు

**అద్భుతాలంటే యేమిటి?**

అద్భుతాలంటే ప్రకృతిసంబంధమైన శక్తులచేగాక, దైవశక్తిచే చేయబడిన ప్రకృతి కలవి కాని మహత్తర కార్యాలు. ప్రకృతి శాసనం అమలు జరగటంలో దేవుడు జోక్యం కలిగించుకొనటమే దైవ సంబంధమైన అద్భుతమని అర్థం. దేవుడు జోక్యంకలిగించుకొనటమనేది యే ఒక సందర్భంలోనో, యే ఒక ప్రత్యేక విషయములోనో జరుగుతుంటుంది. ఆత్మల

నుద్ధరించటం, భూభ్రమణాన్ని సరిగా నుంచటం అద్భుతాలుగావు. ఎందువలనంటే మొట్ట మొదటిది రహస్యమైనది, కంటి కగుపించనిది. రెండవది సాధారణమైనది. అసలు అద్భుతమంటే అసాధారణమైన పని. పనిలో అసాధారణత్వమైనా కనుపించాలి. (చనిపోయిన వారిని బ్రతికించుట) లేక దాని ఫలితాలలో అసాధారణత్వమైనా గోచరించాలి (అపోస్తులకు విజ్ఞానాన్ని కలిగించటం).

**అద్భుతాల సంభావన** ప్రపంచాన్ని పాలించేటటువంటి దేవుడు లేరనే వారికి అద్భుతాలనేవి అసాధ్యమైనవిగా కనిపిస్తవి. కాని ప్రపంచాన్ని నడిపిస్తున్న ఒకానొక మహత్తర మూర్తిని నమ్మేవాళ్లు, దేవుడే తన పనులలో జోక్యం కలిగించు కుంటుంటారనే సూచనను అంగీకరించటంలో యేమీ వెనుకంజవేయరు. ప్రకృతిలో జరిగేపనులు కొన్ని నియమితమైన శాసనాల ప్రకారం జరుగుతవని నీకు తెలుసు. భూమ్యాకర్షణ శక్తి, క్షయము కావటం, పెరగటం యీలాంటివన్నీ ప్రకృతి సిద్ధంగా జరిగే పనులు. కాని యీచట్టముల నన్నింటినీ చేసిందిదేవుడే. కనుక ఆయన చేసినపనులు ఆయన చిత్తం వచ్చినపుడు యెందుకు మార్చలేరు? తను చేసినపనిలో మార్పు తేగల శక్తిలేని కళాకారుడులేడు. తనుచేసిన శాసనాన్ని కొన్నియెడల అమలు లేకుండా చేయలేని శాసనకర్త లేడు. ఆలాంటి శక్తి, ఆలాంటి స్వేచ్ఛ జగత్సృష్టి కర్తయైన దేవునికి లేదూ?

మనము మనపనులలో మార్పులు పెడతాము. దైవము కూడ ప్రకృతి శాసనాల ప్రవర్తనలో తనశక్తిని ప్రయోగించి మార్పు తీసుకొని రావచ్చును. ఒక కుర్రవాడు ఒకరాతిని గాలిలో విసరుతుంటాడు. అంతమాత్రముచేత భూమ్యాకర్షణ శక్తికేమీ భంగంరాదు. ఆ ఆకర్షణ శక్తికి వ్యతిరేకంగా చేస్తుంటాడు. ఆలాగే అద్భుతాలు కూడా ప్రకృతి నియమాలను, శాసనాలను మార్చవు. వాటికి అవరోధం కల్పించవు. సంశయాత్మకము కావు. అవి ఒకానొక సమయములో జరుపబడే మహత్తర కార్యాలు.

**అద్భుతాలు నిజంగా వున్నాయి** భూతకాలంలో: బైబుల్ చాల అద్భుతాలను గూర్చి చెబుతుంది. క్రీస్తునాథుడు అద్భుతాలను చేసిన వృత్తాంతాన్ని ఆయన శత్రువులే కాదనలేరు. అపోస్తులులు కూడా అద్భుతాలు చేశారని వారంగీకరిస్తారు. (అపో. చర్యలు. 4-16) సైంటిస్టులని పిలువబడే వారికన్నా నిజాయితీలు గల్గిన సాక్షులే అసలు జరిగిన విషయాన్ని వున్నదున్నట్లు చెబుతారు. మృతుడైన నాల్గురోజుల అనంతరం తిరిగి ప్రాణం గలిగిన వానికి చేసిన అద్భుతాన్ని గూర్చి చెప్పటంలో ఒక సాధారణ వ్యక్తి నిజమైన సాక్ష్యమిస్తాడు. అతన్ని విశ్వశించవచ్చు. యథార్థంగా జరిగిన అద్భుతాలను గూర్చి సాక్ష్యమివ్వటానికి మనకనేక మంది సాక్షులున్నారు. ఎంతో సాక్ష్యమున్నది. మనం అద్భుతాలు అని చెప్పుకునే వాటిని చాలవరకు సహజమైన వాటిక్రింద జమకట్టవచ్చు. కాని యీలాంటి దాన్ని (మృతులలో నుండి నాల్గవ దినం లేపటం) దైవ సంబంధమైన దాన్నిగా పరిగణించాలి. అందులో దేవుని ప్రమేయం లేకపోతే, అందులో దేవుడు జోక్యం కలుగజేసుకొని వుండకపోతే అలాంటి అద్భుతం జరగటానికి అవకాశమే లేదు.

వర్తమాన కాలంలో: ఒకవ్యక్తి ద్వారా అద్భుతాలు చేయబడినవని ఖచ్చితంగా రుజువైతే తప్ప తిరుసభ ఆ వ్యక్తిని అర్చ్యశిష్టులని పిలువదు. అర్చ్యశిష్ట తెరేజమ్మగారి విషయంలో జరిగిన అద్భుతాలు, లూర్దు గుహవద్ద సాధించిన విజయాలు అలాంటివే. వాటిని జాగ్రత్తగా పరిశీలించు.

**అద్భుతాల విలువ** క్రీస్తునాథుడు దైవ పంపితుడని రుజువు చేయడానికి అద్భుతాలు సహాయపడును. అవి వారి పిత ఘనతను ప్రత్యక్షంగా నిరూపిస్తున్నాయి. ఆయన దేవుని దగ్గర నుండి వచ్చినాడంటానికి అవి ప్రబల సాక్ష్యాలు. ఆయన బోధనలు దైవంనుంచి వచ్చినవని అవి స్థిరీకరించాయి.

క్రీస్తునాథుడు బాధాపీడితులైన మానవాళి యెడలగల సానుభూతి వలననే అద్భుతాలను జేశారు. అందుకనే, ఆత్మోద్ధరణ కోసం

పని చేయుటానికి క్రీస్తునాథుడు వచ్చినట్లు స్పష్టం చేయటానికి అవి ప్రత్యక్షంగా కనిపిస్తుంటాయి. రోగపీడితులను రక్షించటమనేది సైతాను వశ్యులనుండి ఆత్మల నుద్ధరించుటమనే దానికి గుర్తు

క్రీస్తునాథుడిలోకానికి వచ్చినపుడు ప్రపంచం మూఢనమ్మకాలతో నిండివున్నది. కాబట్టి, నిజమైన దేవునిలో ప్రజలకు నమ్మకము కుదర్చటానికి ప్రబలమైన సాక్ష్యం అవసరమైంది. ఈ పనిని ఆయన అద్భుతాలే సాధించాయి. "సత్యోపదేశం యొక్క ఘనతను చూపటానికి కాక, యెందుకు సత్యోపదేశాన్ని అంగీకరించాలి" అన్న దానికి నిదర్శనాలు వున్నాయి. అచేతన పదార్థాలమీద, పంటల మీద, మానవుల మీద, మృత్యువుమీద ఆయనకేలాంటి అధికారమున్నదో, శక్తి సామర్థ్యాలున్నవో ఆయన చేసిన అద్భుతాలను పరిశీలిస్తే తెలుస్తుంది. చేపల రొట్టెల పెరుగుదల అద్భుతాన్ని జనులను దివ్యసత్ప్రసాదానికి తయారు చేయుటకు చేశారు. కాని యీనాడు ఆలాంటి అద్భుతాల అవసరం లేదు. ఎందువలనంటే కతోలిక వేదం సత్యమైనదని చెప్పటానికి యింక యితరమైన సాక్ష్యాలు యెన్నోవున్నాయి. మన మతం క్రొత్తదికాదు.

జరిగినవని చెప్పబడే అద్భుతాలన్నిటిని కతోలికులు నమ్మక్కరలేదు. వాటిని గూర్చి తిరుసభ చేసే నిర్ణయాల కోసం వేచి వుంటాడు కతోలిక వ్యక్తి. ఆలాచేయుటం వలన అతని తెలివితేటలు వ్యక్తమవుతాయి. అద్భుతాలనేవి మనం పశుప్రాయంగా విశ్వసించాలని చేయబడవు. అవి నమ్మమని నిన్నాహ్వానిస్తున్నవి. ఎందువలనంటే దేవుడు యెవరిన్నీ తన రాజ్యంలో ప్రవేశింపమని ఒత్తిడిపెట్టడు.

**అద్భుతాలని యెట్లా తెలిసికో గలము**

1) అద్భుతాలు చేయువాని ప్రవర్తన, అతని వుద్దేశాలు. 2) ఆ పనులు పంచేంద్రియాలకు అందుబాటులో నుంటాయా? 3) అవి అసహ్యంగా వుంటవా లేక గోచరంగా వుంటవా? అంధుణ్ణి దృష్టిగలవానిగా చేయటం సరియైనదే. మంచిదే. కాని చనిపోయినవారితో మాట్లాడడం వృథా, అనవసరం, అసహ్యకరం కూడా.

4) మంచిపనులు చీకటిలో చేయనక్కరలేదు. పరలోకా-టను జూచి భయపడే వానికి గుర్తించుము.

**ఆచరణ**

1) హేరోదు కొరకు క్రీస్తునాథుడు అద్భుతాన్ని ఎందుకు చేయలేదు? (లూకా. 23,8)

2) అద్భుతం మంచిక్రియ. కాని దయ్యాలతో, భూతాలతో సంబంధం పెట్టుకొనడంవలన చాలమంది తెలివి తక్కువ వారైనారు. అట్టిచర్యద్వారా మంచి అనేది వస్తుందని నీవు అనుకుంటావా?

3) కొందరు భూతాలను పిలచి వాటిసహాయం పొందటానికి కొన్ని సమావేశాలు జరుపుతారు. అట్టి సమావేశాలకు కతోలికుడు వెళ్ళిన, క్రీస్తును దూషించినట్లే. పరలోకమును గురించి మనము యేమి తెలుసుకొనవలయునో అవి దైవము మనకుచెప్పారు. ఎందుకు ఆయన రహస్యములను యీ విధంగా తెలుసుకోవాలని ప్రయత్నిస్తావు

4) ఈ నాటి ప్రజలు విద్యావంతులైనందున పూర్వపువారి వలె అద్భుతాలను నమ్మరు. అందువలన అవి జరగవని కూడా హేళనగా మాట్లాడినప్పుడు మహాగొప్ప సైంటిస్టులే యెందుకో తంత్రాలు, భూతసహాయమున్నదంటె నమ్ముతారు అని నీవు తిరుగు చెప్పవచ్చు. ఈ దయ్యాల సహాయాన్ని నమ్మినప్పుడు అద్భుతాలను నమ్మడము అంత తెలివి తక్కువగాదు. జనముయొక్క విశ్వాస శీలత క్రీస్తు అద్భుతాలను నమ్మునట్లుచేయలేదు. అవి జరిగాయి కాబట్టి వాటిని నమ్మారు.

# ఇరువది ఆరవ అధ్యాయము

## పరిణామము

**సిద్ధాంతము**

మానవులు యెల్లప్పుడు వస్తువుల మూలమును గురించి నేర్చుకోవాలని ప్రబలాటపడుతుంటారు.

పరిణామ సిద్ధాంతం, పరిణామవాదం ప్రకారం ఈనాడున్న చెట్లు జంతువులు మొదట్లో అలాంటి స్థితిలోగాక మరొక స్థితిలో వుండేవని, అవి పరిణామముచెంది యీ నాడీస్థితికి వచ్చాయి. మానవుడు కూడా అలాగే కొంతవరకు జంతువు గనుక తక్కువజాతికి చెందిన ఒక మృగజాతినుండీ యీనాడీవిధంగా పరిణామము జెందినాడని అనుకోన బడుచున్నది.

**ఒప్పుకొనదగిన కొన్ని విషయాలు**

ఈ పరిణామ సిద్ధాంతం కేవలం భౌతికమైన వస్తువుల విషయంలోనే వ్యవహరించ గలదు గనుక భౌతికసంబంధమైన వస్తువుల పుట్టుకను గూర్చిన సమాధానం తప్పుమరియే యితరమైన దాన్ని యివ్వలేదు. అనగా ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించిన సమాధానాన్ని యివ్వలేదని అర్థం.

అయితే భౌతికమైన వస్తువుల పుట్టుకకు సంబంధించిన సమాధానాన్ని యివ్వటం గాని లేక దానికోసం వెతకటం గానీ సైంటిస్టుల పని. ఇక యీ సైంటిస్టు తనపనిని ఆరంభించబోవు ముందు ప్రకృతిని పరిశీలిస్తాడు జంతుశాస్త్రం, వస్తుశాస్త్రం, భూగోళశాస్త్రం, శరీర శాస్త్రం యీ లాంటివన్ని తిరిగేసి జీవితం అనేది వ్రాత రికార్డులు అమలునకు రాక పూర్వంనుంచే వున్నదని తగిన సాక్ష్యాన్ని సేకరిస్తాడు. అక్కడక్కడ లభించే కొన్ని అస్థిపంజరాలను బట్టి, తదితర అంశాలను బట్టి, శతాబ్దాల తరబడిగావున్న జంతుజాలం అంతస్తులను కనుగొంటాడు. ఈలా పరిశీలన చేయటం వలన, చేస్తున్న సందర్భంలో జంతువులలో కొన్నిరకాలు ఆదిలోవున్న తక్కువరకపు ఆకృతులనుండి ఆవిర్భవించినవని తోచుచున్నది.

మానవుడు తక్కువరకపు జంతువునుండి పరిణమించాడనే సాక్ష్యం యీ నాటికీ సంపూర్ణమైనదిగాదు. దానిమీద వాదోప వాదాలు, తర్జన భర్జనలు జరుగుతునే వున్నాయి కాని యింకా సాక్ష్యం పూర్తికేవరకు సైంటిస్టు ఒక నిర్ణయానికి రారాదు. అలాంటి సందర్భంలో సైంటిస్టు త్వరపడి ఒక నిర్ణయానికి రావడం మంచిదిగాదు. "మానవ శరీరానికి మూలం జంతువే అని చెప్పటానికి తగిన సాక్ష్యాన్ని సైన్సు యొక్క దీర్ఘకాలపు పరిశోధనలు కూడా సమకూర్చలేక పోయినాయి"

**దాని ప్రమాదకర దృక్పథం**

పరిణామ వాదంలోకి దిగి చాలమంది దేవుడున్నాడన్న భావాన్ని నాశనంచేయడానికి వాంఛించారు గనుక, కొందరు పరిశోధనలు జరుపుతూ దేవునియందు విశ్వాసాన్ని కోల్పోయారు గనుక, పరిణామ వాదము దైవాన్ని, దైవ విశ్వాసాన్ని నాశనము చేయునని ఆయన సృజనాత్మకమైన క్రియలను కాదనునను భావము కలిగినది. కొందరు దేవుడు అవసరము లేదని, దైవభావము మానవుడే స్వంతగా ఆరంభించాడని అన్నారు.

ఈ భావాలు నిజమైన విద్యావంతుల, పండితప్రకాండుల, యథార్థమైన సైంటిస్టుల భావాలు కావు. మిడి మిడి జ్ఞానంకల మధ్య తరగతి వ్యక్తులు, తల తిరుగుడు మనుష్యులు యీ రకమైన పనిచేస్తారు. ఆలోచించిచూస్తే యీ లాంటిరకపు మనుష్యులే పరిణామ సిద్ధాంతానికి అనవసరమైన ప్రచారాన్ని తీసుకువస్తారు. కాని యేమాత్రం యింగిత జ్ఞానం, మెదడు వున్నవ్యక్తి యీ విషయాన్ని సులభంగా గ్రహిస్తాడు. ఏ పరిమాణము వాదమైనా దానివెనుక దేవుడనే వ్యక్తి వున్నాడని ఆయన లేకపోతే అసలు యేదీలేదని తేలిగ్గా అంచనా వేసుకుంటాడు.

ఈ పరిణామ వాదం గూర్చి యెక్కువ శ్రద్ధతీసుకుంటే క్రమంగా శరీరంమీద దృష్టి, ఆ సక్తి యెక్కువౌతవి. ఆత్మ విషయంలో అవేవీ కన్పడవు. ఈ విధంగా భౌతిక వాదం రంగంలో ప్రవేశించి మానవ

జాతిని అధమస్థితికి తీసుకొని పోతున్నది. కొందరు నాస్తిక వాదుల సిద్ధాంతాల ప్రకారము పరిణామవాదం అనేది చాల ప్రమాదకరమైనది, విపత్కరమైనదీను. ఎందువలనంటే దీని ఆశయం మానవుని తలంపులను ఆత్మదగ్గరనుండీ, దేవుని దగ్గరనుండి దూరం చేయటమే.

**పరిణామ వాదం ఋజు వయితే**

పరిణామవాదం గనక ఋజువైనట్లయితే తిరుసభ భయపడవలసిన అవసరం లేదు. ఎందుకంటే నిజమైన పరిణామ వాదం యెన్నడూ దేవునికా దనదు. పై పెచ్చు ఆయన్ని గూర్చి యెక్కువగా ప్రబోధిస్తుంది కూడ. శతాబ్దాల క్రితం ప్రసిద్ధ కతోలికు తత్త్వవేత్తయిన అర్చ్యశిష్ట అగు స్తీనువంటి ప్రముఖులు యీ పరిణామ వాదం గూర్చి చర్చించారు. అసలు పరిణామ వాదమే సమర్థింపబడునెడల అది మనకు భగవంతుని గూర్చి యింకను యెక్కువ వివరణయిస్తుంది. "సర్వపదార్థాలను- పరిణామ వాదంలోని శక్తిసంపన్నతను గూడ- దైవమే సృష్టించి వుంటా"డని చెప్పదలిస్తే కతోలికులకు కూడా యిష్టమే. "పరిణామ వాదము వాస్తవమేనని రేపు సిద్ధాంతంగా అంగీకరింప బడినా- ప్రారంభంలో- దేవుడే సృష్టించెనన్నమాటకు మార్పు లేదు."

బైబుల్ మతాన్ని తప్ప సైన్సును ప్రబోధించటానికి వ్రాయబడలేదని జ్ఞాపకముంచుకొనటం మంచిది. ఆదికాండము సృష్టికి సంబంధించిన రహస్యాలను బైటపెడుతుంది. ఆ గ్రంథం మానవునికి దేవుడే కారణం అన్న పరమ సత్యాన్ని చెబుతుంది. అసలు జీవితానికి సంబంధించిన నడక యావత్తు దేవుని శక్తివలననే సాగుతున్నదని తెలుసుకుంటేచాలు. ఈ నడక పరిణామ వాదానికి సంబంధించినా సంబంధించక పోయినా అది మనకనవసరం. అసలు ఆ పరిణామమును వివరించటానికి, విశదం చేయుటానికి దేవుడవసరం. దేవుడు లేకపోతే యేది పరిణామాన్ని పొందలేదు. పరిణామమున్న అదంత "దేవుడు చేస్తున్నదే, దేవుడు నడపిస్తున్నదే. దేవుడు మార్గదర్శకత్వం వహిస్తున్నదే. అది యెక్కడికి పోతున్నదీ దేవునికి తెలుసు." దేవుని కట్టడల ద్వారా ప్రకృతిలో అభివృద్ధి జరుగుచున్న దన్న అంశం, మార్పులు కనిపిస్తున్నవన్న అంశం దేవుని శక్తి సామర్థ్యాలను, ఘనతను స్పష్టాతిస్పష్టంగా తెలుపుతున్నాయి.

**తిరుసభ బోధన** దేవుడు ప్రత్యక్షంగా ఆదాము ఆత్మను సృష్టించాడని, ప్రతిమానవుని ఆత్మను సృష్టిస్తాడని, ఈ ఆత్మ ఆధ్యాత్మిక సంబంధమైనదని ప్రతి కతోలికు విశ్వసించాలి. ఈ మానవుని ఆత్మ పరిణామవాదానికి గురికాదు. ఏదో జంతువుల నుండి పరిణామాన్ని పొందగల్గినట్టిదికాదు. ఆత్మ అంటే ఒకానొక వస్తువు అది అగోచరము, అనన్య సామాన్యమూ అయినట్టిది. అది వేటితో కలిసి వుండలేదు. అదియేవో, ఏవో పదార్థాలు కలిస్తే తయారైంది కాదు. అది ఈ భౌతిక పదార్థాలతో సంబంధం కల్గినట్టిది కాదు.

మానవ శరీర పరిణామాన్ని గూర్చి తిరుసభ అధికారికంగా యింతవరకూ యేమీ చెప్పలేదు. ఈ విషయంలో పరిశోధనలు జరుప వచ్చు; వాదోపవాదాలు చేయవచ్చు. దీని ఫలింతమేది ఏలా అయినా, "ప్రపంచంలో చేయబడినదేదీ ఆయన లేకుండా చేయబడలేదని" తిరుసభకు తెలుసు.

**ఆచరణ** 1) శరీరమొక్కటే మానవుడు కాదు. అది మానవున్నిగా చేయదు. అదొక్కటే లెక్కలోనికిరాదు. లెక్కలోనికొచ్చేదల్లా ఆత్మ ఒక్కటే. ఈ భావాన్నే యెల్లప్పుడూ మనస్సులో కలిగివుండు.

2) సైంటిస్టులను పరిణామవాదంగూర్చి చర్చించనీయి. మతాన్ని తన రంగంలో పని చెయ్యనియ్యి. శాస్త్రజ్ఞులు వాళ్ల హద్దులు యెంతవరకో అంతలోనే వుండాలని వాళ్ళని ఒత్తిడిచెయ్యి. ఎవరి కిందులో యెంత తాహతువుందో అందులో అంతవరకు దాన్ని గూర్చి ప్రసంగించాలి. మత సంబంధమైన విషయాల్లో నిర్ణయాలను చేయటానికి సైంటిస్టులుగా వారికేమీ తెలివితేటలు లేవు. పక్షపాతపరుడైన సైంటిస్టుకంటె "దోవనపోయే మనిషి" మత సంబంధమైన సత్యానికి దగ్గరగా వుండవచ్చు.

3) మంచి శాస్త్రజ్ఞులు తగిన సాక్ష్యము లేనిచోట ఏ నిర్ణయాలకూ రారు గనుక, ప్రచారము కొరకు ప్రాకులాడే మధ్య తరగతుల శాస్త్రజ్ఞులనుంచి నీవు సి భావాలను నేర్చుకోవచ్చు. అవి స్థిరము కావు.

---

# ఇరువదిఏడవ అధ్యాయము

## తీవ్రవాదము— (Radicalism)

**దాని వివిధార్థాలు- కారణాలు** సమాజాభివృద్ధికి యీ నాడు యెన్నో వుద్యమాలు బైలు దేరినాయి. ఈ వుద్యమాలవంక నీ దృష్టిని యెప్పుడో ఒకప్పుడు త్రిప్పుతావు. వాటిని గురించి తెలుసుకోవాలని అసలు సాంఘిక సమస్యలకు తగిన పరిష్కారమంటూ ఒక దాని కనుక్కొనటానికి నీవు నీ తెలివి తేటలను, నీ దీర్ఘపు టాలోచనను వుపయోగించ అవసర మొస్తున్నది.

మన జీవితాలలో చాల అసమానత్వాలు, హెచ్చుతగ్గులు వుండటం వలననే సమాజంలో ఒక విధంగా అశాంతి సంభవిస్తున్నది. ఒక శ్రమజీవి తిండికి జరక్క అనేక విధాల అవస్థపడుతూ, తన యజమాని సర్వ సౌఖ్యాలు, సమస్తభోగాలు అనుభవిస్తూ, డబ్బుతో మునిగి తేలుతూ ఆనందడోలికల్లో వూగుతుండడం జూచి నిందించటానికి కారణముంటుంది. మరికొందరి విషయంలో అలా కాదు. తమ అధమ పరిస్థితికి వారే కారకులు. వారి మందత, వారి చెడు యలవాటులే వారి స్థితికి కారణం. వాటిని చక్కజేయు విధానం యిప్పటిలో మీకు చెప్ప నవసరంలేదు. కాని ఆ పరిస్థితుల యెడ మన సంస్థితి యెలావుండాలనో మనం చర్చించవచ్చు

ఈ నాడు విద్యలో, పరిశ్రమలో, రాజకీయాల్లో, కళల్లో, సైన్సులో, మతంలో, సాధారణ సాంఘిక జీవితంలో తీవ్రమైన వుద్యమాలు కన్పిస్తున్నాయి. ఇవన్నీ కూడా మానవులకు స్వాభావికంగా వున్న మార్పువైపుకు పురోగమనాన్ని సాగిస్తాయి. మార్పు కలగాలన్న మానవుల ధోరణిని వ్యక్తం చేస్తాయి. ఈ తీవ్రత అనేది మార్పును, క్రొత్తదనాన్ని కోరుతుంది. ఈ తీవ్రవాదం, మౌలికవాదం కోరే మార్పులను బట్టి దాన్ని అతివాదమని, మితవాదమని అనవచ్చు. వీటికిగల అర్థాలు వాటిని వుపయోగించే వ్యక్తినిబట్టి వుంటాయికూడ. ఒక యజమాని ఒక కార్మిక సంఘాన్ని యిది చాలా తీవ్రంగా వుంటుంది అని అంటే, దాన్నే ఆ సంఘాన్నే ఒక సోషలిస్టు ఇది తీవ్రమైన రాజకీయ మార్పులను వ్యతిరేకిస్తుంది. ఇది అంతా బూజుపట్టిన

సిద్ధాంతాలకు కట్టుబడి వుంటుంది అని అంటాడు. ఈ సోషలిస్టు మాటలకు మళ్ళీ కమ్యూనిస్టు ఒప్పుకోడు. అతనిది మరీ తీవ్రపక్షోరకం. మౌలిక వాదం, తీవ్రత అన్న పదంలోని అర్థం వాటిని వుపయోగించే వ్యక్తులనుబట్టి వుంటుంది. తీవ్రవాద వుద్యమాలలో కూడ కొంత మిత వాదం అణగివుంది. పాత నమ్మకాలయందు కొంత భక్తివుంది కనుక ఎవరి చిత్తం వచ్చినట్లు వారా పదాన్ని వాడుతూ పామరజనాన్ని తప్పుత్రోవన పెడుతున్నారు. సహేతుకమైన సంస్కరణలు కోరే వారిని సోషలిస్టులని అనడం తప్పుడు అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తుంది.

కమ్యూనిజము, బోల్షివిజము ఇవి రెండు సోషలిజము యొక్క అతివాదరూపాలు. కార్మికసంఘాలు, ప్రగతిప్రణాళికలు, యివి మిత వాదంలో కూడ వున్నవి. వీటిని పై అతివాదంతో జతపరచరాదు.

**సోషలిజం** సోషలిజం అనేది యీ క్రింది వాటిమీద ఆధారపడ్డది. 1) ఈనాడు సాంఘిక వ్యవస్థాక్రమం దివాలా తీసిన దని (2) దీనికి కారణం వ్యక్తిగత ఆస్తులేనని, వ్యక్తిగత పెట్టుబడులు కలిగి వుండుటేనని (3) పెట్టుబడిమీద సమిష్టి యాజమాన్య మున్ననాడు పరిస్థితులు చక్కబడతవని సోషలిజం అంటున్నది

ఇవిగాక మరిరెండు భావాలు కూడ వున్నాయి. ఇవి సోషలిస్టు వుద్యమంలో ఒక భాగ మంటారు. చుట్టుప్రక్కలున్న వాతావర ణాన్ని బట్టి ప్రవర్తన, నడవడి రూపొందించ బడతవని, మానవ స్వభా వం అనేది, మానవ ప్రకృతి అనేది పరిపూర్ణత్వాన్ని, సమగ్రత్వాన్ని పొందగల తాహతు గలదని నమ్ముతారు. వీటిలో మొదటిదాని వలన తన భవిష్యత్తుకు రూపురేఖలు దిద్దుకొనటానికి వ్యక్తికిగల శక్తి సామర్థ్యాలు, స్వేచ్ఛ కాదనబడతవి. అనగా భవిష్యత్తును తీర్చి దిద్దు కొనగల శక్తిసామర్థ్యాలు వ్యక్తికిలేదని మొదటిది స్పష్టంగా చెబు తుంది. ఇక రెండవది గాలిమేడలతో కూడిన ఆదర్శాలు కనుగుణంగా సంస్కరణలకు దారితీస్తుంది.

అసలు సోషలిజం చరిత్ర చదివితే దీనికి నాస్తిక వాదమంటే యిష్టమని తెలుస్తుంది. నాస్తికవాదంతో సంబంధం కల్గివున్నట్లు తెలు

స్తుంది. అంతేగాక, స్వేచ్ఛాప్రేమ, వర్గవైమనస్యం, తప్పు ఒప్పు అని నిర్ణయించు ప్రమాణములను నిరాకరించుట మొదలైన వాటితో సహాకరిస్తుంది. సంఘంలోవున్న చెడు పరిస్థితులను ఆర్థిక అసమానత్వాలను గురించి చెప్పటవలన ప్రజాహృదయాలను ఆ కట్టుకొన్నది. ఆదర్శప్రాయమైన రాజ్యాంగాన్ని సాధించాలని, అది సోషలిజం వలన సాధ్యమవుతుందని చెప్పటవలన అనేకమంది అనుయాయులను సంపాదించుకొన్నది. సోషలిజం అసాధ్యమైన వాంఛిక పరిపూర్ణత్వాన్ని సమర్థిస్తుంది. మానవజాతి శతాబ్దాల తరబడిగా ఒక గుణపాఠం నేర్చుకొంటూ వస్తున్నది. అది యేమిటంటే ప్రకృతిని [illegible] చేసికొనకుండా, ఆధ్యాత్మిక సత్యాలను విశ్వసించకుండా సంఘ సంస్కరణలను సాధించలేము అని. ఐతే దాన్ని కాదంటుంది సోషలిజం. సంస్కరణ అనేది కొన్ని సంస్థలద్వారా సాధించవచ్చునని చెబుతుంది. ఇదే అసంబంధం. "శక్తి అంతటినీ వుపయోగించి దేవునిలోగల నమ్మకాలను తొలగించడమే మా పని. నాస్తికవాద వ్యాప్తికి తోడ్పడని వ్యక్తి చెప్పుకోతగిన మనిషికాదు" అని ఒక సోషలిస్టు అన్నాడు. దీన్నిబట్టి సోషలిజం నిజ స్వరూప మేమిటో బైటపడ్డది. సోషలిజం ఒక ఆర్థిక సిద్ధాంతమేగాదని తేల్తున్నది. తీవ్రమైన సోషలిజం దేవుని శత్రువు అని కూడా తేల్తున్నది. అలాంటి సందర్భంలో కతోలిక్కు అతివాద సోషలిస్టు కాలేడు. పైగా మరోసంగతి యేమిటీ అంటే యే రకమైన ప్రభుత్వ విధానంక్రిందైనా వుచ్ఛదశ వుండదని సంపూర్ణస్థితి వుండదని గుర్తించుకోవాలి.

**బోల్షివిజం** ఈ నాడు రష్యాలో వుంటున్న బోల్షివిజం కమ్యూనిజం యొక్క అతివాద (తీవ్రమైన) రూపమే ప్రజానీకం పరిస్థితులను చక్కపెట్టటానికే బోల్షివిజం యదార్థంగా ప్రయత్నిస్తుంటే దానికి మన సానుభూతి వుంటుంది. కాని యీనాడు అది యితర దేశాలలో అవలంభించే విధానాలను చూచిన పిమ్మట దాన్ని మనం అంగీకరించలేము. 18 సంవత్సరాల లోపల వున్నవారికి మతాన్ని బోధించటం నేరమని బోల్షివిజం అంటుంది. "దేవునిలో, దేవుని కుమారునిలో విశ్వాసాన్ని తొలగించటం బోల్షివిక్ స్కూలు ఒక విధిగా పెట్టు

కున్నది. వారికి దేవుడుగాని, మతంగాని అవసరంలేదు. అలాంటి సందర్భంలో అది కతోలికుల కెలా ప్రియమవుతుంది ?

రాడికల్ పార్టీ వ్యక్తులు, కమ్యూనిస్టులు అంత పెద్ద బాధాకరమైన శత్రువులు కారు. దేశభక్తి అను పేరుతో స్వార్థప్రయోజనాల సాధించు వ్యక్తులను మొదట జైలుకు పంపాల్సి వుంటుంది. సాంఘిక న్యాయంకోసం నిలబడే నాయకులను, రాజ్యాంగబద్ధమైన సిద్ధాంతాలను కాపాడే నాయకులకోసం మనం వెదకాల.

**సంస్కరణలో జాగ్రత్త**

ప్రపంచంలో సాంఘికంగా చాల అన్యాయమున్నది. శాసనాలు అమలుజరుపుటలో అశ్రద్ధవున్నది. బీద సాదల కుటుంబాలలో చాల విచారకరమైన పరిస్థితులుంటున్నాయి. ఆలాగే ధనవంతులలోనూ వుంటున్నాయి. ఇవన్ని రాజ్యాంగం చక్కదిద్దవలసిన వ్యవహారాలు వీటిని పరిష్కారం చేయటంలో చాల జాగ్రత్త కనుపరచాలి. లేకపోతే మంచికి బదులు చెడే సంభవించటం జరుగుతుంది.

సాంఘిక సంస్కరణల మొట్టమొదటి నిబంధన దేవుని శాసనంమీద, కట్టడిమీద సంఘ సంస్కరణకు పునాదులు వేయాలి. ఈనాడు సంస్కరణలని చెప్పుకొనబడు చున్నవి పతనానికి మార్గాన్ని సముఖంగా చేస్తాయి. అవి వ్యక్తిని పురోగమింపచేయ లేవు. తనంతట తాను యే పనీ ప్రారంభించలేడు. అసలతనిలో వ్యక్తిత్వాన్ని యివి పెంపొందింపవు. ప్రథమంలో వ్యక్తియందు నైతికోపదేశము ద్వారా కొన్ని విశ్వాసాలను నమ్మకాలను కల్గించాలి. అతనిలోని దురభ్యాసాలు, దురలవాట్లు క్రమేనా తగ్గునట్లు చెయ్యాలి. అతనిలోని లోపాలను సరిదిద్దకుండా సంఘాన్ని సంస్కరిస్తామంటే అర్థంలేదు. దురభ్యాసాలయెడ హేయభావము కలుగునట్లు మనం సంఘమును చాల కాలము శ్రద్ధతో విసుగులేకుండా తర్ఫీదు చేయవలయును. ప్రజాభిప్రాయము మనము కూడగట్టుకున్నయెడల మనము అధములను ఉద్యోగములనుండి తొలగించవచ్చును. వారి స్థానములో నిజాయితీగల ఉద్యోగులుందురు, మరియు వుత్తమమైన, శుద్ధమైన సాహిత్యము, చలనచిత్రములు మనకు లభ్యమగును.

**తిరుసభ దృక్పథం** 1) సాంఘిక సంస్కరణ అనేది ముఖ్యంగా నైతికమైన ఆధ్యాత్మికమైన విధి అని కతోలికు తిరుసభ అంటున్నది. ప్రజాభిప్రాయాన్ని చైతన్యవంతంచేసి వుత్తమాదర్శాలను ఆచరణలో పెట్టి సాధించిన సంస్కరణలంటే తిరుసభ యిష్టపడుతుంది. విగత పద్ధతులన్నీ నిష్ప్రయోజనమైనప్పుడు మాత్రం శాసనాన్ని తీసుకురావడం ఆలోచింపదగినది. ఒక పని చేయాలంటే దాన్ని శాసనంద్వారా సాధిద్దామనుకోవడం యెంతో అవసరమైతే తప్ప యితర ప్రయత్నాలన్నీ విఫలమైతే తప్ప ఆలోచించరాదు.

సాంఘిక సమస్యలు దినాలుగడిచిన కొలదీ పెరిగిపోతున్న కారణంగా అవి చాల చిక్కువిగా కన్పడడం కారణంగా సాంఘిక న్యాయాన్ని కల్గించటానికి కొంతవరకు చెప్పుకోదగిన సత్ఫలితాలను చూడడానికి శాసనాలద్వారా పనిచేయవలసిన అవసరం కన్పడకుండా వుండటంలేదు. ఈ సాంఘిక న్యాయాన్ని కల్గించటానికి తిరుసభ చేసే ప్రయత్నములో నీ సహాయాన్ని ఆశిస్తుంది. మానవులందరు సోదరులే నను భావము ప్రతివారిలో నుండవలె.

2) శాంతి భద్రతలకు తిరుసభ మిత్రము. అరాచకత్వాన్ని అపేక్షించే వ్యక్తి, చెప్పుకోతగిన దాన్ని చేయగలడని తిరుసభ విశ్వసించదు. రాజద్రోహానికి, నేరానికి, అరాచకత్వానికి సంబంధించిన మాటలనువినవద్దని, తిరుసభ తనబిడ్డల నాదేశిస్తున్నది. వ్యక్తిస్వామ్యము అనే దాన్ని గనుక తొలగించినట్లయితే మానవుడు ఏ పనిని చేయటానికి వుద్దేశించడని స్వంత ఆస్థి అనేది గల్గివుండవలెనని తిరుసభ అంటున్నది.

తీవ్రవాదులైన ఛాందసులు కొందరు సాంఘిక సంస్కరణలను ప్రతిఘట్టంలో వ్యతిరేకించటానికి చూస్తారు. దాన్నే తిరుసభ గర్హిస్తుంది. సాంఘిక సంస్కరణలు గోరేవారి ప్రయత్నాలకు తిరుసభ మద్దతునిస్తుంది. కార్మిక జన శ్రేయస్సున కుపకరించు శాసనాలు ప్రాథమిక హక్కులను రక్షించు శాసనాలు అంగీకార యోగ్యాలు. ఇవి సాంఘిక న్యాయాన్ని తీసుకరావటాని కుపకరించును. కతోలిక విద్యార్థి సోదరప్రేమ చట్టమునననుసరించి ఆ బాధ్యతవలన యీ వుద్యమాలలో పాల్గొని సాంఘికాభ్యుదయానికి కృషిచేస్తాడు.

**ఆచరణ**

1) ధనము వర్గ విభేదాలను అనేకంగా కల్గిస్తున్నది అనే సాక్ష్యం నీకు వుంటే నీవు వాటి నివారణకు యేయే సలహాల నిస్తావు?

2) మన రోజుల్లో రాజకీయ స్వాతంత్ర్యం సురక్షితంగా వున్నదని, కాని ఆర్థిక పౌరసత్వ సంబధమైన స్వాతంత్ర్యాలు ప్రమాదావస్థలో నున్నవని ఒకరు చెప్పారు. ఇందులో యేది నిజం?

3) మన దేశంలో సాంఘిక న్యాయమునకై తిరుసభ యేమి చేయు చున్నదో చూడు. దాని సంబంధమైన ప్రచురణాలను చదువు.

---

# ఇరువది ఎనిమిదవ అధ్యాయము

## దైవ శ్రద్ధ

**ప్రపంచ కాఠిన్యము**

ఈ ప్రపంచములోనున్న యీనాటి బాధలను, అన్యాయములను చూచి కొందరు నిజంగ దేవుడున్నట్లయితే ఆయన యీ లోకములో శ్రద్ధ తీసుకొనడము లేదను అభిప్రాయానికి వస్తారు. మరికొందరు తమ తప్పిదాలకు యేవో కొన్ని సాకులు కారణాలు చెప్తారు. ఇంకా దైవము ముందుగానే తమను నరకానికి నిర్ణయించారు కాబట్టి తమకు పుణ్యజీవితం జీవించే అవకాశం లేదంటారు. దుర్మార్గులు భాగ్యవంతులవడము, సుఖముగ జీవించటం జూచి, నిజాయితీగల కొందరు అధైర్యాన్ని పొందుతారు. కృతజ్ఞత అనేది యీ లోకంలో అరుదు అనిపిస్తుంది.

**దేవునిగూర్చి జ్ఞాపకం వుంచుకోవలసిన విషయాలు**

1) ప్రతి మానవుడు దేవుని శక్తివలన యీ లోకంలోకి తీసుకొని రాబడ్డాడు. మానవులంతా తమ పనుల్లో శ్రద్ధగలిగివుంటే తన పోలికగ సృష్టించిన వారి విషయంలో దేవుడు అంతకన్నా యెక్కువ శ్రద్ధవహిస్తారు.

2) దేవుడు అంతంలేని వ్యక్తి. ఆద్యంతాలెరుగని మహామూర్తి. సర్వశక్తివంతుడు. ఆయన ప్రపంచమంతటిమీద శ్రద్ధను చూపించగల శక్తియున్నది. "అందరినీగూర్చి జాగ్రత తీసుకొను యే యితర దేవుడు లేడు." (విజ్ఞానము 12,13) "మనందరికి ఆయన దూరంగా లేడు. ఆయనలోనే మనం నివసిస్తున్నాము. ఆయనలోనే మనం వుంటున్నాం, కదలుచున్నాము" (అ పొ. చర్యలు 17,28). "ఆయన చిన్నవారిని పెద్దవారిని చేశాడు. ఆయన అందరిని సరిసమానమైన జాగ్రత్తతోనే చూస్తున్నాడు." (విజ్ఞానము 6,8). దేవుడు మన స్థితిగతులందు శ్రద్ధగలిగి వున్నాడనటానికి, దేవుడు చెప్పిన మాటలు వుండనే వున్నాయి.

3) క్రీస్తునాథుడు దేవుడు. ఆయన కరుణార్ద్రమూర్తి. చిన్న పిల్లలయెడల నయితం చాల జాగ్రత్త కనుబరుస్తారు. దేవుడు క్రీస్తు

నాథునికంటె వేరే విధంగా వుంటారని మనం యేలా అనుకోగలం? దేవునిలో వున్న లక్షణాలను ప్రపంచానికి క్రీస్తునాథుడు మానవ రూపమెత్తి ప్రదర్శించారు.

4) మనయెడల ప్రేమ వాత్సల్యాలను చూపునట్టి మహత్తర కార్యముగా స్లీవమరణము చూపబడినది. దివ్యసత్ప్రసాదము సర్వ మానవులయందు క్రీస్తునాథునికిగల శ్రద్ధను, ఆసక్తిని చూపునట్టి ప్రత్యక్ష నిదర్శనం.

5) మన జీవితకాలం యావత్తు ఒకానొక మహాపరీక్షా సమయం. దేవుడు మనల్ని పరీక్షలో పెడతారు. ఏదైనాజరిగితే జరిగిన ప్రతిపనికి కారణాలను వెతకలేవు. కాని మనకు "దేవుడు తన్ను నమ్మినవారి చేయి విడువడు. మీరు సహింపగల్గినంతకంటె యెక్కువగా ఆయన మిమ్ములను శోధింపనీయ్యడు." (కొరింతి 10,13) కనుక దైవసహాయంతో మన భవిష్యత్తుకు మనమే యజమానులము.

**చెడు ఉనికి** పెద్ద బుద్ధిగల వ్యక్తి చిన్నవారు గ్రహింపలేని పను లెన్నో చేస్తాడు. దేవుని దృష్టిలో మనం అందరం పిల్లలం. పిల్లలకు పెద్దలుచేసిన పనులు అర్థంగావు. అలాంటి సమయంలో మానవుల్ని సృష్టించిన దేవుని పనులు మానవులకెలా అర్థమౌతాయి? ఆయన కొన్ని పనులకు యెందుకు అనుమతినిస్తాడో మనం గ్రహించలేం. ఎందుకిలా చేస్తున్నాడో దురూహ్యం. మనబుద్ధి, విశ్వమానవ నమ్మకము ఒక దైవమున్నాడని చెబుతున్నాయి. దేవుడు దయగల తండ్రి, ప్రేమాస్పదుడైన తండ్రి అని క్రీస్తునాథుడు మనకుచెప్పాడు. ప్రపంచాన్ని యేర్పాటుచేయుటంలో దేవుడు తెలివిగా వ్యవహరించాడని మనకు తెలుసు. కాబట్టి మనము ఆయనయందు యెందుకు నమ్మకము గలిగియుండకూడదు. మనకు ఏదిమంచో, ఏది కావలయునో ఆయనకు తెలుసునని మనము యెందుకు విశ్వశించరాదు. ప్రపంచంలో చెడువున్నట్లయితే అది అలా వుండటానికి తగిన కారణమున్నది. ప్రతి సందర్భంలో మనకు కారణమనేది కన్పించక పోవచ్చు. కాని మనం చేయవలసిందల్లా వున్నదున్నట్లు ప్రపంచాన్ని (ప్రపంచంలోని వస్తువులను, ప్రపంచంలో జరిగే ప్రకృతి విశేషాలను) అంగీకరించటమే. అంగీకరించి వున్నపరిస్థి

తిని ఆక్రందన లేక చక్కజేసి కోవడము సరియైనవిధానము. మనం ఈ క్రింది విషయాలను కూడా తెలిసి కోవాలి.

I శారీరకకష్టాలు: (1) ఇవి మనం చేసిన ఆది పాపఫలితాలు.. మరియు మానవుడు చేసే పాపాలు చాల చెడుగులను తీసుక వస్తవి.. పాపం వినాశనానికి కారణమగును.

(2) దైవము శారీరకమైన అస్వస్థతనుంచి మంచినిచేకూర్చవచ్చు. (మానవుడు జబ్బులో వున్నప్పుడే దేవుడు జ్ఞాపకం వస్తాడు.)

(3) చెడుగున్న యెడల దానిని అధిగమించుటకు మానవులు ప్రయత్నించి అభివృద్ధి నొందుతారు. చెడుగు కన్పిస్తేనే మానవుడు మంచి కోసం కష్టపడతాడు. కనుకనే చెడుగువుండడం మంచికి మార్గాన్ని సుగమం చేయుట యనవచ్చు.

II నైతిక కీడులు: వీటికి అర్థం చెప్పొచ్చు. పాపం లేకుండా చెయ్యాలంటే దానికొక్కటే మార్గముండేది. అది మానవునకుగల స్వేచ్ఛను తీసివేయటమే. అనగా శోధింప బడటానికవకాశము లేదన్న మాట. దైవం పాపాలను కట్టుకొనిన వారిని మాత్రమే సృష్టించకలిగితే, అప్పుడు దైవశక్తి పరిమితమై వుంటుంది. అది ఒప్పుకొనుటకు వీలులేదు. చెడుగు లేకుండా చేయుటకంటె చెడుగునుంచి మంచిని తీయుటకు దైవం చిత్తగించారు. కాబట్టి నీవు చెడుగుతో పోరాడుతున్నావంటే, తప్పుడు త్రోవలో నడవాలని శోధనలు కలుగుతున్నాయంటే, యివి యన్ని నీవు మోక్షాని కర్హుడవాయని పరీక్షచేయుటకే. అందుకనే బాధలు పడుతున్నకొలదీ, వేదన లనుభవిస్తున్నకొలదీ, శోధనలకు తట్టుకొంటున్న కొలదీ మానవునికి మంచి దినాలు వస్తున్నవని అర్థం. కాని చెడుగు చేసేవ్యక్తులు, మోసంచేసే వ్యక్తులు, కుటిలాత్ములు, దుష్టులు-ఇలాంటివాళ్ళకే మంచిరోజులు వున్నట్లుమనం తలంచవచ్చు. కాని చిట్ట చివరకు వారు ఈ లోకము లోనే తగినఫలితము అనుభవిస్తారు. మనో శాంతిని పోగొట్టు కొంటారు. ఏలాటి వూరట వారికుండదు. నిజానికి చెడుగుచేసేవారిని ప్రకృతి సహించదు. ప్రకృతి శిక్షిస్తుంది. పాపాత్ముడు కూడా కొన్ని మంచికార్యాలను చేసి వుండవచ్చు. పాపములకు మన

స్థాపపడని పక్షమున మోక్షము లేదు. అందువలన పై మంచి కార్యము లకు మోక్షమున బహుమానము పొందుటకు వీలులేదు. కావున ఈ లోకముననే తగుబహుమతిని దైవము యిచ్చుచున్నాడని చెప్పవచ్చు. ఈ లోకంలో ప్రతి కార్యానికి వెంటనే ఫలితాల్ని బహూకరిస్తే అందరు సరియైన యుద్దేశంతో మంచి కార్యాలు చేయరుగదా.

మనవిధి 1)తన (దేవుని) యొక్క గొప్ప లక్షణాలను గూర్చి మనం ఆలోచించాలని ఆయన వుద్దేశం. మనయెడల ఆయన కనబరుస్తున్న శ్రద్ధనుగూర్చి తరచుగా యోచించే అలవాటును మనం అలవరచుకోవాలని దేవుడు వుద్దేశిస్తున్నాడు. అలాగే మన విషయంలో ఆయన కనబరుస్తున్న జాగ్రత్తనుగూర్చి, దయాదాక్షిణ్యాలనుగూర్చి, న్యాయాన్ని గూర్చి మనం అప్పుడప్పుడు తలపోస్తుండాలని ఆయన అభిమతం. కాని మానవులలో ఈలా చేసే వాళ్ళు యే కొలదిమంది మాత్రమో! సహృదయత్వం, సత్ చింతన గలవారు మాత్రమే ప్రతి ఆత్మయెడ దేవుని శ్రద్ధను గ్రహిస్తారు.

కొందరు దేవునియెడగల విశ్వాసాన్ని పోగొట్టు కుంటారు. దానికి కారణం వారు దేవుడు ప్రపంచాన్ని యేలా నడిపించేది గమనించక పోవటమే. అప్పుడప్పుడు ఈ లోకసందడిని వదలి ధ్యానము, ప్రార్థన చెయ్యి. మౌనమే మనశ్శాంతి కారకం. లోతైన నీళ్ళలో సంచలనం కలుగదు. అదేవిధంగ దైవముతో సన్నిహితత్వంగల జీవితం కూడ సులభంగా చలించదు.

2) నీవు యవ్వనుడవుగా నున్నపుడే బాధపడుతున్నపుడు ఓరిమిని అలవరుచుకో. ఒకమంచి పనిని చేస్తున్నపుడు అందులో నీవు ఓడిపోవుదు పనిగాని, అవమానానికి గురి అవుతావనిగాని భయపడకు ఆలా శాధ అనేదానికి ప్రపంచంలో ఒక ప్రత్యేక విశిష్టత ఉన్నది అది స్త్రీపురుషులను బాగుచేస్తుంది.

ఉత్తమమ్మైన ఆత్మల నున్న ప్రథిత
పావన పవిత్రతా గుణ వైభవమ్ము
అంధకారాన, సౌందర్య వ్యాప్తినలరు
పుష్పముల రూపునైనొనె పూన్కతోడ.

3) ప్రపంచం శాశ్వతమని అనుకోకు. జీవితం నశిస్తుంది. ధన సంపదలుండవు. పేరుప్రతిష్టలు సుస్థిరాలుగావు. ప్రపంచానికి నిలకడ అనేదిలేదు. అది అశాశ్వతం. ఇవన్ని అశాశ్వతాలే. కాని ఒకటి మాత్రం సత్యం. శాశ్వతం. ఒకటిమాత్రమే మనల్ని వున్నత స్థితికి గొని పోతుంది. ఒకటి మాత్రమే మానవునికి పరిపూర్ణత్వాన్ని స్థిరింప జేస్తుంది. ఒకటి మాత్రమే అనంత వైవిధ్యంతో చిత్ర విచిత్రంగా వున్న ఈ ప్రకృతి స్వరూపస్వభావాలను గూర్చి సరియైన నిర్వచనాన్ని అందివ్వగలదు.

4) ప్రతి వ్యక్తి గుడికిపోయినా పోకపోయినా దేవుని ఎడల కొన్ని బాధ్యతలను కలిగియున్నాడు. ఈ ప్రధానాంశాన్ని గుర్తించ డంలో నీ మిత్రులకు యెక్కువగా తోడ్పడు. వారికి సహాయంచేయి.

5) దేవునియెడల నమ్మకాన్ని కల్గివుండటంలో మానవుడు పురుషత్వాన్ని యే మాత్రం పోగొట్టుకోడు. జోబుని చరిత్ర చదివిన దేవునియందలి విశ్వాసమును పోగొట్టుకొనకుండా బాధలనెట్లు సహింప గలమో నేర్చుకుంటాము.

**ఆచరణ** 1) ఏదో ఒకనాడు మానవజాతి యే లోపములేకుండా వుంటుందని పరిపూర్ణత్వాన్ని పొందగలదని రోగాలు, నేరాలు ఈ లాంటివి తొలగిపోగలవని చాలమంది విశ్వసిస్తారు. ఈ సందర్భంలో ఆది పాపమనే సిద్ధాంతం నీకేమి నేర్పుతుంది?

2) వృద్ధులకు, అవిటివారికి సహాయము చేయటానికి తిరుసభ యే పద్ధతుల నవలంభిస్తుంది.

3) "విజ్ఞానము" అనే గ్రంథములోని మూడవ ప్రకరణమందలి ఐదవ పద్యాన్ని చదివి అందులోని అర్థాన్ని గూర్చి చర్చించు. తర్వాత ఆ పద్యాన్ని జ్ఞాపకముంచుకో.

---

# ఇరువది తొమ్మిదవ అధ్యాయము

## భవిష్య జీవితము.—అమరత్వము.

**కతోలిక బోధన**

అపోస్తులుడైన పౌలుడు హెబ్రీయులకు వ్రాసిన లేఖలో స్థిరమైన పట్టణము మన కిక్కడ లేదుగాని రాబోవుచున్న దానికోసం యెదురుచూచు చున్నాము అని వ్రాసినాడు. మృతిబొందిన తర్వాత జీవిత మున్నదా లేదా అని ప్రశ్నవేశే కొందరి ప్రబుద్ధులకీ పై వాక్యములు సరియైన సమాధానాన్ని తప్పక యివ్వగలవు.

వేదగ్రంథాలు "దేవుడు మట్టితో మానవుని రూపొందించి, అతని ముఖములో శ్వాసను వూదినాడు" (ఆదికాండము 11-7) అని చెబుతున్నవి. చనిపోయినపుడు యీ మట్టితో చేయబడిన శరీరం తిరిగి మట్టిలోకి జాతుఁదని మనకు తెలుసు కాని "జీవంతో వున్న ఆత్మ" మాత్రం మరొక జీవితంలోకి పోతుంది "మట్టి మళ్లీ మట్టిలోకే పోతుఁది. దైవమిచ్చిన ఆత్మ దేవునికి చెందుతుంది."

ఈ భావి జీవితం అనంతమైనది. అది దైవంతో చైతన్యస్థితి యందుంఢును. దానికి వ్యక్తిగత అమరత్వ ముంటుంది. పుణ్యాత్ముల కిది దైవానందనమున నుండును. వీరు మహిమాన్విత శరీరాలను కలిగి వుంటారు.

"ప్రాగసంబంధమైన శరీరంగా విత్తబడును, ఆత్మ సంబంధమైన శరీరముగ లేచును." (కొరింతి. 15,44)

కనుక దీన్నిబట్టి మానవుడు మృతి అయిన తర్వాత కూడా ఆత్మ అశరీరమైనందున జీవించగలదని, తిరిగి శరీరాన్ని పొందుతుందని తెలుస్తున్నది. నవ్యమైన, శాశ్వతమైన శరీరముతో కలిసేవరకు అది సజీవంగానే వుంటుంది. దాని లక్షణాలన్ని వుంటూనే వుంటాయి.

**ఈరకమైన బోధనకు కారణాలు**

1) రానున్న జీవితాన్ని, కలుగనున్న జీవితాన్ని పొందే విషయాన్ని ఆధారం చేసుకొని క్రీస్తునాధుని క్రియలు మాటలు వుంటాయి. "మీకు ఒక స్థానమును సిద్ధముచేయుటకు వెళ్లుచున్నాను. నేను తిరిగి

వచ్చేదను. నావద్దకు తీసుకు వెళ్ళేదను. నే నెక్కడ వున్నానో మీరూ అక్కడే వుండవచ్చు." (జ్యా. 14,2-3)

క్రీస్తునాథుడు దేవుడు. ఆయన మోక్షమునుండి వచ్చాడు. చనిపోయినతర్వాత జీవితమంటే యేమిటో ఆయనకు తెలుసు. అంతే గాక మన విశ్వాసానికి పాత్రుడనని ఋజువుచేసికొన్నాడు. కనుక నే ఆయన్ని నమ్మటం అన్నివిధాల క్షేమకరం. అంతేగాని చనిపోయిన తర్వాత జీవితంలేదు అని చెప్పేవారిని నమ్మటం మంచిదిగాదు. వారు తమ నమ్మకానికి కారణాలను చూపించలేరు.

2) మానవజాతి కెల్లప్పుడు అమరత్వంపై విశ్వాసమున్నది ఈలాంటి నమ్మకం, యీ రకమైన భావన వెనుక యీజిప్టు, చైనా గ్రీసు ప్రజల హృదయాలలో హత్తుకొనివుంది.

3) ఈ లోకంలో మానవుడు విసుగు విరామంలేకుండా శాంతి సౌఖ్యాలకోసం తహతహలాడటం, వాటిని సాధింప ప్రయత్నించ పూనుకోవడం జరుగుతున్నది. ఈ అంశాలను బట్టి చూస్తుంటే అతను యేదో మృత్యువు లేకుండా చేసుకోవాలని చూస్తున్నాడని అర్థమవు తుంది. ఏదో శాశ్వతానందమయ జీవితాన్ని గడపాలని వుత్సాహ లూగుచున్నట్లు అవగతమవుతుంది.

"ఓ ప్రభువా! మీకొఱకు నన్ను సృష్టించారు. నేను మీతో జేరేవరకు నా హృదయానికి పూరటలేదు. శాంతి లేదు." అని అర్చ్య అగుస్తీను అన్నాడు. కనుక మానవుడు యీ ప్రపంచాన్ని విడిచి మోక్షానికి చేరాలని ఆశిస్తూ అందుకుతగిన ప్రయత్నాలను చేస్తున్నా డని అర్థమవుతుంది.

మానవుని ఆశయాలన్నీ, వాంఛలన్నీ, అంతంలేనట్టి దేదయితే వుందో, దాని దగ్గరకు పోవాలనే, ఆ సర్వశక్తివంతుని జేరాలనే. తను భూమి అనే కారాగృహాన్ని అసహ్యించుకుంటున్నాడు. పర లోకానికి వెళతానని కలవరిస్తుంటాడు.

పర్వత ప్రాంతాల్లోకి వెళ్లి రమ్యమైన లోయప్రాంతాల్లోంచి మహోన్నతమైన శిఖరాలవైపు తన దృష్టిని సారిస్తాడు. ఆ పర్వతా

గ్రాన్నుంచి మేఘాలవైపు తన దృక్కులను పోనిస్తాడు. ఏదో ఒకనాడు అచ్చటికి పోతానుగదాయని ఆనందిస్తాడు. ఇంకా యీ లోకంలో తన ప్రయాణం సాగించాలనే అని మరోప్రక్క విచారపడుతూ వుంటాడు. అతడు అమరుడైన ఒక ఖైదీ. దైవము కొరకు సృంష్టిచ బడ్డాడు. కాని యింతలో అ వుత్తమస్థితికి పోవటానికి అతనికి అనుమతి లేదు ఆ మహత్తర స్థలాన్ని గురించి కలలు కననివ్వు. ఈలోకము తనకు స్థిరముకాదని క్షణక్షణము జ్ఞప్తియందుంచుకోనివ్వు.

4) మానవుడు న్యాయం జరగాలని కోరుకొంటున్నాడు. న్యాయము సమర్థించబడాలని వాంఛిస్తున్నాడు. సత్యమే చివరకు జయము పొందాలని ఆశిస్తున్నాడు. ఈ వీనివాంఛ లే అమరజీవితమున్న దనుటకు నిదర్శనము. ఇవన్నీ యెలాగో యిక్కడ పూర్తిగా జరగ వని తెలుసు. దానికి అనుభవం అనేది ప్రత్యక్షంగా వుండనే వున్నది. అసలు పరిస్థితులన్నీ సవ్యంగా సక్రమంగా చక్కబడేటటువంటి స్థలం అంటూ యేదొకటి వుండితీరాలి.

రూసో అను నతడు కతోలిక విశ్వాసంపైవు సుముఖత్వము లేనివాడు. అయినా అతను ఒకసారి యిలా అన్నాడు. "పాపాత్ములు వర్ధిల్లడం, న్యాయవంతులు బాధపడడంకంటె నాకు ఆత్మ అమరత్వా నికి యే యితరరుజువు లేనపుడు యిది ఒకటె చాలు. ఇది నానుండి అమరత్వాన్ని గురించిన సందేహాన్ని తీసివేస్తుంది. ఇటువంటి బాధా కర తారతమ్యాలు, అంతా యింతటితో ముగియవు. మృతిబొందిన తర్వాతనే క్రమం, శాంతి అనేవి కన్పిస్తాయి అన్న నిశ్చయానికి తెచ్చి నాయి. యదార్థానికి ఆఖరి పాప పుణ్యముల ప్రతిఫలదినమంటూ ఒకటి లేకపోతే జీవితమంటే అర్థంలేదు. పరిష్కారము చేయలేని ఒక అవకతవక వ్యవహారంగా జీవితం తయారవుతుంది.

5) మరోజీవితం వున్నట్లు మానవులు విశ్వసించకపోయినట్ల యితే, యిక్కడ యీలోకంలో జీవితాన్ని యేలా చక్కబరుచు కోవల్సింది, యేలా క్రమబద్ధం చేయవలసింది వారికి తెలియదు. ఈ మధ్య ఒక వ్యక్తి యీలా అన్నాడు: "చీకటి (మరోజీవితం) అనేది

రేమిటో తెలిస్తేతప్ప వెల్తురులో (యీ జీవితంలో) మానవులు స్వస్థతగ నైతికంగా బాగుగ వుండలేరు" క్రీస్తునాథుడు తన అనుచరులకు, తనను నమ్మినవారికి మరో జీవితాన్ని గూర్చి యిదమిద్ధంగా తెలియజేస్తారు.

6) నాశనముకాని ఆత్మకు గల వునికిని సైన్సు ఋజువుపర్చలేదు అని యెవరైనా అంటే దాన్ని గూర్చి మనం పెద్దగా పట్టించుకోనవసరం లేదు. కారణ మేమిటంటే ఆత్మతో వ్యవహరించటం దానిచే తగదు. మానవ భావిజీవితాన్ని తెలిసికొనటానికి అమరత్వాన్ని నిరూపించుకోటానికి నేనెట్లు బ్యాంకు మేనేజరుదగ్గరకు, రాజకీయవాదుల దగ్గరకు వెళ్లనో, అదేవిధముగ సైంటిస్టుల దగ్గరకు వెళ్లనని ఒక మేధావి అన్నాడు. సైన్సుకు భౌతిక ప్రపంచంతో ధాతు పదార్థములతో మాత్రమే సంబంధం వున్నది. ఆత్మ అనేది ఆధ్యాత్మిక సంబంధమైనది. మానవాతీతమైనది. అది సైన్సుకు వశంకానిది. లొంగనిది. మైక్రోస్కోపుకు ఆత్మ అందదు. ఆత్మను తెలుసుకోవాలంటే యితర పద్ధతులను అవలంభించాలి. అవే ఆధ్యాత్మిక సంబంధమైన పద్ధతులు. పైపెచ్చు చనిపోయిన తర్వాత ఆత్మ జీవించదని సైన్సు నిరూపణ చేయలేదు.

**కాదన్నా సత్యం సత్యమే**

ఆత్మ అమరత్వాన్ని నమ్మనివారు కొందరు యెప్పుడూ వుంటారు. "భావిజీవిత ప్రభావము యీ జీవితముపై శాశించటమే మేము వ్యతిరేకించేది" అని వారంటారు. తమ నిర్దేశాలకు తగిన రుజువు లివ్వకపోయినా అజాగ్రత్తులైన కొందరిని మోసము చేస్తారు. నీవు కొంచెము ముసలివాడ వైనప్పటికి వాళ్లు చెప్పినది యెవరు నమ్మరు, పట్టించుకోరు. కాని కోట్లకొలది అమరత్వాన్ని నమ్ముతూనే వుంటారు. ఒక సైంటిస్టు తన రంగానికి వెలుపలకువచ్చి అమర జీవితం లేదని చెపితే తెలివిగల వాడెవుకు దాన్ని పట్టించుకోడు.

**ఆచరణ**

1) అమరత్వ మనగానేమి? అటు విద్యావంతులయందు యిటు నిరక్షరాస్యులయందు అమరత్వమునందు యెందుకు నమ్మకమున్నది?

2) శరీరాలు తిరిగి ప్రాణాన్ని పొందటానికి (పునరుత్థానాన్ని పొందటానికి) భూమిలో విత్తనాలు నాశనం కావదానికి సామ్య మేమిటి? మృతులైన వారిని కాల్చవద్దని (దహనం చేయవద్దని) తిరుసభ యెందుకు ఆంక్షను విధిస్తుంది?

3) తాను చనిపోయేముందు ఒక ప్రసిద్ధ సైంటిస్టు హెర్బర్టు స్పెన్సరు కతోలిక స్నేహితునితో యిలా అన్నాడు: "నీకున్న విశ్వాసాన్ని పొందటానికి నాకున్న సర్వస్వము యిస్తాను" దీన్నిబట్టి విశ్వాసాన్ని పోగొట్టుకున్నవారు యెంతవిలువను పోగొట్టుకుంటారో తెలిసికో! అమరత్వంలోని విశ్వాసము నీ జీవితముపై యేలాటి ప్రభావము కలిగి వుంటుంది?

---

# ముప్పదియవ అధ్యాయము

## సింహావలోకనం

**విశ్వాసం** నీ మతంలో రెండురకాల సత్యాలున్నవని నీకు తెలుసు. వాటిలో మొదటిది: నీవు నమ్మవలసిన విషయాలకు సంబంధించినది; వాటినే విశ్వాససత్యాలు, సిద్ధాంత సత్యాలు (dogmatic truths)అందాము. ఇక రెండవది నైతిక సత్యాలు (moral truths) ఇవి నీవు చేయవలసిన వాటికి సంబంధించినవి. మనం యింతవరకు సిద్ధాంతాలకు సంబంధించిన సత్యాలను మాత్రమే ఆలోచించాము. దేవుడు, ఆవిష్కరణ, ఆవిష్కరణదూత వీటినిగురించి తెలుసుకున్నాం. తాను చెప్పిన సత్యాల రక్షణకై క్రీస్తునాధుడు గైకొనిన చర్యలను తెలుసుకున్నాం. తమ సత్యాలను తిరుసభ రక్షణలో యుంచిరి. తన సత్యాలను నమ్మినవారికి తిరుసభను మార్గదర్శనంగా చేసిన అంశాన్నికూడా గమనించాం. తర్వాత శతాబ్దాల తరబడి ఆయన అనుచరులు మతంకోసం పడిన పాట్లను, యెదుర్కొనిన క్లిష్ట పరిస్థితులను గుర్తించినాము. వారు ఒక పరీక్షనుండి మరొక పరీక్షకు నిలబడినారు. ఒకటివెంట నొకటి పోరాటాలకు తట్టుకున్నారు. నానా అగచాట్లు పడ్డారు కాని దైవవిశ్వాసాన్ని మాత్రం గోల్పోలేదు 19 శతాబ్దాలపాటు బాధలు పడుతూ యేలా 20వ శతాబ్దంలో ప్రవేశించారో, యీ శతాబ్దంలో ప్రవేశించిన వారు యెలా జీవిత నైతిక ప్రశ్నలకు సరియైన సమాధానాలిస్తూ నిలబడుతున్నారో మనం అవగాహన చేసుకున్నాం. వేద సత్యాలను తిరుసభ యేలా ఖచ్చితంగా పొరబడకుండా చెప్పినది, అద్భుతాలను యెలా వివరించి చెప్పినదీ చూచినాము. నాశనములేని ఆత్మలో మానవుని హోదా యిమిడి వున్నదని తిరుసభ చెప్పుచున్న విషయాన్ని, తన బిడ్డలకు జ్ఞానస్నానమిచ్చి వారిని మోక్షవారసులుగాచేయుటను వారిని సుఖవంతమైన భవిష్యజ్జీవితానికి పురోగమనాన్ని సాగింపమని సమాయత్తం చేయుటను చూచియున్నాము.

ఇదంతాకూడా సిద్ధాంతానికి సంబంధించినదే. ఏది నమ్మాలనో సిద్ధాంతం చెబుతుంది. నీలో నమ్మకాలను పుట్టిస్తుంది. విశ్వాసాలను

గల్గిస్తుంది. క్రీస్తునాథుని వ్యక్తిగతంగా ప్రేమించటానికి తగిన పునాదిని అది నీకు యేర్పరుస్తుంది.

**విశ్వాసంతోపాటు క్రియలుకూడా**

కేవలం నీ విశ్వాసంచేత నిన్ను క్రీస్తునాథుని నిజమైన అనుచరుడవు అని పిలువటానికి వీలు లేదు. ఆ విశ్వాసం అనేది కార్యరూపేణ కన్పించాలి. నీవు ఒంటరిగా వున్నపుడు అర్చ్. జాన్ వ్రాసిన యీ క్రింది వాక్యాలను మననం చేసుకో. ఈ విషయాలు తెలిసివుంటే, వాటిని ఆచరణలో పెట్టినట్లయితే నీవు ఆశీర్వదింపబడుదువు. (జాన్ 13,17). ఇక అర్చ్. చిన్నప్పగారు వ్రాసిన యీ వాక్యాన్ని కూడా చదువు. "వేదచట్టము ననుసరించి ప్రవర్తించువారే నీతిమంతు లగుదురు."

కనుక పై అంశాలనుబట్టి తేలింది యేమిటంటే మన విశ్వాస మనేది మన క్రియలయందు కన్పించాలి. క్రీస్తు తన అనుచరులు పవిత్రాత్ములుగా, దయార్ద్ర హృదయులుగా, ప్రార్థనా పరులుగా, నీతి నిజాయితీ పరులుగా వుండాలని వాంఛించారు. ఆయన అభిమతం ప్రకారం నీవు వుండటానికి, నడుచుకోటానికి నేర్చుకోవాలి. అపుడే నిజమైన క్రీస్తువుడవు కాగలవు.

నీ విశ్వాసాన్ని దైనందిన జీవితంలో యెట్లు ఆచరణలో పెట్టగలవనేదే సమస్య. మొదట అష్టభాగ్యాలను చదువు. వాటిని అర్థం చేసుకో. వాటిని ప్రత్యేకంగా స్వంతమాటలతో వ్రాసుకో. ఒక నెల వరకు ఒక అష్టభాగ్యాన్ని తీసుకొని దానినెట్లు నీ దైనందిన జీవితంలో అనుసరించావో చూచుకో. నీ మనోసాక్షి నీకు చెబుతుంది నీవు క్రీస్తు ఆదర్శాల ప్రకారం నడిచావా లేదా అని.

**నీకు మార్గంచూపే మాతృమూర్తి**

నీవు సంపాదించుకున్న జ్ఞానం నీవు దేవుని పవిత్ర హృదయంతో సేవించుటకు, మన నాథుని శాసనాల కనుగుణంగా నడవటానికెలా తోడ్పడుతుంతో చూద్దాం. దేవుడు తమ కొరకఆత్మను సంరక్షణార్థమై యిచ్చారని ప్రతి బాలుడు బాలిక గ్రహించటం చాల వుత్కృష్ట విషయం. ఇది చాల గొప్పబాధ్యత.

ఎవరి తెలివి తేటలు యెట్లావున్నా. యేఒక్కరూ అప్రధానులుకారు. ప్రతి ఒక్కరు దేవునియెదుట తమకు వ్యక్తిగత బాధ్యతలున్నాయని గ్రహించాలి.

---

దేవుని యెడల నీవు యెలా నీ విద్యుక్తధర్మాలను నెరవేర్చ వలసిందీ చెప్పటానికి క్రీస్తునాధుడు భూలోకానికి వచ్చారు. నిన్ను నడిపించే దర్శకుడు ఆయనే. ఆయన ఒక్కడే నిన్ను పరిపూర్ణమైన ఆధ్యాత్మిక స్థితికి తీసుకవస్తారు. కాని యువతీ యువకులు తనదగ్గరకు చేరాలంటే వారికొక మార్గము చూపువ్యక్తి కావాలని ఆయనకు తెలుసు. యువతీ యువకులు యెలా తప్పుదోవలో సునాయాసంగా పడతారో ఆయనకు బాగా తెలుసు. ఇవన్నీ తెలుసు గనుకనే నీకు దోవచూపటానికి, తమ్ము అనుసరించడములో నీకు తోడ్పడటానికి ఆయన తిరుసభను నెలకొల్పాడు. ఆమె మాతృమూర్తి.

ఈ తిరుసభకు అత్యద్భుతమైన చరిత్ర ఉన్నదని చెప్పటం డాంబీకం కాదు. అనేకమంది యువక జీవితాలలో అది బ్రహ్మాండమైన మార్పులను తీసుకవచ్చింది. ఆమెలో ఒక మహత్తరమైన శక్తి వున్నది. అదే మానవులలోగల ఆధ్యాత్మిక సంబంధమైన, ఆత్మ సంబధమైన సంభావ్యాలను (possibilities) ఫలవంతం చేస్తుంది. ఆమె అలాచేయగల్గుతున్నదీ అంటే ఆమెకు క్రీస్తునాధుడు తోడుగా వుండి ఆమెతో పాటు పనిచేస్తున్నారు. అంతేగాక ఆమెలోవుండి పనిచేయిస్తున్నారు. పుణ్యవంతులైన తల్లులను, వుత్తములైన తండ్రులను, స్వార్థత్యాగం గల గురువులను, మత కన్యలను, చక్కని జీవితం జీవించు బిడ్డలను నీవు చూచివుండవచ్చు. పైవారిని అన్నికాలాల్లో అన్నివాతావరణాలలో పూజదగ్గర చూచివుంటావు. వారంతా అనేక విధాలైన పరీక్షలను నిలువగల్గటం, కష్టాలను బాధలను ఓరిమితో సహించటం నీవు కనుగొన్నావు. వారి మాదిరి జీవించటానికి ప్రయత్నించకపోతే నీవు యివిఅన్నీ చూచి లాభంలేదు. క్రీస్తు పాదాలలో నడవటానికి నీకు తోడ్పడటానికి తిరుసభ యున్నది. క్రీస్తుతో నీకు వ్యక్తిగత సఖ్యతను చేకూర్చటానికి నీకు సహాయపడుతుంది. ఆమె నీకు ఆధ్యాత్మిక మాతృమూర్తి.

తిరుసభ ఘటికులైన స్త్రీ పురుషులను తయారుచేయగలదో లేదో యని ప్రతి శతాబ్దములో తిరుసభను సవాలుచేశారు కాని వారు అనుకున్నదానికి వ్యతిరేకంగానే జరిగింది. మనదేశంలో కూడ అలాంటి వ్యక్తులు బయలుదేరటం మీపై ఆధారపడియున్నది. అది మీరు క్రీస్తునాథుని వెంబడించటంలో అణిగిఉంది.

**ఆచరణ** 1) ఏ విశ్వాసం గూర్చిగాని, ఏ మతంగూర్చిగాని ఆలోచన లేకుండానేమంచి జీవితాన్ని జీవించానని యెవరైనా నీతో అంటే నీ విచ్చే సమాధానం యేమిటి?

2) క్రీస్తునాథుడు జన్మించిన తర్వాత పరిశుద్ధ మరియమ్మ జీవితంలో చాల అసాధారణాంశాలు కన్పించాయి. అసాధారణమైన పనులు జరిగాయి. అప్పుడామె "ఈ మాటలన్నియు తన హృదయంలో నుంచుకొని ధ్యానించుచుండెను." (లూకా 2,19). ఈ విధంగా మననం చేసుకొనటం ద్వారా ఆమె దేవుని విధానాలన్నిటిని గూర్చి ఎక్కువగా మెచ్చుకొన్నదని నీవు అనుకొనవూ?

3) ఈ క్రింది వాక్యాలను పరిశీలించు: "పిచ్చివాడు గావటం, పిచ్చివాడుగా వుండటం సులభం. పతితమతస్థుడుగా వుండటం సులభం. నవ్యుడవుగా (Modernist) వుండడం సులభం. తప్పుత్రోవలో పడటం సులభం. ఒకవస్తువు అనేక విధాలుగా క్రిందపడవచ్చు. కాని ఒక ప్రక్కనే అది నిలబడేది. ఈ తప్పులన్నిటినీ తప్పించుకోవడం ఒక మహా వీరకార్యం. స్వర్గమహారథం యుగాలమధ్య మహాధ్వనులతో గుమిస్తువుండగా పతితసిద్ధాంతాలు భూమిపై సాగిలపడి వుంటాయి. సత్యాలు గిర్రున తిరుగుతూ నిలువునావుంటాయి."

---

# ముప్పది ఒకటవ అధ్యాయము

తిరుసభ వచించేదాన్ని ప్రతివ్యక్తి కార్యారూపము ఆచరణలో చూపవలె.

**సరియైన దృక్పథం** నిన్ను నడిపించే వ్యక్తి క్రీస్తునాథుడని వెనుకటి అధ్యాయములో చదివావు. కాని ఆయన నీవద్దనుండి ఏమి ఆశిస్తూవున్నాడో ఆ విషయంగూర్చి నీకు బాగా తెల్సి వుండాలని ఆయన కోరిక. అంతేగాక నీకూ ఆయనకూ వ్యక్తిగతమైన సంబంధ బాంధవ్యాలుండాలని ఆయన అభిమతం. కనుకనే ఆయన తిరుసభ అనే మహా సంస్థను స్థాపించారు. తిరుసభే ఆయన ఏకైక ప్రతినిధి. ఆయన్ను నీ దగ్గరకు తీసుకువస్తుంది. ప్రతి బాలుడు ప్రతి బాలిక తన స్వంతంగా ఏ విశ్వాసాన్ని నమ్మకుండా తన త్రోవను కనుగొనాలని, క్రీస్తువుతో వ్యక్తిగత బాంధవ్యాన్ని కనుగొనాలని చెప్పడం తప్పుడు విషయం. అప్పుడప్పుడు కొందరు తమ ప్రత్యేక ప్రేరేపణవలన దైవాన్ని కనుగొనమని అంటూ వుంటారు. దానిలో సత్యంకంటె మోసం ఎక్కువ. చరిత్రను మననము చేసిన, క్రీస్తునాథుని ఆనతులను అనుసరించిన వారే సరియైన ఫలితాన్ని పొందారు, విజయాలను సాధించారు, అని గ్రహిస్తావు.

**తిరుసభ లక్ష్యం** తిరుసభ పూర్తి వుద్దేశం నీ ఆత్మకు మోక్షాన్ని ప్రసాదించటమే. దేవునిపొందే విషయంలో ఆ సంస్థ నీకు సాయపడుతుంది. అందుకని ఆమె క్రీస్తునాథుని సిద్ధాంతాలను స్వీకరించి వాటిని నీకు అర్థమయ్యేటట్లుగా చేయటానికి ప్రయత్నిస్తుంది. నీకు అర్థమయ్యే భాషలో వెలుతుంది. ఆమె యొక్క సంస్థలు, విద్యాలయాలు, గుడులు, సాంగ్యాలు, శాసనాలు యివన్నీకూడ నీ జీవితంలో ఆయనను ప్రధానమూర్తిగా చేయటానికి స్థాపించబడినవే.

కాగా తిరుసభ వ్యక్తిగతంగా నీ కొరకు వున్నదేనని నీవు గుర్తించాలి. అంటే క్రీస్తునాథుని సిద్ధాంతాలను ఆచరణలో పెట్టే బాధ్యత నీపై గలదని అర్థం. వాటిని నీవు ఆలా చేయటానికి యెవరైనా సహాయపడాలి. ఆ సహాయం చేయటానికే తిరుసభ ప్రత్యే

కించియున్నది. తిరుసభ నియమం ప్రకారం, కట్టడి ప్రకారం నడచుకో నవసరం లేదని ఒక వ్యక్తి యెవరైనా అనుకోవచ్చు. ఆ నియమం అనేది తనకుకాదనీ, మరియింకొకరికనీ భావించవచ్చు. ఇది విచారకరమైన పొరపాటు.

ఇక ఇంకొక తప్పేమిటీ అంటే: క్రీస్తునాధుడు చెప్పినటుల యెవరో ఒకరు నడుచుకోవడం లేదు. కాబట్టే నేనూ నడుచుకోవడం లేదని అంటాడు మరోవ్యక్తి. ఇది మరీ పెద్ద పొరపాటు. ఎవరో సరిగా నడుచుకోలేదు కనుక నేనూ నడుచుకోను అంటే అర్ధమేమిటి? ఎవరో నీచంగా ప్రవర్తిస్తున్నారని మనమూ నీచంగా వుంటామా?

నీవు ప్రయత్నం చేయకుండా వుంటే నిన్ను యెవరూ దేవుని సన్నిధికి జేర్చలేరు. కతోలిక విశ్వాసాన్ని మెచ్చుకోగల అభిరుచిని నీలో యెవరు పెంపొందించలేరు. దేవుని అనుగ్రహంవలన ఆ అభిరుచిని నీయంతట నీవే పెంపొందించుకోవలసి వుంటుంది. కనుక నే ఆయన అనుగ్రహాన్ని సంపాదించు. స్వంతప్రయత్నముతో కృషిచెయ్యి.

దేవుడు నీయొద్ద ఆత్మను న్యాసముగ పెట్టారను తలంపు ఆశ్చర్యకరము గాదా? తిరుసభ దేవద్రవ్యాను మానములను నీ స్వాధీనం చేయడం అతిశయం గాదూ? తిరుసభ నీతో కలిసి నీ రక్షణార్ధం పనిచేయవలె. తిరుసభ యితరులకు యేమి చేసినా నీ విషయములో మాత్రము తిరుసభ చెప్పిన విషయాలను హృదయపూర్వకముగ స్వీకరించకపోతే నీ విషయంలో తిరుసభ విజయాన్ని సాధించలేదు.

**సమస్య** కొందరు బోధిస్తారు కాని ఆచరణలో పెట్టరు. అలాంటి వారిని నీవూ బహుశ కలుసుకొని వుండవచ్చు. అలాగే సరియైన విధంగా తమ మతాన్ని అర్థంచేసుకోనట్లు కన్పించే కొందరు కతోలికులనుకూడ నీవు చూచి వుండవచ్చు.

అన్ని విషయాలలో సరియైన దృక్పధాన్ని అలవరుచుకొనియుంటే, యువకులుకూడ వృద్ధులవలె యెంతో ఆనందాన్ని అనుభవిస్తారు. అసలు దేన్నైనా సరిగా నిర్వచనం చేసుకోవడంవలన, వున్న

మున్నట్లర్థంచేసు కోవడంవలన వ్యక్తి శాంతిని పొందగలడు. అసలు కష్టమైన విషయము యేమంటే యితరుల ఔదాసీన్యాన్ని మనం అధిగమించటం. దాని తర్వాత యింకా కష్టమైన సమస్య మన జీవితంలో తిరుసభ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడము.

| తేల్చవలసిన అంశాలు | తిరుసభ సమాధానాలు |
|---|---|
| 1. విశ్వాసాన్ని నిలుపుకోవడం | దేవద్రవ్యానుమానాలు, జపాలు, నివారణోపాయములు (Precautions) |
| 2. ఒకరి జీవితమున కెట్లు విలువకట్టుట | దేవుడు ప్రపంచాన్ని పాలిస్తున్నాడు మంచివాళ్లను బహూకరిస్తాడు, చెడ్డ వాళ్లను శిక్షిస్తాడు. |
| 3. మిత్రులు | గౌరవంగా, నీతిగా, సహకారిగా నుండాలి. |
| 4. క్రీస్తునాథుని యెడలగల వ్యక్తిగతమైన ప్రేమ | ధ్యానం, పఠనం, ప్రార్థన, మన ప్రభువుని దర్శించటం, దేవద్రవ్యానుమానాలు. |
| 5. చదువు | పద్ధతి, ప్లాను, శక్తి, పట్టు. |
| 6. గురుత్వం, సహోదరత్వం, కన్యాత్వం | నీవు, దేవుడు, ఆత్మగురువు. |
| 7. వివాహం | మహత్తరమైన బాధ్యతతో కూడిన ఒక పవిత్రమైన పిలుపు. |
| 8. వ్యాపార పద్ధతులు | నీ జీవితాశయంగా యెన్నుకొన్న వృత్తియొక్క నైతిక సిద్ధాంతాలను జాగ్రత్తగా పాటించు. |
| 9. సోదరప్రేమ | ఇతరులకు సేవచెయ్యి. వ్యక్తులలో వున్న మంచినే గ్రహించి, చెడును విడిచిపెట్టు. |
| 10. కుటుంబజీవిత ప్రమాణాన్ని వృద్ధి చేయటం | తిరుకుటుంభంమీద ఆధారపడియున్నది. క్రీస్తునాథుడు, బిడ్డలు కుటుంబము కేంద్రంగా వుండాలి. |

నీవు కతోలికు కానివారికి కతోలిక తిరుసభను గూర్చి వ్యాఖ్యానం చేసే వ్యక్తివి. నీవు యేది ఆచరణలో వేసుతున్నావో అది తిరుసభ బోధిస్తున్నది, ఆజ్ఞాపిస్తున్నదీను అని అతను అనుకుంటాడు. కనుక నీవు తిరుసభయొక్క, క్రీస్తునాధునియొక్క ప్రతినిధివి అని గ్రహించుకో. నీవు చేసేదాన్నిబట్టే తిరుసభనుగూర్చిన నిర్ణయం జరుగుతుందని గ్రహించుకో. పరమ పవిత్రమైన తిరుసభనుగూర్చి లోకం మంచిగా అనుకోవటంగాని, అది మహత్తరమైన విలువగలదని అనుకోవటంగాని నీవు చేసేక్రియలమీద ఆధారపడి వుంటుంది.

1) నీవు ప్రతిరోజూ గుడికి వెళ్తూవుండి, లంచాలు పడుతున్నట్లు అవినీతికరమైన జీవితాన్ని నడుపుతున్నట్లు కతోలికేతరునికి తెలిస్తే ఆతను కతోలికులందరూ కపట మనుష్యులని అంచనా వేసుకొంటాడు. కతోలికులందరూ నీమాదిరి వ్యక్తులే అని అనుకుంటాడు.

2) తనకు క్రీస్తునాధుని యెడల మహత్తరమైన గౌరవం గలదని, ఆయన నీకు బోధించిన ప్రతిదానిమీద పూజ్యభావమున్నదని తిరుసభ అంటున్నది. అలాంటి సమయంలో నీకు క్రీస్తునాధుని పేంటే గౌరవం లేకపోతే- దూషించటమే నీకు అలవాటు అయితే- కతోలికేతరులు తిరుసభనుగూర్చి యేమనుకుంటారు? క్రీస్తునాధుని యెడల నీకుగల గౌరవాన్నిగూర్చి వారేవిధంగా తలపోస్తారు?

3) తిరుసభ విడాకులను, తిరుసభకు వెలుపల వివాహమును నిషేదిస్తుందని ప్రపంచమంతటికి బాగా తెలుసు. తెలిసినపుడు నీవు ఆ నియమానికి, ఆ నిర్ణయానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే నీవు యితరుల కెంత దుర్మాత్రుక నిస్తున్నావో గ్రహించు.

4) మానవులకు మనోనిగ్రహాన్ని ప్రబోధించి, అనుసరణలో పెట్టునట్లు చేయగలనని తిరుసభ చెబుతుంది. అలాంటపుడు విద్యార్థుల లోను, యింకా ఇతరులలోనూ కన్పిస్తున్న అనిగ్రహమువలన యేవిధమైన అభిప్రాయ మేర్పడుతుంది? క్రీస్తునాధుడు నీలో వుండి నిన్ను పవిత్రీభూతంచేశారు. అలాంటపుడు దాన్నినీవు అపవిత్రం చేస్తావా?

5) పశుతుల్యులను తిరుసభ శాంతస్వభావులుగ జేసినది. నీవు నీకు ప్రియులుగవున్న తల్లిదండ్రులను, యితరులను క్రూరంగా, కఠినంగా చూస్తే వున్నతులైనవారు, వుత్తములైనవారు నిన్ను యేవిధంగా భావిస్తారు? నిన్నుగూర్చి వారు యేవిధంగా తలుస్తారు?

6) ఒక వ్యక్తి ప్రవర్తనకు, ఆలోచనలకు అతని సంభాషణే గీటురాయి. ఆహ్లాదకరమైన, చక్కని సంభాషణ యితరులలో మంచి భావాన్ని కలిగిస్తుంది. అది హృదయాన్ని ఆకర్షిస్తుంది. అలాంటి సంభాషణ యువతినిగాని, యువకునిగాని వున్నత మార్గంలో నడుచునట్లు చేస్తుంది. జీవితాన్ని జీవించతగినదిగా చేస్తుంది. కాగా పరిశుద్ధ మాతను వుత్త మాటకారి వ్యక్తిగాగాని లేక తన మాటలతో పేరు ప్రఖ్యాతులను నాశనంచేసే వ్యక్తిగా గాని మనం వూహించరాదు. ప్రస్తుతం క్రీస్తునాధునియొక్క విశ్వాస పాత్రులైన, జీవితపర్యంతం వుండగల స్నేహితులుగా వుండాలని మీరు కోరుకుంటున్నారు. ఆ కోరిక సఫలం కావాలంటే, అట్టి సదుపాయం కలుగాలంటే మీరు మీ స్నేహితులకు యధార్ధమైన కతోలిక సిద్ధాంతాలను బోధించండి. వారిని సత్య మార్గాన్వేషకులుగా చెయ్యాలి. మనస్ఫూర్తిగా మోకరించి ప్రార్ధన చేయాలి. ప్రతిదినం కొంతకాలం మననంతో, అంతర్వీక్షణతో గడపాలి. ఈ పనులన్నీ జయప్రదంగా చేయగలిగినపుడే మీరు క్రీస్తునాధునికి జీవితపర్యంతం విశ్వాసపాత్రులైన మిత్రులుగా వుండగలరు

**ఆచరణ** 1) కేవలం తమ సుగుణాలను గూర్చి డబ్బావాయించుకోవడం తప్పితే వాటిని ఆచరణలో పెట్టి చూపించని వారి విషయంలో జేసువు దృక్పధం యేమిటి?

2) నీకు మేలు చేస్తున్నానని అనుకొని, యధార్ధానికి నీకు చెడు అలవాట్లు నేర్పుతూ, నీచుట్టూ ప్రమాదకరమైన వాతావరణాన్ని సృష్టిస్తూ వుండే స్నేహితుని నీవు తోసివేస్తావా?

3) ఈ క్రింది వాక్యాలతో నీవు యేకీభవిస్తావా?

"నేను తిరుసభలో చేరాను నా అనుభవం వలన వాదనతో కతోలి కేతరులు కతోలికులు కారని తెలుసుకున్నారు. వాదనవలన

మతాంతరులు కావటం జరుగదు. ఐతే యేది అందుల కుపకరిస్తుందని ప్రశ్న? ఒక మంచి కతోలిక వ్యక్తి జీవితం ఉత్తమురాలైన కతోలిక స్త్రీ జీవితం- యెన్నో అతిశయ కార్యాలను సాధిస్తుంది. అందుకే ఆదర్శ ప్రాయకమైన జీవితాన్ని నడపాలనటం." మరో మతావలంబకు డీ విధంగా అన్నాడు: "నాకు నిజంగా అడ్డుగా నిలిచింది కతోలికుల నిర్లక్ష్యతే, వారి చెడుమాత్సకే. ఇది అకతోలికులను తిరుసభకు దూరంచేస్తుంది" ఈ పై మాటలను సావధానంగా పరిశీలించుము

4) ఇతరులను గురించిన ముచ్చటలు, కథలు చెప్పటంవలన శీల హంతకుడ వయ్యేదవనుట నిజమేనా?

5) నైతిక పుణ్యాము లెవ్వి? అవి ముఖ్యముగ యే సమయ సందర్భములలో ఆచరణలో పెట్టవలె?

6) తిరుసభ ఆజ్ఞలవలన నీ సంఘంలో కలిగిన సాంఘిక ఫలితాలను పేర్కొనుము.

7) దొంగతనములో, హింసించటంలో, యితరుల పేరు ప్రఖ్యాతులకు హాని కరంగా ప్రవర్తించటంలో నీవు యెందుకు ప్రత్యార్పణ, పరిహారాలు చెల్లించ వలయును?

# ముప్పది రెండవ అధ్యాయము

## విచారణ జీవితంలో ప్రవేశించుట

**నీ విచారణ** నీవు దాదాపు ఏదో ఒక విచారణ సభ్యుడివిగా పెరిగి వుంటావు. ఆ విచారణ జీవితానికి, అక్కడ గుళ్ళకు భవనాలకు, అక్కడి ప్రజానీకానికి, అక్కడి మతకన్యలకు సోదరులకు నీవు అలవాటు పడివుంటావు. కనుక నీవు జీవితాన్ని ఆరంభించబోయే ముందు నీకు ఒక విచారణ అంటూ వుండాలి. అక్కడే నీవు ఆధ్యాత్మిక జీవితాన్ని నడుపుతావు. నీ యింట్లో నీవు కూర్చొని ఆధ్యాత్మిక జీవితాన్ని నడపటం గాదు. ఆ విచారణలోని అందరి మధ్య ఆధ్యాత్మిక జీవితాన్ని నడపాలి. అందరి ఆత్మలను రక్షించాలి. అందరిని బాగుచేయాలి అసలు కతోలికులు క్రీస్తునాధుని బహిరంగంగా ఆరాధించాలి ఆ పని జరగాలి అంటే విచారణ అంటూ ఒకటి వుండాలి ఆ విచారణ నీకు అట్టి శక్తిని ప్రసాదిస్తుంది. బహిరంగంగా మత విషయకమైన పస పాటలను కొనసాగించటానికి అదే నీకు కేంద్రంగా వుంటుంది.

కతోలిక మతమంటే కేవలం విశ్వాసం గాదు. క్రీస్తునాధుని సిద్ధాంతాలకు ప్రత్యక్ష సాక్ష్యంగా జీవితాన్ని నడపాలి. అలాంటి జీవితం విచారణకు సంబంధించిన జీవితంలోని విధులలోకి, కార్యకలాపాలలోకి ప్రవేశించటం వలన లభ్యమౌతుంది.

పిల్లలను పెంచటంలో, విద్యాబుద్ధులను గరపటంలో, ఎక్కువ సమయాలు గలవారు విచారణకు సంబంధించిన కార్య భారాన్ని సేకరించాలని మన ప్రభువు అభిమతం. మంచి చొరవగల్గిన, స్వార్థత్యాగం గల్గిన స్త్రీ పురుషులు, నిస్వార్థమైన వుత్సాహముగల బాల బాలికలు చాలామంది కావాలి. వారి వల్లనే యెంతో పని జరుగుతుంది. అసలు స్వార్థత్యాగం, వుత్సాహం ఈ రెండే ఏలాంటి పనైనా సాధించి తీరతవి. అందులో ముఖ్యంగా విచారణ వ్యవహారాల్లో యివి మరీ అవసరం. వీరికివారు బహిరంగంగా తన్నుగూర్చి ప్రార్థించేటట్లు నీవు చేయాలని క్రీస్తునాధుడు అభిలషిస్తున్నారు. ఆయనను అంటిపెట్టుకొని వుండటమనేది విచారణలో జరుగుతున్న పనుల వలననే తెలుస్తుంది. ఈ విషయంలో జాగ్రత్తగా వుండి వ్యవహరించటం నేర్చుకో!

**విచారణలోని భవనాలు** ప్రతి కతోలిక దేవాలయం జేసుస్వామి ఉనికిచే పరమపవిత్ర మగుచున్నది. ఆయనను గౌరవించ టానికి ఈ దేవాలయాలనేవి అత్యధికంగా తోడ్పడి నాయి. నీవు పెద్దవాడ వయిన తరువాత ఆ కట్టడాలమీద చెక్కబడిన వివిధములైన చిత్రాలను గూర్చి తెల్సుకోవడానికి ప్రయత్నించు. చిత్ర లేఖనం ద్వారా, శిల్పంద్వారా, వివిధ రంగులలో, వివిధాకృతులలో యున్న ఆధ్యాత్మిక సత్యాలను మనస్సు తెలుసుకుంటుంది. గుడి కిటికీల కున్న అదోరకపు గాజు తలుపులు, పెయింటింగులు నీ హృదయాన్ని హత్తుకోనియ్యి. నీవు పెరిగి పెద్దవాడ నవుతున్న కొలది, విచారణకు చెందిన ఆలయం దేవుని గృహమన్న భావనగూడ పెరిగి పెద్దదాన్న వనియ్యి. నీవు తరచుగా దేవాలయానికి వెళ్ళి ప్రభువుని చూడటానికి అలవాటు పడ్డావంటే ఒక విధమైన భయం, ఒక రకమైన గౌరవం ప్రశంసనలూ వృద్ధి అవుతాయి. దేవునియందు అలాంటి భయం, అట్టి గౌరవం కల్గకపోతే నీవు నిజమైన దైవభక్తుడివి గావు.

క్రీస్తునాథుని కోసం ఏదొక రోజున గుడిని చాల చక్కగా వుండే టట్లు చేయవచ్చు. మే నెల మరియమాత నెల. ఆ నెలలో బాల బాలి కలు పూలతో మరియమాతను అలంకరించి గౌరవిస్తారు. ఆ మాదిరి గానే నీవుగూడ విచారణలోని బడికి వెళ్లుతూ వారికి నీ వలన కావ ల్సిన పనులేమైనా వుంటే చేసిపెట్టు. ఆ బడికి పుస్తకాలను, విరాళాలను వసూలు చేసిపెట్టు. అప్పుడప్పుడు అవసరమైతే యేవైనా కార్యక్రమా లను ఏర్పాటుచేసి సభలను, సమావేశాలను జరుపుతుండు. ఆ విధంగా నీవు ప్రభువు యెడలగల భక్తి గౌరవాలను, విధేయతను వెల్లడించు!

**దైవసేవలు** నీవు యింటిదగ్గర దేవుని ప్రార్థించ గలుగుదువు. ప్రార్థి స్తావు. కాని అది చాలదు. బహిరంగంగా కూడా మానవజాతి తనకు శ్రద్ధాంజలులను ఘటించాలని ఆయన అభిమతం! తత్కారణంగానే ఆయన పూజలను నిర్ణయించాడు. దానివలన ప్రజలు ఆయనను బహిరంగంగా ఆరాధించ గలరు. ఆయనకు కృతజ్ఞతలను చెల్లించుకోగలరు. వారి పాపాల విముక్తి కొరకు ప్రార్థేయ పడగలరు.

దివ్యపూజకు హాజరగుట వలన నీవు నీ సృష్టి కర్తయెడల నాల్గు రకాల విధులను నెరవేర్చ గల్గిన వాడ వవుతున్నావు. యేసునాధుడు నీ కొరకు ఏంచేశారో వాటిని జ్ఞాపకానికి తెచ్చేదే ఆ దివ్యపూజ. అలాంటి పూజలో పాల్గొనటంవలన యెంత పరమ ప్రయోజనం గలదో పరికించి చూడు. నీకే తెలుస్తుంది. ఈ నాడు నీవు దాన్ని మొదలు పెట్టు. కొన్ని సంవత్సరాలయినాక నీకు దాని అసలు విషయమేమిటో ఆ మూలాగ్రంగా తెలుస్తుంది. అందులోని త్యాగం, బలి, దేవుని. వాక్కు, అద్భుతం, రహస్యం, ప్రార్థన, చరిత్ర, పద్యం, సాంకేతిక శాస్త్రం—యివన్ని యిమిడి యున్నాయని నీకు అవగతమౌతుంది. కనుక లోతుగా ఆలోచించి చూడు. ఈ దివ్య పూజలో గర్భితమై యున్న దాన్ని మెచ్చుకోవాలి అంటే ప్రార్థన, మననం, నిశ్చలమైన దృష్టి అవసరం. గురువుయొక్క కదలికలను గమనించు.

ఆ తర్వాత గురుపుంగవులు చెప్పే జపంలోని మాటల శక్తి సామర్థ్యములను గూర్చి యోచన చెయ్యి. వాటిలో క్రీస్తునాధుడు మోక్షమునుండి దిగి మానవుల మధ్య పనిచేయడానికి వచ్చిన విధం తమువుంది. ఆఖరికి ఆ పూజబలిలో పూర్తిగా పాల్గొనడానికి వీలైనన్ని మారులు దివ్యసత్ప్రసాదాన్ని లోకొనుము. అదే ఆత్మయొక్క భోజనము. నీకు మోక్షంలో వుపకరించగల ప్రశంసలను అది నీలో సృష్టిస్తుంది.

స్నేహితు లొకరినొకరు పరిచయం చేసుకోవటాని కిష్టపడతారు. అద మానవ సమాజం క్రీస్తునాధునితో సంబంధంలేని స్నేహితు లెవరైన నీకు వుంటే వారిని దివ్యపూజకు యెందుకు తీసుకరావూ? తీసుకవస్తే ఆయనతో పరిచయభాగ్యాన్ని కలిగింప వచ్చును గదా! వారికి దివ్యపూజను గూర్చి వివరంగా చెప్పవచ్చును గదా! ఆయననుగూర్చి పుస్తకాలను చదువవలసిన ఆవశ్యకతను చూపవచ్చును గదా! ఆ పూజ వద్ద ఆయన వారిని ఆశీర్వాదిస్తారు. వారి తప్పులను సరిదిద్దుతారు. వారికొరకు ప్రార్థన చేస్తారు. నీవూ యీ విధంగా క్రీస్తునాధుని విషయంలో శ్రద్ధవహించి, వారిని ఆరాధిస్తుంటే, విచారణలో ఆధ్యాత్మిక కార్యకలాపాలను కొనసాగిస్తుంటే, ప్రజలు తమను తాముబాగు చేసుకోవాలని, వారికి అధికంగా క్రీస్తునాధుడు తెలియవలెనని కనీసం

కొన్నిసార్లైనా అనుకుంటారు. (లెబఫ్ అను గురుపుంగవులు వ్రాసిన "యెన్నడు మారని నా స్నేహితుడు" అను గ్రంథాన్ని చూడు). యథార్థంగా అపుడే ఆత్మసంబంధంగా నీవు చేస్తున్న కృషి సఫలమైనట్లు.

నీ దగ్గర ఏరకమైన తెలివితేటలలున్నా, వాటిని దైవసేవను పెంపొందించ చేసుకోటానికే వినియోగించు. అపుడే దేవుడు సంతోషిస్తాడు. నిన్ను యెవరైనా పాడమంటే క్రీస్తునాథుని యెడల నీకుగల ప్రేమను వ్యక్తము చేయటానికి నీకొక సదవకాశం లభించినట్లుగదూ! నిన్ను యెవరయినా యేదైనా ప్రసంగించండి అంటే క్రీస్తునాథుని గూర్చి ప్రసంగించు. దేవుని స్తుతించటానికి గాను అవకాశంవస్తే దాన్ని జారవిడువకు. ఆలా చేయడం ఆత్మవంచన మాతుంది. అది ద్రోహచింతనను గూడ తెలియజేస్తుంది. కనుక జాగ్రత్త. ఎల్లప్పుడు ఆ ప్రభువు సేవలోనే నిమగ్నుడవై యుండు మానవ జన్మ లభ్యమైనందులకు ఆదే నీకు సార్థకత.

**విచారణ సంస్థలు** శక్తివంతులైన, ఉత్సాహవంతులైన వ్యక్తులు ఒకానొక ప్రత్యేక పనికోసం ఏకమై పని చేయగల్గితే యీ విచారణ సంస్థలు జయప్రదాలవుతాయి.

దివ్యనామ సమాజం జాబితాలో పిల్లల పేర్లు వుండాలి. పరిశుద్ధ కన్యమరియమ్మ యొక్కగాని, జపమాల సంఘముయొక్కగాని, పూజపీఠం సంఘం యొక్కగాని, సొడాలిటిలో బాల బాలికలు సభ్యులుగా జేరాలి దరిద్రజన సేవచేయ నిచ్ఛగించు వార్లకు అర్చ॥ విన్సెంట్ డిపాల్ సంఘము వుండనే వుంది అందులో జేరితే మాత్రం పట్టుదలగా పనిచెయ్యి. ఆ లాగా పెద్ద పెద్ద నగరాలలో విచారణ లుంటవి. వాటిలో సోదరులు, కన్యలు అధిపతులుగా వుంటారు. వీలయితే వారి పనిపాటలలో సహాయపడు.

నీవు అన్ని సమాజాలలోను పనిచేయ నవసరంలేదు. కాని మన ప్రభువుకి మాత్రం అంటిపెట్టుకొని వుండు. ఆలా అంటిపెట్టుకొని యుండటం అనేదే, నీ విచారణలో స్థాపితమైన సమాజాలలో యే ఒక దాని యొక్క ఆశయోద్ధేశాలను కార్యరూపంలో పెట్టడానికైనా నిన్ను పురి

కొల్పుతుంది. అదే నీచేత యెంతపనినైనా చేయిస్తుంది. కొన్ని సమాజాలలోనికి కొందరు స్త్రీ పురుషులు కొత్త వారెవరైనా వస్తే వారికెంతో ఆప్యాయంగా ఆహ్వాన మిచ్చేవారున్నారు. అలాంటి వారిని చూడు. (అయితే అలా ఎందుకు చేస్తారు అన్న విషయాన్ని తెలుసుకోవాలంటే మత్తయి 25, 34-46 చూడు) బాల సంఘాలతో ఏలా కాలక్షేపం చెయ్యాలనో, వారి ఆటపాటలను యేలా జరిపించాలనో, వారితో ఏలా కలసిమెలసి యుండాలనో, బయట యెట్టి కార్యక్రమాలను నడిపించాలనో—ఇవన్ని గూడ ప్రతి విచారణలోను కొందరు నేర్చుకొని యుండాలి. సాంఘికంగా, ఆర్థికంగా జీవితరంగంలో బాగా పైకి వచ్చినవారు తమకన్నా తక్కువ అదృష్ట వంతులైన వారికొరకు కాలాన్ని ఖర్చు పెట్టగల్గితే ఆధ్యాత్మిక దృష్టి, మత విషయక దృక్పథం వారికి కల్గుతాయి.

**విచారణ మద్దతు** నీవు విచారణలో పని చేస్తూన్నపుడు నీ తెలివితేటలు నీ తాహతు, నీ ఓపిక, నీ త్యాగదీక్ష లెక్కలోకి వస్తాయి. ఇతరుల దయా దాక్షిణ్యాలమీద ఆధారపడటం భనం ముఖ్యంగా మంచిదిగాదు. నీకు కావల్సింది యితరులు నీకు నీ పనిలో ఎంతవరకు తోడ్పడతారు అనే అంశయమే. వారు ఏ యే సలహాలిస్తారో గమనించు. వారు యెంత కాలం నీ క్రింద ఖర్చుపెడతారో చూడు. ఈ పరిస్థితుల మీదనే నీ భవితవ్యం ఆధారపడ్డది. ఇతరులు గూడ నీ వలెనే పనిచేస్తున్నారేమో చూస్తుండు. ఒకవేళ వాళ్లు తమపనిలో అశ్రద్ధగా వుంటే నీవు గూడ వారివలె సోమరిపోతుగా అశ్రద్ధగా వ్యవహరించకు. దేనికైనా పట్టుదల, కార్యదీక్ష అవసరం. కనుక యీ రెండు అంశాలను బాగా గమనించు.

**ఇక మరో విషయం** విశ్వాసుల దయా దాక్షిణ్యాలమీద తిరుసభకు మద్దతు అనేది యేర్పడటం వివిధ రకాలుగా యుంటుంది. కొంత మంది ద్రవ్య సహాయం చేస్తుంటారు. కొందరు మాట సహాయం చేస్తారు. మరికొందరు సలహాలను, గ్రంథాలను అందజేస్తారు. వీరు యిలావుంటే యితరులు సత్యోపదేశాన్ని ప్రబోధించుతారు. తప్పిపోయిన వారిని తిరుగ తీసుకవస్తుంటారు. తిరుసభను గూర్చి,

జాగ్రత్త వహిస్తుంటారు. కార్యక్రమాలను యేర్పాటు చేస్తారు. ఈలా వివిధ రకాల సాయము, మద్దతు నీకు విచారణలో లభిస్తుంటుంది. కాని అంతా సవ్యముగానే నడుస్తున్నదని అనుకోకు. కొన్నిసార్లు పెద్ద పెద్ద ప్రతిఘటనలు, అవాంతరాలు యెదురవుతుంటాయి. వీటిని సమయస్ఫూర్తితో తెలివిగా అధికమిస్తుండాలి. కొందరు నీమనస్సుకు కష్టము కలిగించే విధముగా మాటాడితే దానికి నీవేమీ ఆశ్చర్యపడకు. అవి పరిపాటివని తెలుసుకో. ఆలాగా అభిప్రాయ భేధాలు గూడా వస్తుంటాయి. ఒకరిమీద నొకరికి అపోహాలు గూడా కలుగుతుంటాయి. అంత మాత్రంచేత వాటికి భయపడిగాని లేక మరియే యితర కారణం చేతనయినా గానీ నీవు రంగమునుండి వెళ్ళిపోబోకు. ధైర్యసాహసాలు కావాలి. పైగా నీవు తిరుసభను వాంఛిస్తున్నావు. తిరుసభ నిన్ను వాంఛించిన దానికన్న అధికంగా ఈ ప్రధానాంశం బాగా గమనించు; తెలివిగా యుక్తిగావుండు. యెక్కువగా యెవరితోను పూనుకొని తిరగకు. అసలు ఒక మంచికార్యం చేస్తుంటే యెన్నో కష్టాలు యెదురవుతుంటాయి. వాటిని అధిగమించాలి. తప్పదు. కనుక నీవేమీ గాబరాపడకు.

నీవు ఆర్థికంగా మంచి స్థితిలోవుంటే ఆ ధనము మంచిని చేయటానికి ఒక అవకాశాన్ని కలిగించిందని తలంచు. అంతేగాని దుర్వినియోగము చేయటానికి కాదని గ్రహించు. అంత ధనము నీ దగ్గర వున్నప్పుడు మామూలు సాధారణ వ్యక్తిమాదిరిగానే నీవుఇమ్ము కాని, నీవలె అదృష్టవంతులు గానివారు యెక్కువగా సంపాదించునట్లు చూడు. వారిచేత గూడా దైవసేవకు ధన సాయం అగునట్లు చూడు అందరు దైవసేవకు అర్హులుగదా! అసలు, ఏదైనా సదుద్దేశముతో యిస్తే నీవు యదార్థమైన ఆధ్యాత్మిక జీవివి కాగల్గుదువు. ఇవ్వడంలో సదుద్దేశము, పుచ్చుకొనడంలో సదుద్దేశము, చేయటంలో సదుద్దేశం చేయించడంలో సదుద్దేశం— యీలా అన్ని పనులలో సదుద్దేశం వ్యక్తమైనపుడు నీవు నిజమైన ఆధ్యాత్మిక జీవితాన్ని నడుపుతున్నావని అర్థం. నీవు నీ జీవిత కార్యక్రమములో స్థిరపడి పోయినాక కతోలికుల విద్యకోసం, దాన ధర్మాలకోసం త్యాగమయ జీవితాలను గడపుతున్న యెడల మంచిగావుండు.

**ఆచరణ** (1) క్రీస్తునాథుడు "మంచిచేస్తూ వెళ్ళాడు" విచారణ జీవితంలో దీని అర్థమేమిటి. ప్రతి ఆది వారం సత్యవేదాన్ని చదవటం మంచి అలవాటుగా పెట్టుకో. ఆలా అయితే నీకు క్రీస్తునాథుడు యధార్థంగా కన్పిస్తారు.

(2) విచారణ వ్యవహారాలలో నీవు బద్ధగించినపుడు నీవు యెవ రికి హాని చేస్తున్నావు?

(3) పూజ జరుగుతూ వుంటుంది. అక్కడవచ్చిన ప్రజలు తమ ప్రార్థనా పుస్తకాలను చదివినట్లయితే, గురువు ఆ సమయంలో ఏమిచేస్తున్నది తెలుసుకుంటారు. పూజ జరగడం లతీను భాషలో నయినా, భాష వేరుగావున్నా నీకు భేదం కన్పించదు. కారణం యేమంటే యేంజరుగుతున్నదీ అన్నది ప్రధానమైనది.

(4) ఈ వాక్యం అర్థాన్ని గమనించు "బహిరంగమైన ప్రార్థన యధార్థ క్రైస్తవ తత్వానికి మొట్ట మొదటి, అవసరమైన ఆధారం విశ్వాసులంతా పవిత్రమైన యీ బహిరంగ జపంలో పాల్గొనటంలో యెంత యెక్కువగా కృషిచేస్తే అంత యెక్కువగా వారిలో యధార్థ మైన క్రైస్తవత్వము ప్రవేశిస్తుంది. (10 వ పరిశుద్ధ పాపుగారు, Motu proprio, 1903, 20-౨). కనుక దివ్యపూజ అనేది నీ జీవితములో మొట్ట మొదటిస్థాన మాక్రమించాలని నీకు కన్పడటంలేదూ? దేవుని యెడల గల నాలుగురకాల విధులను చెల్లించటానికి దివ్యపూజ నీకు యేలా శక్తిని గల్గిస్తుంది? నీ తండ్రియెడల నీ తల్లియెడల నీకు గౌరవ భావమున్నదని చూపటానికి బహిరంగంగా యేది చేయకపోతే నిన్ను గూర్చి యేమనుకుంటుంది లోకం. దేవుడు నీ తండ్రి అయినపుడు ఆయనయెడల నీ గౌరవాన్ని చూపటానికి బహిరంగంగా వున్న గుర్తే మిటి? దివ్యపూజ అనేది ప్రార్థనయొక్క బహిరంగ కార్య క్రమం యెలా అవుతుంది?

(5) జీవితంలో ఆత్మరక్షణేనా నీ యేకైక పని?

—:0:—

# ముప్పది మూడవ అధ్యాయము

## సాంఘిక సేవ

**అర్థము** క్రైస్తవ మతం మానవజాతికి ఒక మహత్తర సేవజేసింది. ఎలాగంటే నీ పొరుగువాని యోగక్షేమం విషయంలో ప్రతివ్యక్తి శ్రద్ధతీసుకోవాలని చెప్పటంవలన. అతను పగవాడయినా, పరాయివాడయినా, నల్లనివాడయినా, తెల్లనివాడయినా, క్రైస్తవుడయినా, క్రైస్తవుడు కానివాడయినా అతని అభ్యుదయంకోసం అతని బాగుకోసం పని చెయ్యమని ప్రతి మనిషికి వుద్బోధించటం గొప్ప విషయం గదూ! జేసునాధుని జీవితాంతరాల్లోకి ప్రవేశించి చూస్తే, ఒక్కొక్కరు తమ పొరుగువానికి సేవచేసేవిషయంలో ఆయన ఎలాంటి ప్రాధాన్యతను, యెట్టి విలువను, అపాదించినది తెలుస్తుంది. "తన స్నేహితునికొరకు ప్రాణమిచ్చుటకంటె ఎక్కువ ప్రేమగల వాడెవడును లేడు." (జ్యాన్సు - XV 13)

క్రీస్తునాధుడే ఒక వుదాహరణను చూపించారు. నీకు గూడ అలాంటి తత్వమే వుంటే, నీవూ యితరులకు సహాయంచేయ గోరుతావు.

నీ జీవితంలో యీనాటివరకు నీ తల్లిదండ్రులమీద యెక్కువగా ఆధారపడ్డావు వాళ్ళుగూడా నీ విషయమునుగూర్చి జాగ్రత్తపడటంలో, నీకు రక్షణను కలిగించటంలో చాలా కాలాన్ని వ్యయం చేశారు. తల్లిదండ్రుల విషయ మలా వుండగా నీ మిత్రులకు, నీ బంధువులకు, నీ వుపాధ్యాయులకు గూడా నీవు చాలా ఋణపడియున్నావు. వారివలన యెంతో మేలు, యెంతో సహాయం పొందివుంటావు. అది యే విధంగానైనాసరే. కనుక యీ నాడు నీవు యింత పెద్దవాడవు అయ్యావంటే దానికి కారణం తల్లిదండ్రులు, నీ సుహృజ్జనులు అన్నమాట. సంఘం యేదో కొంతవరకు నీకు తోడ్పడింది అన్నమాట. అలాంటి పరిస్థితుల్లో నీవు నీ కొఱకు చేసినదానికి ప్రతిగా ఆ సమాజానికి సేవ చెయ్యొద్దూ? అది న్యాయం ధర్మంగాదూ? అయినా ఆలోచించు.

అయితే సాంఘిక సేవ అంటే యేమిటి ? దేవుడు వుద్దేశించి నట్లుగా మానవులు బ్రతుకుటకు శక్తివంతులగునట్లు నీ వద్ద మిగిలిన ఆర్థిక, మానసిక, వైజ్ఞానిక సహాయాన్ని వారికి అందజెయ్యి. అనగా వారిని ఆర్థికంగా బాగుచెయ్యమన్నమాట. మానసికంగా పైకి తీసుకు రమ్మన్నమాట. వైజ్ఞానికంగా వుత్తమ స్థాయికి గొనిరా అన్నమాట. ఈ మూడు విధాలేగాదు. నీకు చేతనయినట్లు నీ పొరుగువాని అభ్యున్నతికోసం కృషిచెయ్యి. అదీ దేవుడు కోరింది; కోరేదీను.

అయితే యీ కృషి చెయ్యటమనేది నీ ఒక్క విచారణలోనే గాదు.మానవజాతి కంతటికి చెయ్యోచ్చు. అది నీ శక్తి సామర్థ్యాలను, నీ తెలివితేటలను బట్టి వుంటుంది. నీవు అధిక సామర్థ్యంగల వాడవయితే, అధిక సంఖ్యాకులు నీ వలన బాగుపడటానికి అవకాశముంటుంది. తక్కువ తాహతు గలవాడవయితే అల్ప సంఖ్యాకులు బాగుపడటాని కవకాశముంటుంది. అదే ఉన్న సంగతి.

పైగా సాంఘిక సేవ అంటే మానవుణ్ణి తన కాళ్ళమీద తాను నిలబడునట్లు చెయ్యటమనే అనుకోవాలి. దరిద్రులకు ధనసహాయన్ని యివ్వవచ్చు. ధనవంతులకు వైజ్ఞానిక సహాయాన్ని యివ్వవచ్చు. మానసికంగా బాగు చెయ్యోచ్చు. కనుక యెవరు యెందులో తక్కువగా యున్నారో, యెవరు యే కారణాలవలన అధమస్థితిలో వున్నారో, దానిని తొలగించటానికి సాధనాలేమిటో - యీ మొదలైన అంశాలన్నిటినీ గమనిస్తూ, చిత్తశుద్ధితో సాంఘిక సేవారంగంలోకి ప్రవేశించు. దేవుని బిడ్డవనిపించుకో. ఇహలోక సంబంధంగానేగాక పరలోక సంబంధంగా కూడ నీ పొరుగువానిని చక్కబరచు. అతను చక్కని ఆధ్యాత్మిక జీవితాన్ని నడుపునట్లు చూడు

**సిద్ధాంతాలు** 1) కతోలిక సంఘసేవ అనేది "దేవుని పేరు" మీద జరుగు వ్యవహారం గనుక అది మానవాతీతమైనది. అసహజమైనది. ఇతరులను కేవలం "మంచివాళ్ళుగా" మాత్రమే నీవు తర్ఫీదు చేయటంలేదు. ప్రతి వ్యక్తి-ధనికుడుగానీ, బీదవాడుగానీ-లోని ఆత్మను నీవు దర్శిస్తున్నావు. శాశ్వత మోక్షానందసుఖానుభూతి వారికి లభ్యమగునట్లు నీవు చూస్తున్నావు. కనుక కతోలిక సాంఘిక

కార్యక్రమంలో మానవుణ్ణి ఐహికంగా మాత్రమే గాక ఆధ్యాత్మికంగాగూడ బాగు చేయడమన్న గొప్ప విషయం యిమిడి వున్నదన్న మాట. ఈ ప్రధానాంశాన్నే గమనించ వలసింది.

2) ఈ కరుణ క్రియలు మన ఇష్టా యిష్టములపై ఆధారపడక, మన కర్తవ్యములై ఉన్నవి. అయితే "యీ కర్తవ్యం అనేది మన పొరుగువాని అవసరాలనుబట్టి మన తాహతనుబట్టి హెచ్చుతూ వుంటుంది, తగ్గుతూ వుంటుంది యెవరుగూడ — బహుశా - అన్ని పనులను చేయలేరుగదా." నిజంగూడా అంతే. కాని ఒక విషయాన్ని మనము బాగా గమనించాలి. అది యేమిటంటే మన పొరుగువానిని ప్రేమించటమే. "నీ యెదురుగా కన్పించె పొరుగు వానిని ప్రేమించని వ్యక్తి నీ కంటికి కన్పడని దేవుని యెలా ప్రేమిస్తారు" (జాన్ 4. 20) కనుక యిది అసంభవం. అందుకు ముందు నీ పొరుగువానిని ప్రేమించు. అలా ప్రేమించటం నేర్చుకొని వానిని దేవుని బిడ్డగా తయారుచెయ్యి. అప్పుడు నీవు దేవుని ప్రేమకు అర్హతను సంపాదిస్తావు. అతన్ని మంచి వాడివిగా చేయగల్గినపుడే నీవు దేవుని దృష్టిలో మంచివాడవవుతావు.

నీ జీవితానికి యేది వర్తిస్తుందో, యితరుల జీవితాలకు అదే వర్తిస్తుంది. పాలవాడు చెడ్డపాలు పోసి తత్ఫలితంగా నీ చెల్లెలు చని పోతే నీవు యేంచేస్తావు? మంచిపాలు సరఫరా కావటానికి మార్గాన్ని వెదకవూ? అందుకు తగిన కృషి చెయ్యవూ? తప్పక చేస్తావు.

ఆలాగే— అనగా పాలవానిని నీవు మీా చెల్లెలు చనిపోయి నందులకు దూషించినట్లుగా-- యితరులు పాప పంకంలో దిగుతున్నా, అలా ఆత్మ నాశనానికి ఒడిగడుతున్నా నీవు దూషింప బడతావు. మంచి సంభాషణ వలన, సత్ప్రవర్తన వలన యితరులకు మార్గదర్శకంగా వుండి వుత్తమమైన, ఘనమైన సాంఘిక సేవ చేయుటం నేర్చుకో. కనుక నీ వంతు నీవు చేయగల్గినంతవరకు చెయ్యి. ఆ చేసింది మాత్రం వుత్తమమైనదిగా, గట్టిదిగా, ప్రశంసార్హమైనదిగా వుండునట్లు చూడు. ఏ పనినైనా చిత్తశుద్ధితో, స్థిర సంకల్పముతో చెయ్యి. అపుడు నీవు తప్పక రాణిస్తావు. ఆధ్యాత్మికమైన పనులు కేవలం ఆత్మకు, దాని రక్షణకు సంబంధించినవేగాక మానవుని చిత్తానికి, విజ్ఞానానికి గూడ

సంబంధించినట్టివి. చాలమంది బాలికలను బడికి పోవునట్లు చేయటం అనేది దయతో కూడినట్టిది. తినటానికి తిండి వుండటానికి వసతి కల్పించటానికి అనారోగ్యకరమైన పరిస్థితులనుండి కాపాడటానికి నీవు స్వార్థరహితుడవై పనిచేయ సంకల్పించితే "రోగులకు సేవ" చేసి నట్లు, అవసరంలో వున్న వారికి తోడ్పడినట్లు అవుతుంది. ఇతరులకు తోడ్పడటంకన్నా నిజమైన కతోలికునకు కావల్సినదేముంది.

నీవు చేసిన పనులు అవి యేయుద్దేశంతో చేయబడినవో అన్న దాన్నిబట్టి నిర్ణయించబడతవి. అవి యెట్టి ఫలితాలను సాధించినవో అన్నదాన్నిబట్టి కూడా నిర్ణయింప బడతవి. కనుక యీనాటినుండే ఒక్కొక్క పనిని ఆచరణలో పెట్టి చూడు. వాటి అర్థాన్ని పూర్తిగా గ్రహించుకో. ఏదైనా చేయగాచేయగా పనిలో నిపుణత్వం అనుభవం యేర్పడతవి.

3) మనం పనిచేస్తున్నామంటే దానికి ఒక సంస్థ, ఒక వ్యవస్థ వుండాలి. కూటమిగా కలసి పనిచేయుటం అలవరచుకోవాలి. అంతే గాక స్వార్థ పూరితమైన, సంకుచితమైన వ్యూహాలు, ఉద్దేశాలు పనికి రావు. దూరదృష్టి, విశాల దృక్పథం వుండాలి. దానికితోడు యీనాటి జీవిత పరిస్థితులు చాలా చిక్కుగా క్లిష్టముగా వుంటవి. అందుకని అవి ఒక మనిషి వలన సాధ్యమయేవిగావు జీవితానికి సంబంధించిన కూలిని నిర్ణయించటంలో గాని, అది అమలునకు వచ్చునట్లు చూడటంలో గాని, కార్మిక జన శ్రేయస్సుకై ఒక కార్యక్రమాన్ని అమలు జరప టంలోగాని, నీవు ఒక్కడివి చేయజాలవు. పదిమంది కలసి ఒక సం ఘంగా యేర్పడి పనిచేయుటం జరిగినపుడే అలాంటిది సాధ్యపడుతుంది. దిగ్విజయంగా జరపటానికవకాశ ముంటుంది కొందరు తమ స్వప్ర యోజనాల దృష్ట్యా రోజుకో సంస్థను స్థాపించడమో, రోజుకో సంఘంలో సభ్యులుగా చేరటమో జరుగుతుంది. అలాంటి వారిని జాగ్ర త్తగా కనిపెట్టి చూస్తుండు. వారిని విశ్వసించకు. నీకు ఒక పద్ధతి, ఒక పంథా, ఒక ప్రత్యేక కార్యక్రమం, ఒక ప్రణాళిక వుంటే అలాంటి వారి నందరిని సులభంగా పట్టివేయ గలవు. అంతేగాదు అర్హులైన వారికి సహాయం కూడా చేయగలవు. అర్హులైన వారెవరో యెఱిగి వారికి సహాయ పడటమే విజ్ఞుల లక్షణం.

4) "బలవంతులు బలహీనులకు సహాయం చేయాలి" అన్న విషయాన్ని గుర్తుంచుకో. భౌతిక సంపదలను, తెలివితేటలను, దేవుని అనుగ్రహాలను యెక్కువగా కల్గిన వారున్నారు ఆలాంటి వారు తమ కన్న తక్కువగా వున్న వారిని ఆదుకోవాలి. తమ కంటె దూరదృష్టి వంతులైన వారిని కనిపెట్టి వుండి వారికి సాధ్యమైనంత వరకు సాయ పడాలి. అంతేగాని "అతన్ని చెయ్యనియ్, ఆమెను చెయ్యనియ్" అని అనరాదు. అవి స్వార్థపరులైన వ్యక్తులు, క్రైస్తవేతరులు అనవలసిన మాటలు. సహాయం చేయగల తాహతు వుండిగూడ వారు సహాయం చేయకు అంటే దానికి స్వార్థపరత్వం తప్ప వేరు కారణ మేమున్నది.? సహాయం చేయాలని వూహిస్తే సహాయం చేయగలరు. కాని అలా వూహించరు అదే వారిలోన పెద్ద లోపం.

**ఇక అసలు విషయం** ప్రపంచంలో ప్రతి వ్యక్తి యేదో ఒక రకంగా సహాయం చేయగలరు. ఎవరూ అన్ని విధాలుగా సహాయపడలేరు, ఎవరూ పూర్తిగా సహాయం చెయ్యలేరు. బీదవారికి ప్రతిదీ సహాయం చేయమని యెవరూ కోరరు. కాని ప్రతి వారు యేదొక సహాయం చేయాలని కోరుతారు. కొన్ని చిన్న పనులున్నాయి. కొన్ని నిరాడంబరమైన పనులుగూడ వున్నాయి. అవి చాల కాలం వరకు ఘనంగా నిల్చివుంటాయి. బీదవారికి సేవ చేయటంలో అవి యెల్లప్పుడు తోడ్పడుతవి.

ప్రతి నగరంలోను యితరులకు సహాయం చేయటానికి తగిన సావకాశం, తగిన సాధన సంపత్తి గలవారెందరో వున్నారు. అంత అవకాశం, అన్ని సాధన విశేషాలు గల్గివుండి గూడ పొరుగు వానిని ఆదుకోవటం లేదు. అంటే అది కేవలం స్వార్థం గాదూ? అదే పనికిరాదు. అట్టివారినే దేవుడు మెచ్చుకోడు.

నీవు పిల్లలకు సహాయం చేయటానికి యిష్టపడతావా? వారి విషయంలో శ్రద్ధ తీసుకుంటావా? మన కతోలికుల ఆధ్వర్యం క్రింద పిల్లల కోసం యేర్పడిన సంస్థవుంటే దానిలో పనిచేయటానికి యిచ్ఛగించవూ? అవసరంలో వున్న వారిని సుఖవంతులుగా చేయటంలో కృషిసల్పుచున్న సంస్థకు ఏదైనా సహాయం చెయ్యి. ఏదో ఒకటి

యియ్యి నీకు చేతనైన దాన్ని ఈలాంటి దాన్ని అలవాటు చేసుకో. మారిన్ ఫ్రాన్సిస్ ఈగన్ అనునతను యెల్లప్పుడూ దయగా వుండే వాడు నిరంతరం ఆలోచనా పరుడై వుండి యితరులకు తాను యే విధంగా వుపకరించ గలనా అని అనుకుంటుండేవాడు, దానికి తగిన మార్గాల నన్వేషిస్తుండే వాడు. అతను ఒకసారి యిలా అన్నాడు "ఇతరులకు సహాయం చేయుటంలో గల మార్గాలను గూర్చి సాధనాలను గూర్చి అన్వేషించటంలో శ్రద్ధ తీసుకోనక పోయినట్లయితే నన్ను నేను ఎన్నడూ క్షమించుకోను." ఈతని వాక్యాలు యెందరికి కను విప్పుకోగలవో చూశారా? అంతా ఆలాంటివారైతే యింక కావల్సిందేముంది! కనుక ఇతరుల జీవితాలకు సహాయ పడటానికి నీవు నీ తెలివి తేటల నుపయోగించు. నీ బుద్ధిని వికసింపజెయ్యి. ఇతరులు నీకు సహాయ పడ్డారు. ఆ సహాయాన్ని కొంతయినా తిరిగి సంఘానికి అప్పగించు. అప్పుడు నీవు బాగుపడ్డట్లే. నీవు వున్నతికి వచ్చినట్లే. సంఘములోని యితరులు గూడ వస్తారు. అంతా అట్టిస్థితికి రావటాన్నే నీవు ఆలోచించాలి. కాంక్షించాలి.

**జాగ్రత్తగా చూడవలసిన పరిస్థితులు**

ఈనాడు మనం మహా నగరాల్లో నివసిస్తున్నాం. మహా నగరాలని పేరేగాని యెక్కడ జూచినా నిరుద్యోగ బాధే. ఎక్కడ జూచినా వుండటానికి వసతి లేక అల్లాడిపోయే ప్రజానీకమే. ఎండకు వానకు తపిస్తూ చెట్లక్రింద మహా సౌధాల మెట్ల ప్రక్కన, రహదారుల ప్రక్కన, పార్కులలోను కాలం వెళ్లబుచ్చుతున్నారు. ప్రజలెందరో కన్పిస్తుంటారు. అష్ట కష్టాలకు పాలై, అందరి చేత ఛీ ఛీ అనిపించు కుంటూ అలాగే జీవితాన్ని వెళ్ల బుచ్చుతున్న వారెందరో చెప్పనలవిగాదు. సంఘం వారిని పట్టించు కోనడం లేదు. అందువలన జీవిత మంటే యీదరాని సముద్ర మయింది. జీవితం మీద నిరాశ, నిస్పృహా లేర్పడు తున్నాయి ఇవి యేర్పడిన కొద్దీ మానవుడు నైతికంగా పాడవుతున్నాడు. ఏ పనికైనా సిద్ధపడు తున్నాడు. గత్యంతరం కన్పడటంలేదు. తనను ఆదుకొనే వాళ్లెవరూ లేకపోతే అతను యెన్ని పనులైనా చేస్తాడు. ఎంత పనైనా చేస్తాడు. కనుక మానవులలో అధిక భాగం అలా తయారవుతున్నారు. శాంతి

భద్రతల కవకాశాలు తక్కువ. దేశంయొక్క గొప్పతనం యావత్తూ శాంతి భద్రతలను కాపాడు కోవడంలో, వాటి కోసం కృషి చేయు టంలో యిమిడి వున్నది. మనది యంత్ర యుగం. యీ యంత్ర యుగంలో కార్మికుడు తన వ్యక్తిత్వాన్ని పోగొట్టు కొన్నాడు. అందు వలన అతను చేసే పనిమీద అతనికి శ్రద్ధ తక్కువయింది. దాంతో పెట్టుబడి దారునకే దెబ్బ తగులుతున్నది. అటు పెట్టుబడి దారునికీ, ఇటు కార్మికునికి తత్సంబంధాలుండడం యీనాడు చాలా అరుదయింది. పెట్టుబడి దారునికి ప్రభుత్వానికి యెట్టి సంబంధ బాంధవ్యా లున్నవో అట్టివే పెట్టుబడి దారునికి కార్మికునికి మధ్య వుండాలి. అప్పుడే సరి యైన పారిశ్రామి కోత్పత్తి జరగటం, తద్వారా దేశ ఆర్థిక సంపద పెరగటం జరుగుతుంది కనుక యీ విధంగా చూచుకొంటే ఈనాడు నాగరికత దేశాలు, పెద్ద పారిశ్రామిక దేశాలని చెప్పుకొన బడుచున్న దేశాలలో నిరుద్యోగం, దారిద్ర్యం, దుర్భర జీవనం ప్రత్యక్ష మౌతు న్నాయి. ఇవేగావు. వీటితోబాటు యెన్నో సమస్యలు బయల్దేరు తున్నాయి ఒక సమస్యను పరిష్కరించ బోతే మరొక క్రొత్త సమస్య వుత్పన్న మవుతున్నది. ఇలా యెప్పటికీ సమస్యలకు పరిష్కార మంటూ కన్పించకుండా వుండటం మామూలయింది. అయితే యీ దుర్భర పరిస్థితులన్నీ తొలగాలంటే నీతి నిజాయితీ అయిన పెద్దలను రాజకీయాల్లోకి, పదవుల్లోకి తీసుక రావాలి. సద్వర్తన, సచ్ఛీలత, సహృదయత్వం గల వ్యక్తులను వుద్యోగాల్లోకి తీసుక రావాలి. అపుడు గాని అటు రాజకీయాలు, యిటు ప్రభుత్వ రాజ్యాంగం బాగుపడదు. అట్లు చేయని దేశాలకు అశాంతే. అది తప్పదు.

డాక్టరు జె. ఎ. రాయన్ ఇలా చెప్పాడు. "కష్టపడి నాలుగు డబ్బులు సంపాదించుకొనే కార్మికునికి, జీతం సెలవు, పని రోజులు, ఆరోగ్య పరిస్థితులు వీటిలో ఒక కనీస ప్రమాణం వుండాలి. అంతేగాక అతనికి రోగం వచ్చినా, కష్టాలు వచ్చినా, ముసలి తనం వచ్చినా, యేవైనా ప్రమాదాలు సంభవించినా, నిరుద్యోగ సమస్య వుత్పన్న మైనా యీలాంటి వాటినుండి రక్షణ గల్గాలి. సాంఘిక భీమాద్వారా అతనికి భద్రతను కల్గించాలి."

**మరో సంగతి:** అటు ఆఫీసుల్లో గుమస్తా వుద్యోగాలు చేసే వారికి గాని, యిటు ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులకు గాని వారి వారి పనుల్లో వుత్సాహాన్ని శ్రద్ధను కల్గించాలి. వారి వలన యెక్కువ పనిని గ్రహించాలి. వారికి వారి పనులలో విసుగు కల్గరాదు. అభిరుచి సన్నగిల్లరాదు. ఇన్ని పనులు జరగాలంటే అతనికి కొంత విశ్రాంతి యిచ్చి దానిని యింటిదగ్గర భార్యా బిడ్డలతోను, యింటి వ్యవహారాలతోను, పత్రికలు గ్రంధాలు చదవడంతోను ఖర్చు పెట్టమనాలి. లేకపోతే బయటి వ్యవహారాల్తోనో, ఆటపాటలతోనో అతను కొంత కాలాన్ని వెళ్ళబుచ్చాలి. అందుకు తగిన విశ్రాంతి కాలం యివ్వాలి. అప్పుడే అతనికి మానసికంగా తీరుబడి అవుతుంది. తిరిగి సంతోషంగా పనిలో ప్రవేశించి అతను యెంతో వుత్సాహంగా కనిపిస్తాడు. అతనికి శారీరకంగా విశ్రాంతి నివ్వటమే గాక, మానసికంగా వున్నతిని గూడా కల్గిస్తున్నా మన్నమాట. తద్వారా అతని వ్యక్తిత్వానికి భంగం గావటం లేదు. అదే మనం యీ నాగరిక యుగంలో చూడవలసింది.

**ఇక మరో విషయం** సంఘ సేవకులు, ప్రభుత్వం, దరిద్రులను గూడా ధనాఢ్యులతో బాటు చూచేటట్లు చూడాలి. కోర్టులకు పోవటానికి వారికెన్ని అవకాశాలున్నాయో వీరికి అన్ని అవకాశాలుండునట్లు చెయ్యాలి. ప్రతి వర్గానికి న్యాయం కల్గునట్లు చూడాలి. వికలాంగులకు, బిక్షుకులకు యేదో మార్గాన్ని చూపించి ప్రభుత్వం వారి కోసం ప్రత్యేక యేర్పాట్లు చేయాలి. నిరుద్యోగ సమస్యను యెప్పటి కప్పుడు పరిష్కరిస్తుండాలి. అందుకు తగిన మార్గాల నాలోచిస్తుండాలి. కార్మికుల నుండి పై అధికారివరకు వుండటానికి వసతులను కల్పించాలి. కుటుంబ జీవన ప్రమాణాన్ని పెంపొందింప జేయాలి. బిడ్డల మీద తల్లి దండ్రులకు మమకారాన్ని బాధ్యతను వృద్ధిచేయాలి. బిడ్డలను పైకి తీసుకరావటం తల్లి దండ్రుల విధే గాని, ప్రభుత్వానిది గాదు. వారిని పెంచేబాధ్యత అనేది తల్లి దండ్రులదే గాని ప్రభుత్వానిది గాదని క్రైస్తవసిద్ధాంతం. అసలు పిల్లవాడు మొదటగా వారికి చెందిన వాడే. తర్వాతనేగా రాజ్యాంగానికి చెందిన

వాడవుతాడు. కనుక కుటుంబ జీవితంలోని శాంతి వాతావరణాన్ని కూడా పెంపొందింప జేయాలన్న మాట.

పత్రికల్లోగాని, ఉపన్యాసాలలో గాని చెడు వుంటే దాన్ని ఖండించు. సహృద్భావాన్ని పెంపొందింప జెయ్యి. మంచిదాని కోసం, ఘనమైన దాని కోసం, సత్యమైనదాని కోసం కాంక్షించు వాటినే అన్వేషించు. అదే ఉత్తమ క్రైస్తవ లక్షణం.

**ఆచరణ**

1) సాంఘిక సేవ అనేది అతి విశాలమైనది. కతోలిక వ్యక్తివిగా, భారతీయుడవుగా నీవు మనదేశాన్ని సర్వ సమృద్ధంచేసి వారికి సర్వ విధాల తోడ్పడు. అలాంటి అవకాశం దొరకటమే కష్టం. దొరక్కపోతే నీవు సృష్టించుకొని సాంఘిక సేవా రంగంలోకి దిగు. ప్రతివ్యక్తి— పురుషుడు గాని స్త్రీ గాని - ఆత్మ విశ్వాసాన్ని అలవరుచుకోడానికి తగిన అవకాశం కోసం ప్రయత్నించాలి. దానితో పాటు దేవుడు బోధించిన సత్యాన్ని, దేవుని తెలుసు కుంటూ వ్యవహరించాలి

2) ఈ రోజుల్లో బ్రతకడం అనేది పెద్దబరువుతో కూడి పటువంటిది. చాలా కష్టాలతో కూడి పటువంటిది. అనేకమంది జీవితాల నుండి మతం అనేది పూర్తిగా తీసివేయ బడినది. దేవుడు విస్మరింప బడ్డాడు. నీతి నిజాయితీలు, దయా దాక్షిణ్యాలు, ప్రేమ వాత్సల్యాలు సన్నగిల్లాయి. ఈలాంటి పరిస్థితుల్లో జీవించటమనేది కష్టసాధ్యమయిన విషయమని వేరే చెప్పాలా? తిరిగి ప్రపంచంలో శాంతి వాతావరణం నెల కొల్పు బడాలంటే దేవుని విశ్వసించు సహృదయంతో నీ పొరుగువానికి తోడ్పడి దైవదృష్టిలో తనకు స్థానము గలదని గ్రహించునట్లు చేయుము. ఈలా చేయుటంలో కూడా జాగ్రత్త వహించు. తెలివితో సానుభూతితో కూడిన విధంగా బలహీనులకు బలవంతులు తోడ్పడాలి. ఈ తోడ్పడటం సాంఘిక సేవ ద్వారా జరగాలి. ఈ సాంఘిక సేవ ఒక్కటే మంచి ఫలితాలను సాధిస్తుంది. బలవంతులు తమ ఇష్టము వచ్చినట్లుగాక, తమకు సంతోష మిచ్చుచున్నదను భావముతో గాక, బలహీనులకు ఏది అవసరమో, దేనివల వారు పూర్ణమైన సత్ఫలితాలను పొందగలరో అట్టిదానినే చేయ

సలెను. లేకపోతే వారికృషి నిరర్థకం, నిష్ప్రయోజనమూను. అది మాత్రం యథార్థం అనిచెప్పటంలో అతిశయోక్తి లేదు.

3) "మన పారిశ్రామిక నాగరికత ఫలితంగా, మానవుడు యంత్రంగా తయారు గావడమే" అని ఒక వ్యక్తి అన్నాడు. "అసలు యీ పారిశ్రామిక విధానం వలన మానవుడు అటు యంత్రానికైనా బానిస గావాలి, యిటు యజమానికైనా బానిస గావాలి. అంతకుతప్ప గత్యంతరం లేదు. ఒక ఆలోచనగాని, విచక్షణాజ్ఞానముగాని యీ విధానంవలన అధిక సంఖ్యాకులకు ఉండదు అక్కడ వారిబుద్ధి వికసించడంగాని, మనస్సు ఆలోచనా రంగంలోకి ప్రవేశించటంగాని జరుగదు. అందుకే మానవుడు గూడ మరొక యంత్రం మాదిరి తయారవుతున్నాడని అనడం. అందుకే మానవుని శక్తిసామర్థ్యాలు అన్నీ యిక్కడ యెందుకు పనికిరాకుండా పోతున్నాయి. పనికిరాకుండా పోవటమే గాదు, అవి స్తంభించి పోతున్నాయి ఈ విపత్కర పరిస్థితిని తొలగించటానికి మార్గాల నన్వేషించు. మానవజాతిని యీ రకమైన విపద్రవమునుండి రక్షించటానికి ఆలోచనచెయ్యి.

4) "నేను ఆయన కావలివాడనా" అని మొట్టమొదట చెప్పినదెవరు? అలాంటిది యెందుకు ఖండించబడింది? యూరపులోని కార్మిక జనాంగంలో వాన్ కెట్లర్ మేత్రాణులు చేసినకృషిని పరిశీలించు.

5) ఈ దేశంలో సాంఘిక సేవ చేయునట్టి కతోలిక సంస్థల జాబితాను ఒకటి తయారుచేయి.

6) శరీర సంబంధమైన, ఆత్మ సంబంధమైన పుణ్యక్రియలను ఒక్కొక్కదానిని ఆచరణలో ఎట్లు పెట్టగలవో, బ్లాక్ బోర్డుమీద వ్రాయి.

——:0:——

# ముప్పది నాలుగవ అధ్యాయము

## విశ్వమానవ సౌభ్రాతృత్వము.

**కతోలిక సిద్ధాంతం**

విచారణ కార్యకలాపాల్లో పాల్గొనటంవలన, యువతికి గాని, యువకునికి గాని యితరులకు సహాయంచేసే అలవాటు ఒకటి యేర్పడుతుంది. నీవు పెరిగి పెద్దవాడ వవుతున్న కొలది యీ అలవాటు విస్తృతమై క్రమేణ సాంఘిక సేవ క్రింద పరిణమించవలె. ఈ సాంఘిక సేవాతత్వం ప్రజల పరిస్థితుల చక్క జేయుటకు ప్రోత్సహించును. విచారణకు సంబంధించిన పని, సాంఘిక సేవ యీ రెంటిని సక్రమముగ చేయగల్గితే అవి నిన్ను అంతకన్నా పెద్దపనులకు తయారు చేయును. అంతర్జాతీయ సమస్యలకు కూడ నిన్ను తగిన వానినిగా తయారు చేయును. నీవు త్వరలోనే మానవుల మధ్య వైషమ్యాలున్నాయని గుర్తిస్తావు. అసలు "జాతీయత" అనే పేరుతో ప్రతి జాతీయుడు పరాయి జాతీయుని యెడల అసూయ ప్రదర్శించటం పరిపాటయింది మన దేశంలో వర్గ వైషమ్యాలున్నాయి. అయితే యీ అసూయను తొలగించాలంటే మనందరం ఒకే దేవుని బిడ్డలమని, ప్రేమ వాత్సల్యాలు గల ఒక తండ్రిచేతనే మనందరం యీ లోకంలోకి తీసుక రాబడినామని వారికి బోధ చెయ్యాలి ఆ విధంగా వారిలో హృదయ పరివర్తన తీసుకురావాలి. ఒకే తండ్రి బిడ్డలమైనపుడు మనలో మనం కలహించుకోనడం భావ్యం గాదని ఒకరిని చూచి ఒకరం అసూయ పడుతుంటే దేవుని హృదయాన్ని గాయపరచిన వారమౌతామని, అలాంటిది తండ్రి సహించలేడని, కనుక మనం అందరం సొంత అన్నదమ్ములవలె మెలగాలని నచ్చజెప్పాలి దాన్నే విశ్వమానవ సౌభ్రాతృత్వం అని అంటాము.

ప్రతివ్యక్తికి ఆత్మవున్నదని, అందరు దైవదర్శనమునకు, మోక్ష భాగ్యానికి చేయబడ్డారని, అందరి రక్షణార్థం జేసుస్వామి మరణాన్ని పొందారని తిరుసభ యెప్పుడూ చెబుతూనేవుంది. ఆయన అందరికోసం మరణించారు గనుక నీవు ఆయన అనుచరుడవుగా వారికిని ఆయనకును గల సంబంధ బాంధవ్యాన్ని గూర్చిన సంగతులను వారికి తెలుపవలె. వారిని క్రీస్తునాథుని దగ్గరకు తీసుక రావాలి.

అర్హులమని రుజువుపరచుకొన్న వారందరికి మోక్షమే బహూకరించ బడుతుందని వారికి సచ్చజెప్పాలి. అలా చేయాలి అంటే తోలు దోలుత నీవు వారిని సోదరులుగా భావించాలి. యదార్థమైన అంతర్జాతీయ వాదులలో ప్రథములైన అర్చశిష్ట పాల్ యిలాఅన్నారు: జూదుడు అనిగాని, గ్రీకు అనిగాని లేదు. పార తంత్రుడుగాని, స్వేచ్ఛుడు గాని లేదు. ఎందువలనంటే ఆయనలో- అక్రీస్తునాధునిలో- మీరంతా ఒకటే (గలా 3 ,28) ఈనాడు నీవు- దేవునికి సంబంధించినంత వరకు- చైనా దేశీయుడు గాని, జపాన్ దేశీయుడు గాని, బర్మా దేశీయుడు గాని, సిలోన్ దేశీయుడు గాని లేడని చెప్పవచ్చు. అంతా దేవుని కుమారులే అని అనవచ్చు.

తిరుసభలో క్రొత్తపండుగ ఒకటివుంది. "అన్ని జాతుల మీద క్రీస్తుయొక్క రాజరికము" (Kingship of Christ over all Nations) అనునది మానవ హృదయాలన్నిటికి ఆయన రాజు. అన్ని జాతులు, అన్ని తెగలు, అన్ని వర్గాలు ఆయన దగ్గరనుండే జీవితానికి సంబంధించిన అర్థాన్ని గ్రహించాలి. జీవిత నిర్వచనాన్ని ఆయనే తెలుపాలి. అంతేగాదు ఆయనే సర్వశక్తిని ప్రసాదించాలి. దానినుండి నైతిక పునరుద్ధరణ జరుగుతుంది

**ఈ సిద్ధాంతం మనకు మార్గ దర్శనముగ నుండవలె**

1) ఈ సౌభ్రాతృత్వ సిద్ధాంతము యితర మానవులయెడ మన మవలభింప వలసిన విధానాన్ని నిర్ణయించవలెను. ఏ జాతినిగాని యే తెగనుగాని నీచంగా చూడకుండునట్లు అది చేయవలె. అతను యెంత అనామకుడై వునప్పటికి, అతను యే భాషనైనా మాట్లాడనీ, అతను యే జాతీయుడైనా గానీ, అతనిలో నీవు క్రీస్తునాధునిచే రక్షింపబడిన మానవుని చూడాలి. అందరికి ఆత్మలున్నాయి కనుక "యితరులు నీకేలాగు చేయవలెనని నీవు కోరుదువో ఆలాగె నీవును వారికి చేయుము" అనుదానిని అనుసరించవలె.

2) ఒకవ్యక్తి క్రైస్తవ యూరపు అసూయతో నిండియున్నప్పటికి, అంతర్జాతీయ దృక్పథాన్ని, యేకైక అభిప్రాయాన్ని గల్గి

యున్నది. ఇది కొంతవరకు ప్రజలలో విద్వేషాన్ని అరికట్టగలిగినది. కాని యీ యేకైక దృక్పథం 16 వ శతాబ్దంలో విచ్ఛిన్న మయింది. ఆనాటి నుంచీ ఈ ఖండంలోని ప్రతిజాతి ప్రజలు, తమ జాతీ యాదర్శాలకే అంటిపెట్టుకొని, తమ నాయకులనే కొలిచి, తమ యాచార వ్యవహారాలకే కట్టబడివున్నారు. విదేశీయుల సంపర్కాన్ని పట్టించుకోకోలేదు. తర్వాత 18 వ శతాబ్దంనాటి పారిశ్రామిక, రాజకీయ పురోభివృద్ధి జాతీయతను పెంపొందింప చేసింది. ఈ విధంగా జాతి విద్వేషం పెరిగి పెద్దదయింది. ప్రతి జాతీయుడు తన జాతీయమైన వస్తువులను, తన సాహిత్యాన్ని యితర జాతీయుల వాటికన్నా గొప్పగా పరిగణించారు.

ఇతరులకన్నా నీవు ఘనుడవని ఎప్పుడైతే అనుకొంటావో అప్పుడు నీవు జాతి విద్వేషాలను తొలగించలేవు. క్రీస్తునాథుడు అందరిని యేకం చేయటానికి మృతిజెందారు. "ఓ తండ్రీ! మీరు నాలో వున్నట్లు, నేను మీలో వున్నట్లు వారంతా ఐక్యత గలిగి యుందురుగాక! (జాన్ **17**, 21, ) జీవితం అంటే యేమిటి అన్న విషయంమీద ప్రపంచాన్ని ఒక యేకైక దృక్పథానికి తీసుకరావటానికి నీవు కృషి చేయాలి. ఇది చేయటానికి తోడ్పడే యుద్యమంలో పాల్గొనాలి. ఆ విధంగా ఐతే జాతులమధ్య పోరాటాలను తగ్గించటానికి అవకాశాలుంటాయి.

మనం భవిష్యత్తును చూడలేము. కాని యాధునిక జీవితం మానవుల నరిని దగ్గరకు తీసుక వస్తున్నట్లు కన్పిస్తున్నది ఒకరి నొకరిని సన్నిహితులుగా జేస్తున్నట్లు కన్పిస్తున్నది. అది యెలావున్నప్పటికీ క్రీస్తునాథుతో అంతా యేకమై యుండటానికే మీరంతా నిర్దేశింపబడినారని మానవులకు నచ్చచెప్పటానికి తగిన నాయకులు కావాలి. అంతా ఒకటేనన్న భావాన్ని వారిలో తీసుక రావాలి. ఈ భావానికి సరియైన పునాది వేయాలంటే మానవులకు వైమనస్యాలు లేకుండా అందరిని సమానులు, సమానముగా చూడవలయునని బోధించేవారు అధికంగా కావాలి. ఈ భావానికి సరియైన పునాది వేయాలంటే వర్గ వైమనస్యాలుండ కూడదని, అందరు సమానులు, సమానముగా చూడవలయునని మానవులకు బోధించేవారు చాల అవసరము. అట్టివారి సంఖ్యపై ఆధారపడి యుంటుంది మన విజయము. నీవు అంతర్జా

తీయ ఉద్యమాలలో పాల్గొంటున్నట్లయితేదానిలో బాగా పనిచెయ్యి. అలా కాకపోతే నీచేతనైనంత వరకు నీచుట్టు ప్రక్కలున్న వారిలో విభేదాలను తొలగించడానికి ప్రయత్నించు.

3) ప్రపంచశాంతి విశ్వమానవ సౌభ్రాతృత్వం మీదనే ఆధారపడ్డది. కనుక దీని సాధనకై తీవ్రకృషి చేయాలి. మానవులందరిని క్రీస్తునాధుని దగ్గరకు తీసుకొని రావటం ద్వారా యీపని సులభమవుతుంది.

**ఆచరణ** 1) ఈ క్రింది వాక్యాలలో నీకు యేది యిష్టము, యేది మంచిది. "మన దేశము యెల్లప్పుడు న్యాయమార్గము నే కనగొనునుగాక! తప్పైనా, ఒప్పైనా అది మన దేశమే."

2) ఏ సమయంలో పరప్రేమ నియమాలకు నీవు కట్టుబడి యుండాలి.

3) కతోలిక అంతర్జాతీయత, కమ్యూనిష్టు అంతర్జాతీయత తాదాత్మ్యము గలవిగావు. ఎందువలన?

4) మతానికి గల స్థానాన్ని దేశభక్తి ఆక్రమించుకొనగలదా?

# ముప్పదియైదవ అధ్యాయము

అంధకారములో నున్నవారికి క్రైస్తవులు వెలుతురుగా నుండవలె.

**అనేక రకాల చీకటి** మంచి స్త్రీ పురుషులు లేకుండా ప్రపంచ మెప్పుడూ లేదు. కాని ఆ మంచి చేయటానికి గల శక్తి సామర్థ్యాలు మాత్రం వారిలో భిన్నంగా వుంటుంటాయి.

1) ప్రపంచం వున్నతో స్తితిని పొందునట్లు చేయటానికి అనేక మంది పేరుబడ్డవాళ్లే చాలా శ్రమలుపడ్డారు. అనేక బాధ లనుభవించారు. కాని తీరా తమ జీవితపోరాటం అంతం కానున్న సమయానికి అసహ్యతను నిస్పృహను పొందారు. సహజ శక్తులమీద వారు తమ స్వంత బలముమీద ఆధార పడ్డారు. ప్రపంచ నీచత్వాన్ని చవిచూచి నపుడు జ్యోతికి ఊరటకు యెక్కడ వెళ్లాలో తెలియలేదు. జీవిత యదార్ధ సత్యాన్ని వారు గ్రహించి వున్నట్లయితే, క్రీస్తునాధుని విశ్వాసం వలన వారు వున్నతి పొందినట్లయితే వారు తమ జీవితంలో యెట్టి మహత్తరమైన మార్పును చూచేవారు చెప్ప గలవికాదు.

2) ప్రపంచంలో కొందరున్నారు. వారి మనఃప్రవృత్తి వింతగా వుంటుంది. తాము జ్ఞానపూరితులమని, అంతా తమవలనేఅవుతుందని, ఎంతో పట్టుదల గలవాళ్ళమని అనుకొంటుంటారు. కతోలికులంతా తొలగింపబడితే ప్రపంచం యావత్తు సక్రమంగా వుంటుందని, వారిలో కొందరు నమ్ముతారు. నిజంగా అలాంటివారిని చూచి జాలిపడాలి మనం. అంతేగాని వానిని మనం ద్వేషించరాదు. వారు క్రీస్తునాధుడు చెప్పిన దీర్ఘదర్శనాన్ని మరచి పోయారు. ఆ తీర్పురోజున ఒకడు "ప్రభువా! ప్రభువా! మేము మీ నామమును ప్రపచింపలేదా? నీ నామమున దయ్యములను వెళ్ళగొట్ట లేదా?" అని అంటాడు. దానికి అప్పుడు "నేను మిమ్మల్ని యెన్నడు ఎరుగను." అని జవాబు వచ్చును (మత్తయి 7,22) ఈ విధంగా వారు ఖండింపబడుటకు అహంకారమా లేక ఆత్మవంచనా కారణము?

3) జీవితాన్ని బాగుచేయడానికి యే ప్రయత్నము చేయనివారు కొందరున్నారు. "చేసి యేం ప్రయోజనం" అంటారువాళ్ళు. "ప్రపంచం

మార్పు చెందదు. అలాంటి సమయంలో మనం ఎందుకు విచార పడాలి." అనికూడా అంటారు వాళ్లు. నిజంగా యీరకమైన మాటలు ఔదాసీన్యముతో కూడిన అంధకారంలో వున్నవారు అనవలసినవి. ఇది విచారకరమైన పరిస్థితి. ప్రతివారు తగిన ప్రయత్నము చేయు వల యునని దైవము యిష్టము. ఈ రకపు మనుష్యులు క్రీస్తు సత్యాల వెలుతురు ద్వారా యేమి ఉత్సాహాన్ని పొందినట్లులేదు. అలాంటివారు విన్‌సెంట్ డిపాల్, అర్చశిష్ట అసీసు ఫ్రాంచీసువారి జీవితాలు చదవాలి.

**సత్య కాంతులు**

క్రీస్తులో వున్న దేదో ఒకటి న్యాయబుద్ధి గలవారిని ఆకర్షిస్తుంది. "అనేకులు ఆయన బోధలు విని ఆశ్చర్య పడిరి" అని సువిశేషము చెప్పుతున్నది క్రీస్తు సత్యము సత్యాన్వేషకులకు ఆయన మార్గాన్ని చూపే ఒక మహత్తర జ్యోతి స్వరూపం. నిరుత్సాహులకు ఉత్సాహాన్ని, అజ్ఞానులకు జ్ఞానాన్ని చూపించే సత్యమూర్తి ఆయన. అలక్ష్యంగా ఉన్నవారిని ప్రయత్నా రంభకులుగా చేసే మహావ్యక్తి ఆయన. ఆయనను విశ్వసించిన వారిలో వచ్చిన మార్పును గమనించు. సత్యాన్ని తెలుసుకున్న తర్వాత అర్చ॥ పౌలునిలో ఎట్టిమార్పు వచ్చిందో గమనించు ఇలాగే అర్చ॥ అగస్తీను కూడ మతం పుచ్చుకున్నాక ఎలా మారిపోయాడో గమనించు.

ఈనాడుకూడ సత్యం తన ప్రాభవాన్ని అంగీకరింప చేయవచ్చు ఒక కథోలికుడు తన మత సిద్ధాంతాల సత్యాలలో యెంతవరకు హృదయము పెట్టి యున్నాడో యితరులు సునాయాసంగా గ్రహించ లేరు. నీవు యెంతగా క్రీస్తునాధుని వెంబడించెదవో, క్రీస్తును ధరించుటకు ప్రయాస పడెదవో, అంతగా సత్యాన్వేషకులు నిన్ను మార్చివేస్తున్న రహస్య శక్తిని గురించి ఆశ్చర్యపడతారో, అదయేమిటో తెలుసుకో వాలని ప్రయత్నిస్తారు. క్రీస్తునాధుని సత్యాలు నీ శీలములో యెలా పాతుకపొయ్యాయో గమనిస్తారు. ఫ్రాంచీసు డిసెల్సును గురించి ఒక డిలా అన్నాడు. "నిన్ను ప్రసంగ వేదికపై చూస్తేచాలు. నీవు పరలోక జపము చెప్పినంత మాత్రాన నీ వదనముద్వారా, నీ నేత్రములద్వారా, నీ హృదయము మాట్లాడును. నీ నోటిలో సర్వ సాధారణమైన మాటలు ప్రేమాగ్నితో కూడుకొని మానవ హృదయాలను కరుగు నట్లు చేస్తాయి."

చంద్రుడు సూర్యుని నుండి ప్రసారిత మయ్యే వెలుతురువలన ప్రకాశిస్తుంటాడు. చంద్రునిమీద ప్రతిబింబితమైన సూర్యుని ప్రకాశాన్ని తప్ప రాత్రిపూట సూర్యుని చూడలేము. అలాగే క్రీస్తునాథుని భక్తుడు కూడ ఆయన ప్రకాశం వలననే ప్రకాశిస్తుంటాడు. అంధకారములో నున్నప్పుడు అనగా ఆయనను తెలుసుకోని వ్యక్తి ఆయన వెల్తురు ఆయన భక్తునిలో ప్రకాశితమైనపుడు చూస్తాడు. నీ ద్వారా అసలు జ్యోతిని కనుగొంటాడు. నీవు క్రీస్తునాథుని దగ్గరకు పోయిన కొలదీ నీ మీద ఆయన వెల్తురు ప్రసారిత మౌతుంటుంది, ప్రతిబింబితమౌతుంటుంది. అసలు ఆయన ఆశయం కూడ అందరికి వెల్తురును-విజ్ఞానాన్ని-అందజేయాలనే అందుకనే ప్రజలు నీలో, నీ ప్రవర్తనలో, ఆయన సత్యజ్యోతిని దర్శించి ఆ విధంగా ఆయన భక్తులు గావాలని ఆయన కాంక్ష. నీలో క్రీస్తునాథుడు ప్రకాశించుట చూచి కొందరు తమ జీవితాలను మార్చుకోవచ్చు

## వెలుగు అవసరమైన ప్రాంతము

నీకు సైన్సుకు సంబంధించిన విజ్ఞానం లేక పోవచ్చు. నీ కన్నా యితరులు శాస్త్రి విజ్ఞానంలో చాలా ఆరితేరినవారు కావచ్చు. అలాగే నీకు రాజకీయ విజ్ఞానం లేకపోవచ్చు. జీవితంలో జరిగే ప్రతి అంశానికి రాజకీయంలో జరిగే ప్రతిదానికి నీవు సమాధానం యివ్వ లేక పోవచ్చు అవి యేవి లేకపోయినా పర్వాలేదు. నీకు ముఖ్యమైనవి తెలుసు. జీవితం అంటే ఏమిటో జీవితార్థము నీకు తెలుసు. మానవుడు "ఎందుకు" బ్రతుకుతున్నాడు. మానవుని ఉనికి "ఎక్కడ" నుండి వచ్చింది. "ఎక్కడకు" పోతున్నాడు. ఇవి నీకు తెలుసు. ఈ మొదలైన వాటిలో ఈ విషయాలను గురించి మానవులకు ముఖ్యంగా జ్ఞానాన్ని కలుగజేయాల. వీటి విషయమే వారికి కొంత వెలుగవసరము.

మతం అవసరంలేదు అని చెప్పే వ్యక్తికి వెలుగవసరము. ధనమే జీవితాశయంగా పెట్టుకొన్న వ్యక్తికి, పంచేంద్రియాలకు సంబంధించిన జీవితాన్నే నడిపే వ్యక్తికి, చాలా బాధపడుతూ ముందుకు సాగలేని వ్యక్తికి, జ్ఞానజ్యోతి యవసరము. యథార్థమైన భారతీ

యత అంతా మాలోనే మూర్తీభవించింది అని డబ్బా గొట్టుకునే వారుగూడ యాదార్థమైన జ్ఞానాన్ని పొందాలి. వీరంతా అలాంటిది పొందాలి అంటే ఎవరికివారు ఇతరులకు మాతృకగా బ్రతకాలి. ఇతరుల వాక్కులకు భంగము కలిగింపరాదు. దేవునికి యదార్థ బిడ్డలుగావాలి. గర్భ నిరోధాన్ని మొదలైన అమానుష కృత్యముల నిరోధింప నీవు మాతృకమైన జీవితం గడపావంటే, కుటుంబ జీవితాన్ని కల్మషరహితంగా చేస్తావు.

నీవు భారత దేశ జీవితానికి చేయవలసినదల్లా ఒకటే. క్రీస్తునాథుని ఆదర్శాలతో, శాంతితో, సంతృప్తితో కూడిన జీవితాలు గల వ్యక్తులను తయారుచెయ్యి. నీవయినా అలా జీవించగలిగితే నీ పరిసర వాతావరణంలోని పరిస్థితులు ఆ విధంగా ప్రభావితాలవుతాయి. జీవితాన్ని యెలా నడపాలనో స్వామి భక్తి గలిగి యెలా వుండాలనో అడుగునుంచి ఆరంభించి ఓర్మితో జీవిత మహా హర్మ్యాన్ని యెలా నిర్మించుకుంటూ రావలెనో తెలుసుకో. సాధారణంగా జీవితంలోని అపజయాలు అనేవి వ్యక్తి అవలంభించే తప్పుడు విధానాల ననుసరించి వుంటుంది; తప్పుడు దృక్పథాల ననుసరించి వుంటుంది మిగతా ప్రజలతో యెలా జీవించాలో చేతకాకపోవటం వలన కూడ అపజయాలు అనేవి కల్గటం సహజం. కాబట్టి జీవిత ప్రధాన సమస్యల్లా ధనం యెలా సంపాదించాలి అని గాదు; యెలా చక్కని జీవితం, సరియైన జీవితం జీవించాలని.

## నీ బాధ్యతను ఎట్లా నిర్వహిస్తావు?

నీవూ ఆధునిక ప్రపంచానికి ఒక జీవితాన్ని యివ్వాలని మేం చెబుతాం. అది యెలా చేయడమా అని నీవు ఆశ్చర్యపడతావు. నీ మత తత్వంలోకి ప్రవేశించి దాన్ని ఆకలింపు చేసుకోవడం వలన, తిరుసభ కట్టడలను శిరసావహించటం వలన, వుత్సాహోద్రేకావేశాలను రేకెత్తించే క్రీస్తునాథుని నీ ప్రజలకు చూపటం వలన నీవు ఆ పనిని చేయగలవు. నీవు భారత జాతీయ జీవితంలో ఒకసరి క్రొత్త వ్యక్తిగా తయారుకావటానికి ప్రయత్నించు. మీరు క్రీస్తునాథుని అనుసరించే యువతీయువకులుగా తయారు కావాల. క్రీస్తు ప్రాభవము జనులు మీలో చూడాల.

"వ్యక్తులు మనలను ప్రభావితులుగా చేస్తారు. వాళ్ళ మాటలు మనలను కరిగిస్తాయి, మావులు మనల్ని లొంగదీస్తాయి, పనులు మనలో ప్రేరణను కలిగిస్తాయి." అని అన్నారు కార్డినల్ న్యూమన్ గారు. నీవేమీ డాబులు చెప్పనక్కర్లేదు. డంబాలు పలుక నవసరం లేదు. ఎక్కువ మాట్లాడనక్కర్లేదు. నీ చేష్టలే మాట్లాడతాయి నీ స్వార్థత్యాగాలే ప్రకాశిస్తాయి. ఇక అంధకారంలో వున్నవారు వెల్తురు ప్రక్క తమ దృష్టిని సాగిస్తారు. కొందరు వశీకృతులౌతారు.

సైన్సుకు సంబంధించిన సిద్ధాంతాలు మారొచ్చు. ప్రభుత్వం, విద్య వీటినిగురించిన భావాలు మారవచ్చు. కాని క్రీస్తునాథుని దగ్గర నుండి నీకు వచ్చిన భావాలు మారవు. ఎందువలనంటే అవి దైవికమైనవి అందుకే అవి నిత్యసత్యాలు, నిత్యనూతనాలూను. అవి నీ ఆధ్యాత్మిక యోగక్షేమాల కొరకు ప్రసాదించబడినాయి. ఇంకా దేవుడు సృష్టించటంలోని వుద్దేశాన్ని యితరులు తెలుసుకోడానికి నీవు వారికి తోడ్పడడానికి అవి నీకు యివ్వబడి వున్నాయి. ఐతే దేవుడు యే వుద్దేశంతో జగత్సృష్టిని చేశాడు- విశ్వాసం, నమ్మిక, ప్రేమ అనేవి వున్నట్లయితే శాశ్వతమైన, మోక్ష సంబంధమైన సుఖాన్ని అందజేయాలనే ఆయన మానవులను సృష్టించాడు.

**ఆచరణ** 1) ఈ క్రింది మాటలు చెప్పటలో క్రీస్తునాథుని వుద్దేశమేమి? "నన్ను విశ్వశించెడువాడు చీకటిలో నడవకుండుటకునేను భూలోకమున వెలుతురుగా వచ్చియున్నాను. (జ్వా 12,46)

2) అపోస్తుల చర్యలు 4 అధ్యాయము 13 వ వచనములో "వారు జేసువుతో యుండిరని వారికి తెలుసు" అనియున్నది. నీ ప్రవర్తనను బట్టి నీవు దివ్యసత్ప్రసాదం ద్వారా జేసుతో ఐక్యమై యున్నావని, తిరుసభలో, కతోలికు విద్యాలయములో వున్నావని ప్రజలు చెప్పగలరా?

3) ప్రతివారు తమ మాతృకచే బోధ చేయవలెనను అర్చ్య శ్రాంచీసు వారి వాక్యము అమోఘము గదా. ఇది వుత్తమ బోధనా పద్ధతి కాదా?

---

# ముప్పది ఆరవ అధ్యాయము

## ఆదర్శాల విలువ

యువకా దర్శాలు జీవితం ఒక ఆటవంటిదని చెప్పాము. నీ జీవిత విజయము నేది నీవు మోక్షభాగ్యాన్ని సంపాదించుకొనుటకు చేయు ప్రయత్నములపై ఆధారపడి యుంటుంది. ఈ జీవితమనే ఆటలో గెలుపొందాలని బాల బాలికలంతా గాఢంగా వాంఛిస్తారు. ఈ భూప్రపంచంమీద విజయంతో మెలగాలని ఆశిస్తారు. చెడుమీద, అన్యాయంమీద విజయం పొందినట్లుగా భావిస్తుంటారు. అలాగే క్రీస్తునాథునియందు సర్వదా స్వామిభక్తి గలిగి వుండాలని కోరుకుంటారు. కాని యీపని చేయటానికి దీర్ఘమైన ప్రయత్నాలు అవసరమని వారు గుర్తించాలి.

ప్రపంచంలో అనేక కష్టాలు యెదురౌతాయి. గత రెండు అధ్యాయాలలో చెప్పబడిన వుద్దేశాల సమలు జరుపుటలో అనేక అవాంతరాలు తారసిల్లుతాయి. వీటిని అధిగమించ డానికి యువకులు ముఖ్యంగా రెండు అంశాలను గుర్తించుకోవాలి: (1) ఆదర్శాలు యెన్నడూ సులభంగా ఆచరణ సాధ్యాలు గావు; (2) కొద్దిమంది మాత్రమే ఆదర్శమయ జీవితాన్ని జీవించు చున్నట్లు మనకు కన్పిస్తారు. జీవితంలోని ప్రతిసమస్య న్యాయానికి సంబంధించిన ఆదర్శాలతో పరిష్కారం చేయబడుటలేదు. వ్యక్తులు పొరుగువానిపై ప్రేమకంటె స్వార్థపరత్వంలో మునిగి వుండటం మనకు కనిపిస్తుంది. నిర్లక్ష్యత, కామాతురతము, కొంటెతనము, అవినీతి, నిజాయితీ లేకపోవటం—యిలాంటి వన్నీ హెచ్చు పెరిగినాయి. మతం "మంచిదేగాని, అనవసరం" అనే ప్రబుద్ధులు బైలుదేరారు.

ఈలాంటిపరిస్థితుల్లో నీవు యేంచేయాలి? నీదగ్గర మహోత్తరమైన ఆదర్శాలున్నాయి. పదిఆజ్ఞలు, అష్టభాగ్యాలు, ప్రార్థనయువన్నీ నరాసరి దేవుని దగ్గరనుండే వచ్చినవని నీకు తెలుసు. అయినా, యిన్నివున్నప్పటికీ నిన్ను నీవు అనుక్షణం జాగ్రత్తగా పరీక్షించు కుంటూ వుండకపోతే నీలో వున్న ఆదర్శాలు క్రమేపి జారి

పోతుంటాయి. వాటికి అంటిపెట్టుకొని వుండటం నేర్చుకోవాలి. అప్పు డప్పుడు నీస్నేహితులు బంధువులుగూడ నీ ఆదర్శాలకు వ్యతిరేక మైన వాటిని సూచించుతూ వుంటారు క్రీసునాధునుగూడ శోధన తో పోరాడవలసి యుండెనని గుర్తించుకో ఈ క్రింది అధ్యాయా లలో ఆయన చూపిన, యిచ్చిన అత్యుత్తమ వుదాహరణలను తెలు సుకో. మత్తేయుడు 4, 1-2; 26, 38-44; మార్కు 14, 32-36; లూకాసు 22, 42-45

**ఆదర్శాలు ఆచరణీయాలు** ఆదర్శాలతో జీవించాలనుకొనే వ్యక్తి తాను ఆశించినంత వున్నత శిఖరాన్ని అందుకోలేక పోవచ్చు. కాని, ఆదర్శాలను అమలు జరప లేము అనుకొనేవ్యక్తి కన్నా యెక్కువ దూరమే పురోగమించగలడు. మన కండ్లముందు ఆదర్శశీల వ్యక్తిని పెట్టుకొన్న పక్షమున మన ఆదర్శజీవితంలో యెంతగానో సహాయ పడుతుంది. న్యాయంకోసం, ధర్మం కోసం, నీతి నిజాయితీలకోసరం, పరిశుద్ధత కోసం జరిపే పోరా టంలో వ్యక్తి తనకుతాను ఆయా రీతుల, ఆయా అంశాలలో బలపడు తుంటాడు. ఆదర్శము విడువకుండ ప్రయత్నం చేసేవి ఒకనాటికిని వృధాకానేరదు. అది నీ జీవిత పురోగమనానికి ఉత్తమ సాధనము. అది యభివృద్ధికి దోహదంగా ఉంటుంది. ఈ అభివృద్ధి యనేది ఆదర్శాల వలననే సులభ సాధ్యమవుతుంది.

ఈ ఆదర్శాలు నీవు అమలు జరుపుతున్నపుడు యితరులు నిన్ను చూచి నవ్వుతారు. కొన్ని పర్యాయములు నీవు నిరుత్సాహ పడవచ్చు. అలా పడకూడదు. ఆదర్శాలను అమలు జరపటంలో వయస్సు పెరుగుతున్న కొలదీ- నీవు వివిధములైన పద్ధతుల నవలం భిస్తావనటం సత్య దూరంకాదు. కాని, యే పద్ధతుల నవలంభిస్తున్నా ఆదర్శాలను మాత్రం విడువరాదు. వాటికి అంటిపెట్టుకొనే వుండాలి. ఒక సమయం వస్తుంది. ఆ సమయాలో నీవు నిజంగ నీ ఋజువర్తనను నిలబెట్టు కుంటున్నావో లేదో చూచుకోవాలి. నీ కుటుంబానికి విశ్వాస పాత్రుడవై వుంటున్నావో లేదో గమనించాలి. నీ వృత్తికి అనుగుణంగా - దానికి భంగం కలుగకుండా - వుంటున్నావో లేదో పరిశీలించాలి.

ఈ రకమైన పరీక్షలనేది వచ్చినప్పుడు- అది యే వయస్సులో నైనా రానీ ఒకచోట సావధానంగా కూర్చొని ప్రశాంతంగా, ప్రజలు చెప్పేదాన్ని బట్టి, చేసేదాన్నిబట్టి, మంచి చెడుగుల నీవు నీ ప్రమాణాలను స్వీకరిస్తున్నావా లేక క్రీస్తునాథుడు నీనుండి యేమి ఆశిస్తున్నారో దాన్నిబట్టి వాటికి ప్రమాణాల గుర్తిస్తున్నావా అన్న అంశాన్ని గూర్చి ఆలోచన చెయ్యి. అప్పుడొక నిర్ణయానికిరా. దానిమీదనే నీ భవిష్యత్తు ఆధారపడుతుంది. ఒక మహత్తర నిర్ణయంవలననే, ఒక కృతనిశ్చయం వలననే మానవునికి శాంతి, సంతృప్తి లభ్యమౌతుంటవి. అర్చశిష్టులలో యెవరు వున్నతాదర్శాలతో గూడిన జీవితాలను జీవించలేదూ? పారిస్‌లోని విశ్వవిద్యాలయ జీవితంలో ఫ్రెడరిక్ ఒజనాం ఆదర్శంచే ప్రేరేపింప బడలేదా? పార్లమెంటులో డేనియల్ ఓకోనాల్ ఆదర్శాన్ని అనుసరించ లేదూ? ఆలాగే భారతదేశంలో యెందరో మహాపురుష పుంగవులు ఆదర్శాన్ని అనుసరించలేదూ? ఎందరు తల్లిదండ్రులు- అనేక బాధలు పడుతున్నా- ప్రేమ, దయ, వాత్సల్యం, స్వార్థత్యాగం, పట్టుదల యీ మొదలైన వాటి ప్రమాణాలను నిలబెట్టలేదూ? కనుక యివన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తే ఆదర్శాలు ఆచరణీయాలే అని తేల్తుంది అంతేగాక ఆదర్శాలు ఆచరణీయమైనవే అని యితరులను నమ్మించటమే నీవిధి.

**నిశ్చిత ఆదర్శాలు** తక్కువ ఆదర్శాలు, లక్ష్యాలు కలిగి వాటితో సంతృప్తి పడే వారి దుస్థితి, కష్ట సమయంలో, పరీక్షా సమయంలో యే విధంగా నడుచుకోవాల యెట్లు విజయాన్ని పొందాల అని ముందుగా ఆలోచించని వారి దుస్థితి చూస్తుంటే విచారంగా వుంటుంది. యుద్ధాన్ని నడిపించే విధమునుగూర్చి ఒక అభిప్రాయం లేకుండా, ఒక ప్లాను లేకుండా యుద్ధానికి వెళ్ళే సేనానాయకుని గూర్చి నీవు యేమని తలుస్తావు? ఆలాగే ఫుట్‌బాల్ ఆడే జట్టు సరియైన రక్షణోపాయము లేకుండ ఆడటానికివెళ్తే వారి పరిస్థితి యెంత విచారకరమో యోచనచెయ్యి. ఆలాగే వుంటుంది కొన్ని ప్రత్యేక అవసరాలప్పుడు ఒక నడవడిక ప్రమాణాన్ని పెట్టుకోని వ్యక్తి విషయం గూడ.

నిజానికి దేవునికి మాత్రమే తెలుసు కొందరు యెందుకు విజయాన్ని పొందుతున్నారో, కొందరెందుకు అపజయాన్ని పొందుతున్నారో. కాని, ఒకటి: ఈ నాడు నీవు చేపట్టుచున్న ఆదర్శాలు అనగా—స్వార్థత్యాగం గాని, ఋజువర్తనగాని, న్యాయంగాని—ఈ యాదర్శాలు నీ భవిష్యజ్జీవితాన్ని ప్రభావితం చెయ్యటం తథ్యం. ఈ లోపల అవాంతరాలు, కష్టాలు వస్తుంటాయి. మహోత్తరమైన ఆదర్శాలతో నీమనస్సును నింపుకో. నీ ఆదర్శాలకు అననుకూలమైన వాతావరణములో జీవించవలసిన అవసరం రావచ్చు. అట్టి సమయంలో నీవు ఆ వాతావరణమును అధిగమించి యితరులకు సహాయము చేయగలవు. స్త్రీ పురుషులను పురోగమ పథములో తీసికొనిపోవుట కొక నాయకుడు అవసరము స్త్రీ పురుషులను పతనావస్థకు తీసుకొని వచ్చుటకు అత్యధిక సంఖ్యాకులు ప్రయత్నిస్తున్నారు. వారికి వ్యతిరేకంగా నీవు పనిచేయవలె.

స్త్రీలు ఆదర్శాల కోసమే సృష్టిచేయబడ్డారు. ఇతరులను ప్రోత్సాహపరచటం, ఓదార్చటం, ఆదుకోవటం వారివిధి. ఒక జర్మను మహాకవి దేవమాతను గూర్చి "మనలను ఉచ్ఛస్థితికి తీసుకవెళ్ళే మోక్షరాజ్ఞి" అని అన్నారు. దైవము ఏవను ఆదామునకు సహాయముగ సృష్టించారు. కాబట్టి యితరులకు సహాయం చేయటం, వారిని వుత్కృష్టులను చేయుటం. ప్రేరణ కల్గించటం స్త్రీ విధియై యున్నది. కాని యీ పనులను చేయాలంటే ధైర్యంతోను, నిస్వార్థంతోను, శ్రద్ధతోను గూడిన ఆదర్శాలను అనుసరించాలి అప్పుడే తక్కువ ఆదర్శాలు గలవారిచేత ఆమె క్రిందికి లాగబడదు. దానికి మారుగా యితరులను వున్నతివైపునకు నడిపించ గలదు.

క్రీస్తునాధుడు కళాకారు లందరిలోకి వుత్తమోత్తముడు. వ్యక్తిని యెలా మోక్షానికి సమాయత్త పరచ వలసింది ఆయన కొక్కరికే తెలుసు. అందుకు అవసరమైన సూచనలను చేశారు. వాటి ననుసరించ గల్గితే పరలోకానికి మార్గాన్ని సిద్ధపరచు కొన్నట్లే. సుఖదుఃఖముల లోను, జయాపజయాల లోను, ఎల్లవేళల లోను మోక్షభాగ్యమును ఆశించి దానికొఱకై యత్నించకుండ లేక కనీసము జీవితాంతమున తన పాపములకు పశ్చాత్తాప పడకుండ, దానిని పొందిన వాడెవడును లేడు.

**వాస్తవికత: ఆదర్శాలు** నీవు యితరులకు సేవ చేయాలని నిశ్చయించుకున్నావు. కాని నీ ధైర్యం నిన్ను విడువ వచ్చు. దానికిక్కి కారణ మేమి? బహుశా నీవు యితరులవద్ద నుండి యెక్కువ ఆశించావేమో! లేక తప్పుడు పద్ధతులను అవలంభించావేమో! కనుకనే నీవు అనుకున్న విధంగా నీ ఆదర్శాలు పనిచేయక పోవచ్చు. అలాంటప్పుడు నీవు చేయవలసిందల్లా ఒకటే. నీ ఆదర్శాలను వీడక, సేవాతత్పరుడవైయుండి యితరుల బలహీనతకు తగినట్లుగ నీవు ప్రవర్తించటానికి, దాని కనుకూలంగా నడవటానికి, ఆ బలహీనత నుంచే వీలైనమట్టుకు మంచిని రాబట్టటానికి నేర్చుకో! ఇతరులెవరైనా నిరాశాపరులై "అది మేము ప్రయత్నించే చూశాము-" అని పెదిమలు విరిస్తే నీవు నిరాశాపరుడవు కావద్దు. నీ చుట్టువున్న పరిస్థితులకు అనుగుణంగా నిన్ను నీవు సరిచేసుకొనటానికే, వున్న వాస్తవికత ననుసరించి నిన్ను నీవు సరిదిద్దుకొనటానికే నీకు దేవుడు తెలివి తేటలను, మానసిక బలాన్ని, అనుగ్రహాన్ని దయచేశాడు. మానవులెప్పుడు పరిపూర్ణులు కాలేరు. కాని, పరిపూర్ణత్వం వైపుకు పురోగమించాలని ప్రయత్నించే వారెప్పుడు వుంటారు. సామాన్యులకంటె యెక్కువగ చేయటానికి ప్రయత్నించు. నీ ఆదర్శాలను ఆచరణలో పెట్టి వాటిని మరింత ఫలభరితముగ చెయ్యి.

**ఆచరణ** 1) దుఃఖాపూరితుడయ్యు, నగుమొగముతో నుండ గలడా? బాధకుయేమైనా అర్థమున్నదా?

2) "యథార్థమైన సోదరప్రేమ అనేది నీ పొరుగువాని లోపాలన్నిటిని భరించటంలోనే వున్నది" అన్నదాన్ని గూర్చి చర్చించు.

3) 7 వ గ్రెగోరి పావుగారిలా అన్నారు: "నేను న్యాయాన్ని ప్రేమించాను. అక్రమాన్ని ద్వేషించాను. అందుకనే నేను దేశభ్రష్టుడనై చనిపోవుచున్నాను." ఆయన అపజయం పొందినట్లేనా? ఆయన న్యాయాన్ని ప్రేమించటం మానుకొని వుండాలా? 'క్రీస్తునాధునిలోని దైవజీవితాన్ని జీవించేవారంతా కడగండ్లపాలౌతారు' దీని అర్థమేమి?

4) ఫ్రెడరిక్ ఒజనాం వ్రాసిన యీ క్రింది వాక్యాలను చర్చించు "పత్రికలయల ద్వారా నా విశ్వాసమును బలపరచుకొనెదను. చర్యల ద్వారా నా మతమును ఘనపరచుకొనెదను."

# ముప్పది ఏడవ అధ్యాయము

## అ ల వా టు లు

**ఆదర్శాలతో అలవాట్లకు గల సంబంధం**

ఆదర్శాలనేవి మనము చేయవలసిన పనులకు మార్గదర్శకాలవంటివి. ఆదర్శప్రాయమైన విధానము నీకు కన్పించినప్పుడు దాని ప్రకారము నీవు చరించడానికి ప్రయత్నించాలన్నమాట. ఈ విధంగా చేసావంటె నీకు ఒక అలవాటు అనేది ఏర్పడుతుంది. ఈ అలవాటనేది ఆదర్శజీవితానికి మరింత సహాయముచేస్తుంది, సునాయాసం చేస్తుంది.

కొన్ని మానవ స్వభావాతీత పుణ్యములను ఆచరించాలని నీ వేదము నీకు ఆజ్ఞాపిస్తుంది. ఇది స్వాభావిక అలవాటు వంటిదికాదు. మంచి అలవాటులను అలవరుచుకొనుట వలన పై పుణ్యములను సులభముగ మనయందభివృద్ధి చేసుకొనవచ్చును. జ్ఞానస్నానము ద్వారా మనకు దైవమును నమ్మి ఆయనను ప్రేమించు శక్తి యివ్వబడినది. మన ప్రస్తుత దైవ విశ్వాసానికి, దైవప్రేమకు అదే కారణభూతమును, పునాదియును. దైవాన్ని, క్రీస్తును ప్రేమించే ఆదర్శం మనకుండాల. మన స్వాభావిక మంచి అలటువాటులను అభివృద్ధిచేయమని దైవాన్ని ప్రార్థిస్తూ వాటి అభివృద్ధికి మనం ప్రయత్నించినట్లైతే దైవము మన విశ్వాస పుణ్యములగు విశ్వాసము, దైవప్రేమ వాటి అభివృద్ధికి కూడా తన అనుగ్రహమునిచ్చును. ప్రతి విశ్వాస క్రియ దైవము మన కుచితముగ ప్రసాదించిన దైవానుగ్రహము. నీవు సరిగా నీ మంచి అలవాటులను ఆచరణలో పెట్టిన దైవము నీకు మరింత అనుగ్రహము దయచేసి నీ ఆత్మ శక్తులను పూర్తిగ ఫలబరితము చేయును.

మన నాథుడు ప్రవర్తించిన విధాన రూపాన్ని నీ కండ్ల యెదుట నుంచుకొని అలవాటును అభివృద్ధి చేసుకొనుము. ఆ విధానమే నీ ఆదర్శం. ఆ విధంగా, ఆ ఆదర్శం ప్రకారం నీవు ప్రవర్తించునట్లు సహాయము చేయుమని ప్రార్థించు ఆయనన్ని.

మనము ఆశావాదపు (Optimism) లేదా నిరాశావాదపు (Pessimism) అలవాట్లైన అలవర్చుకోవచ్చు; నాగరికమైన లేదా మొరటు అభ్యాసాలైనా అలవరచుకోవచ్చు. మనము లోతుగ ఆలోచించక, పైపైన ఆలోచించడం సులభం. ఈ రెండవది - పైపైన ఆలోచించడం—అనేది అన్నిటికంటె సులభం. ఈలాంటి అభ్యాసంగల వారు చెత్తసాహిత్యాన్ని, కథలను చదువు తుంటారు. గౌరవముగల మనస్సు, ఆరోగ్యవంతమైన (మంచి) మనస్సు అనేవి వున్నవి. అలాంటి మనస్సును సదా కలిగి వుండాల. నీ ఆదర్శ మేమిటో మొదట యేరుకో. దాని ప్రకారము నడచుకో! తప్పుడు రకపు అలవాటులున్నాయే అవి మనలను తక్కువ రకపు ఆదర్శాలవైపుకు తీసుక వెళ్తాయి. చివరకు నీచరకపు వస్తువులపై ఆశలను రేకెత్తిస్తాయి

## అలవాట్లను ఎట్లా అలవరచుకోవాలి

ఒక్కసారిగా ఏ అలవాట్లు నీకు అమరవు. 20 సంవత్సరాలు అంతకుపైగా ప్రయాస పడి అర్చ్. ఫ్రాన్సిస్ డిసేల్సు తన కోపాన్ని జయించాడు. ప్రొఫెసర్ జేమ్సు ఈ అలవాటులను గురించి కొన్ని నియమాలను చెప్పాడు.

1) నీ క్రియలలో యెన్ని వీలైతే అన్ని యేలాటి ప్రయత్నం లేకుండ చేసికొన అలవాటును సంపాదించుకో! ప్రతి రాత్రి ప్రతి వుదయము మోకరిల్లడం ఒక అలవాటుగా వుండాలి. ప్రతి సాయంత్రము యీ దినము జపించవలెనా లేదా అనేటటువంటి సమస్యగాని, ఆలోచనగాని నీలో రాకూడదు. జపించెదనని ప్రతిరోజు ఒక నిశ్చయానికి రావడం మనకు అనవసరంగా యుండవలె. అది స్వాభావికంగా ఆ సమయము వచ్చునప్పటికి మనకు రావలె. మనం సక్రమముగా అవి చేస్తూవుంటే తనంతట అదే ఆ సమయము వచ్చునప్పటికి సూచిస్తుంది. అదే విధముగ శపించడముగూడ. శాపపుమాట అనడానికి అలవాటు పడ్డావంటె అది నీకు యెప్పుడూ వస్తూవుంటుంది.

2) అలవాటు స్థిరంగా నిలబడి పొయ్యేవరకు ఆ అలవాటును అలవరచుకొనటానికి యే మాత్రం అశ్రద్ధచేయకు. స్నేహితు డెవడైన

కనిపిస్తే నమస్తే అను. ఇలా అనటం నీకు రెండవ స్వభావం అయ్యే వరకు ఆలా కృషిచెయ్యి.

ఒక పనిని మనం చేయాలి అనే స్వభావము దాన్ని అనేక పర్యాయములు చేసినప్పుడు మనలో ప్రేళ్ళుపాతుకుంటుంది. "ఉత్తమమైన తీర్మానమొకటి లేదా సహృదయత అనునది యేమీ ఫలితము లేకుండా అంతర్థానమైతే అది ఒక అవకాశాన్ని పోగొట్టుకొన్న దానికంటె అధికనష్టం." బేస్ బాల్ ఆటలో ఒక్క దెబ్బతో బేసులన్నీ తిరిగి హోమ్ బేసుకు రావాలని కూర్చొని కలలు గనడం ఒక బలహీనాన్ని తెలుపుతుంది. లేచివెళ్లి బాటింగ్ ప్రాక్టీసు చేసుకో!

3) 'వాటిని ఆచరణలో పెట్టడంద్వారా తీర్మానాలు సమర్థవంతాలౌతాయి.' రేపు గట్టిగా చదువుతాను అని యీ రోజు తీర్మానించుకొనడం యే ప్రయోజనాన్ని సాధించదు. "ఆపని యిప్పుడే చెయ్యి"

4) "అనవసరమైన చిన్న పనులయందు నీ శూరత్వాన్ని క్రమపద్ధతిన చూపు. ప్రతిరోజు కష్టమైన ఒకటి రెండు పనులను, అవి కష్టమైనందుననే చెయ్యి. నీవు తరువాత యేలాంటి పెద్ద పరీక్షలకైనా నిలువగలవు. ఏ కష్టాన్నైనా యెదుర్కొ గలవు." ఈ విధంగా చిన్న చిన్న త్యాగాలు ప్రతిదినం చేశావంటె పెద్ద పెద్ద వాటిలో కృతార్థుడ వౌతావు. భీభత్స సమయాల్లోకూడ ధైర్యముగ నుండగలవు.

"నీ ఆలోచన, నీ ప్రవర్తన నిష్కల్మషంగా, దృఢంగా, న్యాయముగా వుండాలి అంటే నిష్కళంకమైన ఆలోచనలను, విశుద్ధమైన పనులను పట్టుదలతో ఆచరణలో పెడుతుండు. తద్వ్యతిరేకమైన వాటిమీదికి దృష్టిని పోనివ్వకు" కూడని పనులలో నీ దృష్టి లగ్నమైనపుడు దాన్ని అంతకన్న వుత్తమమైన వాటివైపు మరల్చు. ఉదాహరణకు స్వార్థానికి లొంగిపోవటానికి బదులు యితరులకు సహాయంచెయ్యి. లేక నిస్వార్థమైన మరోపనినిచెయ్యి. అప్పుడు నీకు వున్నతదృష్టి అలవడిందన్నమాట. ఎంత త్వరలో నీ ఆలోచనను మంచిక్రియలలో పెడితే అంతగా నీకు బలము చేకూరుతుంది.

**చెడు అలవాట్లను నిర్మూలం చేయుట** 1) ఒక్కసారి ఒక తప్పును కచ్చితముగా సవరించు కోవడం నేర్చుకో. అంతేగాని అన్నిటిని సవరించబోయి యేదియు చేయకుండా వుండకు. ఒక్కసారే పది కర్రపుల్లలుగల కట్టను విరుస్తాననకు. అది నీవు చేయలేవు. ఏ పుల్ల కా పుల్లను ఒక్కొక్కసారి తీసి విరిస్తే సులభంగా అన్నీ విరిగిపోతాయి. అలాగే యెప్పటి కప్పుడు ఒక్కొక్క లోపాన్ని, ఒక్కొక్క తప్పును సరిదిద్దటం నేర్చుకో.

"నేను కోపం తెచ్చుకోను" అని అనకు. అదిచాల విశాల మైంది. అది జరిగే పనికాదు. దాన్నియింకా కొంచెం కచ్చితంగా చెప్పు. "ఈ రోజునుండి యీ వారం ఆఖరు వరకు కోపంతో యెదురు చెప్పను" అని అను. అలా ఒక కాలపరిమితి పెట్టి నిన్ను నీవు చక్క దిద్దుకో. అది చాల శ్రేయోదాయకం.

2) నీకు తెలియకుండానే నీ నోట్లోంచి కోపపు మాట అంటావు. లేక కోపంతో గూడిన పని చేస్తావు. కాని దానికి బాధపడకు. నీకు కోపం రాబోతున్నదని తెలియగానే మనస్సు అంకునుండి మళ్లించుకో. అప్పటికప్పుడే, అక్కడికక్కడే నిన్ను నీవు సరిదిద్దుకో. కోపాన్ని అణచివేసుకో. అదే పెద్దల లక్షణం.

3) ప్రశాంతంగా రోజువారి సమరానికి సిద్ధపడు. జీవితం నిత్యరణ రంగం. నిన్ను నీవు కట్టుదిట్టం చేసుకోవాలి యెప్పటికప్పుడు.

**ఆచరణ** 1) అణకువ, సత్యసంధత, హృదయాంతరాళాల్లోని ప్రార్థనలు, ఉపవాసం యీలాంటి అలవాట్లన్నీ నీవు ఆదర్శాన్ని చేరుకోవటానికి తోడ్పడతాయి. మన దైనందిన క్రియలు మనలను భగ్నం చేయవచ్చు లేదా గొప్పవారిగా చేయవచ్చు. నిరంతరంగా నీలోని నీచపు ప్రేరణలకు కొంచెం కొంచెంగా లొంగటం వలన క్రమ క్రమంగా నీవు బానిసవవుతావు. మోసం చేయటం, నీచంగా వ్యవహరించటం యీలాంటివన్ని కొద్దిపాటి పనులుగానే కనిపిస్తవి. కాని వీటి ఫలితాలు యేలా వుంటవో నీవు వూహించలేవు. కాని ప్రతిపని నీ మెదడులో గాడిని యేర్పరస్తుంటుంది. ఈ గాళ్లలోనే నీ భవి

మత్కార్యాలు నడవటం మొదలు పెడతవి. సిగరెట్లను కాల్చాలను కున్నపుడల్లా సిగరెట్లను కాలుస్తుంటే, తినాలని అనుకున్నపుడల్లా బిస్కెట్ తింటుంటే, సినిమాకు వెళ్లాలనుకున్నపుడల్లా సినిమాకు వెళ్తుంటే నిన్ను బానిసనుగా చేసే ఒక అలవాటును నీవు యేర్పరచు కోవచ్చు. నీ తృప్తికోసం చేసే పనులకు స్వస్తిచెప్పటం చేసుకో.

2) "ఇతరులను మొట్టమొదటి సారిగా మోసం చేయటానికి ప్రయత్నించినపుడు మనము ఒక వలను అల్లుతున్నాము." దీన్ని విమర్శించు.

3) "ఒక భావాన్ని విత్తి క్రియ అనే ఫలాన్ని కొయ్యి,
క్రియను విత్తి అలవాటును పొందు,
అలవాటును విత్తి శీలమును లభ్యం చేసుకో,
శీలము వలన నీ భవిష్యత్తును పదిల పరచుకో."

దీన్ని విమర్శించు.

4) ఓర్పు, ప్రయత్నం, పఠనం, ప్రార్థన వీటిద్వారా నెమ్మది నెమ్మదిగా మానవుడు పూర్ణత్వము నొందుతాడు. నెమ్మది నెమ్మదిగా అభివృద్ధి పొందటంతోత్సృప్తిపడు. కాని నిశ్చయంతో మాత్రంవుండు. ఇక నీకు శోధనలు వచ్చినపుడు "యీపరిస్థితులలో క్రీస్తునాధుడు యేం చేయుదురు" అని ప్రశ్నించుకో. క్రీస్తునాధుని అనుసరిస్తున్నావు గనుక వెంటనే ఆత్మ నిగ్రహాన్ని చూపించు. ఆలా నిగ్రహాన్ని చూపటం వలన, ఆలా యెదుర్కొనటం వలన నీవు క్రీస్తునాధుని ఘనపరుస్తున్నావు!

---

# ముప్పది ఎనిమిదవ అధ్యాయము

## విధేయత

**నాయకత్వం కోసం వాంఛ**

చిన్న పిల్లలు యే ఫుట్‌బాల్ టీముకో లేక మరి ఏ టీముకో కాప్టెనులుగా వుండాలని కోరుకుంటుంటారు. క్లాసులో మానేటరుగా వుండాలని వాంఛిస్తుంటారు. అలాగే పెద్దవాడవయి నీవు ఏ విచారణలోనో పనిపాటలు చేస్తుంటే అక్కడ నీ ఆదర్శాల కనుగుణంగా నీ చిత్తం వచ్చినట్లు వ్యవహరించాలని చూస్తుంటావు. ఇతరుల కోరిక ప్రకారం వారికి సంతృప్తి నిచ్చే విధంగ పనులు చేయటం అంతసులభం గాదు.

నీవు నాయకుడవు కావాలన్న కోరికను గురించి, లేక నీ యిష్ట ప్రకారము చేయాలన్న కోరికనుగురించి కొంచెం ఆలోచించు ప్రతి వారు నాయకులైతే, ప్రతివారు తమ యిష్ట ప్రకారం చేస్తే జీవితము అందరికి యెంత దుస్సహమాతుందో కొంత ఆలోచించు. యెంత కంటకంగా తయారౌతుందో వూహించు. ఒక ఫుట్‌బాల్ టీంలో ఒకడు తాను మిగతా వారికి నాయకుడు కావాలని కోరతాడు అనుకో. ఇతరుల ఆజ్ఞలను విధేయించటానికి యిష్టపడడనుకో. అప్పుడు ఆ టీం గతి యేమవుతుంది? సర్వత్రా మనమే నాయకత్వాన్ని వహించలేము. మనముకూడా యితరులను అనుసరించవలె. ఇతరుల ఆజ్ఞలను పాలించవలె.

**నాయకత్వం వహించడానికి విధేయత అవసరం**

క్రింద చెప్పబొయ్యే విషయం నీకు వింతగా తోచవచ్చు. కాని అది సత్యం. నాయకత్వాన్ని వహించాలంటే ఆ అర్హతను పొందాలంటే నీవు మొట్ట మొదట విధేయత నేర్చుకోవాల. దేవుని కట్టడలకు, దేశ ప్రభుత్వ శాసనాలకు అణగి మణగి వుండని నాయకుడు, బడిలోని నియమాలకు తల్లిదండ్రుల ఆజ్ఞలకు విధేయించని వ్యక్తి అన్నివిధాలా ప్రమాదకరమైన మనిషే. ఈ లాంటివాడు యెప్పుడైనా దేవునికంటె, దేశానికంటె, విద్యాలయము, గృహము, మిత్రునికంటె ముందుగ తన్ను పెట్టుకుంటాడు. తనే వారి

కంటె అధికమని తలంచుతాడు. వారి కట్టడలను తిరస్కరించి తన ఆలోచన ప్రకారం చేయాలంటాడు. స్వార్థపరుడైన స్నేహితులను నీ వెప్పుడు నమ్మవు కదూ! అవిధేయులు స్వార్థపరులు.

కొందరికి యితరులను ఆజ్ఞాపించడమంటే యిష్టము గాని యితరుల ఆజ్ఞలను స్వీకరించలేరు. సహించలేరు ఇతరులేదైనా చెయ్యమని అంటె వారు మహా బాధపడతారు. నవనాడులు క్రుంగినట్లు భావిస్తారు. కాగా విధేయత అనేది వ్యక్తి అభివృద్ధి గావటానికి తగినమార్గమని చెప్పవలయును. విధేయత స్వీయాభివృద్ధికి మూలము.

నీవు ఫుట్ బాల్ టీంలో ఫార్వర్డు (Forward) ఆడుతున్నావనుకో. ఆఫ్ బాక్ (Half back) నీకు వచ్చే ప్రత్యర్థిని నిరోధించమని చెబుతాడనుకో. నీవు ఆలా చేస్తే బాక్ (Back) నీ స్థలాన్ని ఆక్రమించుకుంటాడు అవసరమైతే. ఆలాంటి సూచన నీ కిష్టములేక చేయలేదనుకో. ఆ సూచన తప్పు అని అనుకుంటావనుకో. నీవు గనక ప్రత్యర్థిని నిరోధించడానికి ప్రయత్నించక పోతే నీ టీం అపజయం పొందుతుంది. ఈ అపజయమనేది నీవు నిరోధించ నందువల్లకాదు. నీ టీంలో తగిన శిక్షణ లేకపోవుటవలన. ఈ లాటి ప్రవర్తన నీకు సహజమైతే నీ టీం నిన్ను యెప్పుడైనా నాయకుడిగా యెన్నుకుంటుందా? విధేయత అంటే యేమిటో తెలిసిన వాడ్నే యెన్నుకుంటుంది. నిన్ను స్వార్థునిగా తలంచుతుంది. నాయకుడనేవాడు తన స్వంత వాంఛలను తన అనుయాయులకై విడనాడి వారి శ్రేయస్సుకొరకు అది టీం గాని, విద్యాలయముగాని, కుటుంబముగాని, యజమానులుగాని ప్రయాసపడవలె

నీవు నీ గత జీవితాన్ని గూర్చి ఒకసారి సింహావలోకన చెయ్యి. అప్పుడు నీ వెందరికో విధేయించి వుంటావు. నీవు విధేయించిన ప్రతీ యొక్కసారికి నీ విప్పుడు ఆనందిస్తావు. ఎందుకంటే అది నిన్ను మంచి వ్యక్తినిగా చేసింది. ఎక్కువ మనో నిగ్రహాన్ని కల్గించింది. నిన్ను మరీ స్వార్థత్యాగినిగా చేసింది.

నీ యిష్టాలను యితరుల భావాలకు, అభీష్టాలకు లొంగదీయుడము అనేది అనేక పర్యాయములు జీవితరంగంలో అవసరం. విచా

రణ కమిటీలో వుంటావు. ఆ కమిటీ అధిపతి పరిస్థితులను న్యాయంగా, సక్రమంగా పరిశీలించటం లేదని నీవు అనుకోవచ్చు. అయినప్పటికీ ఐక్యతదృష్ట్యా కమిటీ చేస్తున్న ఆజ్ఞలను శిరసావహిస్తావు. ఈ విధంగా నీవు సంతోషంతో, చిరునవ్వుతో, వాటిని స్వీకరించటం వలన నాయకునికి వుండవలసిన లక్షణాలను యిప్పటినుంచే అలవరచు కుంటున్నావన్నమాట. అప్పుడు నీ క్రింద వున్నవారి అభిప్రాయాలను చాల బాగా అర్థం చేసుకోగలవు. అప్పుడు మానవ స్వభావాని కనుగుణంగా దయతో నీవు ఆజ్ఞలను యితరుల కివ్వగలవు. ఇతరుల అభిప్రాయాలను, సలహాలను వినేంత విశాలహృదయం ఏర్పడుతుంది. కొన్ని సమయాల్లో నీ వితరులను నడిపించటానికి పూనుకో, మరికొన్ని సమయాల్లో యితరులకు అణగిమణగి వుండటానికి సిద్ధపడు. ఇతరుల మాటలను స్వీకరించటానికి నీ వాటికి స్వస్తి చెప్పటానికి ఆయత్తపడు.

**దైవ దృక్పథం** నీవు పెద్దవాడివని అందరు అనుకోవాలని యిష్టపడతావు. పన్నెండవ యేటనే జూదుల పిల్లవాడు పెద్దవానిక్రింద జమ కట్టబడతాడు. అప్పుడే వృత్తి గూడ నేర్చుకోటానికి ప్రారంభిస్తాడు. క్రీస్తునాథుడు ఆ వయస్సులోనే గుడికివెళ్లినారని సువిశేషం (లూకా 2,51) చెబుతుంది. తాను దైవమని, ఆ ప్రాయములో వయస్సువచ్చిన పెద్దవాని క్రింద పరిగణింపబడుటకు తమకు హక్కు వున్నదని ఆయనకు తెలుసు. అయినప్పటికిని తల్లిదండ్రులకు విధేయించినారు. ఇహపర లోకాలకు ప్రభువైన ఆయన సామాన్యులైన ఆ యిరువురి వ్యక్తులకు విధేయించినారు. 'విధేయత'కు అది సరియైన చిత్రణగదూ! నీ తల్లిదండ్రులకు లొంగ వలసిన వయస్సు దాటిపోయిందని నీవనుకున్నప్పుడు వెంటనే ప్రభువైన క్రీస్తునాథుని ఆదర్శాన్ని ముందు పెట్టుకో!

మనదగ్గరనుండి దేవుడు అణకువను కోరుచున్నాడు. ఆయన కొన్ని నిబంధనలను యేర్పాటు చేసారు. ఆ నిబంధనలను శిరసావహించటంలో, న్యాయమైన మన పెద్దలమాటలను మన్నించడంలో, తల్లిదండ్రుల, వుపాధ్యాయుల ఆజ్ఞలను పాలించటంలో మనం దేవుని చేరగలమా లేమా అనే విషయం తేలిపోతుంది.

"నాచిత్తంగాదు మీచిత్తమే నెరవేరుననుగాక" అని ఒకసారి క్రీస్తునాథుకు అన్నారు. ఆనాటినుంచీ న్యాయమైన విషయాల్లో, పట్టిబద్ధమైన విషయాల్లో యితరుల చిత్తం ప్రకారం వ్యవహరించటం మానవలక్షణ మయింది

కాని ఒక విషయం. ఇతరుల ఆజ్ఞలను పాలించటంకన్నా మనస్సాక్షి ప్రకారం వ్యవహరించవలసిన సమయాలు కూడ వస్తుంటాయి. అయితే మొండితనానికి, చిత్తసంకల్పము (Will-power) నకు గల భేదమేమిటో ముందు యితమిద్ధంగా తెలిసికో. మొండితనం బలహీనుల లక్షణం. ఇక రెండవది తద్వ్యతిరేకుల లక్షణం. స్నేహితాల విషయంలో 'మా తల్లిదండ్రులకన్నా నాకే యెక్కువ బాగా తెలుసు' అని పిల్లలు అనడం మొండితనం వలననే. దాన్నే తలబిరుసుతనం అని అనవచ్చు. ఏమాత్రం విజ్ఞానం సంపాదించినా సర్వజ్ఞులులా వ్యవహరించటం యెంత అసంబద్ధమో అంతకన్న వెయ్యిరెట్లు అసంబద్ధం బాల్యములోనే 'యేలాంటివారితో స్నేహం చేయాలనో నాకు తెలుసు' ననటం.

**ఎలా విధేయించాల**

తక్షణం విధేయించటం మన ప్రభువుని సంతోషపెడుతుంది. పెద్దలు యేదైనా చెబితే దాన్ని తక్షణం శిరసావహించటం వలన నీలోవున్న గర్వం, 'అహం' అణగిపోతుంది. అంటే నిన్ను నీవు జయించుకున్నావన్నమాట. నిన్ను నీవు అదుపు ఆజ్ఞలో పెట్టుకో గల్గినావన్నమాట. అదే నిజమైన క్రైస్తవుని లక్షణం. "విధేయించటం యెన్నడూ నేర్చుకోని వ్యక్తి తనమీద తాను అధిపత్యాన్ని యెన్నడూ చెలాయించలేడు. తనకు తాను అధిపతికాని వ్యక్తి సక్రమమైన జీవితానికవసరమైన మనోస్థిరత్వాన్ని, శాంతిని సంపాదించుకోలేడు." వాదించకు, చర్చించకు. తక్షణం వెళ్లి నీ పెద్దలకు విధేయించు. కాని చాల సందర్భాలలో నీకు కష్టంగావుంటుంది. ఎక్కువ బాధపడతావు. అది యెవరూ కాదనరు. నీకు బాధ కలిగించే పనులు చేయడం నీ శీలమునకెంతయో ప్రయోజనకరం.

**ఆచరణ** 1) శోధనలతో తర్కించటం మొదలు పెడితే, వాటితో చెల్లాటమాడితే అవి మనలను వశపరచుకుంటాయి. దేవుని కట్టడ విషయంలో తక్షణం విధేయించాలని నియమం పెట్టుకో సందేహించకుండా ఆ పని చెయ్యి. అప్పుడు నీ కెంత మానసిక సుఖం, సంతృప్తి కల్గుతవో చూడు. దైవ చిత్తము మనకు తెలిసినప్పుడు మనము తర్కించటంగాని, విధేయించకుండా ఆలోచించడంగాని నిష్ప్రయోజనములు.

2) టెన్నిసన్ వ్రాసిన యీ క్రింది వాక్యాన్ని గమనించు. "పర్యవసానాన్ని కూడా తృణీకరిస్తూ, న్యాయము కావున న్యాయపథాన నడచుటే విజ్ఞానం."

3) ఈ క్రింది వాక్యముయొక్క అర్థమేమిటి? "సిలువ పథమే జ్యోతి పథము."

4) యోగము (తపస్సు) అంటే జీవితాన్ని కఠినతరము చేసుకోవడమని అర్థంగాదు. మోక్షభాగ్యమును పొందు యత్నములో ఆత్మకు తగిన శిక్షణనొసంగే ఒక ఆధ్యాత్మిక క్రీడావిశేషమే యోగము అనవచ్చును. ఇది నీకు రుచించని విషయములలో విధేయత చూపుటకు, అణకువ గలిగియుండుటకు ప్రోత్సాహము నిస్తుందా?

5) ఇందులో యెంత సత్యమున్నదో చూడు: "వాదించటం వలన, తప్పులెంచటంవలనగాక పనిచేయటం వలన, బాధపడటం వలన సందేహాలు, కష్టాలు అధిగమించ గలము."

# ముప్పది తొమ్మిదవ అధ్యాయము

## సన్మానము

గౌరవం అనేది మనస్సు యొక్కయు, హృదయము యొక్కయు ప్రవృత్తి (Attitude). ఈ ప్రవృత్తి, యీ సంస్థితి, యీభావము దైవము యెడ, యితర మానవుల యెడ, పెద్దల యెడ, మనయెడ. భక్తిగలిగి యుండు నటుల చేయుచున్నది. యథార్థమైన గౌరవంలో కొంత తల్లి దండ్రుల యెడ ఉండవలసిన భయము వంటి భయము కూడ మిళితమై యుంటుంది ఈ గౌరవం అనేది కొంతమంది వ్యక్తులతో, వస్తువులతో, సంఘటనలతో అధిక పరిచయము లేకుండ తమ్ము తామే నిగ్రహించుకొనునట్లు చేయుచున్నది.

**పరిస్థితి** దేవునికి సంబంధించిన విషయాలలో కొందరు కతోలికులకు గౌరవం లేదు. యువకులు తమతో పరిచయముగా నున్న వారి యెడల గౌరవాన్ని చూపరు. మరీ వారిలో యున్న సుగుణాల యందు కూడ గౌరవము చూపరు.

**సమస్య** నీలో గౌరవం పెరుగునట్లు చూచుకొనటం నీపని. గౌరవానికి గల తాహతును గూర్చి తెలుసుకోవడంలో యితరులకు తోడ్పడాలి. అది గూడా నీపనే. నీతో కలసి మెలసి యుండే స్నేహితుల యందు గౌరవ భావాన్ని అలవరచుకో.

**మనవిధి** దేవుని వలన సృష్టించ బడినాము గనుక, ఆయన వలన లోకములోకి వచ్చినాము గనుక ఆయనను గౌరవించటం మనవిధి. అది ఆయన యాజ్ఞ. (ప్రథమ మూడు ఆజ్ఞలు). కీర్తనలు 2,21. "భయభక్తులుగలిగి జెహోవాను సేవించుడి. గడగడవణుకుచుసంతోషించుడి." మనకన్నా అధికారంలోను, విజ్ఞానంలోను పెద్దగా వున్న వారినిమనం గౌరవిస్తాము. అయినా దేవుడు అందరికన్నా గొప్పవాడు. అందువలన ఆయన్ను గౌరవించాలి. వెయ్యి సంవత్సరాలయితే ఆయనకుఒక రోజులాంటిది."

తల్లి దండ్రులను, వారి న్యాయమైన హక్కులను గౌరవించటం పిల్లల విధి. బాలికలు తమ తల్లి దండ్రుల యెడ గౌరవం కల్గియుం

డాలని, తమ మత సంబంధమైన విషయాలను గౌరవంతో చూడాలని, తమ్ముతాము గౌరవించుకోవాలని దేవుడు కోరుతున్నాడు. బాలికకు తనయెడ గౌరవం లేకపోతే యితరులెవరు గౌరవము చూపరు. అదే విధంగా యువకుడు కూడా చెయ్యాలి. యువకుడు తనకు తోచినట్లు నడచుకోక క్రీస్తునాథుని తనకు మాతృకగా తీసుకోవాలి. ఈ గౌరవము అనే గోడ విరిగి పోయిందా మానవులు ఒకరినుండి ఒకరు జుగుప్సతో దూరముగా వెళ్లి పోయెదరు.

## సహాయాలు

1) దేవుని యొక్క మహోన్నతాన్ని గూర్చి, ఆయన అనంతతను గూర్చి అప్పుడప్పుడూ ధ్యానించుతూ వుండు. ఇతరులను గౌరవించే వరాన్ని నీకు ప్రసాదించమని ధ్యానాంత్యాన ప్రార్థించు. మననం అనేది చాల దీర్ఘకాలం చేస్తుంటే అది దేవుని మీద గౌరవాన్ని కల్గిస్తుంటుంది.

2) దేవుని నామమును గౌరవపరచు. ఆయన నామమునే గౌరవనీయుడూ వృదాగా వాడడు. దేవుని పేరు తన ముందు వుచ్చరింపబడినపుడల్లా ప్రసిద్ధ ఖగోళ శాస్త్రవేత్తయిన న్యూటన్ మహాశయుడు తలమీద టోపీని తీసివేసి అవనత శిరస్కుడయ్యేవాడు. క్రీస్తునాథుని పేరు ఉచ్ఛరింప బడినపుడెల్లా నీవు ఆలాగే చెయ్యి. దివ్యసత్ప్రసాదమున్న గుడిముందు నీవు పోవుచున్న పక్షమున నీవు తగిన గౌరవము చూపు.

3) వృద్ధులను గౌరవించు. ఓలంపిక్ ఆటలను చూచుటకు ఒక వృద్ధుడు వచ్చెను. అచ్చటి స్థలములన్నిటిని ఆక్రమించియున్న స్పార్టనులందరు లేచి తమ ఆసనమును తనకు యిచ్చుట ఆ ముదుసలి చూచెను.

4) గౌరవం కల్గిన స్నేహితులనే యేరుకో. దేవమాతను తలంచుటవలన నీలో గౌరవం అధికం కాదా?

5) చవుకబారు సాహిత్యాన్ని చదవకు.

6) నీవు నీ శరీరంయెడల గౌరవ భావాన్ని అలవరచుకో. తిరులోవలె నీలో కూడ క్రీస్తునాథుడు నివసిస్తున్నాడు. ఆయన ఆలయంవు నీశరీరాన్ని గౌరవించవూ?

7) స్నేహితులను గౌరవించు. అనవసరమైన తగని పరిచయాన్ని పరిత్యజించు "ఒకరియందు గౌరవము చూపనివాడు వారిని నిజంగా ప్రేమించడు. ఒకరియెడల మరొకరికి గౌరవ ముండుట వలనే మిత్రత్వాలు చాలాకాలము నిలుస్తవి. ఏదైతే మనకు భయం కలిగించదో దాన్ని హీనంగా చూట్టానికి అలవాటు పడతాం. దేన్నైతే మనం హీనంగా చూస్తామో దాన్ని మనము ప్రేమించలేము. క్రీస్తునాధుని శక్తిని, ఘనతను, అనిర్వాచ్యమైన పవిత్రతను, మన దోషాలను తెలుసుకున్నపుడు మాత్రమే ఆయన దయాదాక్షిణ్యాలను మనం అర్థం చేసుకుంటాం. ఆయననుగూర్చి భయపడినపుడే ఆయన దయ గ్రాహ్యమవుతుంది"

**గౌరవానికి ప్రతిఫలం**

మతం, సంతోషం, వీటిరహస్యం అంతా గౌరవంలోనే వుంది. గౌరవం లేకపోతే విశ్వాసం లేదు, నమ్మిక లేదు, ప్రేమ లేదు సీనాయి పర్వతపు ఆజ్ఞలలోని ప్రతి ఆజ్ఞ యొక్క వుద్దేశం గౌరవమే, గౌరవించటం నేర్చుకొనమనే. దేవుని గౌరవించు నీ పొరుగు వానిని గౌరవించు, ఆత్మ గౌరవం కలిగి యుండు. ఈ గౌరవంమీదనే అణకువ ఆధారపడుతుంది. దాని వలననే భక్తి సంరక్షింపబడుతుంది. నమ్రత దానిపై ఆధారపడుతుంది. పరిశుద్ధత దానిలో రక్షణను పొందుతుంది. దేవుడు ఆయనకు సంబంధించిన ప్రతిదాన్ని గౌరవించాల- ఆయన అర్చకులు, ఆయన గుడులు, ఆయన సాంఖ్యములు- యిదేమతం. పొరుగువానిని- వాని వస్తువులను, అతన్ని- గౌరవించాలి. అదే నిజాయితీ. ఆత్మగౌరవము- మన ఆత్మ శరీరాలు పరిశుభ్రముగ యుండాలి- ఇది విరక్తత్వము. గౌరవించుటకు నిరాకరించుటచేతనే సైతాను తన ఇప్పటి హీనస్థితికి వచ్చెను. తన మతమంటె గౌరవం లేనివాడు, అపహాసించువాడు చివరకు అవిశ్వాసుడగును.

**గమనీయమైన విషయాలు**

అధికారాన్ని గౌరవించమని దేవుడు మనల్ని ఆజ్ఞాపించుచున్నారు. దేవునిదగ్గరనుంచే న్యాయమైన అధికారం వస్తుంది. అధికారంలో వున్న మానవులు దేవునికి ప్రాతినిధ్యం వహిస్తారు. శాసన సభ్యుల న్యాయ

మైన శాసనాలను, తల్లిదండ్రులయొక్క ఆజ్ఞలను న్యాయతఃమన పై వున్న అధికారుల కట్టడలను మనం గౌరవించవలసివుంది. గౌరవంగా శిరసావహించు. విధేయించు. ఇది దైవముయొక్క యిష్టము. కాబట్టి చట్టమును విధేయించు.

**ఆచరణ** 1) "అతిపరిచయ దవాజ్ఞా భవతి" (Familiarity breeds contempt) అని నీవు వినియున్నావు. నీకు ఈ లాంటిది నీ స్నేహితులతో, యితర వ్యక్తులతో సంబాధించకుండ టానికి నీ వేమిచర్యలు తీసికొనెదవు?

2) ఒకరికి వుద్దేశింపబడిన వుత్తరాలను చదివే వారినిగూర్చి, పొరుగువాని రహస్యాలను తెలుసుకోవాలని ప్రయత్నించే వారిని గూర్చి నీ అభిప్రాయ మేమి?

3) క్రైస్తవులు శరీరాన్ని గౌరవించేదానికి ఇతర మతస్తులు శరీరాన్ని భద్రంగా కాపాడుకుంటూ దాన్ని పూజించేదానికి తారతమ్యం వున్నది. శారీరిక సౌందర్యాన్ని మితిమీరి ప్రశంసించుట, శరీరాన్ని గూర్చి అత్యధికమైన జాగ్రత్త తీసికొనుట వీటిని ఆపుచేయుటకు నీ వేమి చేయగలవు?

4) విశ్వాస విషయములందు నీ గౌరవం తగ్గుతున్నట్లు కనిపిస్తే తప్పెవరిది? నీ మాదిరిగా దేవు డెందుకు చేయరో యెప్పుడైనా ఆలోచించావా?



# నలుబదియవ అధ్యాయము

మన నడవడిక మన స్వభావమును తెలుపును.

ప్రపంచం పైకి కనబడే గుణాలను గురించి చాల శ్రద్ధ వహిస్తుంది. పెద్దమనిషిగా బయటికి కనుపించే ప్రతి వ్యక్తి వుదార హృదయం కలవాడని అర్థమేమికాదు. కోపిష్టిగా, మొరటుగా కన్పించే వ్యక్తి అంతరంగికంగా చాల దయార్ద్ర హృదయము గలవాడై యుండవచ్చు. మోసగాళ్లు మామూలుగా ఆకర్షనీయమైన పద్ధతులను, రీతులను కలిగి వుంటారు. కాని నీ నడవడిక నీ స్వభావముయొక్క సూచక మనునది యెల్లకాలం సత్యమే. నీ నడవడిక, నిజమైన క్రైస్తవ అనుయాయునిదైన, యీ క్రిందనున్న కొన్ని గుణాలను కలిగి వుంటుంది.

**గౌరవము** ఒక వ్యక్తి తన గౌరవాన్ని నిష్కళంకంగా వుంచుకోవటం ఒక గొప్ప కార్యం. మహా మనస్కులు, మహాత్ములు, మహాశయులు తమ గౌరవాన్ని సదా కాపాడుకోటానికి ప్రయత్నిస్తారు. నీవుగూడ క్రీస్తునాధునిమీద గల భక్తికొద్ది దీన్ని ప్రయత్నించు.

ఒక మాట నిచ్చావంటె దాన్ని గౌరవంగా కాపాడుకో. చులకనగ ఒకరికి మాట నివ్వవద్దు. ఇచ్చినదాన్ని గట్టిగా చేసి తీరాలి గౌరవముగ బ్రతకడమంటే యేమిటో తెలియనివారే యితరులు కష్టములలో నున్నపుడు, యితరులు అవసరములలో నున్నపుడు దాన్ని అవకాశముగ తీసికొని దానినుండి లాభాన్ని పొంద ప్రయత్నిస్తారు. నీ పొరుగువాని గౌరవానికి అకారణంగా, అనవసరంగా లోటు తీసుకరావడం చాల నీచం. ఎవరైన నీపై కొన్ని చిన్నచిన్న నిందలు మోపితే, నీ గౌరవానికి కొద్దిపాటి హాని చెయ్యాలని చూస్తే దాన్ని నీవు పట్టించుకోవద్దు. నీవు నిజంగా గౌరవనీయుడవైతే యివన్ని యేమాత్రము హాని చెయ్యవు. నీ వివేకము, నీ వివేచన ప్రతి వారిని పూర్ణముగ విశ్వసించి, నిన్ను వారికి అర్పించుకోవద్దని చెబుతుంది.

**సత్యం సంధత** ఆలోచనలో, మాటల్లో, పనిలో సహజత్వాన్ని ప్రదర్శించు. నీవు రెండు రకాల నడవడికలను అలవరచుకోకు. ఒకటి యింట్లోకి, ఒకటి బయటికి అని పెట్టుకోకు. చదువుకున్నవాళ్ళ సమక్షంలో బాగా తెలిసినవాడిగా మాట్లాడకు. సహజంగా వుండు.

సత్యాన్ని ప్రేమించటమే శీలమునకు సరియైన పునాది. అందుకనే సత్యంగా ప్రవర్తించటానికి, సత్యాన్ని పలకటానికి యిష్టపడునట్టి తత్వమును పెంపొందించుకో. నీవు ప్రేమించేదాన్ని బట్టే నీ శీలం నిర్ణయింపబడుతుంది. క్రీస్తునాధుని సంతోష పెట్టడమే నీవు ఆదర్శంగా తీసుకున్నట్లయితే నీవు సత్యజీవివిగా బ్రతుకుతావు. అబద్ధాలు చెప్పటం నీ హోదాకి తక్కువని భావించు. "సత్యం అతనిలో లేదు" అని జేసుస్వామి యెవరిని గూర్చి (సైతానును గూర్చి) చెప్పారో ఆలాంటి వాని జాబితాలో లెక్కింపబడకుండునట్లు ప్రవర్తించు.

**భక్తి** జీవితంలో ఆదర్శాలను స్థిరపరచుకొన్న తర్వాత, వాటిని ఆచరణలో పెట్టడం ప్రారంభించిన తర్వాత, వాటిని విడిచిపెట్టుదమను శోధన సమయాలు కొన్ని వస్తవి. ఇక్కడే, ఆదర్శాలందు నీకుగల భక్తి, పట్టుదల వుపయోగపడును. ఉదాహారణకు నీవు క్రీస్తుకు, నీ కుటుంబమునకు భక్తి తత్పరుడవై వారిని వీడకుండ యుండవలయునని నిర్ణయించుకుంటావు. నీవు జీవిత మారంభించిన క్రొత్తలో నీ వృత్తిలో, నీ పనిపాటల్లో నీవు రాణించలేక పోవచ్చు. నీవు అనుకున్న స్నేహితులను చేసుకోలేక పోవచ్చు. పరిస్థితులు అనుకున్నవి అనుకున్నట్లుగా జరగక పోవచ్చు. కొందరు నీకు నీతి నియమాలు లేని మార్గాన్ని చూపించి అది కృతార్థులగుటకు, సిద్ధికి దగ్గర త్రోవయని చూపించవచ్చు. వినుగెత్తి ఆమార్గాన్ని కొద్దికాలము యత్నము చేయాలను ఆశ నీలో కలుగవచ్చు. ఆలాంటి పరిస్థితుల్లో క్రీస్తునాధుడు, మరియమాత- నీ తల్లి- యేం చేస్తారో చూడు. నీవు దేనియందైనా దృఢ భక్తి కలిగి వుండాలంటే నీవు అనేక కష్టాలను యెదుర్కొనవలసిన అవసర మొస్తుంది.

ఒకవేళ నీవు విజయమే పొందినా, నీ స్నేహితులయెడల నీ అధికారి యెడల, నీ మత విశ్వాస సిద్ధాంతాల యెడల నీవు యెంత అంటి

పెట్టుకున్నావో యెంత విధేయించి వున్నావో అనే దానికి అది వకీతీగా నిలుస్తుంది. నీ పేరు చెబితే నీ యింట్లో వారికి, నీ పిల్లలకు ఒక శాపంగా వుండరాదు. అది సంతోషదాయకంగా, ఆనంద దాయకంగా వుండాలి. ఆలా వుండాలంటే క్రీస్తునాథుని యందు, నీ యింటి యందు, నీ దేశమందు భక్తికలిగియుండు. కొన్ని సిద్ధాంతాలను అంటి పెట్టుకొని వుండాలంటే, వాటియందు పూర్ణ భక్తికల్గి వుండాలంటే కొన్ని పర్యాయములు లోక ప్రీతిని, జనప్రీతిని పోగొట్టుకొనవలసిన అవసరమొస్తుంది. "పేరు ప్రతిష్టలు పొందేదానికంటె ఒక సిద్ధాంతమును పట్టుదలతో అనుసరించుటే మంచిద"న్నాడు. ఒక రాజ్యాంగ వేత్త.

మానవుల పనులలో తప్పు లేకుండా వుండవు. కాని ఎవరైనను స్నేహితుల్లోన, ముసలివారైన తల్లిదండ్రులలోన, విద్యాలయము లోను వున్న మంచిని గ్రహించి మిగత లోపములను పరిగణింపకుండ యుండవలెను మంచియెడల భక్తి విశ్వాసములు కలిగి యుండవలె.

**నమ్మకం** అబ్బ! ప్రపంచం నమ్మకమైన స్త్రీ పురుషులకోసం యెంత కలవరిస్తున్నది. మంచి వారలుగూడ తాము అన్నమాటలు నిలబెట్టుకోలేక పోతున్నారే అని బాధపడవలసి వస్తున్నది. నీవు నమ్మదగిన వ్యక్తివి, యేదైనాపని యిస్తే దాన్ని నీవు స్వంతంగా, చక్కగా, బాగుగా చేయగలవను కీర్తిని సంపాదించుకో. నీ పనిలోకి వేళకు దిగటం నేర్చుకో. పనిని మనస్ఫూర్తిగా చేయటం అలవరచుకో. నీ భవిష్యదను భవము నీవు నకాలములో సక్రమముగా నీ పనిని నెరవేర్చుటము యెంత ప్రయోజన కరమో నేర్పుతుంది. అవసరమైనచో అదనంగా పనిచేయుటకు సిద్ధంగావుండు. అదినీకు యెప్పటికైనా మేలుకరము.

**మర్యాద** పెద్దలయందు, బలహీనులయందు, అభ్యాగతులయందు నీవు ప్రేమను, ఆపేక్షను, మర్యాదను చూపాలి. దాన్ని బట్టే నీకు క్రీస్తునాథుని యందు యెంతఅనురక్తి యున్నదో తెలుస్తుంది. నీవు నీ తల్లిదండ్రులయందు మేర మర్యాదలు చూపటం అలవరచుకొంటె, గౌరవ ప్రపత్తులను చూపటం అభ్యసిస్తే, ఆలాంటి గుణాన్నే

నీవు యితరులయందు కూడా చూపిస్తావు. గృహ కల్లోలాలు వస్తున్నాయంటే కారణం అమర్యాదగా వ్యవహరించటం వలననే సంకటాన్ని కలిగించు విధముగ జవాబులివ్వటం, తిరస్కారంగా ప్రత్యుత్తరమివ్వటం, ఆనంద దాయకమైన కుటుంబ జీవితాన్ని నాశనం చేస్తుంది. నీవు యితరుల అవసరాలను ముందుగానే గమనించి వాటినితీర్చ ప్రయాసపడితే నీకు అనేక కష్టాలు తొలగిపోతాయి. తల్లిదండ్రులకు యెదురుతిరిగి మాట్లాడే బాలికలు మరియమ్మగారు తమ మాతృక అని చెప్పుకోలేరు.

**నిర్ణయం** వ్యక్తులను గురించి, విషయాలను గురించి నీవు నెమ్మదిగా నిర్ణయానికి రావాలి. త్వరపడి యే అసంబద్ధపు నిర్ణయానికి రావద్దు. చేసుకున్న నిర్ణయానికి కట్టుబడి దానిని నెరవేర్చుటకు దృఢముగా ప్రయాసపడు. ఒక నిర్ణయానికి వచ్చేముందు దాని పూర్వాపరాలను జాగ్రత్తగా పరిశీలించే అలవాటును అలవరచుకో, వున్న సాక్షుబలాన్ని అవగాహనం చేసుకో. ఆలా నిర్ణయానికి వచ్చినప్పుడు నీవు చెప్పే మాటల్లోనే నీ నమ్మకము కనబడుతుంది. అనుమానంగాని, వెనకాడటంగాని ఫుట్ బాల్ ఆట ఆడే వానిలోవుంటే అతను యెట్లా ఆడతాడో నీకు తెలుసు సరిగా ఆడలేడన్నమాట. జీవితంలోకూడ అంతే. ముందుగానే అన్నిప్లానులు సక్రమంగా, సమగ్రంగా వేసుకో. వాటి ప్రకారం పట్టుదలతో చెయ్యి

నీవుచేసే ప్రకటనలు యితరులపై యెటువంటి ప్రభావాన్ని కలిగిస్తాయో చూడు. వారిలో యేలాంటి మార్పునుగాని, లేక వారి నుండి యేలాటి వ్యాఖ్యానముగాని తీసుకొస్తాయో చూడు. నీవు అతిశయోక్తులను చెప్పటం మానివేస్తే ప్రజ నీ నిర్ణయాలను విశ్వసిస్తారు. తెలివి తేటలకు, యుక్తికి (చాతుర్యము) గల బేధమును తెలిసికో. తెలివితేటలు దైవాను గ్రహములు; అవి పుట్టుకతోనే లభించి యుండవచ్చు. కాని చతురత లేకపోతే ఆ తెలివి తేటలు నిష్ప్రయోజనము. "తెలివితేటలకు యేమిచెయ్యాలో తెలుసు; యుక్తికి యెట్లా చెయ్యాలో తెలుసు,"

ఈ గుణాలనేవి పుస్తకాలు చదివితే వచ్చేవికావు. అవి నీలో వస్తుతః లేకపోతే క్రమంగా అభ్యాసంచెయ్యి. ఒకదానివెంట ఒకటి అలవడునట్లు చూచుకో. అంతకుతప్ప మరో మార్గంలేదు.

యువకులలో సాధారణంగా తెలివితేటల్లో అంతగా భేదముండదు. వారి వుత్సాహంలో బేధముంటుంది. నీ వుత్సాహం, దానితో పాటు ప్రార్థన వలన పైజెప్పబడిన కొన్ని గుణాలను నీవు అలవరచుకో వచ్చు. స్వార్థ రహితంగా వుండటానికి యిష్టపడుతూ వుండటం, త్యాగాలకు అలవాటుపడి వుండటం యివి వివేకమైన నిర్ణయాలకు యెంతో సహాయపడతవి. ఆ విధంగ నడచుకొనడం వలన నీవు పెద్ద మనిషిగా, ఆర్యుడవుగా తయారవుతావు పెద్దమనిషి అంటే, కార్డినల్ న్యూమన్ "యితరులకు బాధ కలిగించనివాడు" అని నిర్వచించారు. ఆలానీవు ప్రవర్తించడానికి ప్రయాసపడు. నీ నిర్దయ చర్యలు యితరులకు బాధ కలిగిస్తాయి. నీ లోపాలు నీ మాతా పితలకు మనోవేదనను కలిగిస్తాయి. నిన్ను గమనించేవారు నీ నడవడికనుంచి నీ శీలమును కనుగొంటారు. ప్రశంసార్హమైన గుణాలను అలవరచుకొని నీ శీలమును పటుత్వము చేసుకో.

**ఆచరణ** 1) నాల్గవ శతాబ్దంలో లిబానియస్ అను ప్రొఫెసరు అర్చ॥ జాన్ క్రిసోస్తం తల్లినిగూర్చి "యీ క్రైస్తవులలో ఎట్టి ఉత్తమ గుణములునూ, సాహసమును గల స్త్రీలున్నారు" అని అన్నాడు. ఈ విషయము నాలోచించు.

2) "దూరపు చూపు కలవాడనని గాని, తనతో వున్న వ్యక్తి కన్నా తను యెక్కువ తెలివిగలవాడనని గాని చూపటానికి అతను యెన్నడూ యిష్టపడలేదు. సాధారణంగా యితరులనుండి నేర్చుకొనే స్వభావాన్ని చూపేవాడు" ఇది గొప్ప గుణమేనా? శీలం అనేది మాన శరీరక విగ్రహారీతిలో, ప్రవర్తనలో కనుబడుతుందా?

3) మత్తయిుని 3, 17 చదివి అది నీ మంచినడవడికకు దోహదము కలుగ జేస్తుందేమొ చూడు.

---

# నలువది ఒకటవ అధ్యాయము

## నీ విశ్వాసానికి ప్రమాదాలు

**జాగరూకత** శారీరక ఆరోగ్యాన్ని కాపాడు కొనటానికి కొన్ని జాగ్రత్త లవసరమని నీవు చిన్నవుడు నేర్చుకున్నావు. నిప్పుదగ్గరకు పోరాదని, చిలుముపట్టిన చీలలు గుచ్చుకుంటే అపాయమని విన్నావు. శారీరకంగా ఆ జాగ్రత్తలన్నీ యెంత అవసరమని తలస్తావో మానసికంగా బాగుపడటానికి కూడా కొన్ని జాగ్రత్తలు అవసరమే.

నీవు త్వరలో జీవిత నావలో స్వంతగా ప్రయాణము చేయడానికి మొదలెట్టుతావు. నీకు ఒక ముత్యం అప్పగింపబడింది. దాన్ని జాగ్రత్తపెట్టాలి. ఈ ముత్యమనేది చాల విలువగలది. ఇది నీ ఆరోగ్యముకంటె హెచ్చైనది. ఇది అందరికి యివ్వబడలేదు. ఇది అందరికి బహూకరింప బడలేదు. ఆ ముత్యాన్ని నీవు పొందియుండటం, దాన్ని నీవు కలిగియుండటం ఒకగొప్ప విశేషాధికారం. దానియొక్క విలువను నీవు దైవసాన్నిధ్యానికి వెళ్లేవరకు పూర్ణంగా గ్రహించలేవు. ఆ ముత్యము నీ విశ్వాసమే.

నీ ఆరోగ్యము వలెనే నీ విశ్వాసాన్ని కూడా బహుజాగ్రత్తతో కాపాడాలి. నీ ఆరోగ్యమువలె నీ విశ్వాసాన్ని కూడ పోగొట్టుకొనవచ్చు ఇచ్చట మనం గమనింపవలసిన విషయమేమంటే మన విశ్వాసాన్ని కాపాడుకోడానికి కొన్ని జాగ్రత్తలు, పూర్వోపాయాలను తీసుకోవాల. ఆలా జాగ్రత్తలు తీసుకొనకపోతే దైవము మనకు బహుకరించిన విశ్వాసాన్ని మననుండి తీసికొనవచ్చు. పిశాచి క్రీస్తునాథుని విశ్వసించే వారినుండి వారి విశ్వాసాన్ని అపహరించాలని ప్రయత్నము చేస్తూవుంటుంది.

**నీ విశ్వాసం: ప్రపంచం** అనతి కాలములోనే లోకములో చెలామణి అయ్యే భావాలకును, నీ విశ్వాసంవలన నీకు నేర్పబడిన భావాలకును, ప్రధానంగా, కొన్ని బేధాలున్నాయని తెలుసుకుంటావు. ఉదాహారణకు కొందరు

ప్రార్థన అనవసరమంటారు. కాని క్రీస్తునాథుడు అది అవసరమని చెబు తారు. ప్రపంచం భౌతిక విజయాలకొరకు తాత్కాలిక ఫలితాల వైపు అర్రులు చాస్తుంది. తాత్కాలిక సుఖంకోసం అర్రులు చాస్తుంది. కాని నీవు మోక్షం అనే దానిమీద దృష్టిని నిల్పాలి. తప్పొ ఒప్పొ అని నిర్ణయించటానికి లోకానికి ఒక విధమైన ప్రమాణాలున్నాయి. కాని నీవు మాత్రం దైవచట్టాలను విధేయించాల. అవే నీకు ప్రమాణాలు. కొందరు తమంతటతాము బుద్ధిబలముతో కనుగొన్న వాటికే, తమకు నచ్చిన వాటికే సమ్మతిస్తారు. కాని నీవుమాత్రం విశ్వాసంతో కొన్ని విషయాలు క్రీస్తుదగ్గర నుంచి స్వీకరించాల.

అసలు సమస్య యిది. మనం కాలమానములలో నివసిస్తూ శాశ్వతానందానికి ప్రయత్నిస్తున్నాము. కాలానికి నిత్యానికి ఈ రెంటికి మనపై కొన్ని హక్కులున్నవి ఆ రెంటిని సమన్వయ పరచుకోవాల. మనము లోకములో వున్నాము. మనకు విశ్వాసమున్నది. వాటికి మనము సమన్వయము కుదుర్చుకోవాల. రెంటి హక్కులను తగిన విధముగ గౌరవించాల నీవు పెరిగి పెద్దవాడ వయ్యేకొద్ది లోక సుఖ భోగములంటే, భౌతిక పదార్థాలంటే నీకు అధిక ఆశక్తి కలుగుతుంది. అచ్చటే అపాయముంది. ప్రపంచమిచ్చే సుఖాల్లోమునిగి దానిలో ఒక భాగమైపోయి, చివరకు నీ విశ్వాసపు విషయాలంటే అయిష్టత పుట్టటము, కడన అవిశ్వాస అఘాతాల్లోకి పడిపోవడం జరుగుతుంది. నిజమే ప్రపంచముంది. ఆ ప్రపంచంలో నీ వున్నావు. కాని మనము యింతకంటె మంచి దానికి సృష్టించబడ్డామని, మనము దీనికంటె అధికమైన గమ్యస్థానమున్నదని మనము తెలుసుకోవాలని దైవము యొక్క కోరిక. నీవు లోకముపై ఆధిపత్యాన్ని వహించాలని దైవము కోరిక గాని, నీపై లోకము యాజమాన్యాన్ని వహించాలని కాదు ప్రపంచమే అంతా అనుకోవడము యెంత అనర్థం!

ప్రపంచము నీ చుట్టు యెప్పుడూ నిన్ను ఆవరించుకొని యుం టుంది. ప్రపంచం-స్నేహితులు, సుఖాలు, వర్తక వ్యాపారాలు, పత్రికలు, ధనం, పాపం, మరి వీటివలన మన మనస్సులో కలిగే ద్రృక్పథం మరో ప్రక్క విశ్వాసపు విషయాలు-దైవ సాన్నిధ్యం, క్రీస్తు, మోక్షం,

నరకం-యివన్నీ మన పంచేంద్రియాలతో తెలుసుకొనేవి కావు. అనుభ వించేవి కావు. ప్రపంచం నీకు ప్రత్యక్షంగా కనబడుతుంది. మోక్షం తెరచాటున, కనబడకుండా వుంది.

**అంధులను చేసే ప్రాపంచక శక్తి**

ప్రపంచశక్తి, లోకాను రాగము మనలను సుల భంగా మోక్షపు విషయాలను విస్మరింప జేస్తాయి. నీవు యీ లోకంలో వున్నంతకాలం ప్రపంచ విషయాలలో కొంతజాగ్రత్త వహింప వలసినదే, కాని అజా గ్రత్తలు అధికమైతే దేవుని యెడల మన బాధ్యతలను చివరకు మోక్ష నరకాలను మరచి పోతాము. ఒకవేళ ఆ తెరచాటున యేమి లేకపోయి నప్పటికి యేదో వున్నదను నమ్మకంతో దానికనుగుణంగా జీవించడం ఉత్తమము. ఎందుకంటె ఆలాంటి జీవితము మంచి ఫలితాల నొసంగు తుంది. సన్మార్గవర్తనులైన వ్యక్తులు, మంచివారు, యీ లోకంలో సంతృప్తికి, పూర్ణానందానికి అవకాశం లేదన్నారు. ఈ లోకం కంటె మంచి దాన్నేదో వారు ఆసిస్తూ వుంటారు ఈ లోకం మానవులకు సంతృప్తి నివ్వకపోగా, హృదయాన్ని పూర్ణానందంతో నింపకపోగా ఆధ్యాత్మిక విషయాలకు అంధులనుచేస్తుంది.

**మన విశ్వాసం మానవ స్వాభావిక శక్తిచే వికసిత మైనది గాదు**

"మన విశ్వాసం మనలో సహజంగా పుట్టిందే. ఆ విశ్వాసములో దైవ సంబంధమైనది యేమీ లేదు" అని లోకం అంటుంది. భౌగోళికంగా చైనా, జపాన్, సింహళ దేశాలెలావున్నాయో అదేవిధంగా మన విశ్వాసంకూడ సహజమని అంటారు కొందరు. మరికొందరు మన విశ్వా సానికి అనేక కారణాలు యిస్తారు కాని ముఖ్యమైనది, ప్రధానమైనది యివ్వరు. ఇట్టి విషయాలు తరచుగా వినుట వలన కొన్ని పర్యాయములు విద్యార్థులు తమ విశ్వాసము దివ్యమైనదని, దైవసంబంధ మైనదని, జేసునాధుని అధికారముపై ఆధారపడి యున్నదని మరచిపోతారు.

నీ విశ్వాసాన్ని గురించి రెండు విషయాలు జ్ఞాపకముంచుకో వలసిన అవసరముంది.—(1) నీ విశ్వాస సత్యాలను క్రీస్తునాధుడు

ఆవిష్కరించిరి; (2) తిరుసభ ఆ సత్యాలను నీ విశ్వాసముకొరకై అర్పించుచున్నది. నవీనులమనే ధోరణిలో కొందరు నీ విశ్వాసాన్ని, ఆ విశ్వాసమందు నీకు గల పట్టుదలను తగ్గించటానికి ప్రయత్నిస్తారు. విశ్వాసమందు నీకు వీడని పట్టుదల వుండాలంటే నీవు నీ ఆత్మను ఆ సత్యాలతో పరిపూర్ణం చేసుకోవాలి. ఈ సత్యాలెప్పటికి పాతవిగావు. పాతకాలపు సత్యాలుకావు. ఇవి యెప్పుడు నూతనంగానే వుంటాయి. దానికి కారణం అవి మానవ నిర్మితాలు కాదు కాబట్టి

నీవు జీవితంలో అడుగు పెట్టగానే నీ విశ్వాసాన్ని కాపాడుకోటానికి కొన్ని జాగ్రత్తలు తీసికోవడము అవసరమని తెలసికో. మనుష్యులు తర్కించాలని అభిలాష పడుతుంటారు. నీ విశ్వాసాన్ని లోక ప్రమాణాలనుబట్టి కొలవలేరని, నిర్ణయించలేరని తెలుసుకో. వారు ఎంత తర్కించినా అంత్యాన నీ విశ్వాసం దివ్యమైనది. దైవసంబంధమైనదని మరచిపోకు. నీ విశ్వాసమనేది దైవాన్నుంచి వస్తుంది. నీ పరిచయుని కొకరికి దివ్యసత్ప్రసాద పెట్టెలో జేసుస్వామి వున్నారని చెప్పినపుడు నేను ఆయన్ని చూడడము లేదే యిది నాకు అర్థంకాదే అంటే, యిది చూచేవిషయము, అర్థం చేసుకొనే విషయము కాదు; యిది విశ్వాస సత్యము, ఇది క్రీస్తుమాటమీద నమ్మవలసినదేను అని చెప్పు. క్రీస్తు దైవం కాబట్టి ఆయన పూర్ణంగా విశ్వాసనీయుడు. మన నమ్మకమంతా ఆయనయందుంచుతాము. ఆయన 'ఇది నా శరీరము' అన్నపుడు ఒక డజను అర్థాలు వచ్చేటట్టు చెప్పలేదు నానా విధాలుగ అర్థంచేసుకోమని చెప్పలేదు. యేది సహజమో, యేది సామాన్యమో దాన్నే మనము అర్థం చేసుకుంటాం. తిరుసభ చెప్పే వ్యాఖ్యాలనుసరిస్తాము.

**ప్రత్యేక ప్రమాదాలు** 1) మత విషయాలలో తిరుసభ చెప్పినప్రకారము వినడానికి అసమ్మతి పడడం, తిరుసభకంటె నీకు యెక్కువ తెలుసునని అనుకోవడం, కొన్ని కొన్ని సాంప్రదాయాలు నేటి పరిస్థితులకు సరిపోవను కోవడము యివన్నీ నీ గర్వాన్ని చూచిస్తాయి. ఎవరైన ప్రార్థన మానివేసినపుడు తిన్నగ గర్వపు పురుగు ప్రవేశిస్తుంది. దాంతో విశ్వాసం పోతుంది. ఎల్లపుడు విశ్వాసం కొరకై జపించు. కారణం అది జపించేవారికే బహూకరింపు

బడుతుంది. ఎవరైతే, తమకంటె అధికుడైన వ్యక్తిసమర్థుడైనవ్యక్తి విశ్వ ప్రపంచంలో వున్నాడని అంగీకరిస్తారో వారికే యీ విశ్వాసం యివ్వ బడుతుంది

2) చిన్న చిన్న విధులను, ప్రాతఃకాల ప్రార్థనలాంటివి నిర్ల క్ష్యం చేయటం వలన, మనలో యీ లాంటి వంటే అయిష్టత, ఔదా సీన్యత యేర్పడుతుంది

3) మన మనస్సుపై యీ పుస్తకము యెలాటి ప్రాభవము కలిగి వుంటుంది, దీని ఫలితము యేమి అని ఆలోచించకుండ చదవడం ప్రమాద కరం. మనం విషాన్ని మ్రింగుతామా! అలాంటప్పుడు మన బుద్ధిని దేవు నికి విరుద్ధముగ విషమము చేసేదాన్ని, నీ విశ్వాసాన్ని చంపే దాన్ని యెందుకు చదువుతావు?

**ఆచరణ** 1) పూజకు వెళ్లనటువంటి దేవద్రవ్యాను మానము లను పొందనటు వంటి నీ స్నేహితునికి యేలాటి సహా యముచేస్తావు?

2) "స్వామీ! నా విశ్వాసమును అధికము చేయుము"ను చిన్న జపము ప్రతి రోజూ కొన్ని నియమిత సమయములో— ఉదయమున, రాత్రి పండు కొనునప్పుడు, పని ఆరంభించినప్పుడు— చెప్పిన అది మనకు చాల మంచి ఫలితాల నిచ్చును.

3) అర్చశిష్ట అగుస్తీను వారిలాఅన్నారు."ఇతరులు కీచులాడు కొనివ్వు; నేను విస్మయము చెందుతాను" ఇతరులు కొన్ని సత్యాలను గురించి గర్వంతో వాదులాడు కుంటుంటే వినయముతో అగుస్తీను వారు వారిని గూర్చి చింతపోతారు. ఈ లాంటి మనస్తత్వాన్ని గూర్చి నీవేమను కుంటావు?

——:0:——

# నలుబది రెండవ అధ్యాయము

## క్రీస్తు ధారణ

**బాల్యపు అనుకరణ** చిన్నప్పుడు నీ యితరులను అనుకరించావన్న సంగతి నీకు జ్ఞాపకముండే వుంటుంది నీ తల్లి దండ్రులు మాట్లాడే మాటలు నీవు నేర్చుకొని వుంటావు. అవే నీవు ప్రయోగించావు ఇతరులు చేసిన పనులను నీవు చేయ ప్రయత్నించి వుంటావు. పెద్దవాడైన తర్వాత ఈ అనుకరణ విలువ నీకు తెలిసింది. అందువల్ల కొంతమంది వ్యక్తులను, వారి విధానాలను అనుకరించాలని నీ ఆకాంక్ష. ప్రతి బాలునికి, ప్రతి వ్యక్తికి కొందరు వీరులు కనబడ తారు. వారివలె జీవితం గడపాలని అనుకుంటారు. వారికి ఒక విధంగా వీరపూజ చేస్తారు. వారు చేసిన ప్రతిపనికి యేదో గొప్ప విలువ కడ తారు. వారిని అనుకరించాలని ప్రయత్నించుతుంటాగు నీ వీరునివలె నీవు చేయాలంటె ఆయన చేసిన కార్యాలను నీవు అనేకసారులు చెయ్యాల నీ దృష్టిముందు యెప్పుడు ఆ చిత్రన వుండాల, నీలోని ప్రజ్ఞా విశేషాలలో ఏ ఒక్క దానిని వృద్ధి పొందజేయాలంటే

ప్రతిపని, ప్రతిమాట అనుకరించ తగినదికాదు అని తెలుసు కొనే టప్పటికి నీ కెంతో కాలం పట్టలేదు. నీవు అనుకరించుదామను కొన్న వాటిలో చాలా వాటిని నీ తల్లిదండ్రులు బహుళ ఆక్షేపించే వుంటారు . వారలా యెందుకు ఆక్షేపించారో యిప్పుడు నీకు తెలిసే వుంటుంది. వారి తెలివితేట లేపాటివో కూడా యిప్పుడు నీకు అర్థ మయ్యే వుంటుంది.

**దేన్ని యెన్నుకోవాల?** బాల్యం గడచిపోయింది, కాని అనుక రించాల్సిన అవసరం వుండనేవున్నది. క్రమక్రమంగా దేన్ని అనుకరించాలి అన్నది ఒక సమస్యగా తయారవు తున్నది. అసలు, అనేకం వున్నపుడు వాటిలో దేని నేరుకోవడం అనేది చాల కష్టసాధ్యమైన విషయం. దేని నేరుకుంటె మన జీవితాన్ని వున్నత పథంలో నడిపిస్తుందో బాగా తెలుసుకోవాలి. సరియైన దాన్ని యేరుకోవటానికి తగిన ధైర్య సాహసాలు అవసరం. లోకము మనకు

అనేక సుఖభోగాలను, ప్రమాదకరమైన భావాలను పుట్టిస్తున్నదనీ దాని వలన మన విశ్వాసమునకు ఆపదయున్నదని చూశాము.

నీ విప్పుడు జీవితంలో అడుగుపెట్టబోతున్నావు దేన్ని అనుకరించాల, యే తరగతి మనుష్యులను అనుసరించాల, యేలాటి స్నేహితులనూ యేరుకోవాల, యేలాంటి సారస్వతం చదవాల అని ఆశ్చర్య పడుతూ వుంటావు. దేన్నో ఒకదాన్ని మనం నిశ్చయించుకోవాల. ఆ నిశ్చయము మనము చేసికోవలసినదే, ఆ నిశ్చయమునకు మనము బాధ్యులము కావలసినదే.

మన జీవిత సమస్యలో మన కండ్లముందుంచుకోవలసిన విషయం "శాశ్వతాన్నా అశాశ్వతాన్నా? లౌక్యాన్నా పారలౌక్యాన్నా; వీనిలో యేది ముఖ్యము?" వీటిల్లో దేన్ని మనం పూర్తిగా విసర్జించరాదు. మన సమగ్రపురోభివృద్ధికి రెండూ అవసరమే

లోకము నిన్ననేక విధాల ఆకర్షిస్తుంది. మానసిక (Intellectual) జీవితము బహు కొద్దిమందిని మాత్రమే ఆకర్షిస్తుంది. స్నేహితులు కొందరు నిన్ను జీవితాన్ని ఆనందించమని దుర్బోధచేస్తుంటారు. ధనం మరి కొందరిని వ్యామోహితుల జేస్తుంది. లోకమిచ్చే గౌరవప్రతిష్టలు మరి కొందరిని ఆకర్షిస్తాయి కాని అనంతకాల తీరాన్నుంచి క్రీస్తు "నన్ను వెంబడించుము" అనుచున్నాడు. అంటే దైవముతో జీవించడానికి, క్రీస్తుతో సహకరించడానికి, అక్షయమైన ఆనందాన్ని శాంతిని పొందడానికి పిలుస్తున్నాడన్నమాట.

నీవు క్రీస్తునాధుని ధరించినట్లైతే, క్రీస్తునాధుని అనుసరించినట్లయితే నీ విశ్వాసానికి కలిగే అపాయాలను అధికమించవచ్చును. ప్రపంచ అవసరాలను సామర్థ్యంగ తీర్చుకోవచ్చు ఇదే విజయవంతమైన జీవితానికి సరియైన విధానము. ఈ లక్ష్యాన్నే నీ వెల్లప్పుడు నీ కండ్లముందుంచుకోవాల. నీ జీవితమంతా జేసునాధుని అధికమధికంగా అనుసరించడానికి ప్రయాస పడవలె.

**క్రీస్తు మనకవసరము** క్రీస్తునాథుడు మన నాయకుడని తెలుసుకున్నాం. ఆయన వాగ్దానంచేసిన మోక్ష జీవితాన్ని పొందడానికి నిశ్చయులైనాము. తిరుసభద్వారా, దేవప్రవ్యానుమానాల ద్వారా, ఆయన మనల్ని దేవునితో జీవితం గడుప ఆయత్తపరుస్తున్నాడని మనకు తెలుసు. మరోప్రక్క మన యువతీ యువకులకు లోకము బహు ఆకర్షనీయంగా వుంది. ఈ లాంటి లోకంలో జీవిస్తూ నీవు యెట్లా క్రీస్తును ధరించగలవు? నీ వెట్లు ప్రపంచంలో, ప్రపంచమేలునకై పనిచేస్తూ లౌకికుడవు కాకుండా వుండగలవు?

దీనికి ఒకటే సమాధానం. నీవు కేవలం లోకాన్ని అనుసరించరాదు. క్రీస్తునాథుని జీవితాన్ని జీవించాలి. మోక్షానికి సమాయత్తపరచే జీవితాన్ని గడపాలి. లోకాన్ని అనుకరించడం సులభం, కాని నీవు క్రీస్తును ధరించాల, ఆయన ఆదర్శాలను ప్రతిబింబించాల. అర్చశిష్ట చిన్నప్పగారితో "నేను జీవిస్తున్నాను, యిప్పుడు నేను కాదు, క్రీస్తు నాలో జీవించుచున్నాడు." అని చెప్పవలె. మోక్షములో, క్రీస్తుతో జీవించాలంటే ఈ లోకంలో ఆయన్ను అనుకరించడంవలన ఆయనతో జీవించడానికి ఆరంభించాల.

**క్రీస్తు ధారణా మార్గం** క్రీస్తునాథుడు నీ నాయకుడుగా వుండాలని అనుకున్నట్లయితే ప్రథమంలో ఆయన్ను గూర్చి తెలిసికోవడమారంభిచాల. సువిశేషం చదవడం, ప్రసంగములను వినడం, వేదాన్ని పఠనం చేయడం, దివ్యసత్ప్రసాదము ముందు మోకరిల్లి జ్ఞానవెలుగునకై ప్రార్థించడంవల్ల నీవు క్రీస్తునుగురించి నేర్చుకుంటావు. మన నాథుని రూపాన్ని నీ కండ్ల ముందెప్పుడు వుంచుకో. ఆ రూపాన్ని అప్పుడప్పుడూ ధ్యానించుతూవుండు.

నిజంగా ఈ రకమైన అలవాటువలన గల్గె ఫలితానికి నీవు చాల ఆశ్చర్యపడతావు. క్రీస్తునాథుడు గూడా ఒకప్పుడు బాలుడే. కష్టపడి పనిచేశాడు. తల్లిదండ్రులకు విధేయించాడు. జూదుల మత సంబంధమైన విధులను నెరవేర్చాడు. ప్రజలమధ్య కలిసి మెలసి తిరిగి, వారితో మాట్లాడి, వారితో భుజించాడు. మానవుల బాధలంటె యేమిటో, కష్టాలంటే యేమిటో తెలుసు. యువకుల ఆలోచనలను, ఆశయాలను

అవగాహనం చేసుకొన్నాడు. వారిలో వున్న మంచిని ప్రేమించాడు. ఆయన జీవితం సత్క్రియల మయం. అయినా అనేక పర్యాయములు ప్రశాంత ఏకాంతస్థలమునకు పోయి దైవాన్ని ప్రార్థించేవాడు. ప్రపంచంలోని ధన, భోగ భాగ్యాలు, అధికారం, అహంభావం-వీటి శోధనలకు లొంగిపోలేదు

“బాధలను ఆయన ఆనందించాడని మనం చదువను. కాని ఆయన వాటిని సహించాడని భరించాడని చదివాము.” బాధపడటానికి ఆయన భయపడలేదు. ఆయన ప్రార్థనా బలాన్ని పొందాడు. మోక్షసంబంధమైన వాటిలో ఆయన విశ్వాసాన్ని పెట్టాడు.

క్రీస్తునాథుని గురించి ఆలోచించడానికి నీవు పెద్ద విశ్వాసవంతుడవు కానవసరంలేదు. ఇక్కడ మనం గమనించవలసింది నీ కెంత విజ్ఞానమున్నదని కాదు ఆ వున్న విజ్ఞానమును నీవు యెలా మననం చేసికుంటున్నావు, ఆ వున్న జ్ఞానాన్నే నీవు యెలా ధ్యానానికి వుపయోగించుకుంటున్నావు అని. నీవు యితరులయెడ దయగా యున్నపుడు, నీ కోపాన్ని అదుపులో పెట్టుకున్నపుడు, యితరులను గురించి నీచమైన విషయాలు చెప్పడానికి నిరాకరించినప్పుడు, పూజకు పోవుటకుగాను సుఖాల్ని, ఆనందాన్ని త్యాగం చేసినప్పుడు, నీవు క్రీస్తును ధరించుచున్నావు. క్రీస్తునాథుని అనుసరించుటకు తగినంత జ్ఞానమున్నదని మీకు తెలుసు. కాని భక్తితో ఆయన్ను ధ్యానించినప్పుడు ఆయనతో మనం ఒకటి అవుతాము. “ఆయనతో మనం ఐక్యమైనప్పుడు ఆయన సత్యాలను మనం అర్థంచేసికొంటాం. ఆయన ఆజ్ఞలను విధేయించుతాము.”

ఈ అలవాటు నందు మనం నిరంతర కృషిచేస్తున్నట్లయితే చివరకు క్రీస్తు మన క్రియలన్నిటిలోను ఆదర్శమూర్తి అవుతాడు అప్పుడు మనం క్రీస్తును మరచిపోకుండ ఈ లోకంలో వుంటూ ఈ లోక సౌభాగ్యానికై పనిచేయ గల్గుతాం. ఈ లోకపు సుఖాలను, ఈ లోకపుమంచి వస్తువులను అనుభవించినంత మాత్రాన మనం మన గురువుయొక్క క్రీస్తునాథుని యొక్క స్నేహితాన్ని, మోక్షానందాన్ని పోగొట్టుకోటానికి కారణము కానవసరంలేదు. పైగా మోక్షసంబంధమైన సంతోషాలు కూడ నీకు దక్కుతాయి. వాటిలో నీకు భాగముంటుంది.

ఇతరుల శ్రేయస్సు కోసం నీవు క్రీస్తునాధుని అను కరించాలనే ఆశయం పెట్టుకో. క్రైస్తవ సిద్ధాంతాలను యెలా ఆచరణలో పెట్ట వలసిందీ చాల మందికి తెలియదు. అందుకనే అర్చశిష్ట చిన్నప్ప గారు తిమోతికి "నీ పుణ్యాభివృద్ధి అందరికిని తేటగా కనబడు నట్లు వీటిని తలపోయు చుండుము. వీని యందు నెలకొని యుండుము" (1 తిమొతి 4,15) అని వ్రాశారు.

క్రీస్తుధారణ నిదానముగ లభ్యమౌతుంది. మనం ఓర్పుతో నుండ వలె. మన బాల్యపు స్మృతులు, మనమే ఈ ధారణ స్వయంగా చేయ వలసి యున్నదని, దానికి స్థిర ప్రయత్నములు అవసరములని చెప్తూ చున్నవి లోకములో రాణించ డానికి నీ తల్లిని, నీ తండ్రిని, నీ ఉపధ్యా యుని అనుకరించావు. అదే విధంగా జ్ఞాన జీవితంలో అభివృద్ధి పొందా లంటే క్రీస్తును, అర్చశిష్టులను అనుసరించాల— ఒక వారం గాదు, ఒక నెల గాదు, సంవత్సరాల పర్యంతం, నీ జీవితమంతా.

**ఆచరణ** 1) పేతురు, జ్వాన్నే సుగారల పట్టుదలను జూచి జూదులు ఆశ్చర్యపోయిరి. కారణ మేమన "వారు విజ్ఞానులుకారు, నిరక్షరాస్యులు," వారిపట్టుదల, వారిశక్తి వారు జేసువుతో చరిం చుట వలన లభ్యమైనదనిరి. అపోస్తులు యే విధంగా క్రీస్తును ధరిం చారో చూశావా? క్రీస్తునాధుడు వారి జీవితాల్లో ప్రకాశించారు.

2) అర్చశిష్ట చిన్న తెరేజమ్మ యిలా చెప్పింది "నా యీ దీన హృదయంలో జేసుస్వామియే దాగి వున్నాడని నేను విశ్వసిస్తు న్నాను. నాలోపల వుండి, ఆయన నాచేత చేయించాలని అనుకున్న పనులన్నిటిని ఒకదాని వెంబడి మరొకటి నాలో ప్రేరేపిస్తున్నారు." అది సఖ్యత వలన యేర్పడిన ఫలితమా?

3) ఒక విద్యార్థి ఒక నీచపు పనిని చేయాలని అనుకుంటాడు. లేక ఒక అసభ్యపు కథను చెప్పనుంటాడు. కాని వెంటనే ఆగి క్రీస్తు

నాథుని గూర్చి ఆలోచించుతాడు. అతను ఆ సమయంలో "క్రీస్తునాథుని అనుకరిస్తున్నాడా"? నీవు శోధనకు గురియైనప్పుడు యీ విధంగా చేయడానికి ప్రయత్నించు.

4) ఈ వాక్యమును విమర్శించు "ఎవరైనను యితరులకు ఆదర్శంగా వుండాలంటే మొదట అతడు తన కంటె, తన చుట్టు ప్రక్కల వారి కంటె అధికమైన ఆదర్శాన్ని అనుసరించాలి."

---

# నలువది మూడవ అధ్యాయము

## కతోలిక కుటుంబాల నిర్మాణము

"ఆయన శాసనములను గైకొనుచు పూర్ణ హృదయముతో ఆయనను వెదకువారు ధన్యులు" కీర్తనలు 118.

మతము తన ఆశనంతను కుటుంబాలపై పెట్టుతుంది. కుటుంబమే దేశానికి సర్వబలము. నిజమైన ఆనందానికి వాసం గృహమే. క్రైస్తవ శీలమును యిక్కడనే పెంపొందింప వలె. ఇచ్చటనే, యీ కుటుంబ జీవితములోనే యువకులు క్రీస్తుధారణమును నేర్చుకుంటారు. కుటుంబ మంటే నీకుండే ప్రేమమీద, దాని కొరకై నీవు చేసేత్యాగాల మీద ఆధారపడి యుంటుంది. కుటుంబ తత్వం, కులీనత, ఔన్నత్యం, నీవు చూపే ప్రేమాన్ని బట్టి, నీవు చేసే త్యాగాన్ని బట్టి యుంటుంది

**పరిస్థితి** ఆధునిక జీవిత పరిస్థితులు కుటుంబ జీవితాన్ని చిన్నా భిన్నం చేస్తుంటవి. కుటుంబ పరిమాణాన్ని సంకుచితం చేస్తుంటవి. దేవుడు సంతోషానికి, ఆనందానికి, శాంతి సద్భావాలకు ఆ గృహాన్ని కేంద్రంగా వుంచాలని వుద్దేశించాడు. కాని నేటి ఆర్థిక దుస్థితి, వృత్తులలో మనము గడిపే కాలము, నేటి వినోదాలు, కుటుంబంలోని అధికారాన్ని సగౌరవంగా చూచుకోక పోవడం, తమ శాఖ్య తలను నెరవేర్చిన దైవం తప్పక తమకు కావలసినవి ఒసంగుదురను విశ్వాసము లేక పోవడముచే మన కుటుంబాలలో ఆ సంతోషం లేక పోతుంది.

గృహాన్నుంచి చాల కాలము దూరముగ యుంటే మరల తిరిగి యింటికి వచ్చినపుడు కాలు కుదుటపడదు. ఎప్పుడూ ఒకరినుంచి మరియొకరు దూరముగ నుండే ఆ కుటుంబ సభ్యుల మధ్య ఆదరాభిమానాలు, ఆపేక్షలు వుండవు. జీవితము వైపు వ్యాపార దృష్టితో చూస్తూంటే ప్రతి దానికి దీనివలన మనకేమి లాభము అని ప్రశ్నించు కుంటుంటే, సత్ప్రయోజనాలను గురించే ఆలోచిస్తుంటె త్వరలోనే యీ దృక్పథం దైవ సంబంధ కార్యాలను మనము మరచి పొయ్యేటట్టు చేస్తుంది. తల్లితండ్రుల హృదయాల్లోని ప్రేమ యింకి

పోతుంది ; వారి ఆదర్శాలు అంతర్థాన మౌతాయి; బిడ్డల జ్ఞానాభి వృద్ధికి కుంటు పడుతుంది.

"స్వర్ణమున కన్న, శాంతి నొప్పారు గృహము
మంచి; దచట జేరును కుటుంబమ్ములోని
వారు; దానిని జీవిత స్వర్గముగను
అట్లు గాకున్న పేరిమాలయమ్ముగను
గాని జేయుదురు సతియు గాని, తల్లి
గాని అక్క చెల్లెండ్రయిన్ గాని- తలచి
చూడ సత్య మిద్యేదియె ఎచ్చోటనైన

ఆ కుటుంబమ్ము చెప్ప సాధ్యమ్ముగాని
దీనస్థితి బాధ పడుచున్నగాని, లేక
బహుళ దుఃఖ భారమ్ముతో మగ్గుచున్న
గాని అక్కడొప్పారు పరిగాఢమైన
దేవు నాశీస్సులరయు నెంతేని మెఱుగు
అల సువర్ణమ్ము కన్న, ఎందైన, ఎన్న
డైన యీ సుభాశీస్సులు అమ్మబడవు
కొనబడవు, దొరకవు తెల్సుకొనుడుదీని." F. A. Royan

**పరిస్థితిని ఎదుర్కొనడం** 1) నీ కుటుంబాన్ని పూర్తిగా కతోలికమయం చేయాలంటే, నీవు నిరంతరం దేవుని సహాయాన్ని అర్థించాలి. ఈనాడు నీకు కొన్ని ఉత్తమమైన కుటుంబాలు కన్పిస్తున్నవంటె దానికి కారణం ప్రార్థనాపరులైన, వాత్సల్యపూరితులైన, దయార్ద్రులైన తల్లి దండ్రుల వలననే ఇహలోకంలో మంచి కతోలిక కుటుంబాన్ని తయారు చేయ ప్రయత్నించిన కొలదీ నీకు మోక్షంలో అంతగా స్వాగత మివ్వబడుతుంది.

2) పిల్లల విషయంలో కొంచెం దృఢత్వం అవసరం. కాని అది కోమలంగా కూడ వుండాలి. అది పరుషముగ నుండరాదు. దేవుడు తల్లిదండ్రులకు కొంత బాధ్యత నొప్పగించాడు. వారు తమ అధికారాన్ని

సరిగా వినియోగించవలె. లేకపోతే పిల్లలు చెడిపోతారు. వారికి బుద్ధి పూర్వకంగా పాడుచేసిన వారవుతారు. బిడ్డలు తల్లిదండ్రులకు విధే యించిన, సౌశీల్యు లవ్వేదరు. చిన్నతనంలో తల్లిదండ్రులకు అణకువ గల్గి, యెంతో విధేయించినవారు పెద్దవారైన తర్వాత గూడ అలాగే వుండెదరు.

3) కటువైన స్వభావం యితరుల సంతోషాన్ని నాశనం చేస్తుంది.

4) సాధ్యమైనంతవరకు యింటిదగ్గరనే నీ విశ్రాంతికాలాన్ని గడుపు. వినోదాలుచేసికో యింటిదగ్గరనే.

5) డబ్బు అనేది కుటుంబాన్ని నిర్మించలేదు. అది యెంతచేసినా యింట్లో సామానులను కొనిపెటుతుంది. ఇంట్లో మంచివస్తువులు, కుర్చీలు, బల్లలు, పందిరిమంచాలు, రత్నకంబళ్ళు వున్నంతమాత్రాన యింట్లో సంతోషంవుండదు. భర్తసంపాదన తక్కువగావున్నపుడు భార్య గొంతెమ్మకోర్కెలు కోరరాదు. ఆత్మత్యాగము, అన్యోన్యప్రేమ, నగుమొగము, వుల్లాసము, మితవ్యయం, ఓర్మి, ప్రపంచజ్ఞానం-యివి పెద్ద ఆదాయముకంటె అధికం. మనకు అవసరమైనడబ్బును సంపాదించుకోటానికి అన్ని ప్రయత్నములు చేయవలసినదే. కాని డబ్బే ప్రధానమని మనం జీవించరాదు.

6) కుటుంబంలో విజ్ఞానమయమైన వాతావరణం నెలకొను నట్లు ప్రయత్నం చెయ్యి. గ్రంథ పఠనయందు ఆసక్తి వుండాలి. ఒకరి కొకరు చదవడానికి ప్రయత్నించాల. తండ్రి తన యింట్లో గృహ వాతావరణం, కుటుంబ వాతావరణం కల్గించడానికి ప్రయత్నించాల. ఈ వాతావరణం బిడ్డలను మంచివైపునకు త్రిప్పునదిగాను, జీవితాన్ని వివేకముతో నడవడానికి సహాయపడునదిగాను వుండాలి. ఇంట్లో సంగీతంపెట్టి బిడ్డలకు కళలు అంటె అభిలాష కలిగించాల. స్నేహితులను మన యిండ్లకు పిలవడము, వారితో విజ్ఞాన విషయాలను గూర్చి చర్చించిన బిడ్డలుకూడా నేర్చుకొనెదరు. బిడ్డలు అడిగే ప్రశ్నలకు సమాధానము చెప్పి వారి బుద్ధిని అధికమయ్యేటట్టు చెయ్యాల. పాఠశాల విద్యకంటె యింట్లో విద్య యెక్కువ సహాయ పడుతుంది జీవితంలో.

7) సంతోషం, ఆనందంలేని గృహాలు చాలా వున్నాయి. ఎప్పటికప్పుడు విచారం. దురదృష్టం వున్న చోట్లకు సంతోషాన్ని జేరవేయ గలిగినట్లయితే, నీ కుటుంబానికే గాక యితరుల కుటుంబాలకు గూడ యెంతో శ్రేయస్కరం.

(8) అవసరం అయితే తప్ప, కుటుంబ జీవిత మనుభవించటాని కవకాశమివ్వని వృత్తిలో జేరగూడదు. పైగా మంచి కతోలిక జీవితాన్ని జీవించాలని ఆశవున్నట్లయితే కొన్ని వృత్తులలో ప్రవేశించకుండుట, కొన్ని వుద్యోగాలలో చేరకుండుట మంచిది. ఒక ప్రక్క నీవు లౌకికంగా గొప్పవాడవయ్యే అవకాశాలుండి మరోప్రక్క నీ గృహ జీవితాన్ని పాడుచేసేదిగా వున్నట్లయితే, ఆ పేరు ప్రతిష్టలను వదలివేసి నీ కుటుంబ జీవితాన్ని కాపాడుకో. అంత్యాన నీకు సంతోషాన్ని, ఊరటను యివ్వగలిగేది కుటుంబము మాత్రమే.

కుటుంబ జీవితాన్నుండి నిన్ను మరల్చే ఆకర్షణలు ప్రపంచంలో చాలావున్నాయి. వాటిలో యేది మంచిదో చూచి యేరుకోవడం లోనే వున్నది నీ గొప్ప తనమంతా. తెలివిగా యేరుకోవాలి. ప్రతి క్లబ్బులోను, ప్రతి సంఘంలోను సభ్యుడవుగా జేరరాదు. మంచి చెడ్డ, వెనక ముందు చూడు. జరిగే వినోద ప్రదర్శనాలకు, చూపే ప్రతి సినిమాకు కండ్లు మూసుకొని పోకూడదు. వివేకాన్ని వుపయోగించాల.

9) స్త్రీ యొక్క వున్నతమైన, వుత్తమమైన స్థానం కుటుంబమే, గృహమే. ఆమె వాంఛించ వలసింది, ఆమె ఆశింప వలసింది గృహమే గాని క్లబ్బుగాదు. భవిష్యత్తులో మోక్షానికి తగిన బిడ్డలను సమాయత్తపరచి తద్వారా దేవునితో సహకరించడం గొప్ప సంగతిగదూ! క్రీస్తునాథునివంటి బిడ్డలను పెంచటం యెంత ఘనమైన విషయం! తల్లి దండ్రు లిద్దరు గూడా మరియమ్మ జోజప్పలవలె వుండ ప్రయత్నించినట్లయితే పిల్లలు బాల జేసువు వలె వుండరూ! భర్త తగినంత సంపాదించినపుడు భార్య తన కాలాన్ని బిడ్డల పెంపకానికి గడపాలి కాని మరికొంత సంపాదన కోసంగాదు. తల్లి దండ్రులు తమ కాలాన్ని సాధ్యమైనంత వరకు తమ బిడ్డల విషయంలో గడపాలని వుద్దేశించార్గు

దేవుడు. చాలామంది పిల్లలు పెరిగి పెద్ద వాళ్ళయి పోతున్నారే గాని వారికి తగిన శిక్షణము యిచ్చుటకు యెవరూ ప్రయత్నించడము లేదు.

**ఆచరణ** 1) ఎప్పుడూ ఒకే విధంగా వుండే స్వభావాన్ని అలవరచుకో. యెప్పుడూ సతోషంగా వుండటానికి ప్రయత్నించు. మనకు తెలియకుండానే మనము అనేక కార్యాలు చేస్తాము అవి తమ ప్రాభవమును యితరులపై స్థిరముగ నెలకొల్పవచ్చు.

2) దైవం, మతం అంటె అశ్రద్ధ అధికమౌతుంది. కాని తల్లి దండ్రులు యిట్టి పరిస్థితులలో కూడ తమ బిడ్డలను పుణ్యవంతులుగ తయారు చేయవచ్చును. క్రీస్తు ధారణము మన బిడ్డల ఆశయంగా వుండాల గాని ధనం, ప్రతిష్ట కాదని నీవు వారికి నేర్పుటకు ప్రయాసపడు.

3) ఘనమతులైన వారి జీవితాల్లో కూడ దుఃఖము అనేది చోరవ చేసుకుంటుంది. నీకు దుఃఖము వచ్చినప్పుడు, కష్టాలు కలిగినప్పుడు ఓదార్పు, వూరట నీ యింట్లోనే వెదకు. నీ భార్యా బిడ్డలలో నె కనుగొను. నీ అన్నదమ్ములలో అక్క చెల్లెండ్రవలన మనోశాంతిబొందు. గుడికిపోయి అక్కడ దైవప్రార్థనలో శాంతిని కనుగొను.

4) కార్డినల్ మెర్సియర్ యిలా అన్నారు. "నాలోనున్న వుత్తమ గుణాలకు దేవుని తరువాత నా తల్లియే కారణం. ఆమె సన్నిధిలోనే, ఆమె ఒడిలో, ప్రేమ అంటె తన్ను తాను మరచిపోవడమని, పొరుగువానికి సర్వతా తోడ్పడడంలో వున్నదని నేర్చుకున్నాను." ఇలాంటి గౌరవం నీవు కూడా ఆశిస్తావా? అలా అయితే నీవు ఏ త్యాగాలు చేయాల? ఇతరులకు మేలుకూర్చినందువలన వచ్చే ఆనందాన్ని నీవు యెప్పుడైనా అనుభవించావా?

5) జ్ఞానస్నానుగారి 19, 25 చదివి దానిలో తల్లి కుమారుని ఎడల చూపిన ప్రేమను గ్రహించి అంతకంటే మించిన ప్రేమను వూహింప గలవేమో చర్చించు.

—:o:—

# నలుపది నాలుగవ అధ్యాయము

## మతాంతర వివాహాలు

సుఖకరమైన కుటుంబాలు సుఖకరమైన వివాహాల వలన ఏర్పడతాయి. సుఖకరమైన వివాహాలు దేవుని ఆశీర్వాద బలం వలన కొన్ని జాగ్రత్తల వలన ఫలించుతాయి. నీవు వివాహాన్ని గూర్చి ఆలోచించునప్పుడు, వివాహ అంతస్థులోని సంతోష, సంతృప్తి రహస్యము అనేవి తిరుసభ వివాహామునకు ముందుగా తీసికొనుమను జాగ్రత్తలపై ఆధారపడి యుంటవని నీవు తెలిసికొంటావు.

క్రీస్తునాధుడు నిర్ణయించిన వివాహానికే తిరుసభ కట్టబడి వున్నది. ఆ విధంగా ఆయన యెడలగల భక్తిని వ్యక్తం చేసుకున్నది. ఆ విధంగా ఆయన వివాహ బంధముయొక్క స్థిరత్వాన్ని బోధించాడు. ఆయన అనుచరులు శాంతి మనస్కులై యుండవలయునని వాంఛించాడు. దంపతులు ఆత్మ నిగ్రహమను పుణ్యమును అలవరచుకోవాలని ఆయన కోరుచున్నాడు. ఆత్మనిగ్రహము లేకుండ శాంతిఅనేది వుండదు.

క్రీస్తునాధుని విశ్వసించటం వివేకమైతే, తిరుసభను నమ్మటం గూడ వివేకమే. ఎందుకంటె తిరుసభ జేసునాధుని భావాలనే బోధిస్తుంది ఇక, తిరుసభకును క్రీస్తునాధునికిని మధ్య యెట్టి కలయిక, ఎట్టి ఏకీభావం, యెట్టి సంబంధాలున్నవో కతోలిక స్త్రీకి, కతోలిక పురుషునికి గూడా అట్టి ఏకీభావమే, అట్టి కలయికే వుండాలి. క్రీస్తునాధుని తిరుసభయొక్క సంబంధము దంపతులకు వారి జీవితంలో ఆదర్శ ప్రాయముగ యుండవలె. కతోలిక స్త్రీ పురుషులు తిరుసభ క్రీస్తునాధులను వుదాహరణగా తీసుకొని భవిష్యజ్జీవిత పురోగమనానికి కృషి చెయ్యాలి. తిరుసభ క్రీస్తునాధుల సంబంధ బాంధవ్యాలు పవిత్రవంతాలు. కతోలిక స్త్రీ పురుషులైన మీరుగూడా అట్టి పవిత్రమైన సంబంధబాంధవ్యాలను నెలకొల్పుకొనవద్దూ? నీ జీవిత భాగస్వామిగా ఒక కతోలికుని యేరుకోమని తిరుసభ నీకు చెబుతుంది. ఆ ఏరుకొన్న భాగస్వామితో నీవు ప్రీతిగా వుండాలని విశ్వాసం, సద్భావం కలిగి వుండాలని తిరుసభ చెబుతున్నది. ఆలా వున్నపుడే యిరువురి మధ్య శాంతి ఏర్పడుతుంది.

**మతాంతర వివాహాల ప్రమాదం** కతోలిక సిద్ధాంతాలైన ఏకత్వం, వివాహ బంధ అవిచ్ఛిన్నత, వివాహ బంధ పవిత్రతలకు బద్ధులై యుండకనే వివాహ సుఖాలను, సంతోషాన్ని పొందగలమని కొందరూహిస్తారు. నీవు ప్రమాదకరమైన నిశ్చయానికి వచ్చే ముందు ఈ క్రింది విషయాలను ఆలోచించమని తిరుసభ నిన్ను కోరుచున్నది.

1) కతోలికేతరుని వివాహమాడ ప్రయత్నించడం నీ జీవితాన్నంతా పణంగా ఒడ్డటమే. వివాహమైన తరువాత ఆ సంబంధం జీవితాంతంవరకు వుంటుంది. ఇతర మతస్తుల భావాలు వేరు, కతోలిక భావాలువేరు. కాబట్టి అట్టి విభేద భావాలతో జీవితాంతం వరకు సుఖముగా జీవించగలమని అనుకోవడం వివేకము కాదు.

2) వైవాహిక జీవితం చాలా కష్టాలతో కూడుకొన్నది. మతాంతర వివాహాలలో, కతోలికుల మధ్య జరిగే వివాహమునకు దైవము యిచ్చు అనుగ్రహములను యివ్వకపోవచ్చు ఈ జీవితం అనేది మోక్షానికి చేసే ప్రయత్నం. మోక్షాన్ని పొందడానికి సాధనం. దైవ ఆజ్ఞలను అనుసరించే వారికి ఆ జీవితానికి కావలసిన అనుగ్రహములన్ని యిస్తారు. వివాహమనేది మోక్షానికి మనం చేసే ప్రయత్నాలలో ఒకటిగా వుండాల, మోక్ష సంపాదన సాధనంగా యుండాలి. వివాహం పరస్పర సహాయం కొరకున్నది. కాబట్టి వీలైనంత వరకు కతోలిక భాగస్వామిని వివాహమాడుటకు ప్రయత్నించాల.

3) కతోలికేతర వ్యక్తి నీ జ్ఞాన దృక్పథాన్ని అర్థం చేసుకోకపోవచ్చు. నీతో ఏకీభవించక పోవచ్చు. విశ్వాసం లేకుండ మన ఆచారములను, మన భక్తిని అర్థం చేసుకోకపోవచ్చును. అందువల్ల అతను కాని ఆమె కాని నీకు ప్రియమైన వాటిని హేళనచేయవచ్చు. హేళనను భరించడం కష్టం. మతాంతర వివాహాలలో నీ విశ్వాసమునకు ప్రమాదమున్నది. నీవు అవిశ్వాసివైపోవచ్చును.

4) ఈ లాంటి మతాంతర వివాహాలవల్ల సంభవించే నిరానందంలో సగముకూడా బయటికి కానరాదు. ఎంతకష్టమో మనము

చూడము. కొందరు తాము పొరపాటు చేశామని ఒప్పుకోటానికి సిగ్గు పడతారు. అందువల్ల తమ జీవితాలు సంతోషంగానే జరుగుతున్నా యని చెప్తారు అట్టిమాటలతో మీరు మోసపోవద్దు.

5) భర్తలు సాధారణంగా మతమునుగూర్చి పిల్లలకు చెప్పరు. అలాంటప్పుడు భార్యలే పూనుకోవాలి. కాని భార్యలే గనుక కతోలి కేతరులైతేయింక పిల్లలసంగతి యేం కావాల? పిల్లలకు మతం అనేది అలవడదు. దేవుని ధ్యాసేవుండదు

6) ప్రపంచంలో తప్పు, ఒప్పు అన్న వాటికి ఒకే ఒక ప్రమాణ మున్నది. అది దేవుని పదియాజ్ఞలలోను, కొండమీద ప్రసంగంలోను, తిరుసభ చట్టములోను వున్నది. తప్పు ఒప్పు అనే వ్యక్తిగత అభిప్రా యాలపై ఆధారపడి యుంటాయి అనే భావాన్ని మనము యెప్పుడూ ఒప్పుకొనరాదు. వ్యక్తిగతభావాలు యేలావున్నా యిది తప్పు, అది ఒప్పు అని చెప్పడానికి ఒక స్థిర ప్రమాణమున్నది. వివాహానంతరం కతోలి కేతర వ్యక్తి పుట్టిన పిల్లలను కతోలికులుగా పెంచుతానని వాగ్దానం చేయాల. కతోలికేతర వ్యక్తికి కతోలిక మతాన్నిగూర్చి తెలియ నపుడు యిది కష్టమౌతుంది. కతోలికవ్యక్తి చనిపోయినప్పుడు వారికి పుట్టిన పిల్లల విశ్వాసము విషయం యేంగావాలి?

**స్నేహితులను జాగ్రత్తగా ఏరుకోవడం**

కనబడిన వారితోనల్ల పరిచయమైన ప్రతివ్యక్తితో అత్యంత సాన్నిహితత్వాన్ని పెట్టుకోవద్దని, అమిత సహవాసం చేయవద్దని నీ లోకజ్ఞానం చెబుతుంది. అదేవిధంగా నీ వివాహమునకు దోహదమయ్యే స్నేహితాల విషయమై, పరిచయాల విషయమై జాగ్రత్తగా యెందుకుండగూడదు? నిజంగ నీ విశ్వాసమంటె నీకు యెక్కువ జాగ్రత్తయున్న, యీ పరిచయాలు చేసికొనే ముందు ఒక టికి రెండుసారులు తలంచు.

ఒక కతోలికుడు మంచి కతోలిక కుటుంబాన్ని కల్గి వుండాలని మనస్సులో పెట్టుకున్నటయితే మంచివారిని కలసికోడానికి దైవమూ

తగిన సహాయము చేసెదరు. కతోలికుల మధ్యనే ఆలాంటివారు అనేకు లున్నారు.

నీవు వివాహము చేసుకొనే ముందు నీ భాగస్వామిని గురించి బాగా తెలిసికో. పై అందచందాలు కాక, లోపల గుణాలను కను గొను. తొలిపరిచయములోనె అంధుడవుకాక ఆ వ్యక్తిని పూర్ణముగ గ్రహించుటకు ప్రయత్నించు. పెండ్లి చేసుకొనువారు పరిణయ సుఖ దుఃఖాలను అనుభవించువారు యువతీ యువకులుగావున తల్లి దం డ్రులు తమ బిడ్డల పెండ్లి విషయములో బలవంతము చేయరాదు. ధనమునకై ఆశపడి మీ బిడ్డల భావి సౌఖ్యమును బలిపెట్టవద్దు.

కష్ట సుఖాలలో భాగస్వాములైన యిద్దరు వ్యక్తులు, ఒకే స్మృతులకు, ఆశలకు ఐక్యంగా తపించే హృదయాలు, మంచికిగాని, చెడుకుగాని, భాగ్యానికిగాని, నిర్భాగ్యానికిగాని, ఆరోగ్యానికిగాని, అనా రోగ్యానికిగాని యేకమయ్యే రెండు జీవితాలు తమ దైవాన్ని పూజించే టప్పుడు తమ కష్టాలను దేవునికి చెప్పుకొనునప్పుడు, తమ కృతజ్ఞతా సమయములో వేరువేరుగ నుండకూడదు. విడిపోరాదు.

**తిరుసభ దయ** కొందరు వివాహం వలన అనుకొన్న సంతోషాన్ని అనుభ వించరు. ఆలాంటివారు వివాహపు బంధాన్ని తెంపు కోవాలని చూస్తారు. కాని తిరుసభ దాని కంగీకరించదు. అందుకని తిరుసభను వారు నిందిస్తారు. తిరుసభ వివేకాన్ని తెలుసుకోవా లంటె విడాకులను పొందినవారి స్థితినిచూడు. విడాకులు వారిని సుఖ వంతులనుగా జేస్తుంటా? ఒకసారి విడాకులిచ్చారు అంటె, ఒకసారి దానికి అలవడ్డారు అంటె జీవితాంతం వరకు వారు విడాకులిస్తూనే వుంటారు. దీనికింక అంతమంటూ వుండదు. తిరుసభ సమాజం మొత్తం క్షేమాన్ని చూడాలి.

తిరుసభ గనుక విడాకులను అంగీకరించే టట్లయితే, లాభదాయ కంగాని వివాహాల బాధ్యతలను తప్పించుకోటానికి చాలమంది ప్రయ త్నించుతారు. తిరుసభ విధానం గుణవంతులను కాపాడుతుంది. భార్యా భర్తలు వేరుకావడం సులభమైనట్లయితే గుణవంతులు కానివారు సరి యైన వుద్దేశ్యము లేకుండా తాము భార్యను సంరక్షించాలన్న బాధ్యత

లేదని, కలకాలం ఆమెతో అంటిపెట్టుకోవాలన్న చిక్కు లేదని వివాహ మాడెదరు. వివాహ యేకత్వాన్ని క్రీస్తునాథుడు ఆజ్ఞాపించారు. అట్టి విధానమే మానవజాతికి సంతోషాన్ని, సుఖాన్ని ఇస్తుందని ఆయనకు తెలుసు. మతాంతర వివాహాలకు తిరుసభ తన ప్రాతికూల్యము తెలుపుతున్నదంటే దానికి కారణము, యిహలోకములోను మరులోకములోను వివాహితులు సంతోషంగా వుండాలనే. తొందరపడి చేసే వివాహాలకు, దగ్గర బంధువులమధ్య జరిగే వివాహాలకు, రహస్యంగా చేసుకొనే వివాహాలకు తిరుసభ ప్రతికూలము. ఈ విధంగా ప్రతికూలముగా వుందంటే దానికి కారణం నీవు పొరపాటు పడకుండా వుండగలందులకు, అట్టి వివాహాలవలన నీవు అసంతృప్తి జెందకుండా వుండుటకు.

తిరుసభ వుపదేశాన్ని విన్నవారలు తమ వివాహానంతరం నిజముగా తిరుసభ తమ మేలునకే, తమ సుఖమునకే చెప్పుచున్నదని గ్రహించెదరు.

**మానవునికంటె దేవునికి విధేయించు**

వైవాహిక జీవితంలో క్రైస్తవఆదర్శం ఒండొరుల ప్రేమను కలిగియుండుటకు తమ ధర్మాలను, కర్తవ్యాలను నెరవేర్చుటకు గాని, కామము తృప్తిపరచుకొనుటకు గాదు. ప్రేమను కలిగియుండుట ఆశ్రమ ధర్మములను నెరవేర్చుటయనునవి హృదయములను ఐక్యము చేయును. కేవలం కామజీవితం భార్యాభర్తలను మృగతుల్యులను జేస్తుంది. నైచ్యులనుగా జేస్తుంది మంచిక్రీస్తువుడు తన కుటుంబ బాధ్యతలకు విశ్వాసము గలవాడై యుంటాడు. ఆత్మనిగ్రహాన్ని కలిగి వుంటాడు. నిష్కళంకమైన, అమాయకులైన బిడ్డలను కలిగి యుండటానికి, సంతోషమైన కుటుంబాన్ని కలిగి వుండటానికి అతడు లోకపు దురలవాట్లకు పోడు.

**ఆచరణ**

1) ఒకటి మాత్రం నీవు యదార్థమని గ్రహిస్తావు. కష్టముతో కూడినపనులు, విధులు తృప్తిని సుఖాన్ని యివ్వటానికి తోడ్పడతవని, చేయటానికి యెంతో కష్టంగా వున్న త్యాగాలు అమలు. నందుంచగల్గినపుడు యెంతో శాంతిని ప్రసాదిస్తవని తెలుసుకుంటావు. అది అలా వుండగా, నీవు పశుప్రాయుడవై సంచరించినంత

కాలం అసంతృప్తి, చిరాకు, బాధ నీలో వుంటుంటాయని తెలుసుకో. కాని క్రీస్తునాథుని తత్వాన్ని జీర్ణించుకుంటే త్యాగాలుచేయడంసులభం. కాబట్టి కష్టాలతో కూడిన జీవితాన్ని యేరుకోవటానికి భయపడకు. జేసువిజ్ఞానాన్ని విశ్వసించు. యదార్థమైన కతోలికు తత్వంతో పరిపాలితమయ్యే కుటుంబాలను గమనించి వాటినుండి వివేకాన్ని, కుటుంబాన్ని యెట్లానడవాల్సింది నేర్చుకో. క్రైస్తవ ఆదర్శాలకు అనుగుణంగా నడిచే కుటుంబాలలో పెరిగిన యువతీ యువకుల నడవడికను గమనించు.

౭) నీ వివాహపు జీవితాన్ని గురించి చట్టములు చేయటానికి తిరుసభకు హక్కున్నది. ఎందుకంటె మోక్షానికి సమాయత్తం చేసే విషయాలలో తిరుసభ దేవుని అధికారమైన ప్రతినిధి. అంతేగాదు. ఆమె బిడ్డల ఆత్మలనుకూడా సంరక్షించాలి.

---

# నలుపది ఐదవ అధ్యాయము

## కతోలిక పాఠశాలలు

**కతోలిక పాఠశాలల అవసర మేమి?**

నీవు దేవుని కోసం సృష్టించబడ్డావు. మోక్ష పదవికి నీవుగూడా ఒక అభ్యర్థిగా యేరుకోబడ్డావు. ఈ లోకంలో వున్నప్పుడు నీవు మోక్షంకోసం సమాయత్తపరచుకోవాలి. క్రీస్తువలె కావడము నీవు ఆశయంగా పెట్టుకోవాల. నీలో ఒకటి వున్నది. దాన్ని సక్రమంగా, సరిగా అభివృద్ధి చేసుకో గల్గితే దేవునిచేత ఆశీర్వదింప బడినవారిలో నీకూ ఒక స్థానముంటుంది.

విద్య అంటే మానవుణ్ణి జీవితానికి సన్నద్ధం చేయటమే; అతనిలో గర్భితమైయున్న శక్తులను అభివృద్ధి పరచటమే. అసలు విద్య పరిపూర్ణమైనదిగా వుండాలి అంటె మానవుని యిహలోక జీవితానికి సన్నద్ధము చేయుటమేగాదు, పరలోక జీవితానికిగూడా అతన్ని సమాయత్తపరచాలి. ఇక్కడ విజయం పొందేటట్లు, యిక్కడ రాణించేటట్లు చేయడమేగాదు, పరలోకంలో సైతం విజయం పొందేటట్లు చేయాలి. అపుడే విద్యయొక్క పరమార్థం వెల్లడి అవుతుంది. మన విశ్వాసము బిడ్డకు ఆత్మ వున్నదని, దాన్ని సరియైనరీతిగా అభివృద్ధికి తీసుక వచ్చినట్లయితే ఒకనాడు మోక్షానందమును పొందుతుందని చెబుతోంది. కనుక బిడ్డకు ఆత్మ అనేది వున్నట్లయితే, అది అభివృద్ధి కావలసి వున్నట్లయితే, మన విద్యావిధానంలో ఆత్మ అభివృద్ధిని సాధించటానికి గూడా ప్రవేశపెట్టాలి. అందుకుతగిన పద్ధతులను అవలంభించాలి. మానవ జీవిత ప్రధానలక్ష్యాన్ని సాధించటానికి తోడ్పడని విద్యావిధానము పరిపూర్ణ విద్యావిధానమని చెప్పుకోటానికి అర్హతలేదు.

పిల్లవాణ్ణి విద్యావంతుణ్ణిగా జేసే సందర్భంలో వాని శారీరక, మానసిక శక్తిసామర్థ్యాలను దృష్టిలో పెట్టుకొనడమేగాదు, ఆ కుఱ్ఱవాడు ఆధ్యాత్మిక ఔన్నత్యాన్నిగూడా పొందడానికి వీలుగా తయారు కాబడాలి. ఒక కుర్రవాన్ని యీ లోకంలో భోగభాగ్యాలను పొందటానికి, పేరుప్రతిష్టలు సంపాదించటానికి తయారుచేసి, మోక్షజీవి

తాన్ని గురించి తెలుసుకోవడానికి, దానిని సాధించడానికి అవకాశ మివ్వని యెడల అది ఆ కుర్రవానికేమి ప్రయోజనం? మానవుని తెలివి తేటలు అతని దేవుని దగ్గరకు తీసుకొని వెళ్లకపోతే అవి వృథా. అతనికి అవివుండీ లేనట్లే జమ. ప్రతిమానవుడు దైవాన్ని చేరవలసిన బాధ్యత కలిగియున్నాడు. కాబట్టి యువకులు యిహలోక, పరలోక పోరాటా లకు గూడ సమర్థతతో జయించడానికి తయారు చేయబడవలె. వారికి తగిన విద్యాజ్ఞానమియ్యబడవలె.

ప్రతి బిడ్డలో నాశనంగాని ఆత్మవుండటం, అతను దేవునితో ఐక్యత పొందవలసి వుండటం, జీవిత అంతిమ లక్ష్యాన్ని జేరటానికి మార్గాన్ని వారికి బోధించవలసిన అవసరం వుండటం- యివే కతో లికు విద్యా విధానముండటానికి కారణాలు. కతోలికు విద్యాలయాలు శారీరక, మానసిక, సాంఘిక అభివృద్ధి తమ లక్ష్యముగా పెట్టుకుం టాయి; అంతేగాక, క్రీస్తునాధుడు బోధించిన పుణ్యాలను విద్యార్థులు తమ జీవితంలో క్రియలద్వారా ప్రకాశింపజేయటానికి కతోలికు విద్యా లయాలున్నాయి. యువతీ యువకులు తమ జీవితాల ద్వారా అష్ట భాగ్యాలు అనుసరణ సాధ్యాలు అని చూపించినప్పుడు, లోకం క్రీస్తు నాధుని వద్దకు రావచ్చు కాని క్రీస్తునాధుని తత్వాన్ని అలవరచు కోడానికి దీర్ఘకాల శిక్షణ అవసరం. క్రీస్తునాధుని సత్యాలను తమ జీవి తంలో ప్రకాశింప జేయడము విద్యార్థులకు నేర్పడానికి కతోలికు విద్యాలయాల అవరసం యెంతైనా వుంది. కతోలిక విద్యలో క్రీస్తునా ధుని గూర్చి, ఆయన సిద్ధాంతాలను గూర్చి పఠనం చేయవలె. క్రీస్తునా ధుని గూర్చిన పఠనం, అంత ప్రయోజన కరమైనది కాదని నీవు అన గలవా? బోధనా ప్రణాళికతో ఈ పఠనకు స్థానం వుండటానికి అర్హత లేదని యెవరైనా అనగలరా?.

**యువ జనుల అవసరాలను తీరుస్తుంది**

పిల్లవాని శీలమును బహు జాగ్రత్తగ అభివృద్ధికి తీసుకొని రావలె. ఒక గుణాన్ని అభివృద్ధి చేసి మరి యొక దాన్ని తరువాత చేయుడానికి వీలులేదు. శీలము యొక్క వివిధ ముఖములను ఒకేసారి జాగ్రత్తగా అభివృద్ధి చేయవలె. ఆలా జరుగక పోయిన ఒకటి అభి

వృద్ధి యగును, మరికొన్ని స్తంభించి పోవును. ఈ అభివృద్ధి యనునది సరియైన అదునులో జరుగకపోతే యిది ఇక జరుగనే జరుగదు. కతోలిక విద్యాలయములు అవసరాలను సరియైన అదునులో తీర్చుతాయి. యవ్వనములో జ్ఞాన జీవితమును గురించి శిక్షణ నివ్వబడకుండ విడిచిపెట్ట బడినవారు వేనవేలు గలరు. వారు యీనాడు మతం అంటే నిర్లక్ష్యంగా వున్నారు. అసలు వారికి దైవము లేదు. మత విషయాలలో శిక్షణ అవసరమని పెద్దవారయ్యేవరకు ఈ మత శిక్షణ ఆపియుంచవచ్చునని అనేవారికపై నిదర్శనము మనము చూపిస్తే చాలు. పెద్దవారయ్యే వరకూ మత శిక్షణ ఆపినట్లయితే అధిక సంఖ్యాకులు మతాన్ని నిర్లక్ష్యం చేస్తారు.

ఒక చిన్న పిల్లవాడు తన తల్లి దగ్గరనుంచి యేకారణంచేతనైనా విడిపోయి వుంటాడు అనుకోండి. అప్పుడతను ఆమెకు దూరంగా వుండి పెరుగగలడు. ఆమెతో వుండాలనే వాంఛ అతనికి కలుగదు అతనికి తర్వాత జీవితంలో గూడ ఆమె మీద నిజమైన మమకారమే వుండదు. అలాగే దేవుని దగ్గరనుండి గూడ ఆ పిల్లవాడ్ని మనము దూరము చేయవచ్చును. ప్రపంచ సుఖానుభూతులలో నిమగ్నమైన అతను తన పరమతండ్రి విషయం యేమీ పట్టించుకోడు. అసలు ఆయన సంగతే స్ఫురణకురాదు.

కతోలిక బిడ్డ దేవునికి చెందినవాడు. జేసుస్వామి చేత రక్షింపబడిన అమర ఆత్మను పొంది యుండుట చేత, జ్ఞానస్నానపు పవిత్ర జలములచే పరిశుద్ధపరుపబడుటచేత దైవ జీవితంలో భాగస్వామి యగునట్లుగ చేయబడినాడు. ఈ విషయాన్ని ఆ బిడ్డలకు తెలుప నవసరం లేదనుట శుద్ధ తప్పు. మన విద్యార్థులలో ప్రతివారికి స్వాతంత్ర్యమున్నదని మనము బడులలో చెప్పుచూ వుంటాము. అదే విధముగ మనము మోక్షాన్ని గురించి చెప్పరాదా? మోక్షానికి ఆ హక్కు లేదా? బిడ్డలు అందరు దేవునికి స్వంతం.

క్రీస్తునాథుని తిరుసభను, మోక్షజీవితాన్ని గురించి తెలుసుకోవడము త్వరలో రాదు. అందుకు చాలా కాలము నుండి ప్రబోధం, మననం, అలవాటు అవసరం. ఇవన్ని గూడ సరియైన విద్యవలననే

లభిస్తాయి. జీవితములోని అనుభవాలకు సర్దుబాటు చేసికోవడం కోసం తగిన శిక్షణ యివ్వబడుతుంది బడిలో. కాబట్టి బడిలో మత విద్యకు స్థానముండ వలయును. మతవిద్యే జీవితంలోని విషయములను సరిగా నిర్ణయించ గలదు. ఏదైన ఒక విషయము పాఠ్య విషయాల నుంచి తీసివేసిన అది అంత ముఖ్యము గాదని అనుకుంటారు. ఇలాంటి దృక్పథం జీవితాంతం వరకు వుండవచ్చు. మతం అనేది బాలుని అనుభవములోనికి బాగా చొచ్చుకొని పోవాల. అది బాలుని దైనందిన జీవితంలో ఒక భాగమై పోవాల.

**మాతా పితరుల హక్కులు** తల్లి దండ్రులకు తమ సంతానంమీద మొట్ట మొదటి హక్కున్నది. అది వారి సహజమైన హక్కు. ఆ హక్కును వారు సద్వినియోగం చేసుకోవాలి. సంతానానికి సరియైన విద్యను యివ్వవలసిన బాధ్యత వారిపై యున్నది. తమ బిడ్డలను పెంచే విషయంలో యీలా చేయండి, ఆలా చేయండి అని రాజ్యాంగం శాసించుటకు హక్కు లేదు.

**దేశానికి మిత్రులు** ఏ దేశపు చరిత్ర చదివినా ప్రభుత్వముయెడల తమకుగల విశ్వాసాన్ని పొగడుకొనే వారూ మేము అంతా యింత అని చెప్పుకొనేవారు, ఆ దేశానికి మిత్రులుగారని తమ దేశం కొరకు తమ ఆస్తిపాస్తులను, తమకు త్యాగం చేసినవారే యథార్థమైన మిత్రులని తెలుసుకుంటాఫు.

కథోలికులు శ్లాఘ్యమైన పనులు చేశారు; చాలా త్యాగాలు చేశారు వీరు ఆ విషయంలో మంచి పేరు ప్రతిష్టలు సంపాదించారు. తమ బిడ్డలకు మత విధ్యను యివ్వటంలో వారికి హక్కున్నది. బిడ్డలకు యివ్వబడే శిక్షణను విభాగించు దైవానికి బిడ్డ విద్యలో స్థానము లేకుండా చేయువారినుండి మన దేశానికి అధికముప్పు వస్తున్నది. మతాన్ని యెలా బోధించాల అనే విషయంలో మాతో అందరు యేకీభవించారని మేము గుర్తించాము. కాని పిల్లలకు దేవుని విషయములో యేమీ చెప్పక వారిని మతంఅంటే అబద్ధమని, ఒక మూఢత్వమని నమ్మేటట్లు చేయడం తెలివిగలపని గాదని, మాతో తెలివిగల వారంతా అంగీకరిస్తారని మేము విశ్వసిస్తాము.

విద్యలో సంకుచిత ప్రమాణాన్ని పెట్టి అందరు తర్ఫీదు పొందాలని చెప్పేవారిని యెదుర్కొనేవారే మన దేశానికి స్నేహితులు. అందరు ఒకే విధమైన బడికి పోవాలని మనము. బలవంత పెట్టబడి నట్లయితే అది విచారకరమైన దినమనే చెప్పాలి. కొంత ప్రమాణము అవసరమే. కాని పిల్లలు యంత్రాలుగాదని మానవులని, మనం మరచిపోరాదు.

**ఆచరణ** (1) కతోలిక విద్యా విధానాన్ని గూర్చి తెలుసుకోడానికి కతోలిక మతాన్ని గూర్చి కొంతైనా తెలుసుకోవాలి. నీవు వుదాత్తమయిన స్వభావం గలవాడవైతేనే యితరులకు జ్ఞానోదయాన్ని కల్గించగలవు. లేకపోతే నీవు యితరులకు యేమీ చెప్పుకోదగినది చేయలేవు. స్వార్థత్యాగివై వుండు, కాని పట్టుదలగా వుండు. వినయం గలిగి వుండు, కాని విద్యావంతుడివిగా నుండు విశాల మనస్సు గల్గి వుండు, కాని న్యాయాన్ని, సత్యాన్ని పరిరక్షించు. ఈలాంటి వైఖరివలన నీ దృక్పదానికిగల హేతువులను మంచి మనస్సు గల కతోలికేతరులు గూడా విశ్వసిస్తారు. శ్రద్ధ గలవారికి మన బడి పద్ధతిని గూర్చి వివరించు.

2. విజ్ఞానం ఒక్కటే మానవులను గుణవంతులుగా యెందుకు చేయలేదు?

3) దేవుని నమ్మని వ్యక్తులమధ్య స్వాతంత్ర్యం యెందుకు సురక్షితంగా వుండదు?

4) గృహం అవసరమైన మత బోధను ప్రసాదిస్తుందని నీవు అనుకుంటావా?

5) ఒక రచయిత యిలా అన్నాడు. "విద్యాలయాలు లేకుండా మనం చాలా నాగరికులైన మనుష్యులను కలిగి వుండవచ్చునని యీ రోజుల్లో మనం మరచిపోవటం కద్దు. కాని యింకో ప్రక్క ఆలాంటి విద్యా సంస్థలు దేశంనిండా వున్నా, అచటి ప్రజలు అనాగరికులుగానే వుంటారు." దీని అర్థమేమిటి?

---

# నలుబదియారవ అధ్యాయము

క్రీస్తునాథుడు ఉద్దేశించినట్లుగా
దేవద్రవ్యానుమానాలు ఫలము నిచ్చుచున్నవి.

**బయటి ప్రపంచంద్వారా దేవుని దగ్గరకు వెళ్లటం**

నీవు మొట్టమొదట నీ పంచేంద్రియాల ద్వారా దేవునిగూర్చి తెలుసుకొన్నావు. నీ తల్లి ఆయననుగూర్చి చెప్పటం విన్నావు. తర్వాత నీవు పటాలుచూశావు. కథలు చదివావు. స్కూల్లో బోధలు వింటావు. వీటి అన్నిటివలన నీవు నీమనస్సులో ఆ సృష్టికర్తను గురించిన అభిప్రాయము ఒకటి యేర్పడుతుంది. దేవుడు అశరీరి అయినా, నీ ఆత్మగూడా ఆధ్యాత్మికమైనదే అయినా నీవు ఆ దేవునిగూర్చి దృగ్గోచరమైన సంస్థ ద్వారా, బాహ్యావస్తువుల ద్వారా, సగోచర పదార్థముల ద్వారా తెలుసుకున్నావు. తిరుసభ- దృగ్గోచరమైన సంస్థ- సభ్యులతో నీవు సంబంధం కలిగియుండవచ్చు. దేవునిగూర్చి తెలిసికోడానికి నీవు కథోలికు విద్యాలయములో చదివియుంటావు. నీకు దేవు మధ్య తిరుసభ యొక బంధనయని, తిరుసభ దేవుని గురించి నీకు చెబుతూ దేవుని దగ్గరకు పోవుటకు నీకు మార్గము చూపుచున్నదని కనుగొనియుంటావు.

దేవుడు వున్నాడనేదానికి ప్రకృతి నిదర్శనమిస్తున్నదని తిరుసభ చెబుతుంది. క్రమబద్ధంగా నడుస్తున్న ఋతువులు వాటిని ఆలా నడిపిస్తున్న దేవుని గూర్చి చెబుతున్నవి. ప్రపంచం అంతా క్రమం తప్పకుండా ఆలా నిరంతర గమనాన్ని సాగిస్తున్నదంటే ఒక్క దేవుని వలన గాదా? దీన్నిబట్టి తాను సృష్టించి యీ బయటి ప్రపంచం ద్వారా తనను తెలిసికోమని దేవుడు వుద్దేశించినట్లు మనకు ద్యోతకమవుతుంది. జ్ఞాన సంపాదనకు సహజమార్గ మేమిటో దేవునికి తెలుసు. పంచేంద్రియాల ద్వారా తెలిసికొనడమే ఆ మార్గము. తనను గురించి తెలుపుటకు దృగ్గోచర వస్తువులను సాధనములుగా జేసెను దేవుడు ప్రతి వ్యక్తిని వేరు వేరుగా విజ్ఞానవంతుల్ని జేయవచ్చు. అంతరంగికంగా అలా చేయవచ్చు. కాని సర్వ సాధారణముగా తన సృష్టి, తన్ను దృగ్గోచర ప్రపంచంద్వారా తెలిసికొన వలయునని ఆయన నియమము. "వాని

అగోచర లక్షణములను, వారి నిత్య శక్తియు, దేవత్వమును లోకసృష్టి మొదలుకొని సృష్టింపబడిన వస్తువుల నాలోచించుట వలన తేటబడు తున్నవి గనుక సాకు బోకుచెప్పుటకు వారలకు చోటులేదు." (రోమనులు, 1,20). అట్లు చేయువారలను అర్చ్బిశప్ట చిన్నప్పగారు ఖండించుచున్నారు.

## క్రీస్తునాధునిద్వారా దేవుని సమక్షమునకు

కాని దేవుడు బయట కనబడే వస్తువుద్వారా మాత్రమే, బయటి ప్రపంచము ద్వారా మాత్రమే, ప్రకృతి ద్వారా మాత్రమే మనతో మాట్లాడలేరు. ఆయన తన కుమారుని మానవ మాత్రునిగా మానవుల వద్దకు పంపాడు.- మానవులను దేవునిదగ్గరకు తీసుకరమ్మనమని. ఆ మానవ స్వభావమును యెత్తుకొనిన దైవకుమారుడే క్రీస్తునాధుడు. ఆయన దేవుడు గనుక మానవులు మోక్షానికి జేరాలి అంటె యేమి చేయవలసింది ఆయనకు తెలుసు. అందుకే దానికి తగిన ప్రణాళిక ఆయన ఒకటి వేసుకున్నాడు. అది నీ కోసమే వేసుకున్నాడు. దాన్ని నీవు అనుసరించాలని ఆయన అభిమతం. ప్రణాళికలో నీ సహాయం కోసం నిన్ను వున్నతికి తీసుక పోవడం కోసం కొన్ని బాహ్యమైన, గోచరమైన వాటిని సాధనాలుగా ఉపయోగించాడు.

తాను ప్రపంచానికి వెల్తురని జ్యోతి స్వరూపాన్నని క్రీస్తునాధుడు చెప్పాడు. ప్రకృతి ద్వారా దేవుని వద్దకు తీసుక రాబడని వారికి విజ్ఞాన జ్యోతిని చూపటానికి, బయట ప్రపంచం ద్వారా దేవుని దగ్గరకు పడప బడే వారిని స్థిరతరం చేయటానికి క్రీస్తునాధుడు వాంఛించారు. ఆ జ్యోతిని అనుసరించటం ద్వారా ఆయనతో నిత్య జీవితాన్ని పొందటానికి మనల్ని మనం సంసిద్ధం చేసుకో గలమని మనం విశ్వసిస్తున్నాం క్రీస్తునాధుడు దేవుని ప్రార్థించారు మనం కూడా ప్రార్థించాలి. ఆయన మంచి పనులు చేశాడు. మనమూ అలాగే చేయాలి. ఆయన స్వార్థ త్యాగ జీవితాన్ని జీవించాడు. మనమూ అలానే చేయాలి ఆజ్ఞలకు విధేయులై యుండాలని ఆయన అన్నారు. కనుక మనం విధేయించాలి. ఆధ్యాత్మికోన్నతికి అష్ట భాగ్యాలలోనున్న నియమాలు అనుసరించాలన్నారు. ఆ నియమాలను మనం అనుసరించాల

కాని క్రీస్తునాధుడు ప్రపంచాన్ని విడిన తర్వాత మనం దేవుని దగ్గరకు యేలా నడిపింప బడతాము అన్నదే ప్రశ్న.

దేవుని చిత్తమును గూర్చి ప్రపంచానికి చెప్పటానికి గాను తిరుసభ ఒక బహిరంగమైన సంస్థగా వుండాలని క్రీస్తునాధుడు కోరుకున్నట్లు మనకు తెలుసు. మనకు మరో విషయంగూడా తెలుసు. నీళ్ళు, ఆహారం, వెలుతురు వీటిని గురించి గూడా ఆయన మాట్లాడినారు. మనుష్యులను దేవుని వద్దకు తీసుక రావటానికి వీటికి గల శక్తులను గూర్చి గూడా ఆయన చెప్పారని మనకు తెలుసు అంటె యివి మానవుని దేవుని దగ్గరకు జేర్చగల వుపకరణ అని భావన. “ఒకడు నీళ్ళ వల్లను, స్పిరితుసాంక్తు వల్లను మరల జన్మించిన తప్ప సర్వేశ్వరుని రాజ్యములో ప్రవేశింప లేడు.” (జ్వా. 3,5); “నేనే జీవము నిచ్చెడు ఆహారము.” (జ్వా 6,48); “ఎవడైనను యీ అహారమును భుజించెను పక్షమున వాడు సదా జీవించును. నేనిచ్చెడు ఆహారము లోక జీవము కొరకు నా మాంసమై యున్నది.” (జ్వా6,52)

మానవులను దేవుని దగ్గరకు తీసుక రావటానికి గాను కన్పించే టటువంటి ఒక బహిర్మార్గము తమ తిరుసభలో వుండాలని ఆయన యధార్థంగ వుద్దేశించారు. వారిని దేవుని కొరకు సిద్ధం చేయటానికి వారికి దేవుని్న యిచ్చుటకు బహిరంగంగా ఒక విధానము, ఒక పద్ధతి వుండాలని ఆయన యధార్థంగా వాంఛించారు. దేవుని మనుష్యుల వద్దకు తీసుక రావడం ద్వారా దేవద్రవ్యానుమానములు మానవులను దేవుని దగ్గరకు తీసుకొని వస్తాయి. చిహ్నములందు మనకు గల అపేక్షను ఆధ్యాత్మిక కార్యముల కుపయోగించారు క్రీస్తునాధుడు. అదే క్రైస్తవ మత విశిష్టత.

## దేవద్రవ్య అనుమానాల ద్వారా దేవుని దగ్గరకు వెళ్ళటం

దేవుని సన్నిధికి జేరటానికి ముందు మానవుడు నూతన జన్మనొందాలి. ఆధ్యాత్మికంగా కడగబడాలి క్రీస్తునాధుడు జలమును దీనికి గురుతుగా జేసిరి. జ్ఞానస్నానమప్పుడు స్వాజాతీయతమైన జీవము యిచ్చును. తమ అనుచరులలో ఈ ఆధ్యాత్మిక జీవితాన్ని

పెంపొందింపజేయటానికి క్రీస్తునాథుని మాంసమే ఒక సాధనం. వివిధము లైన దేవద్రవ్యానుమానాలలో వుపయోగింపబడిన కొన్ని గుర్తుల ద్వారా మూడువిషయాలు సూచింపబడినవని నీకు తెలుసు. ప్రతి గుర్తు ద్వారా (1) క్రీస్తునాథుడు యేం చేసింది గుర్తుకు తెచ్చుకోవాలి. (2) ఒక వ్యక్తి దేవద్రవ్యానుమానమును పొందుతున్నపుడు ఆత్మలో యేం జరిగేది గ్రహించాలి. (3) ఆ దేవద్రవ్యానుమానం యొక్క భవిష్యద్ఫలితం యేమిటా అని తెలుసుకోవాలి. ఈ మూడు అంశా లను ప్రతి కతోలిక వ్యక్తి బాగా గమనించాలి. దివ్యసత్ప్రసాదం దేవుని నీ వద్దకు గొనితెస్తుంది. దైవవర ప్రసాదము అంటె పరిశుద్ధ ఆత్మ నీలో వుంటటం. పరిశుద్ధ ఆత్మ దైవ జీవితం. "జ్ఞానస్నానం యీ మానవాతీతమైన జీవితాన్ని నీలో ఆరంభింపజేస్తుంది. ఇది ఒక జన్మము. అలాగే దివ్యసత్ప్రసాదం నీలో వున్న సహజాతీతమైన దివ్యజీవితాన్ని బలవర్ధకం చేస్తుంది-ఇది ఆహారం. ఇక పశ్చాత్తాపమనే దేవద్రవ్య సాధనం ఆత్మ జీవితానికి సంబంధించిన రోగాలను నయంచేస్తుంది-యిది ఒక మహత్తరమైన మందు. భద్రమైన అభ్యంగము సహజాతీతమైన జీవితాన్ని ప్రమాదాలనుండి రక్షించు దేవద్రవ్యానుమానము-యిది ఒక కవచము. గురుపట్టము ఈ సహజాతీతమైన జీవమునకు అవసర మైన గురువులను యిచ్చును. జ్ఞానవివాహం యీ సహజాతీతమైన జీవ మును పొందు మానవులను ఒనగూర్చును. అవస్థభ్యంగము ఈ సహజా తీత జీవము అపాయములో నున్నపుడు సహాయపడును."

కనుక దేవద్రవ్యానుమానాలు దేవుని మహోత్తమ పథకం లోని భాగం. వాటిద్వారానే దేవుడు మానవుని దగ్గరకు వస్తాడు. బహిరంగమైన, కన్పించె టటువంటి సాధనాల ద్వారా మానవులు దేవుని వద్దకు గొనిపోబడతారు. క్రీస్తునాథుడు వుద్దేశించినట్లు దేవ ద్రవవ్యానుమానాలు పనిచేసినట్లయితే ప్రపంచం నీతో మాట్లాడి నట్లుగా అవి దేవుని గూర్చి నీతో చెప్పవలయును. ఎందుకనగా దేవ ద్రవ్య అనుమానాలు సాంకేతికాలు. సాంకేతికము అనగా ఒక వస్తువు మరియొక విషయమును గూర్చి తెలియజేయునది.

'మానవుడు యింద్రియాలతో గూడిన ఒక జీవి. అతను వాటి ద్వారా నేర్చుకుంటాడు. దేవుడు ప్రతి దేవద్రవ్యానుమానములో ఒక

కన్పడే గుర్తును పెట్టాడు. ఆ గుర్తు ఒక అనుగ్రహాన్ని పొందునట్లు చేస్తుంది. అంతేగాదు దాన్ని పొందినట్లు గూడా తెలుపుతుంది. ఆ గుర్తు తనలో ఆధ్యాత్మిక రీత్యా జరుపు మార్పును గూర్చి నిశ్చయంగా మానవునికి చెబుతుంది. తాను కొన్ని నియమములను నెరవేర్చినట్లయితే ఆ గుర్తు మానవునిలో సహజాతీతమైన జీవితమున్నదని తెలుపుతుంది.

దివ్యసత్ప్రసాదంలో దృశ్యరూపాన దేవుడు నీ వద్దకుగాని రాబడినాడు అంటే నీవు ఆశ్చర్యచకితుడవు గావూ? రేడియో అంటే ఆశ్చర్యకరమైనదని నీవు నమ్ముతావు. దానికి కారణం యేమిటీ అంటే యెక్కడో చాలా దూరాన వున్న మనుష్యులతో నీకు సంబంధాన్ని యేర్పాటు చేయటమే. మానవులతో నీకు సామీప్యతను చేకూరుస్తుంటే ఆశ్చర్యపడుతున్నావు గదూ! దేవద్రవ్యానుమానాలు నీకు దేవునితో సామీప్య సంబంధాలను కలుగజేస్తున్నవి. దివ్యపూజలో పాల్గొంటున్నావంటె కల్వరి గిరిపైన వుంటున్నావన్నమాట! దేవద్రవ్యానుమానాన్ని పుచ్చుకొనేటప్పుడు భూత, భవిష్యద్వర్తమానములు మూడు నీ కళ్ళముందు కన్పిస్తాయి. ప్రతి దేవద్రవ్యానుమానము ఒక ప్రత్యేక గుర్తు ఒక్కొక్కటి దానికి అనుగుణముగ అనుగ్రహాన్ని తెస్తుంది ఒక ప్రత్యేక సమయంలో, ఒక ప్రత్యేకవసరాన్ని ఒక్కొక్కటి నెరవేరుస్తుంది. నీ ఆత్మలో నీకు కనబడకుండా జరిగే మార్పు ఒక కన్పించేటటువంటి గుర్తు ద్వారా తెలుపబడుతుంది. ఎందువలన అంటే ఒక్కొక్క దేవద్రవ్యానుమానం దేన్ని చూపిస్తుందో ఆ అనుగ్రహాన్ని కలిగిఉంది; దాన్ని తీసుకవస్తుంది. నీళ్ళు పరిశుభ్రపరచటాన్ని తెలుపుతవి గనుక అవి నిజంగానే పరిశుభ్రపరుస్తాయి నిన్ను జనన మొందునట్లు చేస్తాయి. పవిత్ర దివ్యసత్ప్రసాదం ఒక ఆహారం గనుక అది నిజంగా దేవుని అభిముఖంగా పెరుగునట్లు చేస్తుంది.

ఈ దేవద్రవ్యానుమానాల పూర్తి ఫలితాలు యీ జీవితంలో నీకు తెలియవు. దివ్యసత్ప్రసాదంద్వారా వచ్చే పూర్తిఅయిన ఆధ్యాత్మిక అభివృద్ధిని నీకున్న యీ ఐహికమైన కళ్ళతో చూడలేవు. నీవు క్రీస్తునాథునియందు నమ్మిక యుంచు. ఈ దేవద్రవ్యానుమాన స్వీకారంద్వారా మోక్షంలో దేవుడున్నాడు అనేదాన్నిగూర్చి నీవు

ఎక్కువగా సంతోషిస్తావు. ఈ లోకంలో ఆ ఆహారంతో పరిపోషింపబడుతున్న కొలదీ, మోక్షంలోని ఆ ప్రభువువలె వుంటావు. ఈ దేవద్రవ్యానుమానమును గూర్చి క్రీస్తునాథుడు గట్టిగా నొక్కిచెప్పారంటె ఆశ్చర్యపడనవసరములేదు. ఎందుకంటె దానిద్వారా దైవము నీలో నివసిస్తారు

నీవు దివ్యపూజకు హాజరయిన ప్రతిసారి దివ్య సత్ప్రసాదాన్ని లోగొన్న ప్రతిసారి యీ విధంగా జపం చెప్పు. "ఓ దివ్య ప్రసాదమా! నీ ద్వారా క్రీస్తును లోగొనుచున్నాము. నీ ద్వారా మా ఆత్మలు దైవానుగ్రహముతో నింపబడుచున్నవి. ని ద్వారా వారిమరణము నూతన పరచబడుచున్నది. నిత్యానందమునకు నీవు నాంది వచనము." దైవ సమ్ముఖమైన మోక్ష భాగ్యమునకు ఆయత్తపరచుకొనుటకు యీ దేవద్రవ్యానుమానము ఒక అవకాశమని గుర్తించు.

**ఆచరణ** 1) ఎందుకు మంచి కతోలికు కుటుంబాలను కావాలంటున్నామో యిప్పుడు నీవు తెలుసుకొన్నావు. దేవద్రవ్యానుమానాల ద్వారా దేవుని అనుగ్రహాలను పంచిపెట్టుటకు తిరుసభ అవసరమైనట్లు యిప్పుడు నీవు గ్రహించి వుంటావు. కతోలిక విద్యాసంస్థల అవసరాన్ని నీవు గూడా తెలుసుకొనే వుంటావు నీవు నీ మతాన్ని గూర్చి తలంచితే దానిలో యెన్నో ఆశ్చర్యకరమైన విషయాలను కనుగొంటావు వాటిని గురించి మురిసిపోతావు నీ కతోలిక మతంయొక్క విలువను గ్రహించటానికి నీకు కొన్ని సంవత్సరాలు పడుతుంది ఈ రకంగా నీవు నీ మతాన్ని గూర్చి తెలుసుకొని దాన్ని ప్రశంసించటానికి సహాయ భూతాలుగా కతోలిక కుటుంబాలు, కతోలిక విద్యాసంస్థలు, మతంలో తరగతులు, అనేకం వున్నాయి. ఇవన్ని గూడా క్రీస్తునాథుని ధరింపజేయుట మనే ఆదర్శాన్నే కల్గివున్నాయి.

2) పాపసంకీర్తనము విషయములో, దివ్యసత్ప్రసాదము విషయములో వుద్దేశించిన ఫలితాలను యివ్వకుండ యేది అడ్డగించుచున్నది.

3) దివ్యసత్ప్రసాదము లోగొనుటకు నీకుగల కారణములేమిటి?

**4)** దృశ్య సృష్టిలో దైవహస్తమున్నదని చూచే అలవాటును బాలబాలికలు యెట్లు అలవరచుకొనగలరు. 'దృశ్యవస్తువుల ద్వారా మేము దేవుని తెలుసుకొనుచున్నాము. ఈ దృశ్యవస్తువుల ప్రేమ మూలమున అదృశ్య వస్తువుల ప్రేమకు ప్రేరేపింప బడుదుముగాక, దీని అర్థమేమిటి.?

**5)** నీ ఆత్మలో యెప్పుడు దేవద్రవ్యానుమానములు తమ పూర్ణఫలమును యిచ్చును.

———:O:———

# నలుపది ఏడవ అధ్యాయము

పనివారు బహు స్వల్పము.

"ఆత్మలకు ముక్తినిచ్చుటలో దేవునికి సహాయ పడుటయే పనులలోకెల్ల గొప్పపని." అదే నీ మహా ఘనమైన పని. లోకంలో అంతకన్నా వాంఛింప వలసింది నీకు లేదు.

నీవు దైవజీవితం పొందటానికి క్రీస్తునాథుడు చనిపోయారు. ఆదాము చేసిన పాపమువలన మానవజాతి దైవ సమ్ముఖము చేరుటకు వీలు లేకపోయినది. కాని క్రీస్తునాథుడు శిలువ మరణాన్ని పొందటంతో మానవులకు తిరిగి మోక్షంలో ప్రవేశించే హక్కు యేర్పడింది. ఇది ఆయన ఉచితంగా—యే ఒకరిద్దరికో కాక మానవజాతి అంతటికి—సమర్పించిన వరం. దేవుడు యెట్టి సంతోషాలను మానవులకు యివ్వ దలచుకున్నాడో క్రీస్తుకు తెలుసు. అందుకనే దాని సంపాదన యోగ్యమైనదని చూపుట కెన్నియో శ్రమలు పడెను. అందరు ఆయనను గురించి తెలిసికొన వలయునని ఆయన వాంఛ. మోక్షానందానికి స్థిరపరచు కోడానికి తన పద్ధతులను అవలంభించాలని ఆయన కోరిక. క్రీస్తునాథుడు మానవుల నిమిత్తమై చేసిన మహా కార్యముల విలువను గురించి వారికి నచ్చచెప్పుట, స్త్రీ పురుషులను, బాలబాలికలను ఆ విలువ వైపు ఆకర్షించుట కష్టమైనపని. నీకు బహిరంగంగా దర్శనమిచ్చి నిన్ను ఆయన మోక్షంలో ప్రవేశింపమని ఒత్తిడిచేయ నెంచ లేదు. తన జీవిత కాలంలో కేవలం అంతరంగమున మాత్రమే ప్రేరణ చేయలేదు. మానవుల కొరకు తాను యేం చేశాడో బహిరంగంగా చూపాలని వారికి సహాయం యివ్వటానికి వారంతటవారు ఒక నిశ్చయానికి రావటానికి ఆయన వుద్దేశించినాడు. ఈ కారణంచేత ప్రజల యెడల తనకుగల అవ్యాజానురాగాన్ని గూర్చి వారికి నమ్మకం కల్గించటానికి దేవుని మోక్షానంద భాగ్యములో భాగము పంచుకొనుటకు వారు పిలువ బడ్డారన్న విశేషానుగ్రహాన్ని గురించి వారికి జ్ఞానోదయం కల్గించటానికి ఉదార, త్యాగశీలులను—ముఖ్యంగా యువ్వనులను—తనతో సహకరించమని కోరుచున్నాడు. తన అనుచరులలో కొందరు ప్రత్యేక ప్రవీణులు కావాలని, వారు యితరులకు "క్రీస్తునాథుని అనుసరించు మార్గాన్ని" ప్రబోధించాలని ఆయన కోరాడు.

**దైవపిలుపు** ఆత్మల రక్షణ కార్యక్రమంలో ప్రత్యేక విధంగా క్రీస్తునాథునికి సహాయ పడాలని ఆహ్వానింప బడుటయే దైవపిలుపు అనెదరు. అంటే క్రీస్తునాథుడు తన కొరకు పని చేయుటకు, తన సందేశాన్ని అందరకు తీసికొని పోవుటకు కొందరి స్త్రీ పురుషులనే యెన్నుకుంటారు. "మీరు నన్ను యెన్నుకొనలేదు, నేను మిమ్ము యెన్నుకొంటిని" అని ఆయన స్పష్టంగా చెప్పారు. కొందరిని గురువులుగా, కొందరిని కన్యాస్త్రీలనుగా, కొందరిని మఠసోదరులనుగా యేరుకొంటారు. కొందరు ప్రార్థనకొరకే యెన్నుకొన బడతారు. మరికొందరు ప్రార్థన, పని రెండు చేయుటకు పిలువబడతారు. కొందరిని విద్యగరపుటకు కొందరిని చికిత్స చేయుటకు, కొందరిని సాంఘిక సేవ చేయుటకు, మరికొందరిని విదేశాల్లో వేదవ్యాపకము చేయుటకు ఆయన యెన్నుకొని వారిచేత దైవ కార్యక్రమాన్ని కొనసాగిస్తుంటారు. వైవాహిక జీవితానికి పిలువబడినవారు కూడా దైవకార్యములను నెరవేర్చుచున్నారు.

గురువులుగా, మఠకన్యలుగా, మఠసోదరులుగా పిలువబడినట్లు వారికి తోచిన దానిని గురించి వారు జాగ్రత్తగా పరిశీలించవలెను. ఆ విషయంలో మరికొంత వెల్తురును యివ్వమని దైవాన్ని ప్రార్థించాలి.

ఆ పిలుపు అనేది యెప్పుడు యెవరికి వస్తుందో తెలియదు. అది నీ అంతరాత్మలో పుట్టవచ్చు. అది నీకు యే వ్యక్తి ద్వారా నైన రావచ్చు లేక యే సంఘటన ద్వారా నైనా యే గ్రంథం ద్వారా నయినా నీ కాపిలుపు రావచ్చు. క్రీస్తునాథుడు తన పిలుపును వీటిలో దేనిద్వారా నయినా నీకు అందజేయవచ్చు. కాని నీవు ఆయనకోసం ప్రపంచ సుఖాలను విడవటానికి సందేహించవద్దని నిన్ను కోరతాడు. ఆయన అర్చ్ఛిష్ట రాయప్పగారిని, అంద్రియాసుగారిని యింకా తదితరులను యేలాపిలచారో గమనించు. (మార్కు 1, 16-20; లూకాస్ 5, 27-28; మార్కు 10, 17-25). తను పిలిచేవారు యే విధంగా ఆత్మ త్యాగంచేసి ఆయన్ను వెంబడించాలని. ఆయన కోరుతున్నారో మనము చూడవచ్చు కూడ.

క్రీస్తునాథునితో పనిచేయటానికి మానవునికి ఆహ్వానం వస్తున్నదీ అంటే యెంత గొప్పవిషయమో ఒక్కసారి యోచనచెయ్యి.

**దైవపిలుపు ఎలా గుర్తింప బడుతుంది**

దైవపిలుపు కలిగే విధం వ్యక్తుల్నిబట్టి మారుతూ వుంటుంది.

దైవపిలుపుకు గుర్తులు యివి:

1) పూజ పీఠంవలన ఆకర్షింప బడటం, దాని జాగ్రత్తను వాంఛించటం, దానిచుట్టూ వుండటం.

2) క్రీస్తునాధునికి సహాయం చెయ్యాలని కోరుకోవటం, ఆయన సిద్ధాంతాలను యెక్కువగా ప్రబోధం చేయవలసిన అవసరాన్ని గమనించటం.

3) ఈ ఐహిక వస్తువులనుండి దూరంగా వుండటం, కాన్వెంటే, పూజపీఠ ప్రదేశమే నీ స్థలమని అనుకోవటం.

4) ఆత్మల రక్షణ కార్యమందు, పాపమునుండి ప్రజల కాపాడుటయందు ప్రేమ ఆతురతలు గలిగి వుండటం.

5) నీ మనస్తత్వాన్ని, నీ యోగ్యతను అర్థం చేసుకున్న వారు నీకు సలహాయిస్తే, ఆ సలహా ఆలాగేవుండిపోతే, ఒక సంఘటన యేదో నీలో బాగానాటుకపోయి వైభావాన్ని పుట్టిస్తే అది దైవపిలుపుకు గుర్తు. కాని క్రీస్తునాధునికి తోడ్పడాలన్న ప్రతి మంచి ఆలోచన దైవపిలుపు కాదు. నీవు ప్రశాంతంగా, యే వుద్రేకంలేకుండా వున్నపుడు ఆ ఆలోచన నీలో నిలిచి పోవాలి.

6) సదుద్దేశం, స్వార్థంలేని తలంపు వుండవలె.

7) ఆరంభంలో కేవలం ఒక సూచనగాగాని లేక వుండీ వుండని జిజ్ఞాసగాగాని వుండవచ్చు. కాని ఆ కల్గినదాన్ని జాగ్రత్తగా, సక్రమంగా వినియోగించుకొన గల్గితే, దాన్ని ప్రార్థనతోను, నిదానమైన ఆలోచనతోను సమ్మిళితం చేయగల్గితే అది క్రమంగా ఒక ఆకర్షణీయమైన రూపం దాలుస్తుంది. అదే, దేవుడు నిన్ను పిలుస్తున్నాడన్న దానికి సాక్ష్యం. అప్పుడు ఆయన క్రమంగా నీకు ఒక వెలుగును చూపిస్తాడు. చేయిపట్టుకొని తరచు నిన్ను లాగడు కాని మొదటిసూచన కన్పడిన తర్వాత, నీవు గనక సద్భావాన్ని, స్వార్థత్యాగాన్ని ప్రదర్శించుతూ వచ్చినట్లయితే నీకు యింకా అదనంగా వెలుగును ప్రసాదిస్తాడు. ఒక వేళ నీకు కష్టాలురావచ్చు. కాని అవి లెక్కచేయ తగినవికావు. అవినీ

పట్టుదలను, నీ స్వార్థత్యాగ తత్వాన్ని క్రీస్తునాథుని కోసం సమస్తం విసర్జించే నీ చిత్తాన్ని పరీక్షచేసే సాధనాలు. నీకు ఆపనికి కావల్సిన తెలివితేటలున్నవో లేవో నిర్ణయించవలసిన వాడివి నీవు కావు నీకన్నా అనుభవము కలవాని దగ్గరకుపోయి అతని సలహాసడిగి దాన్ని తీసుకో. అసలు నిర్ణయించుకోవలసినది క్రీస్తునాథునికి యే ఒక పనిలోనైనా సహాయపడదామని నీకు అసలు యిచ్ఛ వున్నదా అని. మధ్య మధ్య కష్టాలు వస్తుంటాయి. వాటిని లెక్క పెట్టకు. నీకు తగిన సమర్థత వున్నదీ లేంది యితరులు పెద్దలు గమనించి చెప్పెదరు. నీ దృష్టి సంతటిని, నీ హృదయాన్ని, నీ మనస్సును ఆ మహత్తర లక్ష్యము మీదనే నిల్పు. ఆ లక్ష్యం యేమిటి అంటే ఒక ప్రత్యేకమైన ఒక పరమ పవిత్రమైన విధంగా క్రీస్తునాథుని కొరకు పనిచెయ్యటమే.

### గురువులుగా, సన్యాసులుగా యెవరు వెళ్లాలి?

ఎవరికైనా మంచి వుద్దేశ్యముండి మేత్రాణులచే పిలువబడినట్లయితే వారలు గురువులు కావచ్చును ఆలాంటి స్థితికి చేరనివారు తమ పరిస్థితులనుగూర్చి వివేకుడైన ఆత్మగురువుని చెప్పుకోవచ్చు. తగిన తెలివితేటలు గలవారు, మంచి మనస్సు గలవారు, తమ ఆత్మగురువువద్ద తగిన సలహా పొందినవారు యే భయము లేకుండ నిర్ణీతమార్గాన నడువవచ్చు. మఠజీవితము కష్టమైనదని యే బాలిక కూడా భయపడకూడదు. క్రీస్తునాథుని నమ్మినవారికి క్రీస్తునాథుడు త్యాగములను సులభతరం చేస్తాడు.

ఇతరులకు మంచిచేయ వాంఛించేవారు, ఇతరులకు సహాయం చేయటాన్ని ప్రేమించేవారు కొన్నిసార్లు తాము గురువులము కావచ్చునని, కాన్వెంటులో చేరవచ్చునని సలహాలను పొందుతుంటారు. ఆ రకమైన సలహా వచ్చినపుడు, అటువంటి పిలుపు వచ్చినపుడు దాన్ని అనుసరించటానికి భయపడరాదు అపోస్తులులకు తాము పిలువబడతామని ముందుగా తెలియదు. క్రీస్తునాథుడు కొంతమంది విషయములో వారి ప్రక్కగా నడుచుచు "నన్ను అనుసరించండి" అని అన్నారు. వెంటనే వారు ఆలాగే చేశారు. ఏమీ సందేహించలేదు. పైగా

ఆయనయందు నమ్మకముంచారు. వారు ఆయనను యెలా విశ్వసించారో నీవు గూడా ఆయనను అలాగే విశ్వసించమని క్రీస్తునాథుడు నిన్ను కోరుతున్నారు. నిన్ను పిలచి, నీవు చేయవలసినది సరిగా చేసినట్లయితే, నిన్ను పరిత్యజించడు. నీవు అసంపూర్ణుడవుగా, లోపభూయిష్టముగా నుండవచ్చు. కాని నీవు క్రీస్తునియందు నిండువిశ్వాసముంచి శ్రద్ధతో ప్రయత్నించిన నిన్ను తప్పక క్రీస్తు మార్చివేయును. ఇది మతజీవితము జీవించువారి విషయములోను, గురువుల విషయములోను నిజమే.

కొందరు గురుత్వ బాధ్యతలు నిర్వహింప యిష్టపడరు కాని వారు క్రీస్తునాథునికొరకై పనిచేయవలయునని ఆశిస్తారు. అట్టి వారలు మతసోదరులు కావచ్చును

**దైవపిలుపు బీజాన్ని పోషించుట** పిల్లలు హైస్కూలులో చేరిన మొదటి సంవత్సరాలలో తాము గురువులు కావాలని ఆశిస్తారు. కాని ఆ ఆశను పోషించుటకు జాగ్రత్తపడరు. ఆ తలంపు చివరకు మాయమైపోవును. మొదట గురువు కావలయునని, కన్యాస్త్రీలు కావలయునని తలంపు పుట్టినప్పటికి తరువాత వారు ఆ పై రెండు తమకు తగిన అంతస్తులు కావని నిర్ణయించుకొనవచ్చును. అది సహజము కొందరు ప్రపంచంలో తాము ధనం సంపాదించాలనే ఊహతో, సాంఘికంగా విజయంపొంది పైకి రావాలనే ఆకాంక్షతో క్రీస్తునాథునికి సేవచేయాలనే వూహను తోసేస్తారు. వేదంలో చెప్పబడిన భాగ్యవంతునివలెనే (మార్కు 10, 21-23) స్వార్థత్యాగం చేయటానికి వారు వెనుకంజవేస్తారు తమకు ప్రియంగా వున్నదానిని విడిచిపెట్టడానికి జంకుతారు. అలాంటి సమయంలో క్రీస్తునాథుడు మరొకరిని అహ్వానిస్తాడు తనకు సహాయపడటానికి.

దైవపిలుపు అనేది ఒక సలహా. అది ఒక ఆహ్వానం అది ఒక చిన్న లేత మొక్కవంటిది. కనుక అది చాలా జాగ్రత్తగా పెంపొందింపబడాలి దాన్ని ఐహికసంబంధమైన లంపటాలనుంచి రక్షించుకోవాలి దాన్ని ఆధ్యాత్మిక అనుగ్రహాలలో పరిపాలితం చేయాలి. ప్రార్థనతో దానికి నవ్యత్వాన్ని కలుగజేయాలి. త్యాగాలచేత వృద్ధి

పొందించాలి. ఆలోచనచేత, పఠనంచేత దాన్ని బలిష్టం చేయాలి. అంతేగాక ఆ దైవపిలుపును పటిష్టంచేసుకొనే విషయంలో యితరుల సలహాలను పొందాలి. ఆ క్రీస్తునాథుని దివ్యచిత్తాన్ని నెరవేర్చునట్లు తరచుగా .నీవు క్రీస్తునాథుని ప్రార్థించు. నిన్ను ఆ దైవపిలుపునుండి తప్పించే టటువంటి వ్యక్తులను, పుస్తకాలను, స్థలాలను విడిచిపెట్టు. నీవు ఆయన సేవలోచేరి పనిచేయటానికి చాలా తీవ్రంగా ఆలోచన చేస్తున్నావని ఆయనకు వ్యక్తపరచు.

క్రీస్తు నీకు నిస్సందేహంగా యెప్పుడు తనపిలుపును పంపను అంటే ఆ పిలుపు తప్పక వున్నదని క్రీస్తు తెలియజేయను. ఆ పిలుపును దృఢతరం చేసికోవడం నీలోవున్నది. పుణ్యాము సంపాదించు కోడానికి, నీ స్వేచ్ఛను వుపయోగించు కోడానికి అవకాశాన్ని కలిగిస్తాను. ఆయనక్రింద పనిచేయ బోయేముందు ప్రపంచ సుఖాలను, ఆనందాలను రుచి చూడాలని నీవు ఆనుకోరాదు. క్రీస్తునాథుడే మొట్టమొదటి వాడని, మిగతావి అన్ని తరువాతవే నని బాగా గ్రహించాలి.

**ఆచరణ** 1) ఒకే విధంగా యే యిర్వురు పిలువ బడరు. అర్చ. అగుస్తీను పాప పంకమునుండి రక్షింప బడ్డాడు. ఇక అర్చ. జాన్ బర్క్మన్సు యెప్పుడూగూడ తన ఆత్మను కళంక రహితంగానే వుంచుకొన్నాడు. సెటన్ అమ్మగారు కతోలికేతరురాలు. ఒక కతోలికేతరునిభార్య భర్త మరణానంతరం సత్యవేదంలో చేరినది. తర్వాత ఒక మత సంస్థను స్థాపించింది. దేవుడు తన పనికొరకు వివిధ రకాలకు చెందిన వ్యక్తులను యేరుకుంటారు.

2) మనకు దైవపిలుపును ప్రసాదించమని దేవున్ని అడిగినట్లయితే మనకు ఆపిలుపు రావచ్చు. నీ వెప్పుడైనా దైవపిలుపుకై, గురువు కావలయునని, కన్యస్త్రీ కావలయుననికాని ప్రార్థించావా? కొన్నిసారులు దైవాను గ్రహమనునది మనం నిష్ప్రయోజనం అనుకున్న వారినే స్వాధీనం చేసికుంటుంది.

3) నీనుండి నీ తల్లిదండ్రులకు ఆర్థిక సహాయం అవసరమైనట్లయితే నీ తల్లితదండ్రులను త్యజించమని దైవము కోరడు. కాని కొం

దరు తల్లిదండ్రులు, భౌతికదృష్టి అధికంగా గలవారు తమ బిడ్డలకు గొప్ప ఉద్యోగాలు రావలయునని, సాంఘికంగా చాల గొప్పవారు కావాలని కోరుతారు; అట్టిసమయములో యవ్వనులు తమ తల్లిదండ్రులను తిరస్కరించి దైవపిలుపును వెంబడించవలె. లోకము నిన్నె వ్వరూ స్వాధీనం చేసుకోవాలని చూస్తుంటుంది. సిలువమార్గం అనేక మందికి కఠినంగా, కష్టాలతో కూడినదిగా కన్పడుతుంది. కాని దానిలోనున్న మధురమును ఆమార్గాన నడువనివారు యెప్పుడూ రుచి చూడరు.

4) భౌతికదృష్టి గలవారిలో యెందరు స్వార్థ త్యాగం గల వారు?

5) చాలామంది యువజనులు క్రీస్తునాధునివైపు సుముఖంగా వుంటారు ఆయనకు సేవచేయటానికి అభిలాష కలిగే వుంటారు. కాని అందుకు తగిన కృతనిశ్చయం వారిదగ్గర వుండదు. నిశ్చయం, సత్శీలం గల స్త్రీ పురుషు లగుటకు వారికి యేది తోడ్పడుతుంది.?

6) "ప్రతియుగంలో, దేశదేశాలలో ధ్యానమూర్తులై యేకాంత జీవితమును నిరాడంబరులై, దయాళువులై జీవించేవారిని; తపస్వి వస్త్రధారులైనప్పటికిని ధైర్యముతోను, మందహాసంతో కూడుకొన్న హృదయులైనవారిని; రోగులకు జరాభారంతో క్రుంగిపోయిన వారికి, అనాథులకు అహర్నిశలు ప్రేమసంతోషపూరిత హృదయాలతో సేవచేసేవారిని; బాల్యములో మితదృష్టిని కలిగించి, గౌరవ మర్యాదలను, నిర్మలత్వమును నేర్పువారిని; తమ నిరంతర ప్రార్థనలను దేవునికి సమర్పించుచు తన అనుచరులు యెటువంటి వారుగా యుండవలయుననో అనుదానికి మాతృకలై జీవించువారిని; మానవులు తమ్మునుగురించి యేమి తలంచెదరో అని తలంచకుండ చివరకు దేవునికికూడ తమ మంచిపనులను చెప్పుకొనకుండా దైవ పనిలో నిమగ్నులైన అసంఖ్యాక కన్యాస్త్రీలను, విమలులను తలంచి నప్పుడు నేను తన్మయత్నము జెందుదును" అని స్పాల్డింగ్ పలికినవారు నుడివిన వాక్యములనుగూర్చి ధ్యానించు,

---

# నలుపది ఎనిమిదవ అధ్యాయము

ప్రపంచంలో వేదవ్యాపకత్వం.

**ఆవశ్యకత** మానవులందరు దేవునికొరకు కలుగచేయబడినవారు గనుక, వారు ఆయనయెడల సరియైన దృక్పథంతో వుండటం అవసరము. దేవునియెడల అనుసరించగల సరియైన మార్గాన్ని క్రీస్తునాథుడు లోకానికి తెచ్చినాడు గనుక ఆ మార్గాన నడవటం అందరి ధర్మం. అందరికవసరం.

ప్రపంచంలో మూడింట రెండు వంతులు యింకా క్రీస్తును గురించి తెలిసికొనక యున్నారు. వీరందరికి క్రీస్తును తెలియజేయడం అవసరం. వారందరికి క్రీస్తును గురించి తెలియజేయ వలయుననిన, వుత్సాహవరులైన ప్రేరితులు (మిషనరీలు) అవసరం. అందువలననే విదేశీయ యువకులు, యువతులు సర్వమును త్యజించి కష్టములకు వెనుదీయక పర దేశములలో క్రైస్తవనామము ప్రచారము చేయుటకు తమ జీవితముల నంకితము చేయుచున్నారు.

**త్యాగము** మిషనరీ అగుట అంటే అది అంత సులభముగాదు. తమకు సహజమైన సుఖాన్ని గోల్పోవాలి. తల్లిదండ్రులను, స్నేహితులను, దేశాన్ని, బహుశా సిరిసంపదలను వదలిరావడము సులభముగాదు. వారు తన స్వంతాన్ని మరచిపోయి క్రీస్తు స్నేహితాన్ని, క్రీస్తునాథునికి ప్రియమైన ఆత్మలస్నేహితాన్ని మాత్రం ఆశించాల.

అట్టి త్యాగం నిన్ను నిరుత్సాహునిగా చేస్తుందా? అధైర్య పరుస్తున్నదా? నిన్ను అధైర్యునిచేయ నవసరము లేదు. బాల బాలికల్లో, యువతీ యువకులలో ఒక మహాశక్తి వుంది. అది ప్రేరేపింపబడి నప్పుడు లోకసుఖ సౌఖ్యాలకు తమ వెన్నుత్రిప్పి వాటికి విముఖులై కఠిన మార్గాలలో నడవడానికి సాహసిస్తారు నీకు గూడా అలాంటి శక్తి సామర్థ్యా లున్నాయి. నీవు కూడా సుఖ సౌఖ్యాలను త్యజించ గలవు. నీవు, క్రీస్తు స్నేహిత మంటే యేమిటో తెలిసికొన్నట్లయితే వీటి నన్నింటిని కాల దన్నెదవు

వాస్తవమే జీవితం ఆకర్షణీయంగా కనబడుతుంది. దేవుని రాజ్యాన్ని వ్యాపింప చేయటానికి పూను కొనేవారికి యితరులనుండి యెక్కువ ప్రోత్సాహం కనబడదు. కాని యే పనినైనా చేయటానికి నిశ్చయించు కున్నట్లయితే- యధార్థమైన కతోలికులు కష్టాన్నైనా లెక్క పెట్టరు.- గబగబా ముందుకు వెళ్లిపోతుంటారు- కార్య భావం వహిస్తూ.

**ఉద్దేశం** అన్య మతస్థుల కొరకు యెందుకు గృహాన్ని విడిచి వెడతావు? నానావిధ కష్టాలను యెందుకు పడతావు? ఐహికంగా బాగున్న భవిషత్తును యెందుకు వదలి వెడతావు. కేవలం క్రీస్తు నాథుని కార్యక్రమంలో వేదవ్యాపక కార్యక్రమం ఒక భాగం కావటం వలననే. నీ మాదిరిగా ఆ అన్యులకుగూడా ఆధ్యాత్మికమైన, నాశనంగాని ఆత్మలు వుండటం వలననే. వారిని దేవుడు ప్రేమిస్తున్నాడు గనుకనే. ఇంకా అంధకారంలో వున్నవారి దగ్గరకు సువిశేషాన్ని తీసుక వెళ్లుతారని కొందరి మీద క్రీస్తునాథుడు ఆధారపడు తున్నాడు గనుక.

నీవు అన్యుని దగ్గరకు వెళ్తున్నావంటే దానికి నీ దేశనాగరికత యివ్వాలని గాదు, దాని ఆచార వ్యవహారాలను తొలగించాలని గాదు. దేవుని సంబంధమైన, క్రీస్తునాథుని సంబంధమైన, విజ్ఞానాన్ని, ఆయ నొసంగిన రక్షణ ఫలితాలను అంద జేయడానికే నీవు వారిదగ్గరకు వెళ్తున్నావు. క్రీస్తునాథునిపై నీకు గల ప్రేమ, ఆయనను గూర్చి తెలియని వారిపై నీకు గల వాత్సల్యత యీ రెంటి వలననే. నీవు యీ ప్రపంచ సుఖాలను దూరంగా నెట్టివేస్తున్నావు. నిర్లక్ష్యం చేయబడిన ఆయన బిడ్డలలో క్రీస్తునాథుని తత్వాన్ని ప్రవేశ పెడుతున్నావు. క్రీస్తునాథుడు మానవజాతికి తన సందేశాన్ని తీసుక రావటానికి మోక్షానందాన్ని విడిచిపెట్టాడు. నీకు, అంధకారంలో వున్నవారికి ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రసాదించటానికి, సుఖవంతమైన నీ జీవితాన్ని విడచిపెట్టటానికి యిష్టము లేదా? క్రీస్తు జీవవాక్యములను వ్యాప్తి చేయటానికి, గృహ సంబంధమైన సుఖాలన్నిటిని ఒకానొక వేదవ్యాపకుడు వదలుకొని యుండని పక్షంలో నీ పూర్వీకులు మతాన్ని పుచ్చుకొనేవారే గాదు. కనుక నీవుగూడా వారి అడుగుజాడల ననుసరింప ప్రయత్నించు.

**అవాంతరాలు** నీవు నీ ఆరోగ్యం బాగా లేదని చెబుతావు. డాక్టరు చెబితే సరేగాని ఐహికవాంఛ, ఐహిక సుఖాలు ఆలా నీచేత చెప్పివున్నవేమో తెలుసుకో?

"అది చాలా కష్టం" అంటావు. అది నీకు యెలా తెలుసు? వూహించే దాని కంటె అధికమైన కష్టాలకు తట్టుకో గలవు. ఇహ లోకం గో సాంఘికంగా, వ్యాపారరీత్యా పైకి రావటాకి చాలా కష్టపడతావే. ఈ లోకంలో సుఖపడాలనే వాంఛతో యెన్ని కష్టాలు పడుతున్నావు. క్రీస్తునాథుని ప్రేమ నీలో గాఢంగా వుంటే ఆయన కోసం నీవు ఆలా గుచేస్తావు. సంతోష కరమైనధోరణి ఒక లక్ష్యం - ఇదే యే ప్రయత్నాన్నైనా సాధించగలదు. స్వదేశములోనే వేద వ్యాపక పని నిమిత్తం నీవు అవసరమై యుండవచ్చు. మన దేశము లోని ఆధ్యాత్మిక అవసరాలను మనము చూచుకొనవలయును. అపో స్తులులు కూడా యింటివద్ద అవసరమై యుండిరి వారి దేశములోనే యెంతోపని యుండెను. కాని వారు పరదేశములకు కూడా పోయిరి. నీ వలన కలిగేప్రతి ఖాళీలో వైవము మరొకరి నెవరినైనా కను గొంటారు

అనేకమంది బాలికల్లో సాధారణంగా చాలమందికి వేదవ్యాప కత్వ కృషి చేయాలని వుండదు. కాని ఆ పనికి తోడ్పడటం. దాన్ని ప్రోత్సహించటం వారి విధి. ఇంటివద్ద యున్నప్పటికి, పరదేశ వేద వ్యాపకములో అనేక విధముల సహాయము చేయవచ్చు. లేదా మన దేశంలో జరిగే వేదవ్యాపకానికి తోడ్పడవచ్చు. నీవు వేదవ్యాప కానికి బయటికి వెళ్లకపోతే యింటివద్ద యుండి పోయిన వారికి సహా యము చేయుట నీ విధి

**ఆచరణ** 4) వేదవ్యాపక స్థలాలలో అనేక చోట్ల వైద్య సహా యము అవసరము. నర్సులు, డాక్టర్లు విదేశాలకు పోవు టకు యీ విధముగ అవకాశమున్నది. "సోదరులు" గురువునకు కుడి చేయి వంటివారు. అనేకమంది మతసోదరులగుట అవసరము.

2) ప్రతివిద్యార్థి తన మతవ్యాప్తి జరగటంకోసం అప్పుడప్పుడు తన వరదాలను, తింపిఖర్చులను మానుకోనవసరము లేదూ? నీ స్కూలు యేమిచేయగలదో విచారించు.

3) కతోలిక విద్యార్థుల "మిషన్ క్రూసేడు"ను గూర్చి చదువు. అలాంటిదాన్ని నీ స్కూలులో నెలకొల్పలేవేమో చూడు.

4) ఆంధ్రదేశపు మ్యాపు చూడు. ఎంత జనాభో తెలిసికో. కతోలికులెందరో, ప్రొటెస్టెంటులెందరో కనుగొను. గురువులెందరు, కన్యాస్త్రీలెందరు?

# నలుపది తొమ్మిదవ అధ్యాయము

## దైవసేవ-దేశసేవ

### నీవు ఎందుకు కతోలికుడ వయ్యావు?

ప్రపంచంలోని ప్రతిదీ దేవుని ఘనపరచుటకు, గౌరవించుటకు సృష్టించబడినది. నీవు కతోలికుడవై యుండట వలన దైవము నీకు ప్రత్యేకమైన అనుగ్రహము లిచ్చియున్నాడు. నీ ఆత్మ, నీ విశ్వాసం దేవుని బహూకరణలు. క్రీస్తునాథుడు ఒక బహూకృతి. తిరుసభ ఒక బహుకృతి. ఈ బహుమానాలన్నీ యెందుకివ్వబడుతున్నవన్న అంశాన్ని నిత్యమే నీకు స్పష్టం చేయగలవు.

నీవు కతోలికుడివిగా పిలువబడింది నీ స్వంత ముక్తికోసం మాత్రమే గాదు. ప్రపంచ సృష్టికర్త మంచితనాన్ని నీవు ప్రకాశింపజేయవలె. నీవు నీకుమాత్రమేగాక యితరులకు గూడ కతోలిక వ్యక్తివే. ఈ సంగతి బాగా గమనించాలి. నీ హృదయము దేవుని అనుగ్రహాలను పొందుటకు పాత్రత కలిగియుంటే, నీవు క్రీస్తు సిద్ధాంతాల ప్రకారం నడచుకుంటె, నీ ప్రయత్నాలద్వారా యెందరు దేవుని దగ్గరకు నడిపింపబడేది మోక్షంలో వున్న దేవుని కొక్కనికే తెలుసు. నీవు క్రీస్తు మతం విలువను నమ్మకంలేని యీ ప్రపంచానికి చూపించాలి. నీ లాభం కొరకు ఇతరులమేలుకొరకు నీ విశ్వాసము నీకొసంగబడింది. "మనుష్యులు మీ సత్క్రియలు చూచి పరలోకమందున్న మీ తండ్రిని మహిమపరచునట్లు వారియెదుట మీ వెలుగు నీయుడి." (మత్తేయుకు 5,16)

ప్రతి బాల బాలిక తనకున్న కుటుంబపుపేరును జూచి గర్విస్తాడు. దైవ నామాన్ని ధరించటం నీ అదృష్టమే. అంతకన్నా దాన్ని మారుమూలలకు గొనిపోవడం, దాన్ని మహిమపరచటం, దాని గౌరవాన్ని కాపాడటం-యివన్నిగూడ అదృష్టముతో గూడిన పనులే. పిశాచి పక్షమున అనేకమంది యుద్ధం చేయుచున్నారు. అలాంటప్పుడు నీ వలా కూర్చుంటావేమి? కదులు. మానవులు వస్తువుల ఉపరిభాగాన్నే చూడకుండ లోతుగా చూచుటకు నీవు వారికి సహాయపడ

వలె. వారు దేవుని పనులను పరిశీలించుట వలన వానిలో దేవుని మంచితనాన్ని ప్రేమస్వరూపాన్ని కనుగొనవలె. దేవునికోసం పాటుబడే వ్యక్తుల జాబితాలో చేరే ధైర్యం నీకు వుంటే, ఆయన చిత్తం వచ్చినట్లు నిన్ను నడిపిస్తాడు. దేవునికోసం ప్రయత్నించేవారు మంచిని పొందకుండాపోరు (సంగీ. 33).

**భారతదేశ జీవితానికి నీవు చేసిన సేవ**

దేవుడు లేకుండానే తమ జీవితాన్ని విజయప్రదం చేసుకోగలమని అనుకొనే వారున్నారు. సైన్సు, విద్య యీ రెండు హృదయానికి సంతృప్తి నివ్వలేకపోయినాయి. హృదయంలోని ప్రగాఢవాంఛలను తృప్తిపరచలేక పోయినాయి. మానవుని భాగ్యవంతునిగా, శ్రేయోవంతునిగా జేయ, విద్యావంతుల, శాస్త్రప్రవీణుల నూతన కల్పనలలో యేదోయొక కొరత కన్పిస్తూనే వుంటుంది. వాస్తవిక సుఖం అనేది కన్పించనే కన్పించదు. అందుకని వారు తమ కిష్టమైన సిద్ధాంతం పట్టుకొని వేళాడుతుంటూనే వుంటారు. యీ సిద్ధాంతాలలో కొన్ని మతం అనే పేరుతో చెలామణి అవుతుంటాయి. వీటివలననే వారు తృప్తిని పొందటానికి ప్రయత్నించుతారు. వీరు బయటికి చెప్ప సాహసించ లేకపోయినా యధార్థంగా వారు దేవునికోసమే వెదుకుచున్నారు. కాని వీరు సరియైన ప్రక్క-తిరుసభ వైపు-చూడాలని యెన్నడూ అనుకోరు.

ఇలాంటి సందర్భంలోనే నీవు భారతీయుల యోగక్షేమాల కొరకు పనిచేయాలి. అందుకని నీవు ఒక మహత్తరమైన వ్యక్తిత్వానికి మూర్తీభావముగా వుండాలి. క్రీస్తునాథునితో చేసిన సఖ్యతవలన బలం, మంచితనం నీలో యేర్పడినాయి. అవి కల్గించే శక్తివలన నీవు అట్టి వ్యక్తివిగా వుండగల్గుతావు. నిజానికి ఆయనతోటి సఖ్యతే నిన్ను ఎట్టి మహత్తర వ్యక్తిగానైనా తయారుచేస్తుంది. కతోలికులు కానట్టి వారిలో గూడ చాల గొప్పవారున్నారు కాని ఆఖరుదశలో క్రీస్తునాథుని అనుసరించువారే యెట్టి ఒత్తిడికైనా నిలబడగలరు. దేవుని కొరకు బ్రతికే వారే యధార్థంగా జీవించేవారు. క్రీస్తునాథుని సిద్ధాంతాలతో కూడిన జీవితాన్ని జీవించటానికి క్రీస్తుతోటి స్నేహము తగిన శక్తినిచ్చునని నీవు లోకానికి చాటించాలి.

దేవుని కట్టడలకు కట్టుబడినవాడే మంచిపౌరుడు. మతం వలననే నీవు బలాన్ని చేకూర్చుకున్నావని తెలుసుకున్నపుడు, అలా తెలుసుకున్నవారు మతంయొక్క శక్తిని గ్రహిస్తారు. ఈ 20 వ శతాబ్దములో క్రీస్తునాథుని స్లీబమరణాన్ని గూర్చి తిరిగి క్రొత్తగా బోధించాలి. ఈ స్లీవే మానవనడతను మార్చగలదని యీ దేవునిమీద నమ్మకం లేని జనాంగానికి చెప్పాలి.

నీ విక్కడెందుకున్నావో తెలుసు. దేవునిలో గాఢమైనం విశ్వాసం వుంటే, బలవత్తరమైన, గుణవంతమైన జీవితాలు యేర్పడగలవని నీ భారతీయులకు తెలుపాలి. అలాంటిది నీకు శక్యం గావాలిఅంటె క్రీస్తునాధుతో సఖ్యతవుండాలి.

హైస్కూలు విద్యార్థులలో చాలమందికి మతం శూన్యం. అలాంటివారు లోకంలోయున్న అస్థిరకాల చెడుగులను, దురభ్యాసాలను అవినీతిని, బహు భార్యాత్వమును జూచి అవి అవసరమను వుద్దేశానికి వస్తారు. ఏకకాలమందు ఒకే పురుషునికి ఒకే భార్యవుండడము, నీతి నిజాయితీలుండడం అసాధ్యం అనిపిస్తుంది. కాని నీవు సాధ్యపడతవని, సంఘశ్రేయస్సుకు అవి అవసరమని చూపించాలి.

**భవిష్యత్తు** ఈ శతాబ్దం ముగిసేలోగా "మానవుల ఆత్మలను పరీక్షించే కాలం" అంటే చాలా కష్టకాలం తిరిగిరావచ్చు. ఆ విషయంలోనే దేవుని యందు నీకుగల గాఢవిశ్వాసం ఈ దేశపు సిద్ధాంతాలను కాపాడుతుంది. భవిషత్తులో రాబొయ్యే పోరాటాలు రాజకీయ రంగంలో కాదు. దానిలోను వుంటాయి. కాని ముఖ్యముగ మతము, విద్యావిషయాల్లో, ఏది తప్పు ఏది ఒప్పు అనే ప్రాధమిక విషయాలను గురించే పోరాటాలు జరుగుతాయి. ఆ పోరాటము దైవ చట్టాలకు విధేయించి వుండుటను గురించి యుంటుంది. స్వభావాతీతమైన మతమును తృణీకరించే వారు లేకపోరు. యీ లాంటి వారికి యెదురుగ నీవు నిలబడాలి. దేవుని నమ్మినందువల్ల, క్రీస్తుయందు విశ్వాసముంచినందువల్ల నిన్ను దేశద్రోహిగ అనవచ్చును. అధిక సంఖ్యాకులు "మేము దేవుని యందు నమ్మిక యుంచుచున్నాము" అని చెప్పినపుడే మన దేశం నిలువగలుగుతుంది లేని పక్షమున అది పతనం చెందును. నీ సోదరుల మేలుకొరకు దేవుని యందు నమ్మకం తగ్గకుండ వుండునట్లు చూడవలె.

**ఆచరణ** (1) క్రీస్తునాథుడు "నీవు లోకమునకు లవణము" అని అన్నారు. దీనికి అర్థమేమిటి?

(2) డబ్బు సంపాదన జీవితంలో న్యాయమైన ఆశయమేనా? డబ్బు ప్రోగుచేసుకోవడం, కుటుంబ పోషణకు తప్ప మిగతా పనుల కోసంగూడా వుపయోగించాలనే నైతికధర్మ మున్నదా?

(3) ఎలా నీ విశ్వాసం యీ వాక్యంలోని లోటును పూర్తి చేస్తుందో చూడు. "కేవలం హేతువాదం మానవుణ్ణి అసంతృప్తుణ్ణిగానే వుంచుతుందని మానవునికి అన్ని యుగాలలోను నిరంతరం అనుభవ మయింది. అన్నిటికీ తనే కేంద్రం కాకుండా తననుండి తన్ను లేవనెత్త గల వుత్సాహం కోసం, శక్తికోసం మానవుడు యేదో రకంగా ఆశిస్తూ వుంటాడు."

(4) ఈ అధ్యాయములోని మొత్తం భావం ఈ క్రింది వాక్యాలలో యేలా గర్భితమై వుందో చూపించు. "మానవ హృదయాన్ని అల్లకల్లోల మొనర్చే సందేహాలకు సమాధానం యేదో ఒక నడవడికను గురించిన సిద్ధాంతంగాదు. అది యెంత వున్నతమైన దైనా సరే శీలము గల మహిషివలననే అన్ని సందేహాలకు నివృత్తి గల్గుతుంది.

---

# ఏబదియవ అధ్యాయము

అంతము ఆరంభం మాత్రమే.

**నీ జీవిత ఆశయం**

ఇక్కడి జీవితం మోక్షానికి సమాయత్తపరచుకొనే ప్రయత్నమే అని తెలుసుకొన్ననాడు అది అతనికి శుభదినము.

ఈ పుస్తకములోని ప్రథమ అధ్యాయమువలన జీవితం అనేది ఒక ఆట అని, నీకు మోక్షాన్ని తెరచుటకు వచ్చిన, దాన్ని చేరు విధానాన్ని చూపిన జేసునాధునియందు నీకుగల భక్తికి పరీక్షయని నీవు గ్రహించావు. జీవితం ఆట అని అనడానికి మూడు కారణాలున్నాయి లోకంలో జరిగే మోసాలను యెదుర్కొనటానికి, క్రీస్తునాధుని సిద్ధాంతాలను అంగీకరించటానికి, వాటి ప్రకారం నీ స్వభావాన్ని చక్కదిద్దుకోవటానికి నీకు యిష్టమున్నదీ లేనిదీ యీ ఆటలోనే తేలిపోతుంది. మోక్షం అంటే దేవునితో జీవించటమే. క్రీస్తునాధునితో జీవించటమే. నీ నాయకునితో జీవించటమే. ఈ లోకంలో నీ జీవితాశయం మోక్షం కోసం నిన్ను నీవు శక్తివంతునిగా జేసుకోవడమే.

క్రీస్తునాధుడు నీ నాయకుడని నీ నమూనా అని ఆయనే నీ జీవిత సర్వస్వమని చెప్పాము. నీ జీవితం పొడుగునా నీ నాయకుని అంగీకారయోగ్యమైన స్వభావాన్ని, ప్రవర్తనను అలవర్చుకోవాలనే ఆశయంతో వుండు. క్రీస్తునాధుని నియమాల ప్రకారం బాలుడుగాని బాలికగాని, తన్ను రూపొందించుకొనటం గమనించుటకన్నా ప్రపంచంలో మరేదీ యెక్కువ సంతోషకరమైన విషయం లేదు. ఈ రకమైన పని జీవితం పొడుగునా జరగాలి. నీకు సహాయపడటానికి క్రీస్తునాధుడు కనిపెట్టుకొని చూస్తున్నాడు. నీకు రక్షణగావున్న దేవమాత, కాపలియైన సన్మనస్కుడు నీవైపు కనిపెట్టుకొని చూస్తున్నారు. తనవలె నీవుగూడ- యవ్వనవంతుడవుగా వున్నపుడే- రూపొందించుకోవాలని నిన్ను క్రీస్తునాధుడు కోరుచున్నాడు. యవ్వనంలో గాకపోతే ముసలితనంలో పని సాధ్యపడదు. ముసలివాడివి అయ్యేవరకు యీ పని ఆపివేయవచ్చు అనుకోకు. నీ ఆశయం "క్రీస్తువే నా జీవం" అని వుండాలి.

**తిరుసభ వలన నీకు గలిగే ప్రయోజనాలు**

క్రీస్తునాథుని ఆశయాల ప్రకారం నడవటానికి పరిసర వాతావరణం అనుకూలంగా వుండక పోవచ్చు. చెడు శక్తులు, తప్పు నిర్ణయాలు నీ చుట్టూవున్న మిత్రుల ప్రభావం సత్శీలాన్ని రూపొందించుకొనే సందర్భంలో అటంకాలుగా వుంటాయి. ఇక్కడే నీకు తిరుసభ సహాయపడుతుంది. తిరుసభ నీకు జ్ఞానతల్లి. తిరుసభే క్రీస్తునాథుని వాణి అని, తిరుసభ విజ్ఞాన ప్రభావము దాని బోధల వెనుక వున్నవని మేము చెప్పాము. తిరుసభే మోక్షం దృష్ట్యా నీకు జీవితాన్ని గూర్చి సరియైన నిర్వచనం యిస్తుంది. "మానవులను ధనికులుగా జేసి హాయిగా జీవింపజేయుటం, క్రైస్తవమతం వుద్దేశంగాదు. ఆశయంగాదు. ధనానికి సంపదకు వాని ఫలితంగా కలుగు సుఖాలకు యెక్కడైతే విలువ లేదో ఆలాంటి ప్రపంచాలకు నిన్ను లేవనెత్తటమే క్రైస్తవమత వుద్దేశం, ఆశయమూను." కనుక పోరాటములో అలసిపోయినపుడు, పోరాటములో అలసట పొందినపుడు, వెలుగు కోసం, మార్గంకోసం అనుభవజ్ఞురాలైన నీ తల్లివైపుకి దృష్టిని సారించు.

**నీ జీవితం బాగోగులు నీపై ఆధారపడి వున్నాయి**

హైస్కూలు కోర్సు పూర్తిఐంది అంటే జీవితంలో ఒక పెద్ద కోర్సు ఆరంభ మయిందన్నమాట. ఒక పని పూర్తి అయిందంటె మరొకపని ఆరంభ మయిందన్నమాట. ఇప్పుడు నీవు యీ కోర్సు చివరలోనున్నావు. కాని నీకు దాని ఫలితాలు ఆరంభం కానున్నాయి.

క్రీస్తునాథునితో సఖ్యత నలవరచుకొనే పనిని యిప్పుడే ఆరంభించావ్. ఆయన జీవితాన్ని తెలుసుకొంటానికి క్రమంగా ప్రయత్నించు, నీ దగ్గర సువిశేషమును పెట్టుకో. నీ హృదయములో ఆయన్ను యెప్పుడూ జ్ఞాపకముంచుకో. ఈ పాఠములు నిన్ను ప్రభావితుని చేయాలంటే క్రీస్తునాథుని సత్యంకొరకు పనిచేయు యే వ్యక్తికైనా కావల్సిన ప్రార్థనా పూర్వకమైన, నిజాయితీ అయిన ప్రయత్నాన్ని యిక కొనసాగించు. క్రీస్తునాథునితో స్నేహం చేయాలి అనే అభిప్రాయంను గూర్చి తరచుగా అనుకుంటూవుండు. సంవత్సరాలు

గడచిన కొలదీ ఆయనతోటి సాన్నిహిత్యాన్ని పెంపొందించుకుంటూ వుండు. ఎప్పటికప్పుడు క్రీస్తునాధుని గూర్చి నీవు చేసే పఠనంలో ఏదో నవ్యత్వం కనిపిస్తూనే వుంటుంది.

ఒకవైపు జీవిత బాధ్యతలు త్వరలో నీపై పడతాయి. మరొక వైపు వాస్తవ సంఘటనలు, కఠిన సమస్యలు నిన్ను యెదుర్కొంటూ వుంటాయి. ఎవరైతే, యేదైతే నీ మనస్సును నింపుటకు నిన్ను వదలి పెట్టకుండా అంటిపెట్టుకొని యుంటుందో అదే చివరకు జయమొందు తుంది, నీ హృదయాన్ని స్వాధీనం చేసుకుంటుంది. నీ నిర్ణయాలలో కొన్ని పొరపాటులు చేస్తావు. నీవు నిన్ను గురించి గొప్పగా తలంచు కొని అనేక కార్యములను చేయగలను అని అనుకొంటావు. అయితే అనుకున్న దానికంటె చివరకు తక్కువనే నీవు చేస్తావు. వీటినుండి నీవు బాధపడ నక్కరలేదు స్వార్థాన్ని, ప్రపంచ విషయాశక్తిని జయించాలనే నిర్ణయానికి కట్టుబడి వుండు.

సిలువ నుండి వ్రేలాడిన వారికి నీ యందు నమ్మకముంది. నీ జీవితంలో యేమి అర్థంలేదని నీవు వున్నా ఒకటే లేకున్నా ఒకటే అని యెవరైనా అంటే నీవు యెన్నడూ నమ్మవద్దు నీ జీవితానికి అర్థముంది జీవితముపైన్నే మానవుని అమరాత్మ యొక్క జయమో అపజయమో ఆధారపడి వుంది. జీవితముపై ఒక వ్యక్తి మోక్షం పొందుటలో పోగొట్టు కొనుటలో ఆధారపడి వుంది తన అనుయాయులకు స్థలములను తయారు చేయుటకు వెళ్లిన జేసువు నిన్ను ఆహ్వానించటానికి యెదురు చూస్తు న్నాడు. క్రీస్తు నీలో ఒక మంచిపనిని ఆరంభించాడు; అది పరిపూర్ణం కావాలంటే ఆయన స్నేహితాన్ని సంపాదించుకోడానికి కృషి చెయ్యాలి. ఈ పని నీవు బడి వదలి పెట్టిన తర్వాత కూడా చెయ్యాలి. క్రీస్తునాథుడు నీ విశ్వాసం పరిపూర్ణవంతం చేయువట్లుగా వుండాలంటే, దాన్ని పటిష్టం చేయాలి అంటే ఆయనకు అంటి పెట్టుకొని వుండాలి. జీవితాంతాన సంతోషంగా నన్ను జేసుస్వామి కలుసుకొనునట్టి జీవి తాన్ని జీవించు. నీవు ఆ స్థలమునకు అర్హతను సంపాదించుకోడానికి జీవితమొక అవకాశం. కుటుంబం, తిరుసభ, విద్యాలయము నీకు మార్గాన్ని చూపినాయి సహాయాన్ని అందజేశాయి. ఇక నీవు యీ పుస్తకంలోని భావాలను యెలా ఆచరణలో పెట్టగలవో చూడు.

నీవు జీవించటానికి ఒకే జీవితముంది. కతోలికుడవుగా జీవించు ఉత్తమ ఆదర్శాలలో, తిరుసభలో, మోక్ష విషయాలలో విశ్వాస ముంచే వుత్తమ పురుషుడవుగా జీవించు.

"ప్రభువైన జేసుక్రీస్తునాధుని ధరించుము," ఆయన మహత్తర మైన సమక్షతతో ,ఆయన శక్తివంతమైన అండతో, సౌందర్య మూర్తి యైన మానవ కుమారుని ప్రేమాస్పదమైన ప్రశంసతో, ఆయన స్నేహానందంతో, ఆయన హృదయ సుఖదుఃఖములతో. సానుభూతితో నీ ప్రార్థనా సమయమును నింపుకో. అప్పుడే నీ జీవితం ధన్య మౌతుంది

—: సమాప్తం :—

# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 1 | మొలచిన | మలచిన |
| 17 | 2 | ప్రతిబిబ | ప్రతిబింబ |
| | 6 | కాగలదు | కాగలందు |
| 20 | 6 | ఆయుస | ఆయున |
| 19 | 19 | శిరనావ | శిరసావ |
| 22 | 18 | ప్రసాదిసు | ప్రసాదిస్తు |
| 24 | 16 | ప్రభుపు | ప్రభువు |
| 28 | 26 | దండనధింప | దండనవిధింప |
| 29 | 8 | దేపుని | దేవుని |
| | 20 | పనెండేడ్ల | పన్నెండేండ్ల |
| 35 | 11 | అతగా | అంతగా |
| 48 | 8 | అనుకోలేను | అనుకోలేదు |
| 49 | 12 | సద | సంద |
| 50 | 21 | అకాధిరాన్ని | అధికారాన్ని |
| 61 | 2 | మపుతాయి | మవుతాయి |
| 62 | 19 | ఉల్లఘిచా | ఉల్లంఘించా |
| | 28 | ఉడట | ఉండటం |
| 66 | 13 | కొరితీ | కొరింతీ |
| | 27 | క్లెమెటు | క్లెమెంటు |
| 71 | 4 | సభాలను | సభలను |
| 73 | 25 | వర్ణనాతీతుల | వర్ణనాతీతముల |
| | 28 | శతాబ్దలోని | శతాబ్దంలోని |
| 74 | 5 | 25 లో | 257 లో |
| | 13 | గురించి | గురించి గ్రంథములవ్రాసి |
| 75 | 9 | న్నూమెన్ | న్యూమెన్ |
| 76 | 5 | క్రైస్తపుల | క్రైస్తవుల |
| 77 | 20 | మానవాతీతి | మానవాతీత |
| | 23 | శ్రిమిక | శ్రామిక |
| | 29 | దాయొక్క | దానియొక్క |
| 78 | 9 | డయోక్లిసయన్ | డయోక్లిసియన్ |
| | 15 | వ్యామోహం | వ్యామోహం |
| 80 | 7 | 32లో | 352 లో |
| | 28 | రాశా | నిరాశా |
| 93 | 5 | కట్టుకున్న | కట్టుకున్న |
| 93 | 23 | గాడ్ | గాడ్ ఫ్రే |
| | | ఫెబుమ్యా | |
| 95 | 1 | నవుడు | నపుడు |
| | 5 | విజ్నం | విజ్ఞం |
| 96 | 13 | వ్యదములు | పద్యములు |
| 107 | 15 | ఆకర్షిచాయి | ఆకర్షించాయి |
| 112 | 16 | నడలిచ | నడిలించ |
| 114 | 17 | సమయులో | సమయంలో |
| 120 | 7 | శకులు | శక్తులు |
| 122 | 5 | మానపులు | మానవులు |
| 123 | 18 | లెకపోలేదు | లేకపోలేదు |
| | 28 | దాలి | దాని |
| 125 | 21 | హింసిచే | హింసించే |
| 126 | 13 | ప్రజలచెత | ప్రజలచేత |
| | 17 | రాలంకొద్ధి | కాలంకొద్ది |
| | 24 | అధునిక | ఆధునిక |
| | 28 | వదల | వదిలి |
| 131 | 7 | మానవాతీతులు | మానవాతీతుడు |
| 137 | 8 | దానిబట్టి | దాన్నిబట్టి |
| 138 | 3 | రాయప్ప | రాయప్ప |
| | 19 | పెరుగుతావా | పెరుగుతివా? |
| | | కతోలికులు | కతోలికులకు |
| 139 | 3 | వివరించనవి | వివరించనివి |
| | 17 | చేస్తున్నాయి | చేసినాయి |
| | 28 | కతోలికులు | కతోలికుకు |
| 141 | 12 | విద్యార్థి | విగ్యార్థి |
| 143 | 1? | లేంకుండా | లేకుండా |
| 144 | 15 | చేసుకొన్నట్లయితే | చేసుకొనబడినట్లయితే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 147 | 5 | సైంటిసులని | సైంటిస్టులని |
| 148 | 15 | ఫున్నాయి | వున్నాయి |
| 150 | 7 | వచ్చాయి | వచ్చాయని |
| 153 | 20 | కింరులో | కెందులో |
| 156 | 12 | వచ్చునని | వచ్చునని |
| | 13 | బంధం | భవం |
| 162 | 8 | అధిమించు | అధిగమించు |
| | 15 | కట్టుకొనిన | కట్టుకొనని |
| 163 | 14 | ఆత్యయొడ | ఆత్మయొడ |
| 165 | 27 | స్తానమును | స్థానమును |
| 166 | 3 | ఆయ | ఆయన |
| | 20 | మానపుకు | మానవుడు |
| 167 | 4 | సృంప్టిచ | సృష్టించ |
| 169 | 2 | కొవదానికి | కొవడానికి |
| 172 | 12 | ఆమె | ఆమె(తిరుసభ) |
| 173 | 21 | గుమిస్తుం డగా | గమిస్తుండగా |
| 177 | 2 | పేడుతు | పెడుతు |
| 180 | 25 | నాధించి | సాధించి |
| 185 | 22 | నాయం | సాయం |
| 186 | 16 | క్రైస | క్రైస్త |
| 188 | 9 | నామర్థ్యి | సామర్థ్యి |
| 188 | 24 | సిథ్థాతాలు | సిద్ధాంతాలు |
| 190 | 7 | యెయుద్దే శతో | యేయుద్దే శంతో |
| 192 | 9 | పిప్వకో గలవో | విప్వకా గలవో |
| 196 | 8 | ఉడదు | వుండదు |
| 196 | 16 | చెప్పిస | చెప్పిన |
| 197 | 4 | సిదాంతం | సిద్ధాంతం |
| 197 | 15 | తొలగిచా | తొలగించా |
| 197 | 28 | బాధ వ్యాన్ని | బాంధవ్యాన్ని |
| 201 | 6 | వున్నతో | వున్నత |
| | 12 | వున్న ట్లయితే | వున్నట్లయితే |
| | 14 | చూచేవారు | చూచేవారో |
| 205 | 7 | సాగిస్తారు | సాగిస్తారు |
| 207 | 8 | వ్యక్తి | వ్యక్తి |
| 210 | 17 | చెయ్యి | చెయ్యి |
| 214 | 12 | లోపాని | లోపాన్ని |
| 222 | 21 | అక్రమించి యున్న | ఆక్రమించి యున్నందున |
| 222 | 28 | -తిరులో | తిరుసభలో |
| | 29 | వు | వలెనీవు |
| 224 | 1 | మైస | మైన |
| 225 | 9 | క్రైసవ | క్రైస్తవ |
| | 14 | కోటాకి | కోటానికి |
| 229 | 7 | స్వాద్ద | స్వాగ్థ |
| 230 | 13 | నివు | నీవు |
| 234 | 3 | బడుతుని | బడుతుంది |
| 250 | 15 | ధర్మాలను | ధర్మాలను |
| 252 | 13 | నన్నద్ధము | సన్నద్ధము |
| 253 | 23 | ప్రణాళి కతో | ప్రణాళికలో |
| 257 | 15 | నీకు దేవు మధ్య | నీకు దేవునిమధ్య |
| 258 | 11 | పంవాడు | పంపాడు |
| 261 | 27 | దివ్యసత్ప హాదం | దివ్యప్రసాదం |
| 264 | 14 | మోక్షానం దానికి | మోక్షానం దాన్ని |
| 265 | 27 | తాగంచేసి | త్యాగంచేసి |
| 266 | 28 | యింరా | యింకా |
| 367 | 9 | మనస్సును | మనస్సును |
| 270 | 5 | మిార్గం | మార్గం |
| | 17 | తవస్వి | తపస్వి |
| | 27 | నాపల్ | సాపల్ |
| 274 | 2 | తింఖుచ్చు | తిండిఖచ్చు |
| 281 | 20 | ఆహ్వాంచ | ఆహ్వానించ |

